జీవయాత్రయందు నియతకర్మానుష్ఠానము సకల జీవములకును పురుషార్థసిద్ధికి సాధనము. నియతకర్మానుష్ఠానమునకు నిత్యకర్మానుష్ఠానమును, నిత్యకర్మానుష్ఠానమునకు సంకల్పమును నియతసాధనములు. జీవయాత్ర జీవునకు సంకల్పానురూపపరిణామమును పొందుచు పురుషార్థమునకు సాధనముగ నున్నది. చతుర్విధపురుషార్థములకును సంకల్పము బీజము. సంకల్పప్రభవములైన ధర్మార్థకామములు దేశకాలపాత్రావరణములందు సఫలములై దేశకాలాద్యనవచ్ఛిన్నమైన ఆత్మత్వమునకు సాధనము లగుచున్నవి. నూతన సంవత్సరారంభమునందు పంచాంగశ్రవణమును సంకల్పమును జేయుట పురుషార్థమునకు ప్రయోజనకరము. అనంతములైన దేశకాలపాత్రాధారములైన ప్రకృతివిలాసములు నిత్యమైన ఆత్మజ్ఞానమునకు పరమార్థసాధనము.

కాలమహార్ణవమునందు శాలివాహనశకాబ్దములు ౧౮౫౮, విక్రమార్కశకాబ్దములు ౧౯౯౩, క్రైస్తవశకాబ్దములు ౧౯౩౬, ఫసలిశకాబ్దములు ౧౩౪౬, భరతశకాబ్దములు ౫౦౭౮, కలియుగాదిసౌరాబ్దములు ౫౦౩౭, సృష్ట్యాదిసౌరాబ్దములు ౧,౯౫,౫౮,౮౫,౦౩౭ గతించినవి. కలియుగాదినుండియును ౮౪ చాంద్రమాన చాంద్రాయణపరివృత్తులు ముగిసినవి. ౮౫-వ పరివృత్తియందు తొమ్మిదేండ్లు గతించినవి. పదవయేడు ధాతృసంవత్సర మారంభ మైనది. బ్రహ్మకల్పమునందు, ద్వితీయపరార్ధమునందు, ప్రథమవర్షమునందు, ప్రథమ మాస పక్ష దినములందు ౧౩ ఘటికలు ౪౨ విఘటికలు గతించినవి. అనంతమైన కాలచక్రమునం దొక చాంద్రమానాబ్దచరిత్రము పరమాణువైనను దురారాధ్యముగ నున్నది. సాపేక్షములైన దేశకాలపాత్రావరణోదంతములు నిరపేక్షమైన ఆత్మత్వానుభవమునకు పరమార్థసాధనము.

ధాతృసంవత్సర చాంద్రమానాబ్దమునకు కుజుడు రాజు, ధాన్యాధిపతి:— (ఫలము)- సంగ్రామము, అగ్నిభయము, జనక్షయము, వ్యాధివియోగపీడ, గ్రీష్మధాన్యమహార్ఘము, శాలీక్షు ఘృతతైల మహార్ఘము, చంద్రుడు మంత్రి:— (ఫలము):— సుసస్యములు, సువృష్టి, జనపదసుఖము; రవి సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, గ్రామపాలకుడు:— (ఫలము) నరరాజ పురోగమనము, నిర్భయము, స్వపథగమనము, అనర్ఘము, క్షుద్భయము, రాజులకన్యోన్యకలహము, యవచణేక్షుసస్యాభివృద్ధి, గ్రామపాలకుల క్రూరత్వము, ప్రజాపీడ; గురువు సస్యాధిపతి:— (ఫలము) సకల సస్యాభివృద్ధి, జలసమృద్ధి; శని రసాధిపతి, దైవజ్ఞుడు:— (ఫలము) మందబుద్ధి, మ్లేచ్ఛసుఖము, కృష్ణధాన్యాభివృద్ధి, జలక్షయము; బుధుడు నీరసాధిపతి, పురోహితుడు, పరీక్షకుడు:— (ఫలము) అర్ఘవృద్ధి, ప్రజాసౌఖ్యము, పురోహితులకు బుద్ధిబలము, ప్రజానురాగము, రాజనయతత్పరత్వము; శుక్రుడు గణకుడు:— (ఫలము) గణకులకు బుద్ధిబలము, అర్ఘవృద్ధి, జంతుసుఖము; యముడు పశుపాలకుడు:— (ఫలము) క్షీరతృణక్షీణము, పశుపీడ; మకరసంక్రాంతిఫలము:— ప్రజాపీడ, సమము.

ధాతృసంవత్సరసామాన్యఫలము:—

ధాతృవర్షే ఽఖిలక్ష్మా శా స్సగ్రామే సక్తమానసాః,
సంపూర్ణా ధరణీ భాతి బహుసస్యార్ఘవృష్టిభిః.

ధాతృసంవత్సరము గతించిన ధాతృసంవత్సర క్షామసంస్మరణముపలన భయసంభ్రమములను గలుగ జేయుచున్నది. అబిసీనియా సంగ్రామము, జర్మనీ జపాను విజృంభణము, రుష్యావికాసము, యూరపు రాజ్యముల సంధివిగ్రహములు కుజరాజ ఫలములైన భయంకర సంగ్రామ చిహ్నములు. ప్రపంచ ప్రవృత్తియందు సహజసంభవములైన సృష్టిలయములు సంకల్ప సంకీర్తనములు ప్రపంచపరిణామములందు నిత్యమైన ఆత్మత్వసిద్ధికి సాధనభూతములు. సచ్చిదానందాత్మకమైన ఆత్మత్వసిద్ధికి పరమేశ్వరార్థమైన మహాసంకల్పము సర్వకాల సర్వావస్థలందును పరమార్థసాధనము.

# ప్రస్తావన

"శ్రీ శంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్యాగ్నేయప్రదేశే, కృష్ణాకావేర్యోర్మధ్యదేశే, ధాతృనామసంవత్సరే, ఉత్తరాయణే, వసంతఋతౌ, చైత్రమాసే, శుక్లపక్షే, ప్రథమాయాం, రేవతీనక్షత్రే, భౌమవాసరే, పురుషార్థ ముపాస్యే"

కుజరాజాధిపత్యమునను ధాతృసంవత్సర గ్రహఫలము భయంకరమైనను ధర్మపాశబద్ధమైన ప్రపంచ ధర్మపరిణామమునందు క్షామములు, సంగ్రామములు, భూకంపములు, వ్యాధులు, ప్రళయములు నిత్యమైన ఆత్మధర్మసంస్థాపనమునకు సహజపరిణామములు. ధాతృ సంవత్సరమునందు పరిస్ఫుటము లగుచున్న సంగ్రామ సన్నాహములును ప్రపంచవ్యవహారములందు ధర్మసంస్థాపనార్థము, భారతయుద్ధమువలెను సంభవమగుట దైవ సంఘటనమై యుండును. యూరపు రాజ్యముల శాంతి స్థాపన ప్రయత్నములు, కురుక్షేత్ర రంగమునందు పార్థుని విషాదయోగము వలెను, హృదయ దౌర్బల్య చిహ్నములుగాని పురుషార్థసాధన చిహ్నములు గావు. ప్రపంచశాంతికిని, ధర్మసంస్థాపనమునకును ప్రపంచావృతమైన మహాసంగ్రామమే శరణ్యముగను గనుపడుచున్నది. సమరబీజములకు శాంతిసస్యఫలముల నపేక్షించుట యసంగతము. శాంతిపర్వస్థాపనమునకును, ధర్మసంస్థాపనమునకును శ్రీకృష్ణపరమాత్మ యర్జునున కుపదేశించి నట్లు మహాసంగ్రామము శరణ్యముగ నున్నది. మమకారాహంకార పరాధీనమైన ప్రపంచమునం దాత్మోద్ధరణమునకు ధర్మక్షేత్ర సంగ్రామ మాసన్నమగుచున్నది.

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే.

ప్రపంచపరిణామమునందు మానవస్వాతంత్ర్య ధర్మపరిణామమునకు సాధనమగుటకు దుష్టసంహారమును, శిష్టరక్షణమును పరమావసరములు. మాయామోహిత మూలమునందే శకుని దుర్యోధనునకు లాభమును సమకూర్చినను సంహారమును సమకూర్చ గలిగెను. మారణసాధనములు ముస్సొలోని, హిట్లరు మున్నగు డిక్టేటరులకు విజయసాధనములుగను నుపయోగపడినను కాలాంతరమునను సంహారసాధనములుగను పరిణమింపగలవు. ఫ్రెంచిప్రభుత్వము సంధినియమముల మూలమునను ప్రతిష్ఠింపదలచిన శాంతిస్థితి గగనకుసుమమని ప్రపంచరాజ్యముల సాయుధపరమైన రాజనీతి పరిస్ఫుటము చేయుచున్నది. శ్వేతజాతుల ప్రయోజనముల కితరజాతులు పుట్టినవని ముస్సొలోనిగారును, జర్మనులు మానవులం దుత్తమోత్తము లనియును వారిసేవార్థ మితరజాతులు పుట్టిన వనియును హిట్లరుగారును ప్రగల్భములను ప్రకటించుచు నిర్భయముగను, ఘోరముగను అబిసీనియాసంగ్రామమును, రైనులాండు ఆక్రమణమును జేయుచు ప్రజలను స్వదేశవిదేశములందు సంగ్రామోన్మాదపరవశులను జేయునపుడు మాటలందు శాంతి గోచరమైనను చేతలందు మహాసంగ్రామ మనివార్యముగ నున్నది. ప్రపంచ పరిణామమునకు సంగ్రామమును దైవసంఘటనముగ నున్నది.

అనంతమైన మహాప్రవృత్తియందు భూగోళ మంత మతి స్వల్పమైనను నరహంకారాభిమానములు ప్రముఖము చేయుచున్నవి. భూగోళ విస్తీర్ణము, ౧౯,౬౯,౫౨,౦౦౦ చదరపుమైళ్లు.

భూమండలము జనసంఖ్య ౧,౮౯,౯౫,౦౭,౦౦౦.

ఆప్రదేశమునందు ౫,౭౫,౧౦,౦౦౦ భూ ప్రదేశము ౧౩,౯౪,౪౦,౦౦౦ జలప్రదేశము. భూప్రదేశమునందు ఆఫ్రికా ౧,౧౫,౦౦,౦౦౦, ఉత్తర అమెరికా ౮౦,౦౦౦౧౦, దక్షిణ అమెరికా ౬౮,౦౦,౦౦౦, యూరపు ౩౭,౫౦,౦౦౦, ఓషియానియా, ౪౧,౦౦,౦౦౦, ధ్రువ

ప్రదేశములు ౬౨,౦౫,౦౦౦ ఆసియా ౧,౭౦,౦౦,౦౦౦ చదరపుమైళ్లు. భూప్రదేశమునందు సుక్షేత్రములు, ౩,౩౦,౦౦,౦౦౦, ఎడారులు ౫౦,౦౦,౦౦౦, ఉన్నత ప్రాంతములు ౧,౯౮,౦౦,౦౦౦ చదరపు మైళ్లు.

ప్రపంచమునందు గల ౧,౮౪,౯౫,౦౦,౦౦౦ జనులందును మంగోలియనులు ౬౮,౦౦,౦౦,౦౦౦, కాకేషియనులు ౭౨,౫౦,౦౦,౦౦౦, నీగ్రోలు ౨౧,౦౦,౦౦,౦౦౦, సెమిటికులు ౧౦,౦౦,౦౦,౦౦౦, మలయనులు ౧౦,౪౫,౦౦,౦౦౦, అమెరికా ఇండియనులు ౩,౦౦,౦౦,౦౦౦ కలరు. మతముల ననుసరించి క్రైస్తవులు, ౬౯,౨౪,౦౦,౦౦౦, యూదులు ౧,౬౧,౩౦,౦౦౦, మహమ్మదీయులు ౨౦,౯౦,౨౦,౦౦౦, బౌద్ధులు ౧౫,౦౧,౮౦,౦౦౦, హిందువులు ౨౩,౦౧,౫౦,౦౦౦, కన్ఫ్యూషియనులు టాయిస్టులు ౩౫,౦౬,౦౦,౦౦౦, షింటోలు ౨,౫౦,౦౦,౦౦౦, జంతుపూజకులు ౧౩,౫౬,౫౦,౦౦౦, ఇతరులు ౫,౦౮,౭౦,౦౦౦ కలరు.

ప్రపంచేతిహాసములందు గతించిన ౧౫౦ ఏండ్ల చరిత్రమును యూరపురాజ్యముల చరిత్రముగ పరిణమించినది. శ్వేతజాతులు సాయుధసైన్యములై పరదేశముల

శ్వేతజాతులు

నాక్రమించిన చరిత్రము దారుణాధ్యాయముగ నున్నది. పాశ్చాత్యులు పరదేశాక్రమణమును స్వప్రయోజనార్థమును, స్వీయవ్యాపారార్థమును చేసినను ప్రపంచోద్ధరణమునకు చేసినట్లు ఘోషించుట పరిపాటియైనది. శ్వేతజాతుల ప్రముఖులు నిరంతరము "తెల్లజాతులభారధర్మమును" సకల దుర్ణయములకును కారణముగ పరిగణించుట వారి దురహంకారమునకు నిదర్శనము. ఆస్ట్రేలియా రాజ్యము ౩,౦౦,౦౦,౦౦౦ చదరపు మైళ్ల విస్తీర్ణమును గలిగి యున్నను ౬౦,౦౦,౦౦౦ తెల్లవారికి స్వాస్థ్యముగ నున్నది. ఈ విశాలదేశమునందు పరజాతీయులు స్వదేశస్థులు ౬,౦౦,౦౦౦ మాత్రమెయున్నను శ్వేతేతరజాతులకు ప్రవేశము నిషేధింపబడుచున్నది. శ్వేతజాతులు అమెరికా, ఆఫ్రికా, ఆసియా మొదలగు ఖండములను బలవదన్యాక్రమణము జేసి కలుగజేసిన దుర్ణయములు మానవధర్మేతిహాసములందు విషాదాధ్యాయములుగ నున్నవి. ఉత్తరదక్షిణ అమెరికాఖండములు ౧,౪౮,౦౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును, ౨౧,౦౦,౦౦,౦౦౦ ప్రజలను గలిగియున్నను శ్వేతప్రజాధిపత్యమునకు నిలయములుగ బరిణమించినవి. అమెరికా సంయుక్తరాష్ట్రముల వికాసము ప్రపంచ పరిణామమునందుద్యోగపర్వముగ నున్నను శ్వేతేతరు లనుభవించిన దుఃఖపరంపరలు పరమ విషాదమును గలుగజేయుచున్నవి.

భూభాగములందును జాతులందును ప్రకృతివిలసితములైన గుణశీల భేదము లున్నను వర్తమానకాలమునందు శ్వేతజాతుల రాజ్యాధికారములు ప్రజలి పరస్పర

భూ రాజ్యవిభజనము

సంహారమునకును, ప్రపంచనాశనమునకును వినియోగపడుచున్నవి. ప్రపంచమునందుగల ౨౧౦ కోట్ల ప్రజలయందున బ్రిటీషు సామ్రాజ్యము ౪౮, రుష్యా ౧౭౪, అమెరికా ౧౪, జపాను ౧౭౪, ఫ్రాన్సు ౧౧ కోట్ల ప్రజలను గలిగియున్నవి. భూభాగములందు బ్రిటను ౧,౩౩,౩౫,౪౨౬, రుష్యా ౯౨,౫౧,౭౯౬, ఫ్రాన్సు ౪౪,౫౦,౦౦౦, చీనా ౪౨,౭౯,౧౭౦, అమెరికా ౩౭,౩౮,౩౯౩, పోర్చుగలు ౯,౮౧,౦౦౫, ఇటలీ ౯,౩౧,౪౪౦, జపాను ౨,౬౫,౧౨౯ చదరపుమైళ్లస్థలము నాక్రమించుచున్నవి. సామ్రాజ్యమునందు కొంచము భాగమునైనను విడువమని బ్రిటీషు ప్రభుత్వము విస్పష్టము చేసినది. జపాను విస్తీర్ణమునందు రుష్యాయందు ౪౦-వ వంతును, జనసంఖ్యయందు ద్వితీయాంశమును గలిగియున్నది. ఇటలీ జనసంఖ్యకు మించిన భూభాగమును గలిగియున్నను భూమితృష్ణకు మితి లేకున్నది. భూమి విస్తీర్ణమునందును, జనసంఖ్యయందును బ్రిటీషుసామ్రాజ్యము మహోన్నతపదవి నధిష్ఠించుచు సామ్రాజ్యాంతర్భాగములందును బాహ్యభాగము

లందును వివాదసంరంభములకు మూలముగ నున్నది. అయిర్లాండు స్వాతంత్ర్యము ప్రకటించి అనుభవించుచున్నది. ఈజిప్టును స్వాతంత్ర్యమునకు మహాప్రయత్నములను జేయుచున్నది. హిందూస్తానమును సంపూర్ణ స్వాతంత్ర్యాభిలాషను కరాచి బొంబయి కాంగ్రెసులందు ప్రకటించినది. కనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, సంయుక్తదక్షిణాఫ్రికా రాజ్యములు ౧౯౩౧-వ వెస్టుమినిస్టరు శాసనానుసారము స్వాతంత్ర్యపరిపాలనము ననుభవించుచున్నవి. బ్రిటీషుప్రభుత్వ మీరాజ్యముల ప్రభుత్వముతో సంబంధము రాజుద్వారా నామమాత్రావశిష్టముగ నున్నది. ప్రివికౌన్సిలు సంబంధమును పోయినది.

ఐరోపా మహాసంగ్రామానంతరము ప్రపంచమునకు గలిగిన వైరాగ్యము క్రమముగ నంతరించినవిధము గతించిన పదియైదేండ్ల వ్యవహారములును వెల్లడిచేయుచున్నవి. ప్రపంచమునందు పునర్నిర్మాణభారము విశేషము బ్రిటిషు సామ్రాజ్యముమీదను కలదు. సూర్యాస్తమయములేని బ్రిటిషు సామ్రాజ్యము భూమండల వ్యాప్తమై పునర్నిర్మాణమునకు సకలవిధముల ననుకూలముగ నున్నది. బ్రిటిషు సామ్రాజ్య విస్తీర్ణ జనసంఖ్యలు:—

బ్రిటిషు సామ్రాజ్యము

| | మైళ్ల విస్తీర్ణము | జనసంఖ్య |
|---|---|---|
| యూరపునందు | ౧,౨౧,౫౧౨ | ౪,౮౦,౦౦,౦౦౦ |
| ఆసియాయందు | ౧౯,౨౪,౫౫౦ | ౩౬,౫౦,౦౦,౦౦౦ |
| ఆఫ్రికాయందు | ౪౬,౫౨,౦౦౦ | ౬.౦౦,౦౦,౦౦౦ |
| ఉత్తర అమెరికా | ౩౮,౯౩,౦౨౦ | ౯౦,౦౦,౦౦౦ |
| మధ్య అమెరికా | ౮,౬౦౦ | ౫౦,౦౦౦ |
| వెస్టుఇండీసు | ౧౨,౩౦౦ | ౨౦,౦౦,౦౦౦ |
| దక్షిణ అమెరికా | ౯,౭౮,౦౦౦ | ౩,౨౦,౦౦౦ |
| ఓషియానియా | ౩౩,౦౦,౦౦౨ | ౯౦,౦౦,౦౦౦ |
| మొత్తము | ౧,౯౯,౦౯,౭౫౨ | ౪౯,౩౩,౭౦,౦౦౦ |

గ్రేటుబ్రిటనునందు అధినివేశ రాజ్యములందు ౭ కోట్లమంది తెల్లజాతివారును, శేషించిన ప్రజలందు ౩౫,౨౮,౩౭,౭౭౮ హిందూదేశీయులును, ఇతరులు ౭ కోట్లమందియు వివిధ ప్రాంతములందును గలరు. ప్రజలందు హిందువులు ౨౧ కోట్లమంది, మహమ్మదీయులు ౧౦ కోట్లమంది, క్రైస్తవులు ౮ కోట్లమంది, బౌద్ధులు ౧,౨౦,౦౦,౦౦౦, శేషించినవారు ఇతరమతస్థులు. ఈ మహాసామ్రాజ్యమునకు గ్రేటుబ్రిటను మూలస్థానము. సామ్రాజ్యాంతర్భాగములందు స్వపరిపాలనాధికారము గల అధినివేశరాజ్యములును, మధ్యమాధికారము గల క్రౌనుకాలనీలును, నిరంకుశాధికారము గల పరాధీన రాజ్యములును, వివిధములైన పరిపాలనవిధానములు గల ప్రదేశములును గలవు. తెల్లజాతులుగల ప్రదేశములందు స్వపరిపాలనమును, తెల్లవారులేని స్థలములందు నిరంకుశ పరిపాలనమును బ్రిటిషు రాజ్యాంగములకు కీలకములు. బ్రిటిషుసామ్రాజ్యపరిపాలనము పూర్వమువలెనే బ్రిటిషు ప్రయోజనములకును, తెల్లవారిప్రయోజనములకును వినియోగపడినటులు స్వదేశీయుల ప్రయోజనములకును, శ్వేతేతరజాతుల ప్రయోజనములకును వినియోగపడుట లేదు. ప్రపంచమునందు కాలక్రమమున మానవ స్వాతంత్ర్యవికాసము సంప్రాప్తమగుచున్నను బ్రిటిషు సామ్రాజ్య నిర్వాహకులు పూర్వపరిస్థితులనే సంరక్షించుచు సామ్రాజ్యక్షేమమునకును, సామ్రాజ్యాంతర్భాగ వికాసమునకును ప్రతిబంధకములను కల్పించుట రాజనీతిగ పరిణమించినది.

గ్రేటుబ్రిటను నౌకాదళము వెనుకబడినను నీయేడు ౪౦౦౦ విమానములు నిర్మించుటకు నిర్ణయింపబడినది. గ్రేటుబ్రిటనునందు పన్ను ౧౯౧౩ నందు తల ౧-కి ౩-౧౧-౦ నుండి ౧౯౩౩ నందు స. ౧౬-౮-౦ కు హెచ్చినది. ఒటావాయొడంబడికయును బంగారుప్రమాణ విసర్జనమును వ్యాపారాభివృద్ధిని కొంత గలుగజేసినను నది సంతృప్తికరముగాదు. ౧౯౩౪ సంవత్సరమునందు మద్యపానమునకు ౨౨,౯౦,౨౯,౦౦౦ సవరనులు వ్యయమైనవి. ప్రజలు తల ౧-కి మద్యమునకు స. ౫-౧-౦ ను, పన్నులకు ౧౬-౮-౦ సవరనులును చెల్లించుట

బ్రిటీషు భాగ్యస్థితికి నిదర్శనమైనను శుభస్థితికి నిదర్శనము కాదు. క్షీణించుచున్న బ్రిటీషువ్యాపార పరిశ్రమాదుల నుద్ధరించుట కాత్మవిశ్వాసమును స్వయంసహాయమును సాధనములు కాని వ్యాపారరక్షణమును పరాక్రమణ మును సాధనములు కావు. కన్సర్వేటివు కవచమును ధరించిన జాతీయప్రభుత్వము ౧౯౩౫ ఎన్నికలందు విజ యమును బడయుట ప్రపంచశాంతికి దురదృష్టము.

ఎన్నికలయందు జాతీయపక్షమునకు ౪౩౯, ప్రతి కూలపక్షమునకు ౧౫౪ స్థానములు లభించి జాతీయపక్ష ప్రభుత్వము స్థిరపడినది. కార్మికపక్షమునకు ద్రోహము చేసిన రామ్సేమాక్డనాల్డుగారును, వారిపుత్రులును పరా జయమునొందినను జాతీయపక్షనాయకులు తిరిగి వారికి స్థానములను గల్పించుట జాతీయపక్షహృదయమునకు పరమప్రమాణము. జాతీయపక్షమునకు బాల్డువినుగారు నాయకులై ప్రధానమంత్రియగుట గ్రుడ్డిలోను మెల్లయై నను కన్సర్వేటివుపక్షబలము సంగ్రామమునకును, సామ్రాజ్యాభిమానమునకును, పరపీడనమునకును వినియోగపడగలవిధమును గతించిన నాలుగుమాస ముల యుదంతమును విస్పష్టము చేయుచున్నది. హిందూస్థానమునకు రాజ్యాంగ సంస్కరణముల రూప మునను పాశబంధములను సమకూర్చిన హోరుగారి నిర్గమనము వారి తాంత్రికహృదయమును వెల్లడిచేయు చున్నది. హోరుగారు అబిసీనియాపట్లను ఇటలీ స్నేహ హమునపేక్షించి చేసిన యన్యాయముచే, హిందూస్థా నము పట్లను చేసినవిధమును ఫెడరేషను ప్రభుత్వము గవర్నరుజనరలు, గవర్నరులరక్షణాధికారములు ధ్రువా ధికారములు, సంరక్షణములు మినహాయింపులు విశదము చేయుచున్నవి. ఇండియాబిల్లు మొదటినుండి చివరవరకు సంకుచితముకాని విశాలముకాదు. శాసనమునందు స్వాతంత్ర్య వాతావరణము లేకపోగా కలహకారణము లన్ని సందర్భములందును ప్రత్యక్షమగుచున్నది. హోరు గారిస్థానమును జట్లండుప్రభువుగారును, విల్లింగ్డన్ప్రభువు గారిస్థానమును లిన్లిత్గో ప్రభువుగారును నాక్రమించినను రాజ్యాంగములు మామూలు రీతినే నిర్బంధవిధానము లతో సాగుచుండు నని యూహింపదగియున్నది.

గత సంవత్సరమునందు బ్రిటీషురాజ్యాంగము లందు శ్రీపంచమజార్జి ప్రభువర్యుని రజతోత్సవము గమనార్హము. స్వపరిపాలనముగల వలసరాజ్యముల కును బ్రిటీషుస్థానమునకును ప్రభువునందే పాశబంధ మేర్పడియున్నది. జార్జిప్రభువు పిల్లలకు పంపిన సందేశము వారి సామ్రాజ్యాభిమానమునకు లక్ష్యముగ నున్నది :—

"భావికాలమునందు వర్తమానకాలపు పిల్లలే సామ్రాజ్య పౌరులు కాగలరు మీరు పెద్దవారైన కొలదియును మీదేశమునకు మీమనోవాక్కాయకర్మలను, సర్వస్వమును సేవార్పకముగ సమర్పిం చుటకు సంసిద్ధులుగ నుండుట రాజసందేశము."

సామ్రాజ్యాంతర్భాగములందును, గ్రేటుబ్రిటనునం దును నత్యంతవైభవముగను రజతోత్సవములు జరుపబడి నవి. రజతోత్సవములు జరిగిన తరవాతను అనతికాల మునతే శ్రీ జార్జి సార్వభౌముడు పరమపదమును పొందు టయు వేల్సు యువరాజు అష్టమ ఎడ్వర్డు నామమునను రాజ్యాధికారమును బూనుటయును దైవసంఘటనములు. ప్రపంచానుభవమును, స్వాతంత్ర్యయోచనలును గల అష్టమ ఎడ్వర్డు పరిపాలనము సామ్రాజ్యమునందు మానవధర్మాభ్యుదయమునకు వినియోగపడుటకు భగ వంతు డనుగ్రహించుగాక !

ప్రపంచపరిణామమునందు పశుబలస్థానమును బుద్ధి బల మాక్రమించినను బుద్ధిబలము పశుబలరూపమును దాల్చుట మానవధర్మక్షతిహేతువులం దాసురఘోరేతి హాసము. భారతసంగ్రామసమయము నందువలెను వర్తమాన సమయము నందును సకలరాజ్యములును రాజ్యా దాయము నాయుధధారణనిర్మాణములకు వినియో గించుచు ప్రపంచసంపదలను స్వదేశసంపదలను నాశనము చేయుచున్నవి. గతించిన మహాసంగ్రామమునందు

ప్రపంచ పరిణామము

౭౫,౧౦,౦౦౦ సైనికులు మృతినొంది, ౫౮,౦౦౦ కోట్ల రూప్యములు వ్యయమై, పరిశ్రమలు పాడై, ప్రపంచమును సైన్యావస్థ యాక్రమించి ప్రజ లశాంతులై పరితపించుచున్నను కలహాశనులకును, సంగ్రామప్రియులకును శాంతి గలుగకున్నది. ౧౯౩౧ నందు యూరపు రాజ్యములు, జపాను మొదలగు రాజ్యములు సంగ్రామ సన్నాహములకు ౮౦౦ కోట్ల రూప్యములను వ్యయము చేసినది. ౧౯౩౭ నందు ౧౨౦ కోట్ల రూప్యముల నధికముగను విమాననౌకాదళములకు వ్యయము చేయుటకు గ్రేటుబ్రిటను నిర్ణయించినది. కాలెడి మందుకొట్లతో నిండియున్న ప్రపంచమునం దొకనిప్పురవ్వ ప్రపంచమునంతను తగులబెట్టుటకు చాలియున్నది. ముసోలినీగారి రాక్షసప్రజ్ఞలను, అబిసీనియను ప్రజల దుఃఖవేదనను, లావలుగారి భేదోపాయములను, ఈడెనుగారి నీతివాక్యములను, హిట్లరుగారి దంభాహంకారములను, ప్రపంచ పరిస్థితులను నవలోకించునపుడు కుజరాజబల మనివార్యమై సంగ్రామదుఃఖానుభవము ధర్మపరిణామమునకు దైవఘటనముగను గనుపడుచున్నది. మహాభారతయుద్ధము విదురభీష్మద్రోణాదులను కౌరవపక్షమునకు వలెను బ్రిటీషు ప్రభుత్వసాహచర్య దోషము హిందూస్థానమును సంగ్రామ ప్రస్థానమునకు బలవంతముగ నాకర్షించుటయును సహజము. రాజకీయార్థిక సాంఘిక మతాది సకల విషయములందును ఆచారాధికార పాశబద్ధమైన హిందూదేశమునకు ప్రారబ్ధకర్మము నశించుటకు మహావర్తన ప్రాయశ్చిత్తము విధికృతము గావచ్చును. ప్రజలు నియత కర్మానుష్ఠాన పరాయణులై స్వధర్మ నిర్వహణమునకు సంసిద్ధులగుట పరమార్థము.

నానాజాతి సమితి

నానాజాతిసమితి ౧౯౨౦వ సంవత్సరము జనవరి ౧౦ తేదీని స్థాపింపబడినది. సమితియొక్క సంకల్ప మంతర్జాతీయ సాహచర్యమును, ఆయుధవిసర్జనమును జేసి సకల రాజ్యస్వాతంత్ర్యరక్షణమును జేయుచు ప్రపంచశాంతిని గాపాడుటయై యున్నది సమితియందు ౬౦ చిన్న పెద్ద రాజ్యములు చేరినవి. సమితి కార్యనిర్వహణమునకై అంగోపాంగము లేర్పడినవి. సమితి వ్యవహారములుమాత్ర మారంభమునుండియును సంశయాస్పదములుగ నుండినవి. అమెరికా సంయుక్త రాష్ట్రములు చేరుటకు నిరాకరించినది. జపాను, జర్మనీ, బ్రెజీలు, కోస్టారీకా సభ్యత్వమును మానుకొన్నవి. కారణము సర్వసామాన్యముగను తెలిసిన విషయమే. నానాజాతిసమితి సిద్ధాంతమునందు ప్రపంచశాంతి సంరక్షణమున కేర్పడినను వ్యవహారములందు మొదటను పెద్ద రాజ్యముల లాభసంరక్షణమునకును, తదనంతరము శ్వేత జాతుల స్వత్వసంరక్షణమునకును వినియోగపడుచున్నది. ధర్మ స్వాతంత్ర్యరక్షణమునకు నిరర్థకమైనది. పెద్ద చిన్న రాజ్యముల ధర్మములకును స్వాధీనపరాధీనరాజ్యముల ధర్మములకును శ్వేత శ్వేతేతర రాజ్యముల ధర్మములకును భేదము లేర్పడినవి. సమితి వ్యవహారములందు ఫ్రాన్సు గ్రేటుబ్రిటనులకు గల ప్రతిపత్తి జర్మనీ జపానులకు గలుగకున్నది. ఇటలీపట్ల గల భయగౌరవములు అబిసీనియాపట్ల గలుగకున్నవి. జాతిసమితియందు సభ్యత్వముగల అబిసీనియామీదను ఇటలీదండయాత్ర నాపుటకు సమితికి శక్తిలేకపోయినది. సంగ్రామము ప్రారంభమైన తరువాతనైనను సమితి నిర్ణయించిన ఆంక్షలను ప్రయోగించుటకైనను సమితికి శక్తి లేకపోయినది. సమితీయందు ఫ్రాన్సు, బ్రిటను, రుష్యా, ఆస్ట్రియా మొదలగు రాజ్యము లన్నియును స్వప్రయోజనముల నారాధించునటులు ధర్మప్రయోజనముల నారాధించుటలేదు. ఈడెనుగా రాంక్షలను ప్రయోగింపగోరుటయును, లావలుగారు వేగిరింపవలదని మందలించుటయును సమితి నిరర్థకమైన విధమునకు నిదర్శనము. మహాసామ్రాజ్య వైభవముల ననుభవించుచున్న బ్రిటిషు ఫ్రాన్సు రాజ్యము లాచంద్రార్కము స్వీయభుక్తములను సంరక్షించుకొనుటకు ఏర్పడిన సమితి ప్రపంచవిశ్వాసమునకు పాత్రము గాదు. స్వాతంత్ర్యదాహముచేతను, దారిద్ర్య దాహము చేతను పరితపించుచున్న రాజ్యములకును, శ్వేతేతర

జాతులకును తరణోపాయమును సమితి సమకూర్చనంత
వరకును సమితిప్రయోజనము లతిస్వల్పములు. సమితి
యింతవరకును, కార్మికవ్యవహారములందును, ఆరో
గ్యార్థిక వ్యవహారములందును చేసిన స్వల్పప్రయోజన
ములను సయితము అబిసీనియావ్యవహారములు నిరర్థ
కము చేసినవి. అబిసీనియాసంగ్రామము శ్వేతజాతుల
స్వార్థపరత్వమును, యూరపురాజ్యముల రాక్షసబల
ప్రయోగమును, పెద్దరాజ్యముల తంత్రములను వెల్లడి
చేసి సమితిగుట్టను బయటపెట్టినది.

**అబిసీనియా సంగ్రామము**

అబిసీనియా ఒక్కటియే ఆఫ్రికా ఖండమునందు
నిలిచియున్న స్వతంత్రరాజ్యము. ౧౧౫,౨౧,౯౩౦ మైళ్ల
విస్తీర్ణము గల శేషించిన ఆఫ్రికాఖండ మంతయును
శ్వేతజాతుల వశమైనది. ఆదికాలము
నుండియును అబిసీనియా స్వాతం
త్ర్యము ననుభవించుచు క్రైస్తవ
మతమును స్వీకరించినది. అబిసీనియా ౩,౫౦,౦౦౦ మైళ్ల
విస్తీర్ణమును, ఖనిజసంపదలను, ౮,౦౦౦ అడుగుల ఎత్తు
యిన పీఠభూములను గలిగి నైలునది పుట్టిన ప్రాంతము
లందు విరాజిల్లుచున్నది. అబిసీనియాను మ్రింగుటకు
బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీరాజ్యములు ప్రయత్నించియును
పరస్పర వైరములవలనను విరమించినవి. అబిసీనియా
౧౯౨౩-వ సంవత్సరమునందు సమితియందు చేరదలచి
నపుడు బ్రిటను ప్రతిఘటించుటయును, ఇటలీ సమర్థించు
టయును సంభవించినది. ౧౮౯౧ నుండియును గ్రేటు
బ్రిటను అబిసీనియాయందిటలీప్రయోజనప్రాబల్యముల
నామోదించినది. ౧౮౯౬ సంవత్సరమునందు అడోవా
యుద్ధమునందు అబిసీనియాసైన్యములు ఇటలీ సైన్యము
లను సంపూర్ణముగ నోడించినవి. విజయానంతరము అబి
సీనియా చక్రవర్తి హైలిసిలాసి అబిసీనియా రాజ్య
మును సైన్యములను ప్రబలముచేయుట కుపక్రమించెను.
అబిసీనియా సమ్మతింపులేకనే ఫ్రాన్సు గ్రేటుబ్రిటనులు
సంగ్రామఫలముగను ఇటలీకి అబిసీనియాను సంక్రమింప
జేయుట కంగీకరించినవి. గ్రేటుబ్రిటను ఫ్రాన్సులు
౧౯౨౫-౧౯౩౦ సంవత్సరములందీసంక్రమణము బల
పరచినవి. హోరు లావలు సంధి సూచన లీరహస్య సం
ధినె సమర్థించినవి. ఇతరరాజ్యములను పంచుకొనుటకును
దానము చేయుటకును యూరపు రాజ్యాంగ
వేత్తలు వెనుదీయనివిధమును అబిసీనియాయుదంతము
వెల్లడిచేయుచున్నది. ఇటలీ స్వయముగను అబిసీని
యాతో జేసికొనిన సంధి నుల్లంఘించినది; సమితి
నియమములను నిరాకరించినది; సంగ్రామధర్మ విరుద్ధ
ముగను ఆసుపత్రులమీదను, నిరాయుధులైన ప్రజల
మీదను, గ్రామసీమలమీదను విషాదపూరితము లైన
బాంబులవర్షమును గురిపించుచు సర్వసంహారము చేయు
చున్నను నివారణోపాయములు గనుపడకున్నవి. అబి
సీనియాప్రజల మొరలు, రాణీ రాజుల విన్నపములు,
ప్రపంచనిరసనములు నిరర్థకము లైనవి. ఇటలీ జయించి
ఆక్రమించిన భాగముల పూర్ణస్వాధీనమును, శేషించిన
భాగములమీదను నధికారమును ఇటలీకిచ్చి సంధిచేయు
టకు బ్రిటీషు ఫ్రాన్సు మంత్రాంగులు ప్రయత్నించు
చున్నారు. గ్రేటుబ్రిటను జర్మనీకి కొంచెమైనను ప్రదే
శము నిచ్చుటకు నిరాకరించుచు ఇటలీకి అబిసీనియా
నంతయును కట్టిపెట్టుట యేమిధర్మమో బ్రిటిషురాజ
నీతిజ్ఞులే తెలుపవలసిన విషయము. అబిసీనియావిజయాక్ర
మణములు కాలాంతరమునందు శ్వేతజాతులకు మహా
దుఃఖానుభవమునకు మూలము గాగలదు. యుద్ధము
ప్రారంభమై ౭ మాసములైనను యూరపురాజ్యముల
తటస్థభావము మానవధర్మ విశ్వాసమును నిర్మూలము
చేయుచున్నది. ముస్సోలినీగారు విజయోన్మాద దశయం
దయినను ఒక్కక్షణము రోమకసామ్రాజ్య చరిత్రమును
సంస్మరించుట వివేకోదయమునకు సాధనము గాగలదు.
అబిసీనియాభయంకరసంగ్రామము, జర్మనీ రైనులాండు
ఆక్రమణము, జపాను మంగోలియాఆక్రమణము తుర్కీ
డార్డెనెల్సు సంరక్షణేచ్ఛ ప్రపంచమునకు రానున్న



సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు, వెనుకటివారు



కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఇప్పటివారు

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులు

భయంకరప్రళయ చిహ్నములు. నిస్సహాయపరాధీనస్థితి యందున్న హిందూస్థానము స్వవిషయమునందు వలెను పరవిషయములందును భగవంతుని మీదను భారము వేయుటతో సంతృప్తిని పొందవలసియున్నది.

హిందూస్థానము

అపారమైన సహజసంపదలు ౩౫ కోట్ల ప్రజలు ౧౦,౯౯,౩౦౦ చదరపు మైళ్ళవిస్తీర్ణమును, ప్రాచీనవిజ్ఞానమునుగల భరతఖండము స్వయంపోషణమునకు సకల విధములను తగియున్నను పరాధీనిస్సహాయస్థితియం దుండుట కర్మఫలము. ఆచారపాశబద్ధమైన దేశమునందు స్వయంకృతాపరాధములు పారతంత్ర్యమును బలవంతముచేసినవి. కులాచారాభిమానము, మతాభిమానము, అంటరానితనము, బాల్యవివాహములు, నిర్బంధవైధవ్యము స్వాతంత్ర్యలక్ష్యమును స్తంభింపజేసినవి. పాడిపంటలకును పరిశ్రమలకును, సంపదలకును నిలయమైన దేశము దారిద్ర్యవ్యాధిగ్రస్తమై కృశించుచున్నది. మహామారి, విశూచి, మశూచి వ్యాధులు యథేచ్ఛగను విహరించుచున్నవి. ఏటేటను ౩౫ లక్షలమంది జ్వరములవాతను బడుచున్నారు. ప్రజల కవసరమైన వైద్యసహాయము దుర్లభముగ నున్నది.

ప్రజాపోషణమునకు మూలాధారమైన వ్యవసాయపరిశ్రమ గతించిన ౧౦ ఏండ్ల యందును వృద్ధిలేకను యథాస్థితిగా నుండున్నది. ప్రజాపోషణమునకు విదేశముల నుండి బియ్యము, నూకలు, గోధుమలు దిగుమతు లగుచున్నవి వ్యవసాయపదార్థముల ధరలు ౧౦౦ కి ౫౩ వంతున పడిపోయినవి. దేశవ్యాపారము ప్రతికూలముగను పరిణమించినది. ఎగుమతులకన్నను దిగుమతుల విలువ ౧ ౨/౪ కోట్లు హెచ్చినది. బంగారపు ఎగుమతి హిందూస్థాన గ్రేటుబ్రిటనుల ప్రతిపత్తిని రక్షించినది. గతించిన మూడేండ్లయందున ౨౬౪ కోట్ల బంగారము ఎగుమతి యైనను ప్రభుత్వ ముపేక్షచేసినది. గతించిన అయిదేండ్లయందు ఎగుమతులు ౩౧౯ కోట్లనుండి ౧.౨౦ కోట్లకును, దిగుమతులు ౨౨౭ కోట్లనుండి ౧౧౯ కోట్లకును క్షీణించినవి. వ్యాపారమునందు సగముభాగము బ్రిటిషుద్వీపములతో జరుగుచున్నది. ౩౫ కోట్ల జనులందును ౨/౩ కోట్లమంది మాత్రమె అక్షరజ్ఞులు దూది, శర్కర, జ్యూటు, తేయాకు లోహపుపరిశ్రమలు కొంత వికసించినను విదేశములనుండి కోట్ల రూప్యముల బట్టలు, నూలు, శర్కర లోహపదార్థములును దిగుమతి యగుచున్నవి. దేశమంతయును దారిద్ర్యగ్రస్తమైదుర్భిక్షమయమై వ్యవసాయపరాయణత్వము నభిలషించుచున్నది. ప్రజలయందు విశేషభాగమునకు జీవనాధారములును, నివాసస్థానములును నైన గ్రామసీమలు పునరుద్ధరణమును గోరుచున్నవి. గ్రామోద్ధరణమునకు కోట్ల రూప్యములె కాకను హృదయపరివర్తనము ప్రభుత్వమునకు గావలసియున్నది. గాంధిమహాత్ము డుపక్రమించిన గ్రామోద్యోగసంఘమువలన నైనను నీ యుపకృతి గలుగుటకు ప్రజలు కార్యవీరులై పనిచేయుట ధర్మము.

జాతీయమహాసభ ౧౮౮౫ నందు ప్రారంభమై క్రమవికాసమును పొంది ౧౯౩౫ నందు స్వర్ణోత్సవమును పరమోత్సాహముతో జరుపుట స్వాతంత్ర్య సంరంభమునందు దివ్యఘట్టము. ఆరంభమునందు ౧౮౮౩ నందు హ్యూము గారు కలకత్తా పట్టభద్రులకు జేసిన

కాంగ్రెసు స్వర్ణోత్సవము

సేవాత్యాగదీక్ష సందేశమునె గాంధిమహాత్ముడు జనసామాన్యమునకును జేసి పూర్ణ స్వరాజ్యధ్వాన మాసేతు హిమాచల పర్యంతము ప్రతిధ్వనింపజేసెను. మొదటికాంగ్రెసు అధ్యక్షుడు ఉమేశచంద్ర బొనర్జిగారిటీవల చిత్తరంజనుదాసుగారు వలెను కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను చిరకాలము సంరక్షించిరి. ఆరంభమునందు కాంగ్రెసు పరావలంబన చిహ్నములైన విన్నపములతోను, ప్రార్థనలతోను, రాజభక్తి పాటలతోను కార్యారంభమును జేసినను కాలక్రమమునను స్వావలంబనపరమైన సత్యాగ్రహ పరిణామమును పొందినది, జాతి మత కుల వివక్షతలేకను హిందువులుమహామ్మ

జీయులు, పార్శీలు, క్రైస్తవులు, స్త్రీలు, పురుషులు కాంగ్రెసునందు స్వరాజ్యఘోషను ప్రతిధ్వనింపజేసిరి. గోపాలకృష్ణగోఖలె, లోకమాన్యతిలకు, దాదాభాయి నౌరోజీ, ఆనిబెజంటు, లాలా లజపతిరాయి, మదన మోహన మాలవ్యా మొదలగువారి పవిత్రనామములు సువర్ణాక్షరములతో కాంగ్రెసుచరిత్రయందు లిఖింపబడినవి. విశాలమైన దేశమునందు స్వరాజ్యలక్ష్యమునందును, సంపాదన సాధనములయందును భేదాభిప్రాయములు సహజములు. సూరతునందు మితవాదులకును, జాతీయవాదులకును గల భేదాభిప్రాయములు కాంగ్రెసును ధ్వంసముచేసినను కాంగ్రెసునందు రెండుపక్షముల సంయోగమును సమకూర్చిన ప్రతిష్ఠ బిజెంటమ్మగారికి దక్కినది. బిజెంటమ్మగారి హోమ్రూలు ఆందోళనము ప్రచండరూపమును దాల్చి బిజెంటుగారు నిర్బంధములకు గురియై కాంగ్రెసునం దధ్యక్షపీఠము నలంకరించిరి. నిరంకుశాధికారుల నిర్బంధవిధానములు జాతీయవాదులకు బలమును గలుగజేసినవి. జలియనువాలాబాగు హత్యలు రౌలటుచట్టము, మాంటుఫర్డు సంస్కరణములును కాంగ్రెసును జాతీయపక్షవశము చేసినవి. మితవాదులు కాంగ్రెసునుండి ౧౯౧౮ యందు విడిపోయి లిబరలు ఫెడరేషనును స్థాపించిరి.

కాంగ్రెసు ౧౯౨౦ నుండియును గాంధిమహాత్ముని నాయకత్వమునను స్వరాజ్యసంపాదన సాధనమునందు ధర్మపరివర్తనమును గలుగజేసినది. ప్రవృత్తియందు సంకల్పసిద్ధికి నిత్యసత్యసాధనమైన సత్యాగ్రహ సాధనమును స్వరాజ్య సంపాదనమున కుపయోగించుట గాంధి మహాత్ముని మహాత్త్వనాయకలక్షణము. గాంధిమహాత్ముని నాయకత్వము సత్యాగ్రహము ప్రభుత్వపుస్థితులందు సంచలనమును గలుగజేసినవిధమును గాంధి - ఇర్విను ఒడంబడిక రుజువుచేయుచున్నది. విల్లింగ్డను ప్రభువు నిర్బంధ శాసనముల మూలమున్నను శాసనోల్లంఘనమును కాంగ్రెసువ్యవహారములను స్తంభింపజేసినను శాంతివి ధర్మమును స్థాపించినటులు సంతసించుట నిరర్థకము ఇర్విను ప్రభువు ప్రకటించినటులు ప్రాణములేని యెడారి యందు స్థాపించిన శాంతి, ప్రయోజనకరమైన శాంతి కాదు. గత సంవత్సరమునందు బొంబాయియందుగూడిన కాంగ్రెసునకు బాబూరాజేంద్రప్రసాదుగా రధ్యక్షులై కాంగ్రెసుప్రతిష్ఠ నుద్ధరించుటకు చేసిన ప్రయత్నములు సంస్తవనీయములు. రాజేంద్రప్రసాదుగారి యాజ్ఞానుసారముగను డిసెంబరు మాసాంతమునందు దేశమునం దంతటను కాంగ్రెసు స్వర్ణోత్సవ సందర్భమునందు జరిపిన సభలు, ప్రసంగములు, ఉత్సవములు, ప్రదర్శనములు, దానధర్మములు కాంగ్రెసుపట్ల ప్రజలకు గల భక్తివిశ్వాసములను వ్యక్తము చేసినవి. శ్రీయుత పట్టాభి సీతారామయ్యగారు రచియించిన కాంగ్రెసుచరిత్ర ప్రజాదరణమునకు పాత్రమై కాంగ్రెసు తత్త్వపరిణామమునకు సాధనమైనది. కాంగ్రెసు ఆశయము క్రమముగను పూర్ణస్వాతంత్ర్యపరిణామమును పొందిన విధమును కాంగ్రెసుచరిత్ర విశదము చేయుచున్నది. లక్షలమంది స్త్రీలు పురుషులు దేశదాస్య విమోచనార్థ మవలంబించిన సత్యాగ్రహము ప్రపంచేతిహాసమునం దపూర్వ సంవిధానము. లోకయాత్రయందు సంకల్పసిద్ధికి సత్యాహింసాపరాయణమైన సత్యాగ్రహము ననుగ్రహించిన సత్యాగ్రహాచార్యునకు స్వదేశములును విదేశములును కృతజ్ఞములగును గాత!

లక్నో కాంగ్రెసు

సుప్రసిద్ధనాయకులు పండిత జవాహరిలాలుగారు లక్నో కాంగ్రెసున కధ్యక్షత వహించుదురు. వారి ప్రియసతి శ్రీమతి కమలానెహ్రూగారు పరలోకమును జేరినను, దేశసేవాపరాయణులైన నెహ్రూగారు కాంగ్రెసునాయకత్వభారమును స్వీకరించుట వారి నిగ్రహధైర్యములను వెల్లడిచేయుచున్నది. లాహోరుకాంగ్రెసున కధ్యక్షులై నిర్వహించిన కార్యభారము వారి స్వాతంత్ర్య ధీరత్వమును వెల్లడిచేయుచున్నది. లాహోరు కాంగ్రెసునం దామోదింపబడిన

మూలస్వత్వముల తీర్మానము ప్రజాస్వాతంత్ర్యమునకు జాతిమత భేదము లేకను మూలాధారముగ నుండగలదు. లాహోరుకాంగ్రెసువలెను లక్నో కాంగ్రెసు నయితము నెహ్రూగారి నాయకత్వముక్రిందను ప్రముఖము కాగలదు. కాంగ్రెసునందుగల భేదాభిప్రాయములు నెహ్రూగారి భారమును దుర్భరముచేయుచున్నను దైవానుగ్రహమువలనను ప్రజానాయక సాహచర్యమునను కార్యభారమును నిర్వహింపగలుగుదురు వర్తమాన సందిగ్ధ సమయమునందన్ని పక్షములవారును కాంగ్రెసుప్రతిష్ఠను గాపాడుటకు స్వీయాభిమానమును విసర్జించి కాంగ్రెసు నిర్ణయములను శిరసావహించుట ధర్మము; వివేకము.

కాంగ్రెసు పక్షములు

విశాలమైన దేశమునందు పారతంత్ర్యస్థితియందు రాజకీయ సాంఘికార్థికాది విషయములందు భేదాభిప్రాయము లుండుటయును పక్షాభిప్రాయము లుండుటయును ప్రకృతి ధర్మము. కాంగ్రెసునందు మితవాదులు, జాతీయవాదులు, స్వరాజ్యవాదులు, బహిష్కారవాదులు, పార్లమెంటరీ పక్షావలంబనులు, సత్యాగ్రహులు, సామ్యవాదులు మొదలగు పక్షనాయకులు పక్షావలంబకులు నుండుట సహజమని గతించిన ౫౦ ఏండ్ల కాంగ్రెసు అనుభవమును విశదము చేసినది. భిన్నపక్షములకును సాధనములు వేరైనను సాధ్యము సమానము. కాంగ్రెసు లాహోరునందంగీకరించిన పూర్ణస్వాతంత్ర్యము వివిధపక్షములవారికిని లక్ష్యము. ఆలక్ష్యమును జేరుట కన్నిపక్షములకును హక్కుగలదు. కాంగ్రెసునందు బలముగల పక్షము మితరపక్షములవారిని కూడగట్టుకొని భారతీయ సంయోగబలమును సంకల్పసిద్ధికై వినియోగించుట వివేకము, ధర్మము. వ్యక్తిత్వముగల నాయకానుచరులను కీలుబొమ్మలను జేయుట సాధ్యముగాదు. అయిదేండ్లు స్వరాజ్యపక్షమునకును బహిష్కారపక్షమునకును మాంటుఫర్డు సంస్కరణానంతరము సంభవించిన ప్రతిఘటనము వర్తమాన సమయమునందు జ్ఞానోదయమునకు సాధనముగ నుండగలదు.

కాంగ్రెసు ౧౯౩౪ సంవత్సరమునందు సత్యాగ్రహమును విరమించినది. శాసనసభా ప్రవేశము నంగీకరించినది. ఆ సంవత్సరమునందు జరిగిన అస్సెంబ్లి ఎన్నికలందు కాంగ్రెసుపక్షమునకు కొంత విజయము గలిగినది. కాంగ్రెసు అభ్యర్థులు సంస్కరణములను నిరాకరించుటకు ప్రతిజ్ఞచేసిరి. అస్సెంబ్లియందు కాంగ్రెసు ఆజ్ఞలను పాలించుచున్నను చేయగలదేదియును కనుపడకున్నది. ప్రభుత్వము పరాజయములను పొందినను గవర్నరు జనరలు ధ్రువాధికారమూలమునను నిరంకుశ విధానమును సమర్థించుచున్నాడు. ౧౯౩౫, ౩౬ సంవత్సరములందు అస్సెంబ్లియందు నిరంకుశప్రభుత్వమునకు దైన్య పరాజయములు కలిగినను ప్రభుత్వము కదలిక లేకుండ సాగుచున్నది. అయినను దేశమునందంతటను ప్రభుత్వ పరాజయములును కాంగ్రెసు విజయములును కాంగ్రెసు ప్రతిష్ఠను ప్రజావిశ్వాసమును ప్రబలము చేసినవి. అస్సెంబ్లియందు కాంగ్రెసుపక్షము ప్రత్యక్షముగను నిరర్థకముచేయజాలకపోయినను పరోక్షముగను నిరర్థకముచేసినది. కాంగ్రెసు పక్షాచరణములు సత్యాగ్రహ లక్ష్యములు కాని సహాకారలక్ష్యములు కావు; ఇంకను శాసన తిరస్కారలక్ష్యములు కాని సహకార లక్ష్యములుకావు. అస్సెంబ్లి ఎన్నికలందువలెను, స్థానికసంస్థల యెన్నికలందును, రాష్ట్రీయశాసనసభల యెన్నికలందును కాంగ్రెసు-అభ్యర్థులు పాల్గొనుటకు కాంగ్రెసు సమ్మతించినది. కాంగ్రెసు నాయకులు జిల్లాబోర్డుల కధ్యక్షులై వ్యవహారములను నిర్వహించుచున్నారు. ఈ సంవత్సరాంతమునందు ఇండియా ఆక్టుననుసరించి రానున్న ఎన్నికలందు కాంగ్రెసు అభ్యర్థులు పాల్గొనుట కంగీకరించినపుడు శాసననిరాకరణ భావము కొంతవర కంతరించినది. శాసనసభాప్రవేశమును కాంగ్రెసు అంగీకరించినపుడు మంత్రిపదవుల స్వీకరణము నంగీకరించుటయును సహజధర్మము. కాంగ్రెసు పక్షాచరణములను శాసనసభలయందు నియమించి నిర్ణయించుటకు కాంగ్రెసు అధికారమును వహించుచున్నది.

అకర్మకన్నను విగుణమైన కర్మమైనను శ్రేయస్కరము. మంత్రిపదవులను స్వీకరించెడి కాంగ్రెసు నాయకులు ఇండియా శాసనహృదయమును, సహాయ నిరాకరణ ధర్మమును స్వానుభవపూర్వకముగను గ్రహించి ప్రజలకు హృద్గతము చేయుటకు సమర్థులగుదురు. ఇండియా శాసననిరాకరణమునకు శాసనసభా బహిష్కరణమే ధర్మమార్గము. శాసనసభా ప్రవేశము సహజముగను తత్ఫలమైన మార్గాంతరముల నపేక్షించుచున్నది. సహాయ నిరాకరణము సాపేక్షము గాని నిరపేక్షము కాదు కాంగ్రెసునందు భిన్నపక్షములవారును స్వీకరణ నిరాకరణవాదప్రతివాదములతో ప్రజాహృదయమునందు సంశయములను కాలహరణమును గలుగజేయక నేకాభిప్రాయముతో శాసనసభా ప్రవేశమును ప్రవేశానుగుణ్యఫలమునుస్వీకరించి ఇండియాబిల్లు నిరాకరణమును రుజువు చేయుటకర్తవ్యము.

గతించిన రెండేండ్ల యందును సామ్రాజ్యసభ యందు సంభవించిన వ్యవహారములు పరమోత్సాహపరాయణులకును నిరుత్సాహమును గలుగజేయుచున్నవి

సామ్రాజ్య శాసనసభ

సర్ కావస్జి జహంగీరు జిన్నాగారులు ఘోషించునటు లేపక్షమునందును ప్రభుత్వమునకు మిత్రులు లేరు. క్రెయిక్కు గ్రిగ్గుగారల ప్రవర్తన ప్రసంగములు హేయములై సభాప్రయోజనములను నిరర్థకము చేయుచున్నవి. ఆదాయమునందు ౪౫-౫౦ లక్షలు మిగిలినపుడు బీదలకు పన్నుల భారమును తగ్గించుట రాజనీతి. కాని సొమ్మును క్వెట్టాపునర్నిర్మాణమునకును బ్రాడుకాస్టింగునకును వినియోగించుట రాజనీతి కాదు. శాసనసభ నిరాకరించిన ఉప్పుపన్నును, పోస్టుకార్డును పునరుద్ధరించుట రంకుశాధికార లక్షణము కాని రాజనీతిలక్షణము కాదు. ప్రజాప్రతినిధుల యభిప్రాయములను తృణీకరించుచు నిర్బంధముల నుపయోగించిన విల్లింగ్డను ప్రభువుగారు ప్రజాగౌరవమునకెటులు పాత్రులగుదురో తెలియకున్నది. శాసనోల్లంఘనము నాపినందులకు సంతసించుటకన్నను ప్రజానిరసనమును బడసినందులకు విచారపడుటవివేకము. సామ్రాజ్య శాసనసభ ఒటావా యొడంబడికను రద్దుచేసినది. ఎన్నిసారు లోడిపోయినను, సిగ్గునువిడిచి ప్రగల్భములు కొట్టు విల్లింగ్డను ప్రభుత్వమున కెవరును మిత్రత్వమును జూపజాలరు.

హిందూస్తానాంతర్గతములైన వివిధ రాష్ట్రములకును సంస్థానములకును సంబంధించిన రాజకీయార్థిక సాంఘికమతసమస్యలన్నియును ప్రచండముగను మద్రాసురాష్ట్రాంతర్గతమైన ఆంధ్రరాష్ట్రమున కన్వయించుచున్నవి.

ఆంధ్రాభ్యుదయము

ఇరువది యేండ్లకు పూర్వము విలసిల్లిన ఆంధ్రోద్యమమునకు, కలకత్తాకాంగ్రెసు ౧౯౨౦ సంవత్సరమునందు నిర్ణయించిన భాషా ప్రయుక్తరాష్ట్రవిభాగము నామరూపములను సమకూర్చినది. గతించిన ౧౫ ఏండ్ల యందును ఆంధ్రులు స్వరాజ్య సమరమునందు గడించిన గౌరవ ప్రతిష్ఠలు వారి వ్యక్తిత్వమును దేశమునందంతటను వికసింపజేసినను ప్రభుత్వాధికారులకును ప్రభుత్వావలంబనులకును ప్రతికూలములైనవి ఆంధ్రోద్యమమునకు హృదయమైన ఆంధ్రరాష్ట్రనిర్మాణమును మద్రాసుప్రభుత్వమును జస్టిసుపక్షనాయకులును ప్రతిఘటించిరి. మెమ్సుఫోర్డు సంఘమువలెను సైమను కమిషనుచు సిద్ధాంతమునందు భాషాప్రయుక్తరాష్ట్రములను, ఆంధ్రరాష్ట్రమును సమ్మతించినను వ్యవహారమునం దాంధ్రరాష్ట్రనిర్మాణమును నిరాకరించినది. రౌండుటేబిలు కాన్ఫరెన్సునందును నీదురవస్థయె సంభవించినది. మొదటి రౌండుటేబిలుసమావేశమునందు ప్రత్యేకాంధ్రరాష్ట్రమును కోరిన బొబ్బిలిరాజాగారు రెండవ రౌండుటేబిలు సమావేశమునం దాంధ్రరాష్ట్రనిర్మాణమును నిరాకరించిరి. ఒరిస్సా సింధురాష్ట్రముల నిర్మాణమున కుపకరించిన ప్రత్యేకజాతి భాషా విజ్ఞాన సంస్కార ధర్మములు ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కేలపనికిరావో బొబ్బిలిరాజా

గారికిని ప్రభుత్వమునకునుమాత్రమె తెలిసిన రహస్యము. హిందూదేశమునందు ఫెడరేషను ప్రభుత్వము సాధ్యమగుట కెప్పటికైనను భాషాప్రయుక్తరాష్ట్ర విభాగములు శరణ్యములు. ఆంధ్రులు ౨౫౦ లక్షలమంది ఎల్లకాలమును అజ్ఞాతవాసము చేయజాలరు. కేవలము అధికారులు, జమీందారులు, భూస్వాములు, ధనస్వాములు ఆంగ్లవిద్యావంతులు ప్రజాయత్తపరిపాలనమునందు ప్రజాప్రతినిధులుగ నుండజాలరు. ప్రజాప్రాతినిధ్యమునకు గ్రామసీమవాసులెనమర్థులు. ప్రజాశక్తివిజృంభించివీర్యవంతమగుటకుమాతృభాషాసాహిత్యామృతము ప్రయోజనకరము. రాజ్యాధికారాధారములేని ప్రజాజీవనవికాసము సకలార్థములందును దుర్లభము. గంజాముమండల లాంధ్ర సోదరులు ఒరిస్సారాష్ట్రమునందు జేరుట దురదృష్టము. పరిపాలనా సౌకర్యమునకును, ప్రజాయత్త పరిపాలనా వ్యాపనమునకును, ప్రజా వికాసమునకును, ఫెడరేషను విధానము యథార్థముగను సఫలమగుటకు భాషాప్రయుక్తమైన ఆంధ్రరాష్ట్రనిర్మాణము వెంటనే యవసరమగుచున్నది. కాలయాపనము స్థిరవ్యవస్థలను మార్చుటను దుర్లభముచేయుచున్నది. ఇండియా బిల్లులోని నియమముల కనురూపముగను రాష్ట్రీయ సభల నెన్నికలయందునురాష్ట్రీయ సభలయందును ప్రజానాయకులు దీక్షను బూని ఆంధ్రరాష్ట్రమును సార్థకము చేయుదురుగాత !

ఆంధ్రాభ్యుదయమునకు పలు విధములను పోషణములేకను ప్రతిబంధకము లేర్పడినను స్వయం సహాయమునను గలుగుచున్న పురోభివృద్ధి ఆశాజనకముగ నున్నది. ఆంధ్రసాహిత్యము కళలు నవయుగారంభమున కనురూపముగను వికాసమును పొందుచున్నవి. గ్రంథాలయములు గ్రంథమండలులు విజ్ఞానవ్యాపనమునకు కృషి సల్పుచున్నవి. దేశమునందంతటను రాజకీయార్థిక సాంఘిక విషయములందు మహాపరివర్తనము గలుగుచున్నను ప్రజాశక్తి విజృంభణ మవకాశా భావమునను సార్థకము గాకున్నది. హిందీ ప్రచారమునందు యువజనులు చూపుచున్న యుత్సాహము హిందీప్రేమికా మండలికి సంతృప్తిని గలుగజేయుచున్నది. సకల రంగములందును యువజనోత్సాహము నియతకార్య సాధనమును దాల్చవలసిన యవసరమును దేశపరిస్థితులు సహస్రముఖములను బోధించుచున్నవి. వివిధ ప్రాంతవాసులును, కులమతావలంబనులును నియతకర్మానుష్ఠానపరాయణులై ఆంధ్రరాష్ట్రమును సాధించి కృతార్థులగుటకు భగవదనుగ్రహము గలుగుగాత !

ధాతృసంవత్సరాది సంచిక

ప్రపంచపంచాంగశ్రవణము స్వపంచాంగశ్రవణమును నిరర్థకము చేయుచున్నది. అనంతములైన ప్రపంచోద్యమములందు స్వల్పోద్యమము గణనీయము కాకపోయినను సంచికా పంచాంగశ్రవణము చేయుట నిర్వాహకులకును, లేఖకులకును, పాఠకులకును ఆత్మసంస్మరణమునకు సాధనము. మహాసంకల్పము స్వల్పఫలము ప్రపంచవ్యవహారములందు పరిపాటియైన విషయము. అనంతమైన కర్తవ్యమునందు పరిమితమైన దేశకాల పాత్రావరణములందు కృత మత్యంతస్వల్పమగుచున్నది. యువసంవత్సరారంభమునందు జేసిన సంకల్పమునందు శతాంశమైనను ధాతృసంవత్సరారంభమునందు కార్యరూపమునుదాల్చుట దుర్లభమయిన విధము కార్యనిర్వహణము సంస్మరణము చేయుచున్నది. కీలకసంవత్సరమునుండియును సంవత్సరాది సంచికలు ప్రకటింపబడుచున్న ప్రయత్నములు యథార్థము గను ఫలమగుట దుర్లభముగనున్నది. గతించిన ౨౭ ఏండ్లయందును ప్రపంచ వ్యవహారములందు సంభవమగుచున్న మహాపరివర్తనమును నిరూపించుటకు సంవత్సరాదిసంచికలందు ప్రయత్నములు చేయబడినవి. ప్రయత్నములుయథార్థముగను సఫలము చేయజాలనందులకు నిర్వాహకులు చింతిలుచున్నారు. గతించిన సంచికలందువలెను ధాతృసంవత్సరసంచికయందును దేశభాషాభ్యుదయమునకు సంబం

ధించిన వ్యాసములు, పద్యములు, చిత్రములు మొదలగు నవి చేర్చబడినవి. త్రివర్ణచిత్రము లాంధ్రయువకులు చిత్రరచనయందు జూపుచున్న వ్యక్తిత్వ దక్షత్వములను విశదము చేయుచున్నవి. వ్యాసములు, కథలు, పద్యములు ప్రజాహృదయములందు ప్రవర్ధమానంబగుచున్న సాహిత్యకళాభిమానములను విశదము చేయుచున్నవి. ముఖపటము జీవనాధారములైన పాడిపంటలను, పశు సంపదలను, అన్నవస్త్రములను, ఫలవృక్షములను, జలాధారములను, కులవృత్తులను చిత్రరూపమునను మనోగతము చేయుచు కర్తవ్యమును సకలజనులకును స్ఫురింప జేయుచున్నది. సంచికకు వ్యాసములు, చిత్రపటములు, పద్యములు మొదలగువానిని పంపి సంచికాప్రచురణమును సాధ్యము చేసిన మహాజనులకు కృతజ్ఞతాభివందనములు. ప్రచురణమునం దనివార్యముగను సంభవించిన కాలవిలంబనమునకు పాఠకులు, గ్రాహకులు, లేఖకులు మన్నింతురుగాత! ధాతృసంవత్సరమునందు సకల జనులును నియత కర్మానుష్ఠాన పరాయణులై కామితార్థములను భగవదనుగ్రహమునను బడయుదురుగాత!

ఎమ్. శేశ్వత్.





# ఉగాది

శ్రీధాతృనామకాబ్దము
తా ధాత్రి విధానఁ గడుప దక్షియుఁ గనుమ్మ శుక్
శ్రీధాతృసృష్టిఁ జేరిన
యాధాత్రిని ధాతృజనకకృపను మనుమతన్.

ధాతను బొడ్డునం బొడమి తన్మిని బిడ్డనిగాఁగఁ గాంచుటం
దాతకుఁ దాత యన్న ప్రథ తాను వహించి, పురాణపూరుషుం-
డై, తన బొజ్జ నిజ్జగములన్నియుఁ దాల్చిన విష్ణుమూర్తి యా
ధాతను బ్రోచుఁగాత వసుధాతలవాసుల నెల్లరీతులన్!

శ్రీవసంతుండు నానావనాంతరలతాం-
తచయసృష్టి యొనర్చి ధాత యయ్యె:
ధామంబులయ్యె నారామంబుల ట్లభి
రామంబు లామ్రపర్ణములు దాల్చి:
తృప్తిగాఁగఁ జిగుళ్లఁ దిని సంతసమున గొం
తుకలెత్తి పాడెను బికకులంబు;
సంభ్రమంబున భక్తజనులు శ్రీరామలీ
లాసమారంభాభిలాషులైరి;
వచ్చె, వచ్చెఁ, గ్రొత్తవత్సరం! బిది మహో-
త్సవదినం బటంచు జనములు నగ-
రముల, గ్రామములను, బ్రమదంబు గాంచిరి!
వయనముల వెనుగాది యిది యుగాది!

కవిభూషణ
నెట్టి లక్ష్మీనరసింహము



గాంధీ మహాత్ముడు

బెల్గాం : 1924.



బొంబాయిలో 85 సం॥న కాంగ్రెసు మహాసభ సమావేశమైన గోకుల్‌దాస్ తేజ్‌పాల్ భవనం



డబ్లియు. సి. బెనర్జీ

బొంబాయి : 1885—అలహాబాదు : 1892



దాదాభాయి నౌరోజీ

కలకత్తా : 1886, 1906—లాహోరు : 1893



బద్రుదీన్ తయాబ్జీ

మద్రాసు : 1887



జార్జి యూల్

అలహాబాదు : 1888



సర్ విలియం వెడర్ బరన్

బొంబాయి : 1889—అలహాబాదు : 1910



ర్ పి. మెహతా

కలకత్తా : 1890



పి. ఆనందాచార్యులు

నాగపూరు : 1891



ఆల్ ఫ్రెడ్ వెబ్

మద్రాసు 1894



సురేంద్రనాథ్ బెనర్జీ

పూనా : 1895—అహమదాబాద్ : 1902



మహమ్మద్ రహింతుల్లాసయానీ

కలకత్తా : 1896



సర్ సి. శంకరనాయర్

అమరావతి : 1897



ఆనందమోహన్ బోస్

మద్రాసు : 1898



ఆర్. సి. దత్తు

లక్నో : 1899



ఎన్. జి. చందావార్కర్

లాహోరు : 1900



డి. ఇ. వాచా

కలకత్తా : 1901



లాల్ మోహన్ ఘోష్

మద్రాసు : 1903



సర్ హెన్రీ కాటన్

బొంబాయి : 1904



గోపాలకృష్ణ గోఖలే

కాశీ : 1905



రాష్ బీహారీ ఘోష్

సూరత్ : 1907—మద్రాసు : 1908



మదనమోహన్ మాలవ్యా

లాహోరు : 1909



బిషన్ నారాయణధారు

కలకత్తా: 1911



ఆర్. ఎన్. మధోల్కార్

బంకిపూరు: 1912



నవాబు సయ్యద్ మహమ్మద్ బహదూరు

కరాచి: 1913



భూపేంద్రనాథ్ బాసు

మద్రాసు: 1914



సర్ ఎస్. పి. సిన్హా

బొంబాయి: 1915



అంబికాచరణ్ మజుందారు

లక్నో: 1916



డా అనిబిసెంటు

కలకత్తా: 1917



సయ్యద్ హాసన్ ఇమాం
బొంబాయి (ప్రత్యేక): 1918



పండిత మోతీలాల్ నెహ్రూ
కలకతా: 1919—1928



లాలా లజపతిరాయి
కలకత్తా (ప్రత్యేక): 1920



విజయరాఘవాచారి
నాగపూరు: 1920



హకీమ్ అజ్మల్ ఖాన్
అహమదాబాదు: 1921



సి. ఆర్. దాసు
గయ: 1922



అబుల్ కలామ్ అజద్
ఢిల్లీ (ప్రత్యేక): 1923



మహమ్మదాలి
కాకినాడ: 1923



సరోజినీదేవి
కాన్‌పూరు: 1925



ఎస్. శ్రీనివాస అయ్యంగారు

గౌహతి : 1926



.. అన్సారీ

మద్రాసు : 1927



వల్లభభాయి పటేల్

కరాచి : 1931



కాంగ్రెసు స్థాపకులు :

1. హ్యూము, 2. నౌరోజీ, 3. వెడ్డర్ బరన్



నెల్లీ సేనుగుప్తా,

కలకత్తా : 1933.



—ేంద్రప్రసాదు

బొంబాయి : 1934.



పండిత జవహార్‌లాల్ నెహ్రూ

లాహోరు; 1929 లక్నో, 1936.

# ౪౯-వ భారతజాతీయమహాసభ, లక్నో

## అధ్యక్షోపన్యాసము

### ఆప్తవియోగము - మిత్రసమావేశము

సహచరులారా !

పెక్కుసంవత్సరములు గడచిన పిమ్మట తిరిగి నేను మీయెదుట నీ సభామంటపమున నిలువబడితిని. గడచిన సంవత్సరము లన్నియు కష్టములతో గడచినవి. తీవ్రసంఘర్షణముతో గడచినవి. ఈ కష్టమును మనమందరమును అనుభవించితిమి. అట్టితరి మనమందరమును తిరిగి యిచట కలిసికొనుట చాల శ్రేయస్కరము. నాచిరకాల పరిచితులును, మిత్రులును, సహచరులును ఏకైక కార్యతత్పరులై అవిచ్ఛిన్న బాంధవ్యముతో నిచట సమావేశమగుట నాకొక దివ్య సందర్శనముగానున్నది. వెనుకటిశౌర్యప్రతాపమింకను మనలో చల్లారలేదని గ్రహింపగల్గుట కిదియొక యవకాశము. ఈ దేశ స్వాతంత్ర్య సమరములో మీయందరితో బాటు సహచరుడనై, సాటి యోధుడనై పోరాడగలిగిన నన్ను మీరు అపారాదరణాభిమానములతో సన్మానించుటవల్ల కలిగెడి ఆనందమును నే నిపుడు అనుభవించుచున్నాను. ఈమహాసమావేశమందుకూడ నేను ఏకాకినైతినను భావము నన్ను వెంటాడుచున్నను, మీ అందరియొక్క ఆదరణాభిమానములే నాకు మనస్థైర్యమునిచ్చి జవసత్త్వములనొసంగుచున్నవి.



పండిత శ్రీ జవహర్లాలు నెహ్రూగారు

మనసహచరులలో చాలమంది యీ పోరాటమునందు ఆయాసక్లేశముల కోర్వక తమ జీవితాయుః ప్రమాణము సవ్యముగా నిండకపూర్వమే, మృత్యువువాత బడిరి. ఒక్కరొక్కరే భువి వీడి దివికేగిరి. మనఃహృదయములు నీతలేని పర్ణశాలలవలె విషాదభరితము లైనవి. ఈ నిరంతరకల్లోలజాలము నుండి విముక్తులయిన వారి యాత్మలకు విశ్రాంతి లభించినది. అట్టి ఆత్మశాంతికి అర్హులైనవా రట్టి నిత్యపదవిని బొందుట లెస్సయగును. వారు శ్రమించి విశ్రమించుచున్నారు.

అయితే, మనవిషయ మేమిటి ? ఉత్కృష్ట కార్యభారమును, విశ్వశక్త ధర్మములను నిర్వహించవలసిన మనమిచ్చటమిగిలియున్నాము. మనకుగాని, చెరసాలలో నున్నవారికిగాని, నిర్బంధప్రవాసములో నున్నవారికిగాని, విశ్రాంతియనునది యుండదు. మనలను విడనాడి దివికేగినవారందరును, స్వాతంత్ర్యజ్యోతిని మనకు ఒప్పజెప్పి వెళ్లియుండిరి. ఆ స్వాతంత్ర్య పరంజ్యోతిని చల్లారిపోకుండ మనము శ్రద్ధవహించి కనిపెట్టియుండవలెను. ఆ స్వాతంత్ర్యజ్వాలను ప్రజ్వరింపజేయుచుండవలెను. వారు మనకు ఒప్పగించిన యీ ధర్మనిర్వహణమును మనము నిర్వర్తింపనియెడల విశ్వాస ద్రోహులమగుదుము. మనలను నమ్ముకొని లక్షోపలక్షలుగానున్న జనులకందరికిని ద్రోహము చేసినవారలమగుదుము.

నా హృదయము తపించియున్నది. అలసిసొలసియున్న బిడ్డ ఆత్మానందమునకై తల్లియంకమునకు చేరినట్లుగా మాతృభూమికి నేను మరలివచ్చితిని. అందువలన నాకు హృదయతాపోపశమనము అపారముగాకలిగినది. వేనవేలుగా నాదరిజేరిన సోదర దేశీయులు నన్ను చేరదీసి పరిపూర్ణానురాగముతో ఊరడించి యాదరించిరి. వారి ప్రేమపూరితవాక్యములు నా యుల్లమును పల్లవింపజేసినవి. ఇట్టి నా భారత దేశీయులైన యీ స్త్రీ పురుషులకందరికిని నా కృతజ్ఞతాభావమును నే నేవిధముగా వెల్లడింపనేర్తును ? మాటలతో చెప్పనలవి కాని నా హృదయ భావములను మీ కేపగిది నివేదింపనేర్తును ?

### పూర్వకథాప్రశంస

భారతదేశ కథారంగమం దొకప్పుడు నేనుకూడ పాత్రధారినై యుంటిని. కాని, పెక్కుసంవత్సరములనుండియు నేను ప్రేక్షకుడనై మెలంగితిని. ఈమధ్యకాలములో నాకు మనస్సంతాపకరమైన పెక్కువిషయములు సంభవించెను. ఇటీవల జరిగిన కథాకలాపము తయును మీ కింకను జ్ఞప్తియందున్నది. మీమనస్సులలో అచ్చుగుద్దినట్లున్న విషయముల నన్నింటిని, పూసగ్రుచ్చినట్లు నేనిపుడు పురాణశ్రవణము చేయబూనుకొనలేదు. ఆనాటి కథాకలాప మంతయును చిట్టచివరకు కొన్ని అమంగళములతో ముగిసినది.

కొన్నిక్లిష్టసందర్భములను దుర్భేద్యవ్యూహములుగా కల్పించినది కాని గతించినదానిని మరచియుండుటకు వలనుపడదు. భూతవర్తమానముల నుండియే భవిష్యదభ్యుదయము ఏర్పడవలసియున్నది. ఉన్నతాశయములను అవలంబించి కృషిచేసితిమి. మన ఆదర్శములు మహోత్కృష్టములని యుప్పొంగితిమి. పలుబాములబడి వివిధగతుల విచ్ఛిత్తియై యున్న యీ వింత భారతభూమిలో అద్భుత మహత్కార్యము లనేకము జరిగియుండెను. ఇట్టి మహత్తులు ప్రత్యక్షముగా కన్పించినను, మన మనోరథము తీడేరలేదు. మోసపోతిమని గ్రహించితిమి. అపజయమే అనుభవించితిమి. ఉన్నతాశయములతోను, ఉన్నతాదర్శముల కొరకును మనము కృషిచేయునప్పుడు, తాత్కాలికాపజయ మొకవిశేషము కాదు. మనము సాగించవలసిన పోరాటము పెద్దకాలము జరుగవలసినదై యున్నది. అపజయములవల్లనే అఖండవిజయము చిట్టచివరకు చేకూరును. ప్రథమప్రయత్నములు విఫలమైనప్పుడే ఆత్మ పరిశీలన కొంత జరుగుచుండును. మూలకారణములను శోధింపగల్గుదుము. విజయమునకన్న అపజయమే మనకెక్కువ ప్రబోధకరమై రోషావేశములను రేకెత్తించి గుణపాఠముల గరపును. కాని అట్టి ఆత్మపరిశోధన అట్టి ఆత్మజిజ్ఞాస మనము చేయవలెను. అట్టి జాతీయాత్మతత్వవిచారణ చేయుటవల్లను, ఎవరికివారు తనలోపములను తాము గుర్తెరుగ నేర్చుటవల్లను ఋజుమార్గమును అనుసరింపగల్గుదురు. ఆత్మతత్వపరిశోధన లేనట్టిమొండి ధైర్యము నిర్వీర్యమైన విషాదమువలెనే అనర్థదాయకమగును. తాత్కాలిక విఘ్నములును, ప్రయత్న భంగములును నిజమైన అపజయములు కానేకావు. మనయున్నతాదర్శములను మనము విస్మరించి పెడత్రోవల బట్టినప్పుడే మనము నిజముగా అధఃపతితులమగుచుందుము

ఇంతవరకును మనము సాధించినదేమో, ఇతరులు మనలనేవిధముగా సాధించిరో విమర్శించుకొని అభిమానద్వేషములు లేకుండ అయ్యోపాపమని అనుకంప వహింపక కల్లనిజముల నరయుటకై యీ ప్రస్తుత విషమావస్థలో మనలో మనమే ఆత్మవిచారణ కొంతచేసికొనవలసియున్నది. ఇతరులకు ఆగ్రహము వచ్చునని వెరచి వాస్తవమైన సారాంశములను కప్పి పుచ్చకూడదు. వారు మన సాటిసహచరులే యగుదురు గాక! వారినిగూర్చి నిజమాడుటకు వెరువరాదు. అమోఘమైన విషయములలో ధర్మాధర్మ నిర్ణయముచేయవలసినవారు తమకు ముప్పువాటిల్లినను తప్పొప్పులను తారుమారు చేయరాదు.

పదునారు సంవత్సరముల క్రిందట, మన కందరికిని నాయకుడై వెలసిన మహనీయుని ప్రబోధమువలన నిర్వీర్యమైన యీ కాంగ్రెసు సభ భారతదేశమంతటను ప్రజాహృదయములో ప్రాతుకొని ప్రతిష్ఠను పొందిన మహత్తరమైన ప్రజాహితసంస్థగా పనిచేయగల్గెను. అంతకు పూర్వము కొలదిసామాన్యసంపన్నులును, విద్యాధికులును మాత్రమె కాంగ్రెసుసభను జవసత్వములు లేకుండ నడపించుచుండిరి. కాని క్రొత్తగా ఆవిర్భవించిన అఖిలభారత ప్రజాహృదయప్రకోపమును చూచి వెనుకటి పెద్దలు కొలదిమందియును వెనుకంజ వేసిరి. వారి కాలము, వారిపెద్దరికము తీరిపోయినది. వారి సభతో జోక్యము వదలుకొని, సామ్రాజ్యాహంకారపూరితులైన బ్రిటిష్‌వారి యండజేరిరి. కాని ఆత్మదేశ స్వాతంత్ర్యార్థమై చెలరేగిన జాతీయహృదయావేగమునకు చేయూత నొసంగరైరి. దేశచరిత్రలో వారు వెనుకబడిరనియే వర్ణించవలెను. కాని, ప్రజలలోనుండి బయలుదేరిన క్రొత్త పటాలములలో మనము చేరితిమి. నవీన భారతదేశ చరిత్రలో మనముకూడ ప్రశంసార్హముగా పనిచేసితిమి. ప్రజలలో నవశక్తి యావిర్భవించుట చూచితిమి. వారియజ్ఞాన విమోచనము మనకు వేద్యమైనది. చిరకాలానుగతమైన భావదాస్యమునుండి విముక్తి కలిగినది. పారతంత్ర్యమువల్ల కలిగిన అసమర్థత్వమొకటి మనల నావరించియుండగా, నేటి కీయజ్ఞానతిమిరము పటాపంచలైనది. స్వాతంత్ర్యసంకల్పమొకటి ప్రజాసామాన్యమున కంతకును కలిగినది గనుక, మన రాజకీయ విమోచనము చేరువలోనే యున్నదని గ్రహింపగల్గితిమి.

స్థూలబాహ్యబంధములైన ఇనుపగొలుసులనైన సులభముగా త్రెంపివేయవచ్చును. కాని మనబుద్ధిని బంధించెడి దుర్భ్రమలనెడి సూక్ష్మ వ్యామోహబంధములను, సులభముగా త్రెంపివేయజాలము. ఈనవయుగోత్తేజము మనయందే ప్రతిబింబించుచున్నది. ఈనవశక్తికి మనము మచ్చుముక్కలవలె నున్నాము. అసంఖ్యాకులైన తదితరులయందు ఈనవశక్తి ఆవేశించియున్నది. మనదేశమందే గాక, ఖండాంతరములందును యీశక్తి ప్రజ్వరిల్లినది. వారందరితో కలిసి మనము ముందుకు నడచుచున్నాము. ప్రపంచ చరిత్రలో నూతనయుగధర్మ మొకటి ప్రతిష్ఠింపబడవలసియున్నది. అట్టి ప్రతిష్ఠాపనకై ప్రపంచ మంతటను మానవకోటిలో నూతనసంచలనమొకటి బయలుదేరినది. అట్టి నూతనధర్మవికాసమునకు మనముకూడ నిమిత్తమాత్రులమై కృషిచేయుచున్నామనెడి మహదానంద మిప్పుడు మనకు కలుగుచున్నది.

## అఖిలప్రపంచ ధర్మసంచలనము

నూతన జాతీయోద్యమములో మనము నిమగ్నుల మైతిమి. ఈయుద్యమములో మనకు నాయకుడైన మహనీయుని సంస్కార ప్రభావమంతయును దాని కబ్బినది. మనజాతీయవిజ్ఞాన మంతయును అందులో ప్రతిఫలించినది. ఈయుద్యమములో మనము నిమగ్నులమై యున్నకాలమందు బాహ్యప్రపంచ పరిణామములను గమనింపక తన్మయులమై యుంటిమి. అట్లయ్యును, అఖిల ప్రపంచ వ్యాప్తమైన నూతన ధర్మసంచలనమందు మన యుద్యమముకూడ అంతర్భాగమే యై యుండెను.

ఆసియాఖండములోని అన్ని రాజ్యములయందును ఈ నూతనోజ్జ్వలనము కలిగినది. పశ్చిమప్రాంతీయ మహమ్మదీయ రాజ్యములు మొదలుకొని ప్రాగ్భాగాంతస్థిత బౌద్ధభూములవరకును ఈ నూతన ధర్మసంచలనమే వ్యాపించుచున్నది. ఆఫ్రికా ఖండముకూడ యూరో

తనధర్మమును ఆస్వాదించుచున్నది. మహాసంగ్రామమువల్ల విచ్ఛిన్నమైన ఐరోపాఖండరాజ్యము లన్నియును తిరిగి తమలో తాము అన్యోన్యాశ్రయ సామరస్యమునకై ప్రాకులాడుచున్నవి. ఐరోపా, ఆసియాఖండముల రెంటియందును విస్తరించియున్న సోవియటు రష్యారాజ్యములో చేరిన పరగణాలు మానవజాతికంతకును నూతన విమోచనమార్గము నొకటి చూపించుచున్నవి. ఈ నూతన సాంఘిక తత్వమును ద్వేషించెడి ప్రతికూలురు చాలమంది కలరు. అట్లయ్యును సోవియటురష్యా తననూత్న సాంఘికసమత్వధర్మములను అనుష్ఠించుచు, లోకమున కుపదేశించుచునే యున్నది. ఈ నవీన సిద్ధాంతమునకు సంబంధించిన వివిధాంశము లనేకము కలవు.

వివిధాంశములలో వివిధాభిప్రాయములు తత్వజ్ఞులకుండవచ్చును చిల్లర విషయములలో గల భేదాభిప్రాయములనే మనము గ్రహించుచున్నాముగాని, సాంఘిక సమత్వ తత్వవేత్తలందరును గ్రహించిన సమానాంశమును, ప్రధానాంశమును మనము గుర్తించుటలేదు. వివిధ దేశములలోని ఈ నూతన సాంఘికపరిణామములను మనము విలోకించి అవి భారతదేశమున కేరీతిగా యుపకరించునో గ్రహింపదలంచిన యెడల, పుట్టుపూర్వోత్తరముల నన్నిం ఏకాండముగా పరిశీలింపవలెను. ఆరీతిగా మనము సర్వతోముఖ, సాంగోపాంగపరిశీలన చేసిన యెడల, వివిధదేశములలోని సాంఘికసంచలనముల కన్నింటికిని సన్నిహితసంబంధము కలదనియు, సమానసూత్రము వర్తించుచున్నదనియు విదితమగును.

ఇట్టి సర్వాంతర్వ్యాప్త ధర్మసూత్రము మనకు బోధపడినయెడల ప్రపంచ పరిస్థితులన్నియు మనకు కరతలామలకమగును. అఖిల ప్రపంచమహాసంరంభమం భారతజాతీయోద్యమము ఏవిధముగా అంతర్లీనమగు చున్నదో మనకు బోధపడగలదు. కనుక ప్రపంచమున కంతకును వర్తించెడి ధర్మసమస్యలు భారతదేశమునకు వర్తింపవని వాదింపజాలము. ఆరీతిగా గ్రహించేడల మన జాతీయోద్యమముయొక్క పరమావధిని, మూలసూత్రమును మనము సార్థకముగా సక్రమముగా నిర్వచింపజాలము. మనసాంఘిక ధర్మసమస్యలను మనము పరిష్కరింపజాలము. మనప్రధాన లక్ష్యమును మనము గుర్తెరుంగజాలక చిల్లర తగాదాలతో మనలో మనము కలహించుకొనుచుందుము. మతవైషమ్యములలో మునిగి తేలుచుందుము. మనదేశములోని మితవాదులవలెనే మనముకూడ వాక్యార్థములు చేయుచు అంతులేని ఋక్కులతో వృథాకాలక్షేపము చేయుచు మనధీసామర్థ్యములను నిరర్థకమొనర్చుచుండగలము.

## సామ్రాజ్యావేశము-సాంఘిక సమత్వసిద్ధాంతము

ఐరోపా సంగ్రామానంతరము యూరోపునందును ఆసియాఖండమందును దారుణమైన మార్పులు కలిగెను. సాంఘిక స్వాతంత్ర్యమునకై తీవ్రపోరాటము ప్రజలలో బయలుదేరెను. ఆసియాఖండములోని కొన్ని జాతులవారికి పరపీడనార్థమైన స్వజాతీయాభిమానమొకటి యుదయించెను.

ఈ మహాసంరంభములో ఆటుపోటు లనేకము సంభవించెను. చిట్టచివరకొక స్థిరపద్ధతిలోనికి ఇవన్నియు శాంతించుచున్నట్లుండెను. ఆర్థిక కల్లోలములుగాని, రాజకీయ వివాదములుగాని, ప్రస్తుత వ్యవహార విధానము లమలులో నున్నంతకాలమును పరిష్కారమగునట్లు కన్పించలేదు. అమలులోనున్న వ్యవహార సంప్రదాయములును, సాంఘిక ధర్మములును ప్రజాభీష్టములను తీర్చుట కనర్హము లయ్యెను. ఈ ప్రజాసంఘర్షణము వృద్ధియగుచుండెను ఇంతలో ఆర్థికమాంద్యము ప్రపంచము నావరించెను. ప్రతిరాజ్యములోను స్థితిగతులు నీరసించెను. సోవియటు రష్యాలోమాత్ర మత్యద్భుతముగా క్రమాభివృద్ధియే సర్వత్ర కన్పించుచుండెను.

ప్రపంచమందు పరస్పర విరుద్ధములైన రెండు ప్రప్రధాయము లిప్పుడు అమలులో నున్నవి. ఇవి ఒకదాని నొకటి ఛేదింపక పరస్పర సహనముతో వర్తించుచున్నను సహజసిద్ధముగా నివి ఒకదాని నింకొకటి హరించివేయవలెనని యత్నించుచున్నవి. ఈ రెంటిలో మొదటిది ధనాధిక్యముతో కూడిన సామ్రాజ్యకాంక్ష. ధనాఢ్యులైన సాహుకార్ల ప్రాబల్యముతో ఏర్పడిన ప్రభుత్వములు తమ సామ్రాజ్యమును విజృంభింపజేయవలెనని యత్నించుచున్నవి. ప్రపంచమంతటను వారికి వలసరాజ్యములు కావలెను. అందువల్ల చేజిక్కిన వలసరాజ్యములను వారు కబళించుచున్నారు. వారు బలాఢ్యులై తమ సామ్రాజ్యమును కాపాడుకొన గోరుచున్నారు. వారికి యుద్ధభయము చాలగా కలదు. అట్టిసామ్రాజ్యావేశముగల రాజ్యములు తరచు కలహించుచునే యున్నవి. యుద్ధములకు దిగుచునే యున్నవి. యుద్ధసన్నాహములను గంగవెఱ్ఱులెత్తినట్లుగా చేయుచునే యున్నవి. వారికి సంభవించెడి క్లిష్టమైన ఆర్థికసాంఘిక సమస్యలను, తాపత్రయములను వారు పరిష్కరింపజాలక మరింత చిక్కులపాలగుచున్నారు. దారి తెన్ను గానక, క్రమశః తమ వినాశమును తామే తెచ్చిపెట్టుకొనుచున్నారు. ఈ రాజ్యాంగ సంప్రదాయము గాక దీనికి భిన్నమైనది మరొకటికలదు. అదియే సోవియటు రష్యాలోని సాంఘికసమత్వవిధానము. ఇది దిన దిన ప్రవర్ధమానమై అభ్యుదయ పరంపరాభివృద్ధిని పొందుచున్నది. ఈ ప్రభుత్వ సంప్రదాయములో ధనాఢ్యులనువారు లేరు. ధనాఢ్యుల ప్రాబల్య మనునది లేదు.

ఈధనాఢ్యప్రాబల్యమనునది ఒకానొక ప్రాంతములో తలయెత్తుకొనజాలక "ఫాసిజం" అను నూతనావతారమును దాల్చినది. పాశ్చాత్య నాగరకతా సంస్కారమంతయును ఈ ఫాసిజంవల్ల మంటగలిసినది. సామ్రాజ్యావేశము గల రాజ్యములవారు తమ కధీనమైన వలసరాజ్యములలో ఎట్టి అధికారములను చలాయించుచున్నారో అట్టి అధికార

మునే యీ ఫాసిజం ప్రభుత్వము స్వదేశములోనే చలాయించుచున్న ది. ధనాఢ్యప్రాబల్యమే "ఫాసిజం" అను పేరటను "సామ్రాజ్య కాంక్ష" యను పేరటను (ఇంపీరియలిజమను పేట) నేడు రెండు రూపములతో వెలసియున్నది. ఇవి ఆయా దేశకాల పరిస్థితులనుబట్టి ఆయాదేశములందు వివిధ విశిష్టలక్షణ సమన్వితము లైనను, వీనియొక్క అంతర్గతతత్త్వము ఒక్కరీతిగానే యున్నది. ఈ సామ్రాజ్య తత్త్వమును, ఫాసిజమును ఒకదాని నింకొకటి హత్తించి నేస్తము కట్టుచున్నవి. ఒక్కొక్కప్పుడీ రెండు తత్త్వములును యాచకో యాచకః శత్రువన్నట్లుగా సహజసిద్ధముగా కలహించుచునే యున్నవి. కాని, యీ ఫాసిజమును, సామ్రాజ్యాహంకారమును పాశ్చాత్యదేశాలలో విజృంభించిన సాంఘిక సమత్వవాదము ధిక్కరించుచున్నది. ప్రాచ్యదేశములలోని జాతీయోద్యమములుకూడ ఈ ఫాసిజమును, ఈ సామ్రాజ్యావేశమునధిక్కరించుచున్నవి. "ఫాసిజం" ప్రబలియున్న పాశ్చాత్య దేశాలలోకూడ స్వజాతీయాభిమాన మనునది కలదు. కాని, ప్రాచ్యదేశాలలో బయలు దేరిన జాతీయోద్యమమునకును పశ్చిమదేశాలలోని జాతీయాహంకారమునకును పోలికలేదు. ప్రాచ్యదేశాలలోని జాతీయోద్యమము చిరకాలానుగతమైన ప్రాచీన విశిష్ట విజ్ఞాన పునరుద్ధరణార్థమై బయలుదేరినది. , పాశ్చాత్యదేశాలలోని జాతీయాహంకారము ప్రజాపీడనార్థమై అవలంబింపబడిన కుతంత్రముగా బయలుదేరినది.

ఈ విధముగా ప్రపంచమంతయును నేడు రెండు భిన్నసంప్రదాయములుగా చీలియున్నది. సామ్రాజ్యవాదులును ఫాసిస్టులును ఒకవైపున చేరియున్నారు. సాంఘికసమత్వవాదులును, జాతీయవాదులును మరొకవైపున చేరియున్నారు. ఈ రెంటికిని మధ్యస్థముగా వర్తించునట్టి ప్రభుత్వములుకూడ కొన్ని కలవు. పరాధీనములైన కొన్ని దేశములలో బయలుదేరిన జాతీయోద్యమములు ఫాసిజంవాసనలనుకూడ కల్గియుండుట సంభవించుచున్నది. కాని, పై చెప్పిన విభేదమును ముఖ్యమైన వ్యత్యాసముగా గ్రహింపవచ్చును. ఈ భిన్నతత్త్వములను గ్రహించినయెడల ప్రపంచ పరిస్థితులన్నియు మనకు సులభగ్రాహ్యములగును. మన దేశములోని జాతీయోద్యమ తత్త్వముకూడ బోధపడును.

## భారతీయుల స్వాతంత్ర్యోద్యమలక్షణము

మనము భారతదేశ స్వాతంత్ర్యమునకై కృషి చేయుచున్నాము గదా! మన కృషి ప్రయత్నము లేతత్త్వము ననుసరించుచున్నవి? ఫాసిజమునుగాని, సామ్రాజ్య తత్త్వమునుగాని ధిక్కరించెడి లోకకల్యాణప్రదమైన ధర్మసంరంభమునందే మనముకూడ చేరుచున్నాము. మనకిది విధాయకము. ఒకానొక సామ్రాజ్యాధికారముతో మనకిప్పుడు సన్నివేశసంఘర్షణములు సంభవించినవి. ఆధునికప్రపంచమందీ సామ్రాజ్యమే అత్యంతబలిష్ఠమైనది. మహోద్ధతమైనది. ఈ సామ్రాజ్య ప్రభుత్వమే ప్రపంచములో చిరకాలానుగతప్రాభవమును గడించియున్నది.

ఇటువంటి బ్రిటిష్ సామ్రాజ్యముతో మనమెందువల్ల సంబంధమును విడగొట్టుకొని సంపూర్ణ త్వము కావలెనని పాటుపడుచున్నామో, అట్టి సంపూర్ణస్వాతంత్ర్యమునకై మన మెందుచేత పోరాడవలెనో యిప్పుడు ఖండితముగా నిర్ధారణయగుచున్నది. భారతదేశస్వాతంత్ర్యమునకును, జాతీయోద్యమమునకును బ్రిటిష్ సామ్రాజ్యాహంకారముతో భిన్నమైన రణ ఏర్పడజాలదు. రెంటికిని సమన్వయ మసంభవము. మన దేశమునకు ఎటువంటి రాజ్యాంగవిధాన మెటువంటి అధికార ప్రతిపత్తితో ఒసంగబడినప్పటికిని, మనము బ్రిటిష్ సామ్రాజ్యములో అంతర్భాగముగా ఉన్నంతకాలమును, ధనాఢ్యుల ప్రాబల్యముతో కూడిన ప్రజాపీడనము మనలనుకూడ ఆవేశించియేయుండును. మనకిక ఆత్మవికాసము మృగ్యమై సామ్రాజ్యవ్యామోహబంధములనే మన చిత్తవృత్తి యంతయును కట్టుపడియుండును. ఆత్మవికాసమున కవకాశ మొసగక అస్వదిగ్బంధన చేసినట్లగును. ప్రజాసామాన్యమును శ్రీమంతులెప్పుడును పీడించుచు మరింత శ్రీమంతులగుచునే యుండగలరు. సర్వమానవసమానస్వాతంత్ర్యావకాశములు కావలెనను ఆందోళన నిరంతరక్లిష్టసమస్యగా సంఘము నావరించియేయుండును. నిజమైన రాజకీయస్వాతంత్ర్యముకూడ భారతీయులకు గగనకుసుమమైయుండును. ఇక సాంఘికవిభేదముల విషయములోను సాంఘికన్యూనతాధిక్యములలోను చెప్పవలసిన పనియే లేదు.

## బ్రిటిష్ నిరంకుశత్వములో సామ్రాజ్యావేశము, ఫాసిజము కలదు.

ప్రపంచమంతట, నీ నూతన ధర్మసంచలనము విజృంభించుచుండినకాలందియు ధనాఢ్య సామ్రాజ్యాధికారముగల దేశములు క్రమేణ వన్నెదక్కి తమ ప్రతిష్ఠను, పలుకుబడిని గోల్పోవుచున్నవి. ప్రజలుద్రేకించినపుడు కొన్ని దేశములలో వారిని అణగద్రొక్కు నిమిత్తమై (ఇటలీలోవలె) ఫాసిజం అను పేరుతోను, (జర్మనీలోవలె) నాజీజం అను పేరుతోను జాతీయాహంకారమొకటి తలయెత్తుచున్నది ఈవిధముగా ఆదేశములోని ప్రభుత్వములు ప్రజలను శాంతింపజేసి వారి యుద్రేకములను అణచివేసి వారిని తిర్గి ఏకీభవింపజేయుచున్నవి. భారతదేశములోకూడ జాతీయోద్రేకమును శాంతింపజేయుటకై ఇటీవల ఇటువంటి ప్రయత్నములే కొన్ని చేయబడుచున్నవి జాతీయోద్రేకము హెచ్చినప్పుడు ప్రజలలో పార్టీలను కల్పించి చీలదీయుచున్నారు. ప్రజాభీష్టములకు ప్రతికూలురైనవారిని గవర్నమెంటువారు తమయండ జేర్చుకొనుచున్నారు. ఇటీవల జరిగియుండిన రౌండుటేబిలు సభలిందుకు తార్కాణములు. సామ్రాజ్యావేశ ప్రతికూలురను చీలదీయుటయే యీ సభలసందర్భమున బ్రిటిష్‌గవర్నమెంటువారు చేసిన మిత్రభేదతంత్రమై యున్నది. కాని, యీ సంగతిని మనము గ్రహించియు, యీగుణపాఠమువల్ల బోధపడలేదు, ఈ

సామ్రాజ్యవాదులను ఇంకను మనకనుకూలవర్తనులనుగా మనము వశీకరణము చేసికొనగలమనియే మన మింకను భ్రమపడి నమ్ముచున్నాము. వారిని ఎట్లయినను మంచిమాట చేసికొని వారితో సమాధానపడవలెనని, మన ఉన్నతాదర్శములనుండి మనము దిగివచ్చి మా మహోత్కృష్ట లక్ష్యములు గొంతెమ్మకోరికలని మనలో మనమే లజ్జించి మన కార్యదీక్షను కొంతవరకు తగ్గించుచున్నాము.

ఇది యిట్లుండగా, భారతదేశములోనే బ్రిటిష్ సామ్రాజ్యాధికార ప్రభావము తగ్గుచున్నది. ఈ సామ్రాజ్యాధికార ప్రభావమువల్ల మన దేశములోని ఆర్థిక సమస్యలకు మోక్షమార్గమేర్పడజాలదు. మన దారిద్ర్యము తొలగిపోజాలదు. ఈ దారిద్ర్యముకూడ ఈ సామ్రాజ్యాధికార దుర్వ్యూహమువల్లనే కలిగినది. నిరంకుశమైన ప్రజాపీడన మే యీ ప్రభుత్వాధికారమునకు నిత్యకృత్య జీవబాధకము. పౌరస్వాతంత్ర్యమును, వ్యక్తిస్వాతంత్ర్యమును లేకుండ చేయుటయే యీ ప్రభుత్వ ధర్మము. ప్రభుత్వమునకు ప్రజలయందు నమ్మకము లేనందున ప్రచ్ఛన్నులైన గూఢచారులవల్లను, ప్రజలలో అంతఃకలహములను పురికొల్పెడి కలహకారణులవల్లను తత్సంబంధ పరివారములతోను వీరు ప్రభుత్వమును సాగించుచుందురు. ఈ ప్రభుత్వాధికారవర్గములోని వివిధశాఖాధికారులు ప్రజలను సవ్యముగా సమాధానపరుపజాలక అసమర్థులై ప్రజలను పీడించి హింసించుచు, ఒక ప్రభుత్వాధికారశాఖవారు మరొక అధికారశాఖవారిని కొనియాడుకొనుచు పరస్పర స్తోత్రపాఠములతో తమ ప్రతిష్ఠను కాపాడుకొనుచుందురు. సహేతుకముగా ధర్మాధర్మ నిర్ణయములను చేయుటకు అంగీకరింపజాలరు. హేతువాద ప్రయోగములకు బదులుగా పోలీసులలాఠీ ప్రయోగములనే వారు చేయుదురు. సోల్జరుల తుపాకి మొనకత్తులైన సన్నీలనే సులభముగా ప్రయోగించెదరు. ప్రభుత్వాదాయవ్యయములలో పద్దుమొత్తములను మంజూరు చేయునప్పుడుగూడ వాదతర్కములు చేయువారిని నోరు మూయించి అన్నింటికిని వారే పెద్దరికము వహించి యథేష్టముగా వ్యవహరించెదరు. మన ప్రభువులు తాము సంపాదించిన సామ్రాజ్యమును ఎంతటి కాంక్షతో ఎంతటి లోభత్వముతో కాపాడుకొనగోరుచున్నారో, ఎట్టివంటి హేయనిర్ణయములకైనను పూనుకొనుచున్నారో గమనించినయెడల అత్యంతాశ్చర్య విషాదములు కలుగును. కాని, వీరికి బాసటయై నిలచిన మన దేశీయులు బ్రిటిష్ ప్రజలయందు వహించెడి అభిమానమునకన్న బ్రిటిష్ సామ్రాజ్యతత్వముచే ఎక్కువ గాఢముగా ప్రేమించి అభిమానించుచున్నారు. ఈ నిర్ణయములందు దీయనుచరులు బ్రిటిష్ వారికన్న మిన్నలై వర్తించుచున్నారు. జాతీయోద్యమమును ప్రజోద్రేకమును చూచినప్పుడు వీరికి భయముకలుగును. ఈ జాతీయోద్యమమునకు రంగస్థలమైన కాంగ్రెసుసభ కూడ వీరికి భయంకరముగా కన్పించుచున్నది. వారి కీభయభ్రాంతివల్ల మతి స్తిమితము చెడినది. అందువల్ల ఈ నిరంకుశాధికారులకు ఏ కోరికలుకలుగునో ఆకోరికలే వారి దృఢాభిప్రాయములగుచున్నవి. ఆ దృఢాభిప్రాయములే వారి స్థిరసిద్ధాంతములుగా మారుచున్నవి. వానినే వారు తమహుకుములుగా ప్రకటించుచున్నారు. ఆహుకుములు అమలు జరుగుటవల్లనే బ్రిటిష్ అధికార మీ దేశములో సాగగలదని చెప్పుచున్నారు. అందువల్లనే వారికి ఏమాత్రము అనుమానము కలిగినను, న్యాయాన్యాయ విచారణ లేకుండ మనుష్యులను జైళ్లలో నిర్బంధించుచున్నారు. లేదా నిర్బంధ ప్రవాసములలో నుంచుచున్నారు. మానవ మనస్తత్వశాస్త్ర విచారణయందు నాకు కొంత అభిరుచి కలదు. అందువల్ల యీ నిరంకుశాధికారులు ఏవిధముగా బుద్ధిహీనమైన నీచాతినీచమగు పనులకు పాల్పడుచున్నారో ఏవిధముగా వారి ప్రతిష్ఠాగౌరవమును వమ్ముచేసుకొని అపకీర్తిపాలగుచున్నారో నాకీ సందర్భములవల్ల విదితమగుచున్నవి.

ఇటీవలి అసెంబ్లీసభా వ్యవహారనివేదికలను నేను చదివితిని. 10 సం॥ల క్రిందటనుండిన అసెంబ్లీ సమావేశములయందెట్టి సంతృప్తి సమాధానములు కన్పించుచుండెనో, ఇటీవలి అసెంబ్లీ సమావేశములయందెట్టి అసంతృప్తి, ఆవేదన కన్పించుచున్నదో నేను గమనించితిని.

తిలక్ స్వరాజ్యఫండునకు నేను పెక్కుసంవత్సరములు కార్యదర్శిగా వ్యవహరించియుంటిని. ఆ తిలక్ స్వరాజ్యనిధినిగూర్చి తూలనాడుచు, కొన్ని కుతర్కవాదములు చేయబడెను. ప్రభుత్వదూషణములకు నే నలవాటుపడియున్నప్పటికిని, మన కత్యంతగౌరవపాత్రుడైన మన నాయకుడగు రాజేంద్రబాబునుగూర్చి నిందారోపణలు చేయబడినప్పుడు నే నాశ్చర్యపడితిని. బీహారుభూకంపనిధి వినియోగమునుగూర్చి వారు నిరసనవాక్యములను పల్కియుండిరి. బీహారు భూకంపము జరిగినతర్వాత మరొక ప్రాంతమున భూకంపము సంభవించెను. ఈ రెండవ భూకంపమువల్ల బాధితులైనవారికి సేవాసహాయములను చేయువిషయములో గవర్నమెంటువారు అమలుపరచిన కట్టుదిట్టములను, విధినిషేధములనుగూర్చి ఆక్షేపించుచు వ్రాసిన పత్రికలన్నింటికిని జరిమానాలు విధింపబడెను. ఆ పత్రికలు అణచివేయబడెను. గవర్నమెంటువారి శరీరము అతిసుకుమారమైనది. వారి శరీరమునకు రవ్వంత నొప్పికలిగినను వారు సహింపజాలరు. అది దుర్బలావస్థ. వారు అసమర్థులైన కోలండియు బక్కమనిషివలె వర్తించుచుందురు. వారి కప్రియమైన దేదియు నితరులు పలుకకూడదు. కాని, వారుమాత్రము యుక్తాయుక్త విచారణలేకుండ ఇతరులను నిరాక్షేపణగా నిందించవచ్చును.

ఈ దేశములో బ్రిటిష్‌వారు ప్రత్యక్షముగా అమలుజరిపెడి దుర్నయములకన్న వారి వివేకభ్రష్టసంపాతమే నాకు ప్రధానాంశముగా కన్పించుచుండును. దానిని గమనించుటవల్ల యీ దేశములో ప్రజ్వలించుచున్న యుద్యమాంతరార్థము మనకు బోధపడగలదు. మన ప్రభువులయందు ఫాసిజంతత్వము క్రమేణ వృద్ధియగుచున్నది. సామ్రాజ్యాభిమానతత్వము ఫాసిజం తత్వమునకు సన్నిహితమై యున్నదని

మరింత గ్రహింపగలరు. మనదేశ ప్రభుత్వవ్యవహారములలో ఫాసిజం తత్వమే ఇటీవల వర్తించుచున్నది. అదేరీతిగా వర్తించుచున్నదో నేనిచట విస్తరింపబూనను. గత కొలది సంవత్సరములలోను మనమనుభవించిన కష్టపరంపరలను మన మింతలో మరువజాలము. ఇటీవల అమలు జరిగియుండిన ఘోర నిర్బంధవిధానమువల్ల కొందరు క్రుంగి క్షంగి లొంగిపోయి యుండవచ్చును. కాని, తదితరులు చెక్కుచెదరని యుక్కుకున్కులవలె గడితేరి, ఈ భారత జాతీయావమానమును తుదముట్టించుటకు ఇతోధిక స్థిరసంకల్పులైరి.

## పౌరస్వాతంత్ర్యవిరోధము

భారతదేశములో పౌరస్వాతంత్ర్యములేకుండ ప్రజలను అసహాయులనుగా జేయుచున్నారు. ఈ విషయము చాల దారుణమైనది. దీనినిగూర్చి ప్రత్యేకించి ప్రస్తావింపవలసియున్నది. క్రిమినలు లా సవరణ చట్టమును, తత్తుల్యశాసనములను అమలుపరచి తనఅధికారమును సాగించెడి ప్రభుత్వము అంతరించవలెనేగాని అమలులో నుండుటకు తగదు. పత్రికలు సాగకుండ ప్రజాభిప్రాయ ప్రకటనలనుచేయ నిరోధించి అణచివేసెడి ప్రభుత్వము అంతరించవలెనేగాని అమలులో నుండదగదు. వందలాదిగ దేశములో వెలసిన ప్రజాసంస్థలను నిషేధించెడి ప్రభుత్వము, న్యాయాన్యాయ విచారణచేయకుండ చెరసాలలో ప్రజలను నిర్బంధించెడి ప్రభుత్వము అంతరించవలెనేగాని అమలులో నుండదగదు. ఇటువంటి దారుణములను నేనెన్నడును సహింపజాలను. అవి దుర్భరములు. అట్లయ్యును అట్టి చర్యలను హర్షించి అట్టిపనులకు చేయూత నొసంగుటకు మన దేశీయులే పూనుకొనుచున్నారు. అట్టి ప్రభుత్వచర్యలను గర్హింపక, హర్షింపక గోడమీది పిల్లివలె నుండి అట్టి విషయములను చర్చించునప్పుడు వోటునీయక తటస్థముగా నుండుట యొక వింత విద్యగా మనవారిలో కొందరు సాధకము చేయుచున్నారు. అట్టిచర్యలకు చేయూతనిచ్చెడివారికిని, నావంటి వారికిని సమానాంగీకారభావమెందైన నుండగలదా? భారతదేశ స్వాతంత్ర్యోద్యమమునకు దోడ్పడగల్గినవారందరును కాంగ్రెసులో చేరవచ్చునని ఆహ్వానించుచున్నాము. సామ్రాజ్యాహంకారమునకు ప్రత్యక్ష విరుద్ధమైన విశుద్ధప్రజాస్వాతంత్ర్యమునే మనము కోరుచున్నాము. కాని, సామ్రాజ్యాహంకారాభిమానులై దారుణప్రజాపీడనమునకు చేయూతనొసంగుచు పౌర స్వాతంత్ర్య నిర్మూలనమునందు బ్రిటిష్ వారికి బాసటయై నిలచినవారికిమాత్రము కాంగ్రెసులో ప్రవేశించుటకు అర్హతగాని అవకాశముగాని లేదు. వారును మేమును భిన్న కక్షులలోని వారము.

## సుభాష చంద్రబోస్‌గారి అరెస్టు

గవర్నమెంటువారి అధికార మీదేశములో నేరీతిగా చలాయింపబడుచున్నదో బుజువుచేయుట కిప్పుడిప్పుడే జరిగిన విషయ మొకటి ఉదాహరణముగ నున్నది. మనకు ప్రియతముడైన సహచరుడగు సుభాషుచంద్రబోసుగారి విషయములో జారీచేయబడిన సర్కారుహుకుమును గమనించిన చాలును. ఆయన యెడల గవర్నమెంటువారు చేసిన నిందారోపణ లెంతహాస్యాస్పదములో మనకు తెలియును. అట్టినిందలు నిజమని అంగీకరించినను, ఆయన విషయములో హద్దు మేరలేకుండ వారు విధించుచున్న శిక్ష ఎంతమాత్రమును సహింపదగినది కాదు.

తిరిగి మాతృదేశమునకు వచ్చుట యుక్తమాయని ఆయన నాసలహాకోరియుండెను నాకేమియును తోచలేదు. తిర్గి రావలెనని ఆయనకు నేను సలహా యిచ్చుట సులభవిషయము కాదు. అందువల్ల ఆయనకు కారాగారమే ప్రాప్తించగలదు. ఆయన దేహారోగ్యము కారాగారావాసమువల్ల చెడిపోయినది. అట్టిస్థితిలో ఆయన చిత్తస్వాస్థ్యముకూడ లేకుండ తిరిగి మరొక క్రొత్తబాధ ననుభవింపవలసినదని నేను కోరగలనా? అందువల్ల ఇప్పుడిప్పుడే మాతృదేశమునకు మరలిరావలదనియు మరికొంతకాలము ఆగవలసినదనియు నేను కొంచెము వెనుకముందు ఆలోచించి సలహా నిచ్చితిని. కాని, యీసలహా యిచ్చినందుకు నాకే కష్టముగా నుండెను. నాస్నేహితులు కొందరితో సంప్రతించి వెనుకటి సలహాకు భిన్నముగా మరల వీలైనంత త్వరలో స్వదేశమునకు రావలసినదని వ్రాసితిని. నాలేఖ వారికి చేరక పూర్వమే ఆయన బయలుదేరెనట

## రాజకీయ దురంతకుల యుక్యమును

ఈ సందర్భములో మనమొక పెద్దవిషయమును గమనించవలసి యున్నది. ఈ దేశములో దురంత విప్లవోద్యమమొకటి చెలరేగుచున్నదను భయమును చూపించి దేశములోని రాజకీయోద్యమములను పెక్కింటిని గవర్నమెంటువారు అణచివేయుచున్నారు. రమ్యమైన బెంగాలీ ప్రతిభను అణచివేయుచున్నారు. వారికి కాలుచేతులను కట్టివేయుటయేగాక, వారి ధీశక్తినికూడ అణచివేయుచున్నారు. ప్రజలలో పరిపక్వమైన సంకల్పబలము ఏర్పడనప్పుడు రహస్యవిప్లవములు చెలరేగుచుండును. ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వమనునది సక్రమముగా ఏర్పడియుండనప్పుడు ప్రజాప్రభుత్వశాసనముల ననుసరించి శాసనబద్ధముగా నూతనసంస్కారముల నుపక్రమింపవలెనని వాదించెడి సశాస్త్రీయపక్షమువారివాదనకూడ సంస్కార పరిపక్వము లేని యువ్యమమై మతిచెడిన వార్ధక్యప్రలాపము వంటిదే యగును. ఈ రెండును సంస్కార పరిపక్వములేనివే యగును. కాని మనదేశములో జాతీయప్రబోధము అపరిపక్వదశను దాటినది. ఇదివరలో రాజకీయ దురంతముల నుపక్రమించిన వారందరును తమ సిద్ధాంతములు నిరర్థకములని గ్రహించి ఆధోరణిని మానుకొనిరి. కాంగ్రెసు సభ దౌర్జన్యరహిత సిద్ధాంతమునుగూర్చి నొక్కివక్కాణించి దేశములోని యువకుల నందరిని కాంగ్రెసు సంకల్పించిన సాత్వికోద్యమములోనికి ఆక

క్షించినది. ఈ రాజకీయ దురంత విప్లవోద్యమము ఈవరకే పూర్తిగా అంతరించియుండెడిది. కాని, గవర్నమెంటువారు తమ తీవ్రప్రతీకారములవల్ల, అసహాయులైనవారి రోషావేశమును రెట్టించుచున్నారు. మిడ్నపూరులోను, బెంగాలులోను, తదితర ప్రాంతముల లోను అవలంబింపబడిన కఠినచర్యలను బుద్ధిపూర్వకముగా సాగించెడి ప్రభుత్వము తనకుతానే శిక్షను విధించుకొనవలసినదైయున్నది. అటువంటి దారుణకఠినచర్యలే సరిహద్దు రాష్ట్రములలోను అమలు జరుపబడెను. కాని అచట విప్లవోద్యమము కలదనుటకు కించిత్తయినను ఆధారము లేదు. కోట్లకొలది ప్రజలకు హితుడై పూజ్యుడై సజ్జనవరేణ్యుడైన అబ్దుల్ గఫూరుఖానుగారు నేటికిని చెరసాలలో పడియున్నారు. వేర్వేరుసాకులను, సమాధానములను చెప్పవచ్చును. కాని మూలకారణమేమనగా, మన పరిపాలకులయందు ఫాసిజం తత్వము ఎక్కువగా వృద్ధియగుచున్నది

## ఆత్మపరిశోధన

ఇదంతయు ఒకపక్షమువారి విషయము. ఇక మనసంగతి ఏమిటి? మనలో మనకు ఐకమత్యములేదు. మన సహచరులయందే చిల్లర తగాదాలు ఏర్పడుచున్నవి. వీనివల్ల మనప్రధానసంకల్పమును మనము మరచిపోవుచున్నాము. మనము జనసామాన్య హృదయమును ఆకర్షించుట మానివేసితిమి. వారి యభిమానోత్సాహమే మన స్వాతంత్ర్యోద్యమమునకు ప్రాణాధారము. వారిసాహచర్యము మనకు లేనియెడల మన కాంగ్రెసుసంస్థ నిర్వీర్యమై నామమాత్రావశిష్టమగును. ప్రధాన విషయములనే ప్రప్రథమముగా ఆలోచించవలెను. ఈ సంగతిని మనము మరచి చిల్లరవిషయములకై తగాదా పడుచుండుటవల్లనే మనము నేలవిడిచి సాముచేసినవారమగుచున్నాము.

ప్రతియుద్యమమునకును ఆటుపోటు లుండును. మధ్యమధ్య అంతరాయములును అపజయములును ఎట్టియుద్యమమునకైనను తప్పవు. అట్టి అపజయములును పరాభవములును కలిగినప్పుడు ప్రజలు నిస్పృహ జెందుచుందురు. వారి విషాదమునుపోగొట్టి వారికి మరల ధైర్యమును పురిగొల్పవలసియుండును. అట్టిది పలుమారు ఆవశ్యకమగును. కాని ఇటీవల జరిగిన విషయముల కన్నింటికిని పైజెప్పిన సమాధానము చాలదు.

## సత్యాగ్రహోద్యమ విఘాత హేతువులు

ఇదివరలో మనము ప్రత్యక్షముగా జనాంగబలముతో ప్రభుత్వమును ప్రతిఘటించియుండినప్పుడు ప్రజలే మనకు మూలబలముగా నుండిరి. నాయకులుమాత్రము విద్యాధికులైన సాధారణ స్థితిపరులలో నుండివచ్చిరి. అప్పటిపరిస్థితులలో మరొకగత్యంతరము లేకుండెను. ఈ సంపన్నులును, విద్యాధికులును అటు యిటు కాని మధ్యతరగతులలోనివారు. ఈ మధ్యస్థ తరగతి ఎట్టిదో నిరూపించుటకు వీలులేనిది. వీరిలో అగ్రస్థానము వహించెడివారు కొందరు బ్రిటిష్ సామ్రాజ్యాభిమానులు. వీరిలో క్రిందిమెట్టువారు ఆస్తి వసతులను గోల్పోయి దుర్భరార్థికదైన్యమునకు లోనై స్థితి చెడియున్నవారు. వీరిలోనుండియే రాజకీయోద్యమములకుగాని, విప్లవోద్యమములకుగాని ప్రబోధప్రచారకులు బయలుదేరుచుందురు. కాని పైమెట్టువారునుగాక, దిగువమెట్టువారునుగాక నడుమంతరముగా నుండెడి సామాన్యసంపన్నులు కొందరుకలరు. వీరిలో కొందరికి సామ్రాజ్యాభిమానులైన ఉద్ధతులతోను, క్రిందిమెట్టులోనున్న స్థితి చెడిన సంస్కారులతోను సంబంధబాంధవ్యములుండును. ఇటువంటి మధ్యతరగతివారు నాయకత్వము వహించునప్పుడు వారికి ఆస్తివసతుల మీదను, దేశసేవయందును ఆసక్తియుండును. వారి ధోరణి బియ్యము మీదను, చుట్టుమీదను ప్రీతి కలదన్నట్లుగానుండును. వారి ఆస్తులను జప్తుచేయగానే వారిసంకల్పబలము సన్నగిల్లును. ఉద్యమములోనుండి వెనుకంజవేయుదురు. నాయకత్వము వదలుకొనెదరు.

కాని, యిటువంటి పిరికిపందలలోనుండియే జాతీయ విప్లవమునకు నాయకులు బయలుదేరుచుందురు. మన దేశములోని యుద్యమమందు మహాయోధులవలె ముందు నడచినవారందరును ఇట్టి సామాన్యకుటుంబములలో నుండియే ఉద్భవించిరి.

కాని, మన యుద్యమతత్వమునుబట్టి యీ నాయకులు బంధింపబడినతోడనే వెనుక నడచుచున్న చిల్లరజనులందరును విసివి వేసారి తమ వెనుకటి స్తబ్దత్వమునే మరల నవలంబించిరి. మనయుద్యమము విజృంభించినప్పుడు గవర్నమెంటువారు ఆస్తులను జప్తుచేసిరి. పైకమును సర్కారుదాఖలుచేసిరి. ఈవిధముగా జనులను చెదరగొట్టి బెదరగొట్టగల్గిరి.

## సామాన్యజన ప్రాబల్యము

ఇట్టి చిక్కును తొలగించుట ఎట్లు? సామాన్య కుటుంబముల లోనివారే మనకు నాయకులుగా రావలెను. అది తప్పదు. కాని, వీరు జన సామాన్య హృదయమునే గమనించి వారివల్లనే యుత్సాహపూరితులు కావలెను.

కాంగ్రెసుసభ జనసామాన్యార్థమైన సంస్థగా నుండిన చాలదు. ఇది జనసామాన్యసంస్థగానే యుండవలెను. అప్పుడే అది ప్రజాసామాన్యమున కుపకరించును. ప్రస్తుతము మనదేశములో సామాన్య కుటుంబములలోనివారికి జనసామాన్యముతో సన్నిహిత సన్నివేశము లేదు. సామాన్య మాధ్యమిక కుటుంబములోనివారి యూహాపోహలనుబట్టియే మనము జాతీయాభీష్టములను నిర్ణయించుచున్నాము; అది తగదు. ప్రజాభీష్టమనగా సర్వజనసామాన్యాభీష్టముగా, నిర్వచింపబడవలెను. హిందూ మహమ్మదీయసమస్యలనెడి తగాదాలు

సామాన్యస్థితిపరులకు సంబంధి

యత్నములు జనసామాన్యమునకు

గత ౧౫ సం. ల నుండియు జరిగిన సందర్భవిశేషములను బట్టి జనసామాన్యమునకు సంబంధించిన ఆర్థికసమస్యలనేకము పొడసూపినవి. దేశములోని ఆర్థికపరిస్థితులు తారుమారగుటవల్ల వారికనేక క్రొత్త చిక్కులు ఇటీవల సంభవించినవి వీని నన్నింటిని తొలగించవలసియున్నదనెడి సంకల్పము వారిలో కలిగినది. కాని వారి కష్టనిష్ఠురములను వెల్లడించుటకు కాంగ్రెసుసభలో వారికి తావులేకపోయినది.

౧౯౨౦ సం॥ లో పరిస్థితులు యీ రీతిగా లేవు. ౧౯౨౦ సంవత్సరానంతరము కాంగ్రెసుసభకును సర్వజనసామాన్యమునకును అన్యోన్యాశ్రయ సంబంధము అంగాంగిన్యాయముగా ఏర్పడెను. జనసామాన్యాభీష్టములకు కాంగ్రెసు సంస్థ సభారంగమైయుండెను. కాని, జనసామాన్యముయొక్క వాంఛితములు సుస్థిరములై, వారిసంకల్పోద్దేశములకు నామరూపములు ఏర్పడగానే కాంగ్రెసు సభలోనికి వారిని వెనుకటివలె ఆహ్వానించుటకు తదితరులు సంసిద్ధులగుటలేదు. ఈవిధముగా కాంగ్రెసు సభలోని ప్రముఖులకును జనసామాన్యమునకును పరస్పరానురాగసంబంధము తెగిపోయినది. సంబంధము వీడిపోవుట శోచనీయమే. కాని ఇది మనపురోభివృద్ధికే అక్కరకు రాగలదు. ప్రాతసంబంధము విచ్ఛిత్తియైనను, నూతనబాంధవ్యమునకు తగిన కట్టుదిట్టములను క్రొత్తపద్ధతుల ననుసరించి చేయవచ్చును తద్వారా, కాంగ్రెసుసభలోనే జనసామాన్యమున కొక నూతనజ్ఞానోదయము కలుగవలెను. ౧౯౨౦ సంవత్సరమునందు ప్రజాబాహుళ్యమునకంతకును మధ్యతరకపు సామాన్యసంపన్నులును విద్యాసంస్కారులును నాయకత్వమువహించి వారి తరఫు ప్రతినిధులైయుండిరి. ఇప్పటికిని యీ నడుమంతరపు తరగతిలో చేరిన క్రిందిమెట్టువారికింకను జనసామాన్యముతో సన్నిహిత సంబంధ మేర్పడియేయున్నది. మొత్తముమీద యీనడుమంతరపు తరగతివారికిని జనసామాన్యమునకును అన్యోన్యాశ్రయము వెనుకటి యంతగా లేదనియే చెప్పవచ్చును.

ప్రజాబాహుళ్యముతో మనకు సంపర్క సన్నివేశము లేకపోవుటకు కాంగ్రెసుసభయొక్క కట్టుదిట్టములుకూడ కొంతవరకు హేతుభూతములైయున్నవి.

౧౫ సం॥ల క్రిందట యీ సభాంగ నిర్మాణములో సమూలమైన మార్పులు కొన్ని చేయబడెను. అందువల్ల అధికసంఖ్యాకులైన మెంబర్లు కాంగ్రెసులో చేరిరి. జాతీయోజ్జీవనమునకు కాంగ్రెసుసభ అప్పుడు దివ్యముగా పనిచేసెను. కాంగ్రెసుసభను నడిపించెడి పెద్దలందరును ముఖ్యముగా సంఘములోని నడుమంతరపు తరగతిలో నివారుగాను, బత్తీనినాసులుగాను ఉండిరి. అయినప్పటికిని కాంగ్రెసు సందేశము పల్లెపల్లెకును ఇంటింటికిని అప్పుడు వ్యాపించెను. జాతీయ స్వాతంత్ర్యసమస్యలను గ్రామస్థులుకూడ శ్రద్ధాసక్తులతో చర్చించిరి.

అట్టి పల్లెకాపులందరును మన కాంగ్రెసుపక్షాభిమానులై ప్రవర్తించుటవల్ల వారి యండవలన మన కాంగ్రెసు మరింత బలవత్తరమై ప్రతిభావంతమై పనిచేయగల్గెను. కాంగ్రెసుసభకు ప్రజాదరణమే ప్రాణాధారము. గవర్నమెంటువారి కఠిన నిర్బంధ విధానమువల్ల మనకు పల్లెకాపులతో సంబంధము తెగిపోయినది. అంతేకాదు. మరొక సందర్భముకూడ ఏర్పడినది. స్వరూపనిర్ణయములేని అరచేతి వైకుంఠములను వారికి మనమప్పుడు చూపించి ఆకర్షింపగల్గితిమి. కాని, మన మాటలయందు నమ్మకమిప్పుడు వారికి పోయినది. దేశములోని ఆర్థికమాంద్యమువల్ల ప్రజాబాహుళ్యమునకు క్రొత్త ఆర్థికసమస్య లేర్పడుచున్నవి. అవియే వారినిప్పు డెక్కువగా బాధించుచున్నవి. ఈఆర్థికబాధావిమోచనమునకు మనము నిర్ధారణముగా ఇదమిత్థమని తరణోపాయములను వారికి చూపజాలకయున్నాము. కనుక, వారికిని మనకును ప్రత్యక్ష సమావేశము లేకపోవుటయేగాక, చిత్తవృత్తిలో కూడ వారికిని మనకును అంతర మేర్పడుచున్నది.

నడుమంతరపు తరగతిలోని సామాన్య సంపన్నులకును ప్రజాబాహుళ్యమునకును ఇప్పుడు లంకె తెగిపోయినది. ఈ నూతన సందర్భావసరములకు తగినట్లుగా మన కాంగ్రెసుసభయొక్క నియమనిబంధనలనుకూడ మనమింకను సంస్కరించలేదు. కాంగ్రెసుసభావ్యవహారములన్నియు జనసామాన్య ప్రసక్తిలేకుండ నేల విడిచి సాము చేయుచున్నవి. గాలిలో మేడలు కట్టినట్లుగా, ఏవో కొన్ని కాంగ్రెసుకమిటీలు తమలో తాము సంప్రతించుకొనుచు ఘుబ్బాలలో కుర్చుండి పనిచేయుచున్నవి. ఈ కాంగ్రెసుకమిటీలన్నియు కాంగ్రెసుసభాపూర్వప్రతిష్ఠాగౌరవముతోనే వ్యవహారములను చాలవరకు సాగింపగల్గుచున్నవి. కాని, జనబాహుళ్యముతో సన్నివేశ సంబంధము పోయినది. కాంగ్రెసు పేరుతో వీరందరును అధికారములను చలాయించుచున్నారు. వీరిలో వీరు పెత్తనములకై తగవులాడుచున్నారు. నీచాతినీచములైన మాయోపాయములకు కూడ పాల్పడుచున్నారు. ఉన్నతాదర్శములు మటుమాయమైనవి. వానిస్థానే సమయోచితోపాయములను వక్రకుతంత్రములను కాంగ్రెసువారు ఇప్పుడు అవలంబించుచున్నారు. ఈ విపరీత పరిస్థితులను పరిమార్చుటకు కాంగ్రెసుసభానియమములు సర్వసమర్థముగా లేవు. ఉచ్చనీచములను పాటింపని పదిమంది కాంగ్రెసులో జేరి తమ యిష్టానుసారముగా దానిని నడిపించి తాము తలచినరీతిని తలక్రిందుజేయుటకు వీలుగా యీ సభాంగ నిర్మాణమిప్పు డేర్పడియున్నది. ఇటువంటి చాణక్యతంత్రమునుండి కాంగ్రెసుసభను రక్షింపవలసినయెడల, జనసామాన్యమునకీ మహాసభలో బాహుళ్యమైన పలుకుబడియును ప్రాతినిధ్యమును ఏర్పడవలెను. అట్టి ప్రజాబాహుళ్య ప్రసక్తి ప్రమేయమే యీ మహాసభకిప్పుడు కావలసియున్నది.



౯. శ్రీ ప్రకాశ, ఆహ్వానసంఘాధ్యక్షుడు



౧౦. సంపూర్ణానంద, స్వచ్ఛందసేనాదళాధినేత



౧౧. స్వచ్ఛంద సేవాదళము (పురుషులు) సంపూర్ణానంద, దళాధినేత



౧౨. స్వచ్ఛంద సేవాదళము (స్త్రీలు) శ్రీమతి సోఫియా సోంజి, దళాధినేత్రి

నాతో ఏకీభవించి నా సిద్ధాంతముల హర్షించెరని నేను తలంపను. లేదా మీలో అధికసంఖ్యాకులైనను ఆమోదించుచున్నారని తలంపను. కాని నాయొక్క అభిప్రాయధోరణి దేశములో వ్యాపించుచున్నదనియు, దానినిగూడ తెలిసికొనుటకు మీరందరును కుతూహలాయత్తచిత్తులై యుందురనియు నేను తలంచుచున్నాను.

## సాంఘికసమత్వవాదమే నా తారకమంత్రము

భారతదేశాభ్యుదయమునకు సంబంధించిన సమస్యల నన్నింటిని పరిష్కరింపగల తారకమంత్ర మొక్కటే కలదు. అది "సోషలిజం" అనబడు సాంఘికసమత్వవాదము అని నాకు గట్టి నమ్మకము కలదు. "ఆత్మవత్సర్వ భూతాని" యన్నట్లుగా నేను సర్వమానవసమహితత్వమనెడి అద్వైత వేదాంతధోరణిలోను జీవకారుణ్యభావముతోను యీ సాంఘికసమత్వమను మాటను ప్రయోగించుటలేదు. సశాస్త్రీయ నిర్వచనార్థముతోను, ఆర్థికశాస్త్రధోరణిలోను యీసాంఘిక సమత్వమను పదమును నేను వాడుచున్నాను. ఇది సంఘమునకు వర్తించెడి ఆర్థిక సంప్రదాయసూత్రము మాత్రమేకాదు. ఇది మానవజీవిత పరమార్థమును బోధించెడి వేదాంతతత్వమనికూడ నా నమ్మకము. అది నాకు నచ్చినది. భారతదేశములోని దుర్భర దారిద్ర్యమునకును, నిర్వ్యాపారత్వమునకును, భారతజాతియొక్క పారతంత్ర్యమునకును, అధఃపతనమునకును సాంఘికసమత్వ సిద్ధాంతము తప్ప మరొక తారణోపాయము నాకు కన్పించుటలేదు. ఈ భవబంధముల కన్నింటికిని అదొక్కటే మోక్షమార్గము. దీనిని అనుష్ఠించుటకు, మన రాజ్యాంగధర్మములే పూర్తిగా మారవలెను. మనసంఘములోని సంప్రదాయములన్నియు తారుమారు కావలెను. స్వదేశసంస్థానములు, జమీందారీలు కూడ తలక్రిందులు కావలెను. దీని అర్థ మేమనగా, స్వంత ఆస్తియనునది ఉండదు. ఉన్నప్పటికిని ఒక మితప్రమాణమునకు లోబడియుండును. కొలదివర్తకులుమాత్రమే లాభములు గడించి లక్షాధీశ్వరులగుటకు వీలులేదు. సహకారపద్ధతి ననుసరించి అందరును కలిసి పాటుపడవలెను. ఇట్టిపద్ధతి అమలులోనికి రావలసిన యెడల మన పూర్వజన్మవాసనలన్నియు, మన వంశపరంపరానుగతమైన అభ్యాసములన్నియు, అభిప్రాయధోరణులన్నియు మారిపోవలెను.

మన కోరికలు మన జీవితాభిలాషలు పూర్తిగా క్రొత్తమార్గము ననుసరింపవలెను. కేవలము క్రొత్త ధర్మప్రతిష్ఠాపన జరుగవలెను.

ఈ నాగరకతాసంప్రదాయములన్నియు అంతరించవలెను. లక్షాధికారుల చేతులలోనున్న అధికార ప్రాబల్యమే ఇప్పుడు అమలులోనున్నది. ఇది నాశనము కావలెను. ఇటువంటి నూతనయుగధర్మమెట్లు వర్తించునో గ్రహింపదలంచినయెడల, సోవియటు రష్యా ప్రభుత్వము యొక్క పద్ధతులను గమనింపదగును. ఆ దేశములో జరిగిన కొన్ని విషయములు నాకు కూడ యిష్టములేదు. అవి నాకు సంతాపకరములైన విషయములే యగును. కాని, ఘోరప్రజాపీడనము ప్రబలియున్న యీ రాక్షసయుగములో అచట మాత్రము లోకకల్యాణార్థమైన నూతన ధర్మవికాసము జరుగుచున్నదనియే నా విశ్వాసము. మన యనంతరతరములవారికి మంచి రోజులు రానున్నవనేయెడల, సోవియటు రష్యావల్లనే రావలెను. ఇంతలో నొక ప్రళయమువచ్చి ప్రపంచమునంతను ముంచివేయనియెడల, ఈ నూతన సాంఘిక సమత్వతత్వము ప్రపంచమంతటను వ్యాపించి పరదేశములగూడ ప్రబలి, సనాథ్యప్రాబల్య ప్రేరితములైన యుద్ధము లిక తుదముట్టగలవు.

కాని, యీ నూతన ధర్మతత్వమెన్నటి కీదేశములో పాదుకొనునో నాకు తెలియదు. కాని ఆయాదేశములవారి సహజ సందర్భానుసరణముగా యీ తత్వము వారిలో వ్యాపించుచుండును. ఈ తత్వము ఒక్కొక్క దేశములో ఒక్కొక్క ఆకారమును దాల్చుచుండును. కాని ప్రపంచములో యీ సాంఘిక సమత్వతత్వము నవలంబించిన జాతులన్నియు ఏకమై సహోదర భావముతో శాంతిసమాధానములతో మెలంగనేర్చును. ఈ సంక్షోభములోనుండి యీ మహామథనములోనుండి శశ్వచ్ఛాంతిప్రదమైన అమృతత్వము లభించును.

## కాంగ్రెసుసభ సాంఘికవాదుల పీఠము కావలెను

కాబట్టి నాయభిమతానుసారముగా యీ సాంఘిక సమత్వమనునది కేవలమొక ఆర్థికసిద్ధాంతముకాదు. అదియొక నూతనధర్మసిద్ధాంతమని సంపూర్ణవివేకముతో నిండు హృదయముతో నమ్మియున్నాను. పరాక్రాంతమైన భారతదేశమునుచూచి నేను సహింపజాలను. కనుక జాతీయవాదినై నేను భారతదేశ సంపూర్ణస్వాతంత్ర్యమునకై కృషిచేయుచున్నాను. అట్టి సంపూర్ణ స్వాతంత్ర్యమువల్లనే మన దేశములో సాంఘిక సమత్వమేర్పడ గలదను నమ్మకముతోకూడ యీ సంపూర్ణ స్వాతంత్ర్య సంసిద్ధికై కృషిచేయుచున్నాను. కాబట్టి కాంగ్రెసు మహాసభకూడ సాంఘికవాదుల పీఠమై వెలయవలెననియు, ఇట్టి ధర్మప్రతిష్ఠాపనకై పాటుపడుచున్న ప్రపంచములోని తదితరజాతులవారితో మన కాంగ్రెసుసభకూడ చేతులుకలిపి పనిచేయవలెననియు నేను కోరుచున్నాను. కాని, ప్రస్తుతము ఏర్పడియున్న కాంగ్రెసువాదులందరును నాతో పూర్తిగా ఏకీభవించుట కియ్యకొనరని నాకు తెలియును. మనది జాతీయస్వాతంత్ర్యోద్యమసంస్థ. జాతీయ స్వాతంత్ర్య సంపాదనకొరకు మాత్రమే యీ కాంగ్రెసువాదులు నాతోకలిసి పనిచేయబూనుకొనెదరు. కేవలము స్వరాజ్యము సంపాదించుటయే కాంగ్రెసుయొక్క పరమావధియని నిర్వచించినప్పటికిని ఈ రాజకీయస్వాతంత్ర్యమువల్ల బాగుపడెడివారెవరో కొలదిమంది మాత్రమే యుండగలరు. అందువల్లనే మనము జనబాహుళ్య క్షేమాభ్యుదయములనుగూర్చి ప్రస్తావించుచుందుము. కాని, మనలో చాలమంది తమకు స్థిరముగా ఏర్పడియున్న హక్కుభుక్తములనువిడనాడుటకు వెనుకాడుచుందురు. కాంగ్రెసుసభ జాతియౌన్నత్యముకొరకే

పాటుపడవలసియున్నదని వారువాదించెదరేగాని జనసామాన్య క్షేమమునకై స్వార్థత్యాగము చేయనియ్యకొనరు. అట్టి స్వలాభాపేక్షాపరులే చాలమంది జాతీయవాదులమను పేరుతో సమికూడి మనరాజకీయ స్వాతంత్ర్యసమరములో మనకెదురొడ్డుటకు సంసిద్ధముగు న్నారు.

సాంఘికవాదము ప్రబలము కావలెనని నేను కోరుచున్నప్పటికిని కాంగ్రెస్‌మహాసభను నేనిందుకై నిర్బంధించుటకు పూనుకొనను. అట్టినిర్బంధమువల్ల సంపూర్ణ స్వాతంత్ర్యమునకై మనము సల్పుచున్న పోరాటమునకే విఘాతముకలుగును. మనలోమనకు చిక్కులేర్పడును. నాసాంఘికసమత్వసిద్ధాంతము నంగీకరింపనట్టివారితోకూడ నేను చేతులుకలిపి పూర్ణస్వరాజ్యముకొరకుమాత్రమే వారితో పాటుపడెదను. వివిధసిద్ధాంతములను నమ్మియుండినను దేశస్వాతంత్ర్యము నభిలషించెడివారందరును కాంగ్రెసుసభలోచేరి ఇంతకాలము నుండియు ఏకముఖముగా పనిచేయుచునేయున్నారు. అట్టి భిన్నాభిరుచులకు ఇకముందుకూడ కాంగ్రెసుసభలో ఐకమత్యావకాశ ముండవలెను.

## ఖద్దరు - గ్రామపరిశ్రమలు. వీనిప్రయోజన మెంతవరకు?

కాంగ్రెసుయొక్క ప్రస్తుత భావధోరణికిని యీ సాంఘిక సమత్వ సూత్రమునకును ఏరీతిగా పొత్తు కలియగలదు? అట్టి సమన్వయము సాధ్యమగునని నాకు తోచదు. దేశములో ఫ్యాక్టరీలును కార్ఖానాలును విరివిగా పెరుగుటవల్లనే ప్రజలకు దుర్భిక్షము తొలగి సుభిక్షము కలుగగలదని నేను నమ్మియున్నాను. అట్లయ్యును యిదివరలో నేను రాట్నముతోను చేమగ్గములతోను ఖద్దరువస్త్రములు తయారు చేయబడుటకు మనసార తోడ్పడి పనిచేసితిని. ఇకముందుకూడ తోడ్పడెదను. గ్రామపరిశ్రమలలో ఖద్దరుపరిశ్రమకు ప్రాధాన్యము కలదు. మన ప్రస్తుతార్థిక పరిస్థితులలో గ్రామపరిశ్రమలు ముఖ్యముగా ప్రోత్సహింపబడవలసినవే యగును. అట్టి చేతిపనులను అభిమానించి ప్రోత్సహించుటవల్ల మనకు సాంఘికముగా, రాజకీయముగా, ఆర్థికముగా అనేకలాభములు చేకూరగలవు. అట్టి పరిశ్రమోద్ధరణ ఫలితములను గమనించువారి కిది విదితము కాగలదు. కాని స్వరాజ్యము లభించేవరకును ఇవన్నియు తాత్కాలిక సాధకోపాయములుగానే నేను భావించుచున్నాను. మన జీవితతాపత్రయముల కన్నింటికిని యిదియే పరమహంసక్రియయనియు, సర్వబాధానివారిణియనియు నమ్మజాలను. ఈ తాత్కాలికసంధ్యాకాలపరిమితి చాల పెద్దదిగానే యుండగలదు. భారతదేశమువంటిదేశములో యంత్రాగారములు విజృంభించినప్పటికిని వ్యవసాయదారులకును పల్లెకాపులకును ఉపవృత్తులుగా యీచేతిపను లెప్పటికిని స్థిరముగా అక్కరకురావచ్చును. నేనుకూడ గ్రామపరిశ్రమోద్ధరణకై తోడ్పడగలను. కాని యంత్రబలమును, యంత్రాగారవ్యాప్తిని పూర్తిగా ఖండించునట్టియు, సాంఘిక సమత్వము పనికిరాదని వాదించునట్టియు కొందరు కాంగ్రెసు వాదులవలె నేను గ్రామపరిశ్రమోద్ధరణావశ్యకతను పరిగణించుటలేను. కిని నాకును క్రియలో భేదము లేకుగాని సంకల్పములో వ్యత్యాసము కలదు.

## హరిజనోద్ధరణ

హరిజనోద్ధరణసమస్యను అన్వయించుకొనుటలోకూడ సంకల్పార్థములు భేదించుచున్నవి. సాంఘిక సమత్వవాదికి హరిజనోద్ధరణావశ్యకత తేటతెల్లమే. ఎందువల్లననగా, సంఘమందు న్యూనతాధిక్యములుగాని, పరస్పరపీడనముగాని యుండకూడదు. ఆర్థికదృష్టితో చూచేయెడల వారు భూవసతులులేని చిల్లరజనులుగా నిరాధారులై యున్నారు. వీరికి అర్థబలము కలిగినయెడల, వీరు స్థితి పరులైనయెడల సంఘములో వీరికి గౌరవమర్యాదలును సమానప్రతిపత్తియును అయాచితముగానే లభింపగలవు. కులాచారసంప్రదాయములే మారిపోగలవు.

## నూతనరాజ్యాంగవిధానము భారతీయుల కవమానము

అందరి మనస్సులలోను ఇప్పుడు తాండవమాడుచున్న నూతన రాజ్యాంగవిధానమునుగూర్చి యిక ముచ్చటింపదలంచితిని. ఈనూత్నరాజ్యాంగ విధాన విషయములో బ్రిటిష్ పార్లమెంటువారి ధోరణిని గూర్చి మీరు వినగోరుచున్నారు. వెనుకటి కాంగ్రెసు సమావేశము జరిగిన యనంతరము ఈ క్రొత్త యిండియాఆక్టు శాసింపబడినది. అప్పుడే దీని స్వభావలక్షణములన్నియు శ్వేతపత్రముఖములో కన్పించియుండెను. ఈ రాజ్యాంగవిధానమును నాపూర్వికుడైన కాంగ్రెసుసభాధ్యక్షుడే స్తనశల్యపరీక్ష చేసెను. అంతకన్న ఎక్కువ విమర్శ నేను చేయజాలను. అప్పట్లో సూచింపబడియుండినరాజ్యాంగ విధానమును కాంగ్రెసు సభవారు నిరాకరించియే యుండిరి. ఆ శ్వేతపత్ర ప్రణాళిక కంటెను ఇప్పుడు శాసింపబడిన యీ యిండియాఆక్టు మరింత అధ్వాన్నముగా నున్నది. మనలో అతి జాగ్రతగా మృదువుగా మాట్లాడువారును, మితవాదులునుగూడ యీ సంస్కరణములను పూర్తిగా ఖండించియున్నారు. శ్వేతపత్రమునే మనమిదివరలో గర్హించియుంటిమి. మన దాస్యశృంఖలములను మరింత గట్టిగా బిగించి పేదజనులను మరింత నిరుపేదలనుగాజేసి ప్రజలను పీల్చి పిప్పిజేయుటకేర్పడిన యీ రాజ్యాంగ చట్టమును మనము ఏమి చేయవలెను? ఈ చట్టములోని నియమ నిబంధనలను సరకుగొనక మరచి యుండెదముగాక! కాని, ప్రజాభీష్టముల నన్నింటిని తృణీకరించి మన మొఱలనన్నింటిని పెడచెవినిడి మనలను అవమానపరచియుండిరను విషయమునైనను మనము మరువగలమా? మన నోరు మూయించి మనపై క్రూర నిర్బంధశాసనముల నమలుపరచి సాధారణ పౌర స్వాతంత్ర్యముకూడ మనకు లేకుండజేసి మనలను నిత్యవిధిగా అణగద్రొక్కుచున్నారను విషయము నైనను మరచి యుండగలమా?

ఈ రీతిగా వారు మనల నవమానించుచు, మనకు స్వారాజ్య పట్టాభిషేకము చేసినను ఆ కిరీటమును మనము కాలితో తన్ని వేయమా ? మన ఆత్మగౌరవమునకును జాతీయప్రతిష్ఠాగౌరవమునకును భంగము వాటిల్లినప్పుడెట్టి వరములను వారు ప్రసాదించినను మనము కాలదన్ని నేలరాచి వేయకయుందుమా ? అట్టిశరి మనమీ నూత్న రాజ్యాంగ చట్టమునేమి చేయవలెను ?

బానిసత్వమును స్థిరపరచు శాసనములను మనము తాత్కాలికముగ లొంగియున్నాము. ఆర్డినెన్సులు మున్నగు నిరోధములకు మనము తలవంచియున్నాము. కాని ఇట్టి నిరోధమునకు ఎదురు తిరిగి సంపూర్ణ స్వాంతంత్ర్యమును పొందు హక్కుగూడి ఈ నిరోధవిధాన సహనమునందు గర్భితమై యున్నదని చెప్పగలను.

నూతన సంస్కరణములను రాజ్యాంగశాస్త్రజ్ఞులు పరిశీలించి ఖండించి యున్నారు. రాజ్యాంగనిర్మాణచట్టములు కేవలము శాస్త్ర విచారణకు తగినవని తలపకూడదు. ప్రజలకును ప్రభుత్వాధికారమునకును గల పరస్పర సంబంధమును నిర్ణయించునదే నిజమగు రాజ్యాంగ నిర్మాణమని శాస్త్రవేత్తయగు ఫర్డినాండ్ లాసెలీగారు వ్రాసియున్నారు. ఈ నూతన సంస్కరణ శాసనము ఆమోదింపబడిన పిమ్మట కూడ ప్రభుత్వమువారు తమ అధికారములను యేవిధముగ చలాయించుచున్నారో మనము చూచుచున్నాము. మనల నుబ్బించు తియ్యనిమాటలు ప్రమాణములుకావు. పార్లమెంటువారు ఆమోదించిన శాసనమే ప్రమాణము. ప్రజలశక్తి, బలమును ఆధారముగ గైకొని ఈ సంస్కరణములను ప్రతిఘటించుటకు తగుచర్య తీసికొనధ్వంసమొనర్చుటకే నిరంతరముగ కృషిసలుపుటకన్న వేరుమార్గము లేదు.

## నూతనసంస్కరణములు - కాంగ్రెసుధర్మము

మన ఉద్దేశ్యము సఫలముకావలెననిన్ల అవలంబింపవలసిన కార్యవిధానము గూర్చి ఆలోచించెదము.

నేను ఖిరోపాఖండమునుండి తిరిగివచ్చినది మొదలు కార్య సంఘ సభ్యులతో ఈవిషయమై దీర్ఘసంభాషణలు జరిపితిని. ఈ సంస్కరణములను నిరాకరింపవలెననియు, శక్తికొలది ప్రతిఘటింపవలెననియు, అందరు అంగీకరించు చున్నారు. కాని కార్యవిధాన వివరములవిషయమున యేకాభిప్రాయము కుదరకున్నయది. ఇంత కాలము మనము కావలసినపని చేసితిమి. ఇకముందుకూడ యిద్దేవిధముగ సమష్టి బాధ్యతవహించి మాధర్మములను నిర్వహింపగలమనియే నమ్ముచున్నాము. కాని దృక్పథమునందు భేదములున్నవను విషయమును గుర్తెరుగకున్న చిక్కులేర్పడవచ్చును. ఈ సమస్యవిషయమున కార్యసంఘమువారు యెట్టినిర్ణయమును గావింపగలరో నేనీసమయమున ఊహింపజాలను. కావున నేను నావ్యక్తి అభిప్రాయములను మాత్రమే ఈసందర్భమున తెలుపగలను. కాంగ్రెసు సభవారు ఈనా అభిప్రాయములను యెంతవరకు అంగీకరించెదరో నేను చెప్పజాలను. నేను ప్రకటింపనున్న భావములను కార్యసంఘ సభ్యులలో పలువురు అంగీకరింపజాలకున్నా రని స్పష్టపరచుట నావిధియై యున్నది. ఈవిషయమున యేకాభిప్రాయము లేకున్నను కార్యసంఘసభ్యులందరును కలిసి పనిచేయవలయుననియే నిశ్చయించుకొని యున్నాము. ఈభేదములు స్వల్పమైనవనియు, ముఖ్యాంశములయందు యేకాభిప్రాయ మున్నదనియు ప్రకటించు చున్నాము. ప్రజాప్రతినిధి సంస్థయగు కార్యసంఘమునకు యింతకన్న యితరమార్గము లేదు.

## ఎన్నికలయందు పోటీచేయవలయును

కావున ఈపరిస్థితులలో నూతన రాష్ట్రీయసభలు జరుగనున్న యెన్నికలయందు పోటీచేయుట అవసరమగుచున్నది. రాజకీయ, ఆర్థిక, సమస్యలవిషయమున కాంగ్రెసు ఆశయములను వివరించుచు ఒక యెన్నికల ప్రణాళికను తయారుచేసి ప్రజాప్రతినిధి మండలిని యేర్పరచుట ప్రధానసమస్యగ ప్రకటించి మనము ఈ యెన్నికలయందు పోటీచేయవలెను. యుక్తవయస్సు కలవారికి ఓటింగుహక్కును యిచ్చి వారిచే యెన్నుకొనబడిన ప్రజాప్రతినిధులమండలి ద్వారా మన రాజకీయ సాంఘిక సమస్యలు పరిష్కారమగునని నాకు సంపూర్ణవిశ్వాసమున్నది. యెక్కువ తక్కువ ఒక విప్లవమువంటి గొప్ప ప్రబోధము యేర్పడినకాని యిట్టి ప్రతినిధిమండలి సమావేశమగుటకు అనుకూలమగు పరిస్థితులు యేర్పడవు. కాగితములయందు వ్రాయబడు రాజ్యాంగమునకును ప్రజలకును గల పరస్పర సంబంధములను నిర్ణయించునప్పుడు భారతప్రజల నిర్ణయములు ప్రభుత్వమునకు ప్రమాణములుగ నుండవలయును. అట్టి పరిణామము యెన్నడు యేర్పడునో నేను చెప్పజాలను. కాని ప్రపంచమునందెచ్చట చూచినను తీవ్రమగు ప్రబోధము కనబడుచున్నది. నిస్తబ్ధతకు భారతదేశమునందుగాని, మరి యేయితర భూభాగములందుగాని యెడములేదు. కావున త్వరలోనే మనము ఈ సమస్యను (ప్రతినిధి మండల స్థాపనసమస్య) పరిష్కరింపవలసిన అవసరము ఉదయింపవచ్చును. నూతనసంస్కరణములవల్లను, నూతన శాసనసభలవల్లను మన లక్ష్యమగు ప్రజాప్రతినిధిమండలి యేర్పడదు. కాని మన ఈ కోరికను యెల్లప్పుడు దృష్టియందుంచుకొనవలెను. ఈ విషయమున మన ఆశయమును ప్రపంచమునకంతకును ప్రకటించుచుండవలెను.

## బ్రిటిష్ ప్రభుత్వముతో సంధిచేసికొనుట

ప్రజలకు స్వాతంత్ర్యహక్కును కలుగజేయు రాజ్యాంగనిర్మాణమును తయారుచేయుటకు ప్రజాప్రతినిధి మండలికన్న యితరమగు

సాధనమును మరియొకటిలేదు. ఇట్టి మండలి యేర్పడినచో, యిందలి సభ్యులు భారతరాజ్యాంగ నిర్మాణమును గురించి బ్రిటిష్ప్రభుత్వము వారితో ఒడంబడికను గావించుకొనుటకు రాయబారములు సలుపవచ్చును. యిట్టి సమావేశమునకు మనము ముందుగ ఆలోచన సలుపక హాజరగుట అవివేకము. అన్నివిషయములను గురించి సమగ్రముగ చర్చసలుపు రాజ్యాంగనిర్మాణమును గురించి మన ప్రతినిధులు విస్పష్టమగుసూచలను గావింపవలెను. ఇట్టి ప్రతినిధిమండలిని సమావేశపరచుటకు సంబంధించిన వివరములవిషయమై యిప్పుడే మనము ఆలోచింపవలసిన అవసరములేదు. కాని మన ఆదర్శములను స్పష్టముగ గుర్తెరిగి సమగ్రమగువిధమున వాటిని ప్రజాప్రతినిధిమండలివారికి సమర్పించుట అవి సఫలముగావలెనని పట్టుదలతో కృషిసలుపుట కాంగ్రెసుసభవారి ధర్మమైయున్నది.

## కాంగ్రెస్ప్రచారము

ఈ యెన్నికలయందు పోటీసలుపుటకు మరియొక ముఖ్యకారణమున్నది. లక్షలకొలది ఓటర్లకును, ఓటింగు అర్హతలులేని కోట్లకొలది ప్రజలకును కాంగ్రెసు సందేశములను ప్రతిధ్వనింపజేయుటకు ఈ యెన్నికలు మనకు అవకాశము నొసగును. మన కార్యక్రమమును విధానమును స్పష్టపరచి సామాన్యప్రజల కష్టసుఖములను విశదపరచి ప్రజలను, ప్రజాసామాన్యమును అణగద్రొక్కుచున్న సాంఘిక ఆర్థిక పుచిక్కులను తొలగించుటకై కాంగ్రెసువారు పనిచేయుదురని ప్రకటింపవలెను. కాంగ్రెసు సందేశము కాంగ్రెసు విజ్ఞప్తి కేవలము ఓటర్లకుమాత్రమే అందచేసినచాలదు. ఓటర్లు కానివారు కోట్లకొలది యున్నారనియు సాంఘికముగవారు అతిదీన స్థితియందున్నారనియు విదేశీయుల దౌర్జన్యమునకు వారే అధికముగ గురియగుచున్నారనియు మనము గుర్తెరుగవలయును. యెన్నికలసమయములందు అధికారవర్గమువారు జోక్యమును కలుగజేసికొనుటను మనము చూచియున్నాము. ప్రజాస్వాతంత్ర్య ఆశయములకు ప్రతికూలురైన ధనికులనుకూడ మనము ఈ యెన్నికల సందర్భమున యెదుర్కొనవలసి యుండును. కాని ఈ ప్రభుత్వము వారుగాని, ఈ ధనికులుగాని మనబలమును మనలను నిరోధింప జాలరు. గోడమీదపిల్లి చందమున నుండు వ్యక్తులను సంస్థలను మనవైపునకుత్రిప్పుకొనవలయునను ఉద్దేశ్యముతో మనము యెప్పుడు మన విధానమును కార్యక్రమమును చులకన చేయుదుమో అప్పుడే మన ప్రతిష్ఠకును బలమునకును అవాంతరము యేర్పడునని గుర్తెరుగవలెను. తాత్కాలిక లాభములకు ఆశపడి మన ఉన్నతాదర్శములవిషయమున యేనాడు మనపట్టుదలక్షీణించునో ఆనాడే మనము త్రిశంకునివలె భూతలమునకుగాని, స్వర్గమునకుగాని చేరక ఏకాకులమయ్యెదము. ఈ విధమున పతనము చెందినందులకు కనికరము చూపువారుకూడ యుండరు. కావున కాంగ్రెసు నిర్మాణము ప్రమాణముగ గైకొని నిష్కర్షగ నిలచియుంటి యింతకుముందు భారతజాతి సలిపిన స్వాతంత్ర్యసంగ్రామమును ప్రతిఘటించినవారితోను బ్రిటిష్ సామ్రాజ్యమునకు తోడ్పడుచున్నవారితోను యెంతమాత్రము రాజీపడకుండుట సరియగు మార్గమని గ్రహింపవలయును.

## అధికారస్వీకరణము

ఎన్నికలలో మనము విజయముగాంచిన పిమ్మట యేమి చేయవలయును? అధికార పదవులను అంగీకరించుటయా? అంగీకరింపకుండుటయా? ఇది అప్రధానమగు ప్రశ్నయని చెప్పవచ్చును. కాని ఈ ప్రశ్నయందు కాంగ్రెసు ఆదర్శములకు సంబంధించిన ముఖ్యసమస్యలు గర్భితమైయున్నవి. ఈ విషయమున గావింపబడు నిర్ణయమువల్ల కాంగ్రెసుభావివిధానము ఆధారపడియుండును, ఈ విషయమున వివిధపక్షములవారు భిన్నభిన్నమగు దృక్పథములను ప్రకటించుచున్నారు. భారతస్వాతంత్ర్యసమస్య కూడ ఈ సమస్యాపరిష్కారమునందే ఒకవిధముగ నిగూఢమై యున్నదని చెప్పవచ్చును. భారతదేశపు రాజ్యాంగనిర్మాణమును ఆమూలాగ్రముగ మార్చివేయుటయా లేక బ్రిటిష్ సామ్రాజ్యపు ఆవరణను ఈ తుచ్ఛమగు సంస్కారణముల ననుసరించి పనిచేయుట అను ప్రశ్నగూడ ఈ సమస్యయందే యిమిడియున్నవి. 1920 వ సంవత్సరమున కాంగ్రెసు సభ్యులయందు ఉదయించిన భిన్నభావములు ఆ సమయమున కాంగ్రెసుమహాసభవారు గావించిన నిర్ణయము మీకు స్ఫురణకు దెచ్చుచున్నాను. నిష్ప్రయోజనమైనట్టిదియు, తుప్పుపట్టినదియు నగు రాజ్యాంగసంస్కారణముల వ్యామోహమును విడనాడవలయునని కాంగ్రెసు మహాసభవారు ఆ సంవత్సరమున చారిత్రాత్మకమగు నిర్ణయమును గావించిరి. ఇన్నిసంవత్సరములు ధైర్య సాహసములతో యెన్నియోబాధల ననుభవించి కొద్దిగనో గొప్పగనో మన ఆదర్శములు సఫలమైనపిమ్మట యిప్పుడు మరల గ్రుడ్డివారివలె విమోచనములేని పురాతన పద్ధతులకే తిరుగ దలచుట అవివేకము. ఈ పదవీ స్వీకరణ సమస్యయందు నేను పైన వివరించిన సమస్యలన్నియు యిమిడియున్నవని గుర్తెరిగి ఈ విషయమై కాంగ్రెసుమహాసభవారు తగునిర్ణయమును గావింపవలయును. జాతీయజీవిత విధానమంతయు సంపూర్ణమగు విధానమున మారిపోవలెనని భారతదేశము కోరుచున్నది. తీవ్రమగు ప్రబోధమును కలుగజేయునట్టియు, విప్లవమునకు దారిచూపునట్టి నూతన సందేశములు ప్రపంచమును ఆందోళనపరచుచున్నవి యిట్టి మహాసమయమున మనము వెనుకకు తిరిగి నిర్వీర్యమగు పద్ధతుల ననుసరింప ఉద్దేశించుట తగిన కార్యమా యని ప్రశ్నించుచున్నాము. మనలో కొందరు స్వాతంత్ర్యసంగ్రామ విషయమున అలసట జెంది కొంత విశ్రాంతి కావలెనని ఆశపడవచ్చును. కాని అప్రతిహతమగు వేగమున ఆర్థికపుటవసరములు ప్రజలను ముందుకు నెట్టుచున్నప్పుడు నిరుత్సాహులమైన మనలను ప్రజలు అనుకరింపరు. మన మిప్పుడు ఒక

మూల కహోర్పోనవలసి యుండును. ఈమహాప్రవాహపు బాటను గుర్తెరిగి యితరులు ముందుకువచ్చి ప్రజలు తమ లక్ష్యము చేరుటకు మార్గము పడును.

## అధికారములేని ఉద్యోగము

నూతన సంస్కరణములు నిష్ప్రయోజనము లనియు, వాటిని నిరాకరింపవలయుననియు మనము తీర్మానము గావించియున్నాము. ఈ తీర్మానమునకు బద్ధులమై ఈ సంస్కరణములను ప్రతిఘటించుచు వాటిని ధ్వంసమొనర్చుటకై పట్టుదలతో పనిచేయుట మన ధర్మమై యున్నది. అట్లుగాక అధికార పదవులను మనము అంగీకరించుట స్వవచన విఘాతమగును. యిట్టి చర్య జాతీయగౌరమునకు గాని ఆత్మగౌరవమునకు గాని అనుగుణ్యమైనది కాదు. యెంతమూసిపెట్టినను ఉద్యోగముల నంగీకరించుటచే ఈ మహాసామ్రాజ్యమును స్థిరపరచుటకై ఉపయోగింపబడుచున్న నిరోధసాధనములకు తోడ్పడినవారము అయ్యెదము. భారతప్రజలను కొల్లగొట్టుటయందు సామ్రాజ్యవాదులకు సహకార మొసగినవార మయ్యెదము. ప్రజల హక్కులను స్థాపించుటకై కాంగ్రెసు మంత్రులు ప్రయత్నింపవచ్చును. నిరోధవిధానమును ఆక్షేపింప వచ్చును. కాని ప్రయోజన మేమి? ప్రజలకు నిజముగు లాభమును కలుగ జేయుటకు ఈ సంస్కరణముల యందు మంత్రులకు అవకాశములేదు. పైపెచ్చు సామ్రాజ్యమునకు అంగముగ నున్న ఈపరిపాలనమును నిర్వహించుటకును నిరంతరము లోటును చూపు ఆదాయవ్యయపట్టికలకును, కార్మికులను, కర్షకులను అణగద్రొక్కు విషయములను మన కాంగ్రెసుమంత్రులు బాధ్యతవహింపవలసియుండును. ప్రజాప్రతినిధి సిద్ధాంతిములు ప్రమాణములుగ పరిగణింపబడు దేశములలో అధికారములేని బాధ్యతను వహించుట అపాయకరము. మనకు యివ్వబడిన రాజ్యాంగనిర్మాణము ప్రజాయత్త పరిపాలనాసిద్ధాంతములకు అనుగుణ్యమైనది కాదు. యెన్నియో ప్రత్యేకపు సంరక్షణలు రిజర్వు అధికారములు నిర్ణయింపబడెను. మనప్రతిపక్షులు గావించిన కట్టుదిట్టములను అనుసరించి ఆర్థిక వ్యవహారములను జరుపుచుండవలయును. నామమాత్రముగూడ అధికారము లేని యిట్టి బాధ్యతను వహించుట యెంత అపాయకరమో వేరుగ జెప్పుట అనవసరము. పరిపాలన విషయములందు ప్రజాప్రతినిధుల సహకారము వాంఛించుచున్నామని సామ్రాజ్యవాదులు చెప్పుచున్నారు. ఇది కేవలము మర్యాదమాట. వారు కోరినది సహకారము కాదు. వ్యక్తిస్వాతంత్ర్యమును సంపూర్ణముగ వదలుకొని వారికి లొంగిపోవలయుననియే వారి అభిప్రాయము. అధికారపదవులకు అంగీకరించువారు యిందులకు సిద్ధపడవలెను. ఈవిధమున ఆత్మగౌరవమును విడనాడి అధికారపదవుల నంగీకరించుట వ్యక్తులకే అవమానకరము. భారతజాతికి యేకైకకేంద్రసంస్థయగు కాంగ్రెసు మహాసభ యిట్టి అధికారపదవులను అంగీకరించుట జాతీయజీవితపు పునాదులను పెకళించుట యగును, కాంగ్రెసు మహాసభ పూర్వ చరిత్రయంతయు మరచినట్లు అగును.

## దేశమునకు లాభముకూడ కలుగదు

ఆత్మగౌరవము మాట అటుండనిచ్చి సామాన్యవివక్షత దృష్టితో ఈవిషయమై ఆలోచించిన అధికారపదవుల నంగీకరించిన దేశమునకు కొంచెమైనను లాభము కలుగ దని గ్రహింపవచ్చును. ఇండియాప్రభుత్వపు చట్టము ఆవిధముగ నున్నది. నిజముగ ఈ చట్టమువల్ల ప్రజలకు ఎక్కువ అధికారము లభ్యమైనచో, ఈ చట్టమును ప్రతిఘటింప యత్నించుట తప్పగును. కాని అటువంటి దేమియును లేదు. దాని ననుసరించు నెడల మనకు లక్ష్యములుగ నున్న ఉన్నతాశయములు మరుగుపడును. తుచ్ఛమగు సమస్యలు మన దృష్టిని ఆకర్షించును. రాజీలతోను, సాంఘిక విభేదములతోను మనము కాలము గడుపవలసి యుండును. కాని త్వరలోనే మన భ్రమ తొలగిపోగలదు.

శాసనసభలలో కాంగ్రెసుపక్షపు సభ్యుల సంఖ్య అధికముగ నున్నపుడే పదవీస్వీకరణసమస్య ఉదయించును. నిజముగ శాసనసభలలో కాంగ్రెసువారిసంఖ్య అధికముగ నున్న ప్రతిపక్షులను మనము సులభముగ నిరోధింపవచ్చును. ఉద్యోగములవల్ల మనబలము అధికము కాజాలదు. మనకు ఇష్టము లేనిపనుల నెన్నిటినో మనము సహింపవలసి యుండును. అట్టి కార్యములకు బాధ్యత వహింపవలసినందువల్ల మనబలమునకు అవాంతర మేర్పడును.

అట్లు కాక కాంగ్రెసుసభ్యుల సంఖ్య అల్పముగ నున్నచో ఉద్యోగస్వీకరణసమస్య ఉదయించదు. కాని మరికొన్ని పక్షములతో చేరినచో అధికసంఖ్యాకులమై, పదవులను అంగీకరింప తగిన అర్హత యేర్పడవచ్చును. మానవ స్వాతంత్ర్యమును సంరక్షించువిషయమునను, ఆర్థికసమస్యలను పరిష్కరించువిషయమునను మనము మన ఆదర్శములకు కొరత యేర్పడనివిధమున ఇతరపక్షములవారితో కలసి పనిచేయుట తప్పు కాదు. కాని ఇతరుల సహకారముపై మన అధికార పదవులు ఆధారపడి యుండుటకన్న అపాయకర మగుస్థితి వేరొకటి లేదు. ఇది కేవలము దుస్సహము.

మంత్రిపదవులను కాంగ్రెసువారు అంగీకరించెద రని ముందుగ ప్రకటించినచో ఎన్నికలయందు విజయము గాంచుటకు అనుకూలావకాశములు అధికముగ యేర్పడు నని కొందరు చెప్పుచున్నారు. నిజమే. ఇట్టిప్రకటన గావించినచో అధికార వ్యామోహమునకు లోబడిన ఇతరపక్షములవారు కాంగ్రెసునందు చేరెదరు. కాని ఇట్టివారిని కాంగ్రెసునందు చేర్చుకొనుట ఉచితమా యనియు, ఇట్టివారు చేరుటవల్ల కాంగ్రెసు బలము అధికమగునా యనియు ప్రశ్నించుచున్నాను. మంత్రిపదవులను అంగీకరించెదమని వాగ్దాన మొసగినచో

వోటర్లు అధికముగ కాంగ్రెసు అభ్యర్థులకే వోట్లనిచ్చెదరని కొందరు తెలుపుచున్నారు. మంత్రులైన పిమ్మట ప్రజలకు లాభకరమగు కార్యములనెన్నిటినో సలిపెదమని వాగ్దానమొసగినచో నిజముగ మన అభ్యర్థులకు ఎక్కువ వోట్లు వచ్చును. కాని ఇట్టి అసత్యపు వాగ్దానములను గావించినచో త్వరలో తగు శాస్తిని అనుభవింపవలసియుండును.

## ప్రతిఘటన విధానము తప్ప గత్యంతరము లేదు

కావున కాంగ్రెసువారు అనుసరింపతగినమార్గ మొకటే యున్నది. ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు ఆశయములను సఫలపరచుటకు శాసనసభలు సాధనములుగ నుండజాలవని స్పష్టముగ ప్రకటింపవలయును. అయినను మన ఆశయములను ప్రకటించుటకు ఈ శాసనసభలను వేదికలుగ గైకొని, అనుకూలావకాశము లేర్పడినపుడెల్ల ప్రతిష్టంభనములను కలుగజేయుచు, సామ్రాజ్యమునకు నెలవులైన ఈ సంస్థలను తుద ముట్టించుటకై ప్రయత్నింపవలెను. కాంగ్రెసు ప్రణాళికను ఆధారముగ గైకొని ఈ ప్రతిష్టంభనము ఉదయించునట్లు పని చేయవలయును. అప్పుడే ప్రజాశయములు సఫలమగుటకు ఈ సభలు నిష్ప్రయోజనమైనవని ప్రజలు గుర్తెరుగుదురు.

అధికార స్వీకరణవాదులు మరియొక విషయమును మరచుచున్నారు. పెక్కు రాష్ట్రములయందు పెద్దల సభలు ఏర్పరుపబడినవి. ఈ సభలయందు ప్రజాశయములకు ప్రతికూలురైనవారు అధికముగ నుండెదరు. ప్రజలకు నిజముగ లాభము కలుగజేయు కార్యములను ప్రతిఘటించుటకై గవర్నరులు ఈ సభల నుపయోగించెదరు. కావున మంత్రులు సదుద్దేశములు గలవారైనను, ఏమియు చేయజాలని స్థితియందుండెదరు.

## నిర్ణయము గావించుటకు రాష్ట్రములకు స్వాతంత్ర్య మొసగుట

రాష్ట్రముల పరిస్థితుల ననుసరించి, ఉద్యోగస్వీకరణము విషయమై తగునిర్ణయము గావించుకొనుటకు ఆయా రాష్ట్రముల కాంగ్రెసుసంఘములకు అధికార మివ్వవలయునని కొందరు సూచించుచున్నారు. ఇది విపరీతఫలితముల నొసగు సూచన యని నా అభిప్రాయము. ఇంతకాలము భారతదేశపు ఐకమత్యమునకై పాటుపడిన మనము ఈ ఐకమత్యమునకు కొరతకలుగజేయునట్టి సూచనను అంగీకరించుట భావ్యము కాదు. ఈ సూచనను అంగీకరించినచో ఇదే విధమున ఇతరసమస్యలను పరిష్కరించు అధికారము కూడ రాష్ట్రీయ కాంగ్రెసు సంస్థలకే వదలవలసియుండును. సాంఘిక సమస్యలను కూడ రాష్ట్రములవారే పరిష్కరింపవలసివచ్చును. దీనికి అంతము ఇట్లు ప్రధానసమస్యల మరుగుపడ స్వాతంత్ర్య దర్శము దూరమగును. అసహ్యమగు రాష్ట్రీయ దురభిమానము ప్రాముఖ్యమునకు రాగలదు. భారతదేశమున కంతయు అనుకూలమైన విధానములను నిర్ణయించుట కాంగ్రెసు కర్తవ్యము. అందు ముఖ్యముగ స్వాతంత్ర్యసమస్య ప్రధానమైనది. మిగిలిన సమస్యలన్నియు అప్రధానములు.

కావున పదవీస్వీకరణమునకు అనుకూలముగ నుండుట, కనీసము ఈ విషయమై మొగ్గు చూపుటకూడ కాంగ్రెసునకు ఎంతమాత్రము తగిన కార్యము కాదని నా నిశ్చితాభిప్రాయము. మనము పదవుల నంగీకరింప తీర్మానించుకొనినచో మన పతనమునకు వగచువారు కూడ యుండరు! ఉద్యోగములను అంగీకరింపవలయు ననుట కాంగ్రెసు సంప్రదాయములకును, కాంగ్రెసు ఇంతకాలము ప్రజలయందు కలుగజేసిన ప్రబోధమునకు విరుద్ధమై యున్నది. నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించిన రాజకీయముగ కూడ యిది లాభకరమగు కార్యము కాదు. అంతేకాక ఇట్టి నిర్ణయము ప్రజల గంభీరస్వభావమును విచ్ఛేద మొనర్పగలదు. రాజ్యాంగనిర్మాణము ఆమూలముగ మారవలయునని కోరినచో మనము ప్రజాబాహుళ్యమున ఒకవిధమగు విప్లవకరమగు భావములను వ్యాపింప జేయవలయును. ఇట్టి ప్రబోధమునకు అవాంతరముగనుండు సూచన ఇంతమాత్రము అనుసరణానుయోగ్యమైనది కాదు.

మనోభావములం దేర్పడగల పరిణామమునుగూడ మిగుల ముఖ్యమగు విషయము.

మనము ప్రజలను మోస పుచ్చుకూడదు. ఈ శాసనసభలను స్వాధీనపరచుకొనుటవల్ల మనకు నిజమగు అధికారబలము కలుగునని గాని స్వాతంత్ర్య ఆశయములు సఫలమగునని గాని ప్రజలకు మనము చెప్పి వారిని భ్రమపుచ్చుట ఎంతమాత్రము తగనికార్యము. భారతదేశమునకు స్వాతంత్ర్యసంగ్రామమును జరుపుట అవసరమగును. కావున స్వాతంత్ర్యసంపాదనకు శాసనసభలు ఎంతమాత్రము సాధనములు కాజాలవనియు, ఈ సభలవెలుపల జనసామాన్యమునందు ప్రబోధము కలుగజేయుటకై చేయవలసిన పని అధికముగ నున్నదనియు గుర్తెరుగవలెను. జాతికి బలము ప్రజాసామాన్యమువల్లనే కలుగును, ఇట్టి బలము భారతజాతికి ఏర్పడవలయునని జనసామాన్యులకు నిర్మాణబలము కలుగజేయుటకై కృషిసలుపవలసియుండును. ఇది ప్రధానమగు కార్యము.

## కాంగ్రెసుసభ పూర్తిబాధ్యత వహింపవలెను

శాసనసభలకు సంబంధించిన కార్యక్రమము రెండవవిషయము. అయినను శాసనసభలలో మన పక్షమువారి ప్రవర్తనమువల్ల కాంగ్రెసు ఆశయములకు కొరత కలుగకూడదు. కావున ఎన్నికల విషయములందును, ఎన్నికల ప్రణాళిక తయారుచేయు విషయమునను శాసనసభలయందు కాంగ్రెసుపక్షమువారు అనుసరింపవలసిన విధ

నములను నిర్ణయించుటయందును, కాంగ్రెసు మహాసభవారు సంపూర్ణ బాధ్యత వహించి పనిచేయవలసియుండును. కావున ఎక్కువ సర్వాధికారము గల పార్లమెంటరీబోర్డు వేరుగ నుండుట ఉచితము కాదు. శాసనసభలయందలి కాంగ్రెసుసభ్యుల ప్రవర్తనమును నిర్ణయించుబాధ్యత అధికారము కాంగ్రెసునకే పూర్తిగ యుండవలెను. అంతేకాక అప్పుడప్పుడు కాంగ్రెసుసభ్యుల చర్యలను పరిశీలించుటకు తగు ఏర్పాటులను కావింపవలెను.

రాబోవు సంవత్సరము రాష్ట్రీయశాసనసభల ఎన్నికలు జరుగునను నమ్మకముతో ఇంతచర్చ జరుపవలసివచ్చినది. ఈ ఎన్నికలు ఇంకను ఆలస్యముగ జరుగవచ్చును. నూతన సంస్కరణములు అమలునకు వచ్చుటకు ఆలస్యము జరుగవచ్చును. ఈ వ్యవధికాలములో ప్రపంచమున ఎన్నియో మార్పులు కలుగవచ్చును. మనపాలకులు ఉద్దేశములను విధానములను తల్లక్రిందొనర్చుటకు యుద్ధభయము అన్నిదిక్కుల వ్యాపించియున్నది. కాని ఎట్టిపరిస్థితు లేర్పడినను వాటిని ఎదుర్కొని తగువిధమున ప్రవర్తించుటకు మనము సంసిద్ధులమై యుండవలెను. ఒక ప్రశ్న ఉదయించినప్పుడు కాంగ్రెసువారు ఆవిషయమున తాటస్థ్యము వహించినచో, దుష్టమగు ప్రోద్బలములకు కాంగ్రెసు లొంగిపోవలసివచ్చును.

## ఫెడరలుప్రభుత్వ స్థాపనము

రాష్ట్రీయ శాసనసభలు త్వరలోనే స్థాపింపబడవచ్చును. కాని బ్రిటిష్‌సామ్రాజ్యమువారు మనపై విధించిన అసహ్యమగు రాజ్యాంగనిర్మాణమునందలి రెండవభాగము అనగా ఫెడరలుప్రభుత్వ నిర్మాణము ఎప్పుడు అమలులోనికి వచ్చునో ఎవరును గట్టిగ జెప్పజాలరు. మనమట్టుకు మనము సర్వశక్తులతో ఫెడరలు ప్రభుత్వ స్థాపనమును ఎదిరించెదము. రాష్ట్రీయ ప్రభుత్వములయందు ప్రతిష్టంభనల నేర్పరుచుటకు నూతన రాజ్యాంగవిధానమును, ఫెడరల్ కమిషను విధానమును ధ్వంసము చేయుటయే ముఖ్యోద్దేశమని గ్రహింపవలయును. ఫెడరేషనువిధానము భిన్నమైనచో, తత్తరంగములగు రాష్ట్రీయ ప్రభుత్వముల నిర్మాణము కూడ భగ్నమగును.

అప్పుడు భారతీయులు తమ ఆశయములను సఫలపరచుకొనుటకు నూతన నిర్మాణమునకు గడంగవచ్చును. భారత సంస్థానాధీశులు నిరంకుశాధికారులై యుండవలయునను సూత్రము మాత్రము భారతీయులు ఏర్పరచుకొను నిర్మాణమునందు ఒక అంశముగ నుండదని మాత్రము చెప్పగలను. నిరంకుశాధికారములతో కూడిన ఈ సంస్థానములు ఎన్నడో అంతమొంది యుండవలెను. గొప్ప మార్పులు గలుగుచున్న ఈ ప్రపంచమున మన సంస్థానముల కెడము లేదు. నిరంకుశమనకును, ఫ్యూడలువిధానమునకును భావికాలమున తావులేదు. అధికసంఖ్యాకులగు భారతప్రజలు స్వాతంత్ర్య విహీనులై యుండుటయును, భారతదేశము పరస్పర సంబంధములేని భాగములుగ విభజింపబడుటకును స్వతంత్ర భారతదేశము ఎంత మాత్రము అంగీకరింపజాలదు. ఆర్థిక సాంఘిక రాజకీయ విషయములందు మనము ఏదైనను హక్కులను కోరినచో, సంస్థానముల ప్రజలకు కూడ అట్టి హక్కు లుండవలయుననియే మనము పట్టుదల చూపుటధర్మము.

భారతదేశములో బ్రిటిష్‌ప్రభుత్వమువారు స్వాతంత్ర్యము నెట్లడంచుచుండిరో పైన జెప్పియుంటిని. సంస్థానములందు స్థితిగతులింతకంటె అధ్వాన్నముగా నున్నవి. సామ్రాజ్యతత్త్వముగల బ్రిటిష్‌వారి చెప్పుచేతలలో నీసంస్థానములవా రుండవలెనని మన మెరింగియున్నను, మన సోదరులను మనదేశీయులే యడంచుచుండుట మనకు చాల కష్టము కలుగజేయక మానదు. సంస్థానాధిపతులును, వారిమంత్రులును ఫాసిస్టునాయకులపద్ధతి ననుసరించి మాట్లాడుచుండిరి. వారవలంబించినట్టి చర్య లవలంబించుచుండిరి. ఇటీవల కొన్ని సంవత్సరముల నుండియు వారు మతజాతీయాశయములకు తీవ్రమగు ప్రతికూలభావమును ప్రకటించుచున్నారు. అభివృద్ధిపొందినవని తలంపబడు సంస్థానములు కాంగ్రెసును నిషేధించుచున్నవి. మన జాతీయపతాకకు అవమానము కలిగించుచున్నవి. పత్రికల నడంచుటకు నూత్న శాసనములు చేయుచున్నవి. వెనుకబడినట్టియు, అనాగరికమైనట్టియు సంస్థానముల సంగతి యేమిచెప్పుదును?

## సాంఘికనిర్ణయము

ఇండియాప్రభుత్వశాసనములో తీవ్రవివాదముల కాస్పదమైన మరియొకవిషయమునుగూర్చి విచారింప దగును. ఇది సాంఘికనిర్ణయమునకు సంబంధించినది. చాలమంది దానిని తీవ్రముగా ఖండించియున్నారు. అట్లుచేయుటయు తగియేయున్నది. దానివిషయమై అనుకూలముగా మాట్లాడువారు బహు స్వల్పము. నాస్వకీయాభిప్రాయము యితరుల యభిప్రాయముకంటె కొంచెముభిన్నము. ఈసంఘము మనకేమిచ్చుచున్నది, ఆసంఘము మనకేమిచ్చుచున్నది యనువిషయముతో నాకంత ప్రమేయము లేదు. దానియందిమిడియున్న మూలాభిప్రాయమును నేను ఖండింపవలసియున్నది. మతము నాధారముచేసికొని భారతదేశమును ఈనిర్ణయము ఛిన్నాభిన్నముచేయుచున్నది. ప్రజాప్రతినిధిప్రభుత్వాభివృద్ధిని, ఆర్థికాభివృద్ధిని ఈ నిర్ణయము అరికట్టుచున్నది. సాంఘిక నిర్ణయమునకును, ప్రజాప్రతినిధి ప్రభుత్వమునకును పొంతనము కుదురనే కుదురదు. ప్రస్తుత స్థితిగతులలో, మనరాజకీయములు మధ్యరకపు ప్రజలచే నడుపబడుచున్నంతవరకు సాంఘికాభిమానములను సంపూర్ణముగా మనము లేకుండ చేయజాలము. కాని మనమహమ్మదీయ, సిక్కుమిత్రులకు అభిమానము చూపుట వేరువిషయము. అన్యాయకమగు నీసిద్ధాంతమును అనేకయితర చిన్నసంఘములకు వర్తింపజేసి నియోజనా పద్ధతులలోను శాసనసభలలోను ప్రత్యేకత కల్పించుట వేరువిషయము. రెండవపద్ధతి చాల ఉపద్రవకరమైనదికాదా?

# జీవామృతము




1898 సం॥ నుండి భారతవర్షమునం దంతటను ప్రసిద్ధిలోనున్న

ఆరోగ్య ప్రదాయిని

జీవామృతము వాడుటవల్ల
బలహీన దేహములకు బలమును;
దుర్బల వీర్యులకు పటుత్వమును;
నిద్రాహీనులకు సుఖనిద్రయు;
నరముల ప్రోపునకు కండపుష్టియు
మంచికొడిగ నుండువారికి ఉల్లాసమును
జీర్ణశక్తి లేనివారికి జఠరదీప్తియును
రక్తహీనులకు క్రొత్త ఎఱ్ఱటి రక్తమును
జ్ఞాపక హీనులకు జ్ఞాపకశక్తియును;
పాలిపోయినవారికి తేజస్సును;
మొదలగు అసంఖ్యాకములైన సుగుణము లెన్నియో కలుగును. స్త్రీ పురుషు లెల్లరు వయోభేదములేక ఎల్లకాలముల సేవింపదగిన దివ్యమైన టానిక్కు.

పెద్దబుడ్డీ రు. 3-4-0 చిన్నబుడ్డీ రు. 1-12-0

# బాలభాస్కర



బిడ్డల

## లివరు అండ్ స్ప్లీను

వ్యాధులను పోగొట్టుటకు రాకుండచేయుటకు దివ్యకవచము

బాలభాస్కరవలన బిడ్డలకు గలుగు జ్వరము, అతిసారము, వాంతులు, కామిల, కాళ్లుచేతులువాపు మొదలగు లక్షణములు అతి శీఘ్ర కాలములో పోగొట్టును.

మా మందులు అన్నిచోట్ల దొరకును    క్యాటలాగు ఉచితము

| తంతివిలాసము:— "పండిట్" మదరాసు | ఆయుర్వేదాశ్రమము తపాలుపెట్టె 287 మదరాసు | టెలిఫోను నెం. 2191 |
|---|---|---|

**1878-1935**

గొప్ప గొప్ప మహా
పురుషులచే వాడబడి
చాలకాలము నుండి

## జబాకుసుం

మెదడునకు ఉత్సా
హము బలము కలి
గించుటలో అప్రతి
మానమైనదిగా పేరు
గాంచియున్నది.

JABAKUSUM TAILA

సి. కే. సేన్
& కో., లిమిటెడ్.
29, కోలుతోల,
కలకత్తా.

లోకల్ యేజంట్లు:—అమర్‌చంద్ శోభాచంద్, 63, నైనియప్ప నాయకన్ వీధి, జి. టి. మదరాసు.

# ౪౯-వ భారత జాతీయ మహాసభ, లక్నో (193



౧. మోతీనగర సింహద్వారము



౨. మోతీనగరము (విమానమునుండి)



3. స్వదేశి ప్రదర్శనశాల ప్రధానద్వారము



౪. స్వదేశి ప్రదర్శనమునకు పోవుచున్న గాంధిదంపతులు





## లావణ్యము, చక్కదనములకు సరియయిన దోహదము.

మైసూరు శాండల్‌వుడ్ సోప్ క్రమము తప్పకుండా వాడుటయనగా ప్రతిదినము యింటివద్దనే సౌందర్య చికిత్స చేసికొనుట యగును. మైసూరు శాండల్‌వుడ్ సోప్ వాడుట నాగరక లక్షణము. కుసుమ కోమలు లందరికిని యీ విషయము తెలియును.




# Mysore Sandal Soap

మైసూరు గవర్నమెంటు
సోప్ ఫ్యాక్టరి,
బెంగుళూరు.

మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు,

మదరాసు.

(REGD)

బుడ్డి 1 కి, రూ 2-8-0

మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు

107. బ్రాడ్వే, మదరాసు.

వాజీకర

(REGD)

నపుంసకత్వమునకు వరప్రసాదము

అద్భుతముగా

శీఘ్రకాలములో పుంస్త్వము నిచ్చును.

దీనికి సమానమైనది లేదు.

పెద్ద బుడ్డి రూ 5/- చిన్న బుడ్డి రూ 2/8

మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు

107. బ్రాడ్వే మదరాసు.

*Consulting Physician:—*

AYURVEDACHARYA

**N. MADHAV MENON, A. M. A. C.**

---

## అసలు నవరం బంగారుకు

## అప్పటమైన సీమ వెండికి

## పూచీ నిచ్చు స్థలము

యేదియని ప్రప్రథమమున యోచించి, విచారించి మీరు ఆర్డరునివ్వవలెను. మీరు మావద్ద ఇదివరలో ఆర్డరు లిచ్చుచున్నవారి నడిగిన మీకు తప్పక తృప్తి గలుగును. ఎవ రెవరికి యేయే క్రొత్త మోస్తరులందు కావలెనో ఆప్రకారమే సకాలమునందు తయారుచేసి యివ్వబడును.

ఒక దఫా ఆర్డరిచ్చిన విషయ మంతయు మీకే బాగుగా తెలియును.

**వీకంసీ చబిల్‌దాస్ అండ్ కంపెనీ,**

మదరాసు.

---

## మోహినీ తైలము

5 తు॥ నూనె గల సీసా 1-కి 0-12-0.

స్త్రీపురుషులు వాడుటకు యోగ్యమైనది.

ఇది మనఃపరిశ్రమము చేయు విద్యార్థులు ప్లీడర్లు ఉద్యోగస్థులు మొదలగువారికి సుఖనిద్ర, విశ్రాంతి నిచ్చును. సుందరుల మోహ లావణ్యములకు ప్రాపగు కురులను మనోహరముగ పెంచి కాపాడును. ఈ తైలమునందు గల రమణీయమగు సువాసన చెప్పనలవిగాదు. తలకు రాచి దువ్వుకొనిన, ఇరుగుపొరుగు వారలకు కూడ పరిమళము వ్యాపించును. తలలో చుండును పుట్టనియ్యదు. దీనియందు మనోహరమగు సువాసన ద్రవ్యములను చేర్చి తయారుచేయించి వేలకొలది సీసాల విక్రయించి మెప్పు బడసియున్నాము. వేయేల, ఒకసారి పరిశీలించిన నిజము తెలియగలదు.

## అమృతాంజనం డిపో

బొంబాయి మదరాసు

మనదేశములో ప్రజాప్రతినిధి ప్రభుత్వ పద్ధతులు సరిగా పనిచేయవలె నని మనము కోరినచో ఈసాంఘికనిర్ణయము రద్దుచేయబడవలెను. రద్దుచేయబడునని నాకు విశ్వాసము కలదు. కాని నిర్ణయమును తీవ్రముగా ప్రతిఘటించుచున్నవా రవలంబించుచున్న పద్ధతులవలన నది తొలగింపబడజాలదు. ఈపద్ధతులవలన నిర్ణయము యికముందుగూడ నుండుట తప్పనిసరి యగుచున్నది. ఎందుకనగా, దాని పునర్విచారణకు ప్రతికూలమగు స్థితులు దేశములో నేర్పడుట కవి దోహద మొసంగు చున్నవి.

## కాంగ్రెసు సాంఘికనిర్ణయము

మతవిషయములనుగూర్చి కాంగ్రెసు యిదివరలో అనుసరించు చున్న విధానమును, ఒడంబడికలు, సమాధానములకొరకు చేయు చున్న ప్రయత్నములును నాకు మనస్సమాధానము కలిగించుట లేదు. ఐనను, కాంగ్రెసు మహోద్దేశముతో పనిచేయుచున్నది. కాంగ్రెసు యెప్పుడును సంపూర్ణస్వాతంత్ర్యమునే ప్రధానముగా భావించెను. ఇతరవిషయము లన్నియు, మతసమస్యగూడ - దానితరు వాతనే. స్వాతంత్ర్యేతరవిషయముల కెప్పుడును కాంగ్రెసు ప్రాధాన్యము నివ్వలేదు. మరియొక విషయము. ఈ మతసమస్య వలన మూడవవారు యిచటనున్న రెండుమతముల మధ్యను స్వార్థ ముల సాధించుకొనుటకు ప్రయత్నించుచుండిరని చెప్పెదరు. అందువలన ఈ సమస్య పరిష్కారము కావలెనన్న ఆమూడవ వారు లేకుండ పోవలెను (అనగా సంపూర్ణ స్వాతంత్ర్యమే) లేదా ఈ పక్షములు రెండును మిత్రభావముతో పరస్పరద్వేషములు పోగొట్టుకొనుటకు ప్రయత్నింపవలెను. మూడవవిషయము అధిక సంఖ్యాకజాతివారు స్వల్ప సంఖ్యాకులకు గల భయమును అనుమాన మును పోగొట్టుటకు తగిన ఔదార్యమును కలిగియుండవలెను.

ఈ విభాగము యుక్తముగ నున్నదనియే నా యభిప్రాయము. నాయభిప్రాయ మింకొకటి జెప్పెదను. నిజముగా ఈ సమస్య పరిష్కారము కావలెనన్న అన్యమతములకును నష్టదాయకములుగనున్న ఆర్థికసమస్యలు పరిష్కారము కావలెను. వానికి మతభేదము లేమాత్రమును అడ్డు రారాదు. పై తరగతిలో నుండు మధ్యరకమువారు ఉద్యోగములు లభించుననియు, ప్రాపక మేర్పడుననియు ఆశతో నుందురు. వారిమాట మనకక్కరలేదు. జనసామాన్యమునకును, క్రిందితరగతిలో నుండు మధ్యరకము వారికిని ఆర్థికరాజకీయసమస్యలు ఒకేవిధమైనవి కలవు. ఈ రెండు తరగతులవారి సమస్యలకును, మతభేదములను బట్టి కోరుకోర్కెలకును యెట్టి సంబంధమును లేదని ముఖ్యముగా గమనింపవలెను.

మరియొకవిషయమునుగూడ గమనింపవలసియున్నది. హిందువులలోకాని మహమ్మదీయులలోగాని ప్రధాన నాయకులు మతవిషయము లట్లుండి రాజకీయముగ దేశాభివృద్ధినిరోధకులు ప్రధానవిషయములలో బ్రిటిష్ సామ్రాజ్య తత్వముతో నేకీభవించుచుండిరి. అందులకు విచారముగుచున్నది. వారు పౌరస్వాతంత్ర్యాను నణచి వేయుటకు తోడ్పడుచుండిరి. శాసనోల్లంఘనోద్యమసమయమున మనదేశమున నందరును స్వాతంత్ర్యమునకై యెంతయో కష్టపడు చుండ వారివారి వర్గములు స్వార్థములను సంపాదించుకొనుటకు ప్రయత్నించియుండిరి. వారితో మనకు పొత్తుకుదురదు. వారితో సహకార మనగా దేశద్రోహులతో సహకారము. కాని మత విషయము నెక్కువజేయు నాయకుల మాటలువిని తప్పదారినిబోయిన జనబాహుళ్యముతోను, మధ్యతరగతివారితోను సంపూర్ణ సహకారము గావలెను. ఆసహకారమువల్లనే ఈసమస్య చక్కగ పరిష్కారము కాగలదు.

ఈ మతసమస్య తాత్కాలికముగ నింత ప్రాముఖ్యము వహించు చున్నను ఈ విషయమున నాకు ఆ వేశము కలుగుటలేదు. ఇది యొక అప్రధానవిషయము. ప్రధానకార్యవిధానములందు నిజముగా దాని కెట్టి ప్రాముఖ్యమును లేదు. దీనిని ప్రధానాంశముగ తలంచువారు ఈ దేశమున బ్రిటిష్‌సామ్రాజ్యము స్థిరముగా పాదుకొనవలెననితలంచువారై యున్నారు. అట్టి భావము లేకున్నయెడల సామాన్యముగ నేర్పడు నీ సమస్యకు యింత ప్రాముఖ్యమునొసంగి యుండరు. నాకీవిషయమున నెట్టిభయమును లేదు. భావి భారతదేశమునందు సామ్రాజ్య తత్వముగాని, మతతత్వముగాని యుండజాలదనియే నా విశ్వాసము. ఐనను కష్టముండనేయున్నది. దానిని దాటవలెను. మన బెంగాలు సోదరులు యిట్టినిర్ణయములవలనను, ప్రభుత్వమువారివల్లను చాల నష్టపడిరి. వారలయెడల మనము సానుభూతి కలిగియుండవలెను. మిత్రభావముతో వారల పరిస్థితి చక్కజేయుటకు అవకాశము కలిగిన యెడల వెంటనే అందుకు పూనవలెను. కాని మన మేదిచేసినను సంపూర్ణ స్వాతంత్ర్యమును సాంఘికస్వాతంత్ర్యమును ప్రధానముగా భావించియే సంచరింపవలెను.

మన ప్రతిష్ఠాపనమునకును జనసామాన్యమునకును సంపర్కము లేకుండబోయెనని పైన నేను తెలిపియుంటిని. మనలో చాలమంది వ్యక్తులకు జనసామాన్యమునందు పలుకుబడి చాల హెచ్చుగానున్నది. వా రేదిచెప్పినను దానిని ప్రజలు శిరసావహించుచున్నారు. కోటాను కోట్ల భారతీయులకు గాంధి మహాత్ముని యెడల గల భక్తి యింతింతని యెవ్వరు చెప్పగలరు. ఐనను మన ప్రతిష్ఠాపనకు ప్రజలతో నుండిన సన్నిహితభావము పోయినది. అఖిలభారత చరఖాసంఘము, గ్రామ పారిశ్రామిక సంఘము, హరిజన సేవకసంఘములలో పనిచేయు మన మిత్రులు జనసామాన్యములో సేవచేయుచున్నారు. వారిసేవ ఫలించుచున్నది గూడను. కాని ఈ ప్రయత్నములకును రాజకీయముల కును సంబంధ మేమియులేదు. కావున రాజకీయవిషయములలో వారికిని మన ప్రతిష్ఠాపనమునకును సంపర్కము లేకుండబోయినది. ఇందుకు అనేకకారణములు కలవు. వీనిలో కొన్ని మన యధీనమున

మన ప్రతిష్ఠాపనమునకును ప్రజలకును సన్నిహితభావమును కలుగజేసి గ్రామసంఘములలో ప్రజాప్రతినిధి ప్రభుత్వభావములు వ్యాపించుటకు మన ప్రస్తుత కాంగ్రెసు రాజ్యాంగవిధానము తోడ్పడుటలేదు. కమిటీలు పైసంఘములకు ప్రతినిధుల నెన్నుకొనుటకు సమావేశమగుచుండును గాని పద్ధతులను నిర్ణయించుటలో పాల్గొనుటలేదు.

## రష్యాదేశములో ప్రజాప్రతినిధిప్రభుత్వము

రష్యానుగూర్చి వెబ్ అనువారు వ్రాసిన నూతనపుస్తకములో ఆదేశమునందలి స్థితిగతులు తెలుపబడినవి. సోవియట్ అంగనిర్మాణమంతయు విశాలమును, చైతన్యవిశిష్టమును నగు ప్రజాప్రతినిధి సూత్రములపై నెట్లాధారపడియున్నదో ఆగ్రంథమువలన తెలియగలదు. రష్యాదేశము పాశ్చాత్యదేశములయందలి ప్రజాప్రతినిధి ప్రభుత్వపద్ధతుల నవలంబించుచున్నదని తలంపబడుటలేదు. ఐనను యితరదేశములలోకంటె ప్రజాప్రతినిధి సూత్రమున కవసరమగు లక్షణములు రష్యాలో హెచ్చుగా నున్నట్లు మనకు తెలియగలదు. ఆదేశమునందలి 6 లక్షల పట్టణములు గ్రామములు విరివియగు ప్రజాప్రతినిధి ప్రతిష్ఠాపనములను కలిగియున్నవి. ప్రతిగ్రామమునకు పట్టణమునకు ఒక సోవియటుకలదు. ప్రతిసోవియటు నిరంతరము చర్చించుచు, విమర్శించుచు, పద్ధతుల నిర్ణయమునందు సాయపడుచుండును. పైకమిటీల కివి ప్రతినిధుల నెన్నుకొనుచుండును. ఈ సభలలో 18 సంవత్సరములకు మించిన పౌరులందరును కలరు. ఇదిగాక ఉత్పత్తిదారుల ప్రతిష్ఠాపనయొకటి. వస్తువులను ఉపయోగించువారి ప్రతిష్ఠాపన యొకటి కలదు. ఈవిధముగా రష్యాలో కోట్లకొలది ప్రజలు ప్రజాహితకార్యముల చర్చయందు పాల్గొనుచున్నారు. దేశపరిపాలనమునందు పాల్గొనుచున్నారు. ప్రజాప్రతినిధి ప్రతిష్ఠాపనలను యిట్లు వర్తింపజేయుచున్నదేశము మరియొకటి కనబడదు. ఈవిషయ మంతయు నిప్పుడు తేలునదికాదు. రాజకీయ ఆర్థికనిర్మాణములందు మార్పు రావలెను. ఆవిషయముల మనము ప్రయత్నించకుండ ఈపని కాదు. ఐనను, దీని నాదర్శముగ నుంచుకొని మనచేతనైనట్లు దేశీయమహాసభ ఆదినుండియు ప్రజాప్రభుత్వభావము లభివృద్ధియగునట్లు ప్రయత్నింపవలెను. ఆవిధముగా జాతీయ సంస్థను సజీవము చేయవలెను.

జనసామాన్యముతో మన కెక్కువ సంబంధము కలుగుటకు మరియొకమార్గము కలదు. వారలను ఉత్పత్తిదారుల సంస్థలుగ నేర్పరచి ఆసంస్థలను కాంగ్రెసుతో చేర్చినయెడల రెండును సహకారముతో పనిచేయగలవు. నేడు ఆచరణలోనున్న కర్షక కార్మికసంఘములును, సామ్రాజ్యప్రతికూలసంస్థలును ఈవిధముగ మారి జనసామాన్యమునకు మేలుచేయుచు దేశస్వాతంత్ర్యమునకు ప్రయత్నింపవలెను. ఈవిధముగ కాంగ్రెసునందు వ్యక్తులును, సంస్థలును సభ్యత్వము కలిగియుండవచ్చును. ఆ స్వరూపము మారకుండనుండవచ్చును. ప్రజాహృదయమును కనుగొని తదనుకూలముగ తాను మారుటయో ప్రజలలో మార్పు కలుగజేయుటయో జరుగుచుండవచ్చును.

ఇప్పుడు నేను సూచించిన మార్పులన్నియు చాల పెద్దవి. వీని నన్నిటిని చేయ వీలగు నని నాకు నమ్మకములేదు. యెంతకాలములో ఈమార్పులను చేయ సాధ్యమగునో గూడ చెప్పజాలను. ఐనను ఈ దేశమున గల జనసామాన్యమే జీవమును, బలమును యిచ్చునని నమ్మినప్పుడు తదనుకూలముగ కొంతవరకు జరుగవలసియుండును. ఈ విషయము ఆకర్షకముగనే యున్నది. కాని క్లిష్టత్వము కలదు. దీనిని నిపుణు లగువారు ఉపసంఘముగ నేర్పడి చర్చింపవలసి యుండును. కాంగ్రెసు ఆ ఉపసంఘమును నేర్పరచు ననియే నమ్మెదను.

సంఘము సమర్పించు నివేదికను పూర్తిగ చర్చించి దేశమునందు దీనికి సంపూర్ణముగ తోడ్పాటుండునట్లు చేయవలెను. ఈపనియంతయు రాబోయేకాంగ్రెసునాటికిగాని జరుగదు. ఈలోపల కాంగ్రెసు నిబంధనలందు గల కొన్ని అసందర్భములను క్లిష్టములను తొలగింపవలసియున్నది. ఇదివరలో నిబంధనలయందుమార్పుచేసినప్పుడు అవియెట్లుల పనిచేసెనో తెలిసికొనుటకు నేనిచట లేనందువలన అనుభవము చాలదు. అందువలన ఈ విషయమున పటుతరమగు సూచన లేమియు చేయజాలను. కాంగ్రెసు ప్రతినిధులయొక్కయు, అ. భా. కా. సంఘ ప్రతినిధుల యొక్కయు, ప్రతినిధులను తగ్గించుట కొంతవరకు మంచిదే. ఐతే ప్రైమరీ, సెకండరీ కమిటీలు మాత్రము విరివిగ పనిచేయుచుండవలెను. అటులగాకున్న యెడల ప్రజాభిప్రాయమును యే మాత్రమును గమనింప జాలము. అందుచేత ఈ సంఖ్య నెక్కువచేయుట అవసరము. కాని క్రిందనున్న కాంగ్రెసు సంఘములన్నియు రోజుకు రోజు యెక్కువ ఉత్సాహముతో పనిచేయుచున్నగాని ఈ సమస్య పరిష్కారము కాదు. కాయకష్టనిబంధన జయప్రదముగ పనిచేయలేదనియు, చాలవరకది ఉల్లంఘింపబడెననియు చెప్పెదరు. అట్లైన మార్పు ఆవశ్యకమే ఏ నిర్మాణమైనను సులభముగ ఆచరణ యోగ్యముగ నుండవలెను. ఏదో విధముగ దాటివేయున ట్లుండరాదు.

కాంగ్రెసు మహాసంస్థ. ఇంద నేక విభాగములు కలవు. ప్రప్రథమమున నిది రాజకీయసంస్థ. దీని కెన్నియో శాఖలు కలవు. అఖిలభారతచరఖాసంఘము, గ్రామపారిశ్రామికసంఘము యిందులో చేరినవే ఈ సంస్థలు ఆర్థికసంస్కరణములను తెచ్చిపెట్టుటకు పనిచేయుచున్నవిగాని యిప్పుడున్న భూస్వామ్యపు పద్ధతులప్రకారము రయితుల కష్టములను తొలగించుటలేదు. ఇపుడున్నటుల కాంగ్రెసు రైతు సంస్థగానేమియు చేయజాలదు. ఐనను కొన్నిరాష్ట్రములలో రైతుల కొరకు పనిచేసివారలకు కొన్ని సౌకర్యముల చేకూర్చెను. రైతుసంఘములను కార్మిక సంఘములను యేర్పరచుటకు కాంగ్రెసు ప్రోత్సహించుట కవసరము. ఇంతేగాక యిపుడున్న ఆ సంస్థలతో సహకారము

చేయుచు రోజుకురోజు జనసామాన్యము ఆర్థికముగా యెట్టికష్టములు పడుచున్నారో వానిద్వారా తెలిసికొనుచు వారి కోర్కెలను ఈడేర్పవచ్చును. కాంగ్రెసు జనసామాన్యముయొక్క ఆర్థికవిషయములలో యేకమై పనిచేసినయెడల స్వాతంత్ర్యము చేరువకు రాగలదు. ఇంతేగాక స్త్రీ సంఘములుగూడ యేర్పడి జాతీయ సంరంభమున పనిచేయువచ్చును. ఈ విధముగ సర్వ ప్రయత్నములును ఏకమైన యెడల దేశీయ మహాసభ ప్రజాప్రాతినిధ్యము బడయగలదు. కొందరు యే కార్యక్రమమైనను, యే విధానమైనను సంరంభ ప్రక్రియ నుండవలెనని చెప్పెదరు. దీని యర్థమేమో నాకు బోధపడుట లేదు. ఇందలి యుద్దేశ్యము దేశమంతయు ప్రత్యక్ష చర్యకు గడంగి శాసనోల్లంఘనము చేయవలెననిన యెడల అందులకు యిప్పటిలో ఆశ గాన్పించుట లేదు. ఇట్టి పెద్దపనులను చేయుటకు సిద్ధముకాకుండ ప్రగల్భములతో లాభము లేదు. మనము యిప్పుడు ముఖ్యముగా మన యింటిని చక్కజేసికొనవలెను. జనసామాన్యమునందు యేర్పడిన నిరుత్సాహమును పోగొట్టవలెను. దేశీయమహాసభకును, జనసామాన్యమునకును సన్నిహితత్వము కలుగునట్లుచేసి జనసామాన్యముతో నేకమై పనిచేయవలెను. మనకు పరీక్షాసమయము అనుకొన్నదానికంటె త్వరగానే రావచ్చును. ఆ పరీక్షకు మనము సిద్ధము కావలెను. మనము యిష్టమువచ్చినప్పుడెల్ల శాసనోల్లంఘనమును ప్రారంభింప జాలము. విరమింపజాలము. దాని కెన్నియో కారణములు సమకూడవలెను. అందు కొన్ని మనకందునవికావు. ఐనను ఈరోజులలో ప్రపంచమున అనేకములగు మార్పులు, విషమపరిస్థితులు యేర్పడుచున్నవి. మనకంటె ముందుగనే పరిస్థితు లేర్పడుచున్నవి. అవకాశముల కెప్పుడును కొరతయుండదు.

## నిరుద్యోగము-దారిద్ర్యము

ఈదేశమున భూసమస్య చాల ముఖ్యమైనది. గ్రామములయందు దారిద్ర్యము తాండవమాడుచున్నది. నిర్వ్యాపారత్వము అతిశయించుచున్నది. భూస్వామ్యపద్ధతి ఈ కాలమునకు తగినదికాదు. ఎన్నియో పరిస్థితులు యేకమై భారతదేశము కొన్ని శతాబ్దములనుండియు అభివృద్ధిగాకుండ వెనుకబడియున్నది. ఇపుడు ఈదేశము ధరించు రాజకీయ, ఆర్థికదుస్తులు సరిపోవు. అవియన్నియు చిరిగి పేలికలైనవి. ఇపుడు మనదేశముననున్న భూస్వామ్యపరిస్థితులు ఫ్రాంసులో మహావిప్లవమురాకముందు 150 సంవత్సరములనాడు ఉన్నవిగా చెప్పవచ్చును. అవి ఆవిధముగ యెంతకాలముండగలవు? మార్పురావలెను. ఇంతేగాక మనదేశమును వివిధదేశములయందలి ధనస్వాములు చవిజూచుచున్నారు. ఇందువలన మనము విపరీతమగు బాధలకు లోనగుచున్నాము. ఈ విధముగ ఈదేశమున యెట్టిమార్పు యెపుడు యేవిధమున వచ్చునో చెప్పజాలము. కాని ఒకటిమాత్రము నమ్మకముగా చెప్పవచ్చును. ఇప్పుడున్న పద్ధతికి అవసానకాలము వచ్చినది. భవిష్యత్తు మన యిష్టప్రకారము యేర్పడుటకు మనము ప్రయత్నింపవచ్చును.

## యుద్ధజ్వాలలు

ప్రపంచమంతయు యుద్ధభయముతోను [illegible] తోను యున్నది. అబిసీనియాలో కొన్ని నెలలనుండియు ఘోరభీభత్స సంగ్రామము జరుగుచున్నది. వలసరాజ్యములు సంపాదించుటకును ఆకలితో సామ్రాజ్యతత్వము యెటుల కత్తి చిందులాడుచున్నదో మనము కనుచున్నాము. ఇథియోపియనులు యెన్నికష్టములు వచ్చినను ఆత్మస్వాతంత్ర్యమును నిలుపుకొనుటకు యెటుల ధైర్యముతో పోరుచున్నారో మనము కనులార ఉత్సాహముతో గాంచుచున్నాము. వి పక్షమున నేను వారి నభినందించుచున్నాను. క్షమించెదరుగాక! వారలకు మన యాశీస్సుల నంపెదను. వారలు పోరాడునది ఆత్మరక్షణకు మాత్రమేగాదు. సామ్రాజ్య తత్వము పొంగి వైభవముండ ఆఫ్రికాదేశీయులు దానిని నిరోధించుచున్నారు. అప్పుడే దానిఫలితములు యెదురగుచున్నవి.

అత్యంత ప్రాచ్యదేశములలోగూడ యుద్ధచిహ్నములు గాన్పించుచున్నవి. ప్రాచ్యసామ్రాజ్యతత్వము చీనా మీది దాడివెడలుచున్నది. ప్రపంచ సామ్రాజ్యము సంపాదించవలెనని ప్రయత్నించుచున్నది. ఎక్కడజబట్టినను, పాశ్చాత్యదేశములయందైననేమి, ప్రాచ్యదేశములయందైననేమి, సామ్రాజ్యసింహము నఖముల నెత్తిచూపుచున్నది.

ఐరోపాలో ఫాసిజమ్, నాజీజమ్, రెండును యుద్ధమునకు కాలుద్రవ్వుచున్నవి. దీనినంతను అంతముజేయుటకో యన బ్రహ్మాండమగు ఆయుధనిర్మాణము జరుగుచున్నది. దేశములు దేశములతో డీకొనుటకు యేకమగుచున్నవి. ఫాసిస్టుదుండగముల నడచుటకు అభివృద్ధిగోరు అన్ని దేశములును యేకమగుచున్నవి.

ఈచదరంగపు ఆటలలో మనకు స్థానమెక్కడ? రానున్న మహావిషాదనాటకమునందు మన మే పాత్ర నభినయింపవలెను? ఈ విషయములు చెప్పుటకష్టము. కాని సామ్రాజ్యతత్వ ప్రచారమునకు మాత్రము మనము మౌనము వహించి యెర కాగూడదు. యుద్ధములో చేరతగునా కూడదాయను విషయమును మనమే నిర్ణయించుకొనవలెను. మన యిష్టము లేకుండ ఈ విషయమున యెట్టిసహకారము నుండజాలదు. సమయమువచ్చునప్పటికి మనము మన యిష్టమును తెలుపుటకు అవకాశము లేకపోవచ్చును. అందుచేత యిప్పుడే భారతదేశముసామ్రాజ్యతత్వము ప్రచారముచేయునట్టి సంగ్రామములలో పాల్గొనజాలదని స్పష్టముచేయవలెను. యుద్ధమెవరుచేసినను సామ్రాజ్యతత్వమును ప్రచారముజేయుటకే. వారెన్నిసాకులు చెప్పినను వారి ఆదర్శమిదియే. కాబట్టి మనము దానికి దూరముగనుండవలెను అందులకుగాను భారతీయుని ప్రాణయొక్కటియైన గోల్పోవరాదు. భారతదేశపు ద్రవ్యము వెచ్చింపరాదు. ప్రపంచమున అభివృద్ధినికోరుచు మానవస్వాతంత్ర్యము నభిలషించుచు రాజకీయ సాంఘిక శృంఖలములను తెంచివేయవలె

నే యెవ్వరు పోరాడెదరో వారితో మనసహకారము. ఆ సంరంభము సామ్రాజ్యతత్వమును నాశముచేయును. ఫాసిస్టుభావములను తెంపివేయును. మన సంరంభమును వారి సంరంభమును ఒక్కటే. అందుచేతనె వారితో మన సహకారము. మనకు యేదేశముపైగాని యెవరిమీదగాని ద్వేషము లేదు. మనల నడచుచున్న సామ్రాజ్యఖ్యాతి బడసిన యింగ్లాండునందు గూడ సామ్రాజ్య తత్వమును సహింపనివారెందరోకలరు. వారికిని స్వాతంత్ర్యమే యిష్టము

## మహాత్మునికి స్వస్తి

ఇప్పుడు మనము చాల కష్టకాలములోనున్నాము. ఇట్టి సమయమున మన హృదయములు, మనములు మన నాయకాగ్రణిని తలంపగోరును. ఆయన యిన్ని సంవత్సరముల నుండియు తనయందుగల మాహాత్మ్యముచే మనలో నావేశము కలుగజేసి నడిపియుండెను. శరీరారోగ్యము చక్కగ లేకుండుటవలన ఇపుడు మనతోబాటు ఈ చర్చలయందు పూర్తిగ పాల్గొనజాలకున్నారు. ఆయనకు అనతి కాలములోనే సంపూర్ణారోగ్యము కలుగుగాకయని మనము కోరెదము. ఈ కోరెక్కతోబాటు ఆయన మరల మనలో చేరి మనతోబాటు పనిచేయవలెననిగూడ ఆశించెదము. ఇదివరలో ఆయన చెప్పినవిషయముల నెన్నింటినో భేదభావములను చూపియుంటిమి. ఇకముందును అనేకవిషయములను తెలుపవచ్చును. ఎవరికివారు తమ ఆత్మ విశ్వాసములనుబట్టి పనిచేయుటయు ధర్మము. కాని మనలోమనకు గల భేదములకన్న మనలను బంధించు సూత్రములు బలవత్తరమైనవి. మన మందరమును యేకమై గైకొనిన ప్రతినలు మన చెవుల ప్రతిధ్వనించుచున్నవి. మనలో యెంతమంది భారతస్వాతంత్ర్యము కావలెనని ఆవేగపడుచున్నారు ? ఎంతమంది దారిద్ర్యపీడితులగు జనసామాన్యము నుద్ధరింపవలెనని కోరుచున్నారు? ఆమహాత్ముడు ఎన్నియోసంవత్సరములక్రింద గొప్ప విషయములను మనకు బోధించియుండెను. నిర్భయముగ నుండవలెనని, శిక్షణమునకు లోబడి యుండవలెనని, మహోద్యమము కొరకు స్వార్థముల త్యాగము చేయవలెనని ఆయన చెప్పెను. ఈపాఠము లన్నియు యిప్పటికి మనకబారినవి. కాని మనము వానిని మరచిపోలేదు అంతేగాదు మనల నింతవారిని జేసి భారతదేశమును పాతాళము నుండి పైకిదీసిన ఆ మహామహుని మన మెప్పటికిని మరచిపోజాలము. మన మందరమును ప్రతినగైకొనిన స్వాతంత్ర్య శపథము ఇంకను పరిపూర్ణము కావలసియున్నది. మరల ఆ మహామహుడు సమయోచితముగ ఉపదేశములు చేయుచు మనలను నడుపుకాలమును నిరీక్షించెదను.

ఏ నాయకుడైనను, యెంత గొప్పవాడైనను ఈభారమును ఒంటిరెక్కమీద భరింపజాలడు. మన మందరమును యథాశక్తి యిందు పాల్గొనవలెను. నిస్సహాయులమై యితరులు గారడిచేసెదరని దానిపై నాధారపడి యుండరాదు. నాయకు లుద్భవించుచుందురు. పోవుచుందురు. నాయకులును, మిత్రులును యెందరో అకాలమృత్యువాతబడెదరు. భారతదేశము మాత్రము అట్లే నడుచుచుండును. భారత స్వాతంత్ర్యసంగ్రామమును అట్లే. భారతదేశము సజీవమై స్వాతంత్ర్యము బొందుటకు మన మెందరమో యెన్నోని కష్టములను పడవలసియుండును. ప్రాణములనైన అర్పింపవలసియుండును. ఆస్వర్గభూమి దూరదూరమునకు పోవుచుండవచ్చును. మన మెన్నియో యెడారులగుండ యీడ్చుకొనుచు నడువవలసియుండవచ్చును. కాని మనలో ప్రజ్వలము ఆశను యెవరును చంపజాలరు. ఈ ఆశ యెన్నియోకష్టములను, దుఃఖములను, ఉరిభయములను దాటగలిగినది. భారతాత్మ అనేకసారులు నామరూపములు లేకుండబోయి విజృంభించినది. అట్టిదానిని అణచివేయుట కెవ్వరికైనా తరమా?

---

# కబీరుగీతములు

(రవీంద్రుని గీతములకు స్వేచ్ఛానువాదము)

కర్లపాలెం కృష్ణరావు

### మొదటి తునుక

ఓహాన్య దృష్టుల నాకయి చూతువేల?
ఆలయముల, మసీదుల, నందునిందు,
మారుమూలల-భృత్యుడ! మానుమోయి!
నీడవోలెను వెనువెంట నిలచియుంటి.

నేను "కైలాస, కాబల" గానబడను,
యజ్ఞయాగాది క్రతువుల కందబోను,
అన్నియును వీడి, నూడెడు త్యాగియైన
జేరగాలేడు-యేల యీ నిక్కు-లెల్ల?

తేరిపారగ నను మనసారజూడు
మన్యమెఱుగక, గోచరమగును నీకు
కలియగల వప్పుడె కబీరు పలుకు వినవె!
"ప్రాణులకు దేవుడే ప్రాణవాయువనుచు"

### రెండవ తునుక

యుద్ధభటుడైన, వణిజుడు, సిద్ధుడైన,
గురుడైనను, నెవడైన,-కులమదేల?
అంద రొకదిక్కు-జేరుట కరుగుచుండ్రి-
ఏల కల్పింతు వా భేద మింతలోన?

ఏది కులమని ఋషిని బ్రశ్నింపబోకు
మేదియైనను నీకేమి? యెవడవీవు?
నిశ్చయం బొక్క-టేగద! నీకు వారి
కందరికిగూడ వాక్కున్న దచటికేగ.

ఆ వినిర్మలగమ్య స్థలాంతరమున
నంటుసొంటులు లేవు హాస్యములకైన
అన్నిమతములు కోరున దదియె-గాన,
హిందువులెగాదు, తురకలు నేగి రటకు.

### మూడవతునుక

ఇచ్చటే కాంచనగు, నిరీక్షించుమోయి!
ప్రాణముండగనే దాని బడయగలవు
అర్థమొనరించుకొనుము తత్త్వంబు, మిత్ర!
మోక్ష మీజీవితమునందె మునిగియుండె.

తెలివితేటలు, శక్తియు, గలిగియుండి
అవయవంబులు స్వాధీనమందునున్న
సమయమున బంధముల ద్రెంపజాలవేని,
యింకచచ్చిన నేమి సాధించగలవు?

ఆత్మ లేచిన, నిక పరమాత్మయందు
గలియునని చెప్పుకథలెల్ల కలలెసుమ్ము,
అతని నిటజూడ-గాంచుదు వచటగూడ,
తప్పిపోయిన-యమపురి తప్పదోయి!

అమిత విశ్వాసమున గురు నాశ్రయించి
సత్యమును నమ్మి యత్నింప సాగుమోయి!
సత్యమను నీట దిగి, శుచి, స్నానమాడి,
సత్యముగ లేచి, ఆదివ్యశక్తి గనుము.

ఆత్మశక్తియె యిపుడు నీకవసరంబు,
అదియె యన్వేషణమున సహాయమగును,
"నేను దాసుడ నాశక్తి" కనుచు బలుకు
ప్రేమరసమూర్తి యతడు కబీరు-కనుము.

# ఆంధ్రుడా

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

మగధ పాలించావు, జావాసుమాత్రాల నెగరవేశావు నీ జయపతాక
తరతరా లనుభవించావు కేరళచోళ పాండ్యరాజ్యాల లక్ష్ముల పసందు
తొంగిచూసిన గంపు తురకల తలపళ్లు దుళ్లగొట్టేశావు తరిమి తరిమి
వదలగొట్టా వోఢ్రరాజుల జడ్డెల్ల బూది పొర్లించి నెత్తురుల ముంచి;
సర్వతంత్రస్వతంత్రుడ వెరగ వెపుడు-సాటివారలమెడ భావదాస్యవృత్తి;
ఆంధ్రుడా! సంప్రదాయవిరుద్ధ మైన-చచ్చు ఔదార్య మిది యిప్పు డేమి టోయి?

# చాటువులు

ఉదయరాజు శేషగిరిరావు

**పురుషకారము:**

చేయఁగల పనులన్నియుఁ జేసి తుదకు-ఫలము సుంతయు లేకున్న ప్రాప్తియనుచుఁ
దలఁప నగుగాని, మొదటయత్నంబు కొంత-యేని సేయక విధిదూఱనేల నరుఁడు?
కర్మమున వ్రాసియున్నచోఁ గల్గునెల్ల-కార్యములని యూరకయుంట ఖలమతంబు.
అడవిలోఁదిరుగక గుహ నాఁకలిగొని-పరితపించు సింహంబున కెర గలుగునె?

**శైశవము:**

ఎంతవఱకు నరుని కీ జగమందున--తల్లిదండ్రు లునికి దాల్చియుంద్రు;
అంతవఱకు నతని కాపద యుండదు-వారుపోవు వెనుక వచ్చు ముప్పు.
బాల్యమున నెన్నిచిక్కుల పాలుపడిన-"ప్రాపుగలదుగదా పెద్దవారిది"యని
మానవుఁడు మనమున మానుమనికితంబుఁ-గాని యసహాయుఁడై చింతఁగడచుటెట్లు?

తల్లిదండ్రుల కల్లారు బెల్లమగుచు-నిగనిగని గరగరికలకునని యగుచు
ముద్దు గొనముల రతనాలమూట యగుచు-నెట్టిపాపమెఱుంగని పట్టి మేలు.
దృష్టియుగమున కతిథులై తేజరిల్లు-నట్టి జవరాండ్రబల్మిఁజేపట్టి మిగుల
నాడికలకెల్ల గుఱియగునట్టి యువకు-బ్రతుకు తానొక్క బ్రతుకె ప్రపంచమునను.

**సరస్వతి:**

యా మందార శరత్పయోద మిహికా గంగాతరంగాంబు రు
ట్ప్రాలేయాంశు పటీర హీర సితరుగ్ధిక్కారి వాసోయుతా;
యా పద్మాసన హృత్సరోవరము హంసః క్రీడ న్మరాళాంగనా
సా వాణీ కరుణారసార్ద్రహృదయా సామాజికాన్ పాతు వః.

**విష్ణువు:**

భాగీరథీ సలిల పూతపదం శుభాంగం-క్షీరాబ్ధిజా హృదయ పంకజ మత్తభృంగం
తాపింఛ హాసి మృదుమంజుల నీలదేహం-వైకుంఠనాథ మధునా నితరాం భజేఽహం.

# ఓ న మా లు

## శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

మనవారు బాలురకు మొట్టమొదట నక్షరస్వీకార మొనరించుట వేదవిహిత సంస్కారముగా నొనర్చిరి. అదియే 'అక్షరాభ్యాస' మనుపేరుతో ప్రసిద్ధమయియున్నది. తండ్రిచేతనో, బడివంతులచేతనో బియ్యములో బంగారపు టుంగరముతో "ఓంనమఃశివాయ సిద్ధం నమః" అనివ్రాయించి అది పిల్లవానిచేత ప్రథమమున పలికించెదరు. పిల్లవానిచేత పలికించుటలో కాఁబోలు అదిక్రమముగా "ఓ న మః శి వా యః సి ధం న మః" గా పరిణమించినది. అది అంధపరంపరగా వాడుకలో నిలిచియున్నది. ఈయపభ్రష్టోచ్చారణము సమర్థించుటకు ఓంకారాదుల యుచ్చారణము బాలురకు నిషిద్ధము కావున అది యిట్లు రూపాంతరముతో నుపదేశించుట పరిపాటియని కొంద ఱనవచ్చును. అది యుక్తముగాదు. తదుచ్చారణ మెల్లరకును లభ్యమగునట్లే అప్పటి మతబోధకులు గావించిరి కాని మఱుగుపరిచి మాఱుత్రోవను అపభ్రంశముగా నుపదేశింపఁబూనినవారు కారని అప్పటి మతచరిత్ర తెలుపును. 'అ, ఆ' మొదటగల అక్షరవర్గమునకు 'అఆ' లనియు, 'కఖ' మొదటగల అక్షరవర్గమునకు 'కాఖా' లనియు పేర్లు వచ్చినట్లు 'ఓనమః శివాయఃసిద్ధం నమః' అనుదానికి మొదటి యక్షరములనుబట్టి 'ఓనమాలు' అని పేరు ఏర్పడినది. వర్ణసమామ్నాయమందలి యక్షరముల సంయోగముచే ఏర్పడినదే యీ 'ఓంనమః' ఇత్యాదివాక్యము. ఇది వేఱుకాదు. అయినను ఇది యొక ప్రత్యేకవర్గముగా ఏర్పడిపోయినది.

అకార-ఉకార-మకార సంయోగరూపమగు 'ఓమ్' అనునది సృష్టిస్థితిలయకారణమగు పరమాత్మను తెలుపునని ఉపనిషత్తు తెలుపును. వేదారంభమున బయలువెడలిన యక్షర మిదియే. కావుననే ఇది సామాన్యముగా ప్రారంభ పర్యాయమయినది. ఇట పరమాత్మనయినను ప్రప్రథమ ప్రారంభమునయినను తెలుపు ననవచ్చును. 'శివాయనమః' శివునికొఱకు నమస్కారము - అనఁగా శివునికి నమస్కారము. 'సిద్ధం నమః' సిద్ధునిగుఱించి నమస్కారము-అనఁగా సిద్ధునికి నమస్కారము. వీనిలో మొదటిదగు శివనమస్కారము శైవసంప్రదాయమున వచ్చినది. రెండవదగు సిద్ధనమస్కారము జైనసంప్రదాయమున వచ్చినది. సిద్ధుఁడు జైనమతమున పంచపరమేష్ఠులలో నొకఁడు. జైనగ్రంథముల యాద్యంతములందు 'సిద్ధంనమః' అనునది వ్రాయఁబడుచుండును. జైనమతమున దీనికి 'సిద్ధమాతృక' అని పేరు.

"తతో భగవతో వక్త్రా న్నిస్సృతా మక్షరావలీమ్
సిద్ధంనమ ఇతి వ్యక్తమంగలాం సిద్ధమాతృకామ్"
(ఆ. ౮. ౫౬)

అని యాదిపురాణమునఁ గలదు. 'ఓం సిద్ధం నమః', 'ఓం నమోసిద్ధం', 'నమః సిద్ధం' అని జైనగ్రంథములయందుఁ గలదు. 'శివాయనమః' అనునట్లే 'సిద్ధాయనమః' అని యుండఁదగును గాని జైనసంప్రదాయము ననుసరించి 'సిద్ధం నమః' అనునదే గ్రహింపఁబడినది. ఈవాక్యద్వయ సమ్మేళనము ఆకాలమందు మనదేశమందున్న శైవజైనమతముల సమరసతను, సమప్రాధానతను చాటుచున్నది.

వైష్ణవమత ప్రాబల్యముగలచోట 'శ్రీహరిః ఓంనమః' అని అక్షరాభ్యాసము చేయుదురు. కొందఱు తమిళదేశమున తద్భాషోచ్చారణానుసారముగా 'హరిః నమోత్తుచిందం' అని యుపదేశింతురు. 'చిందం' అనునది 'సిద్ధం' అనుదాని అపభ్రంశరూపము. ఇది వైష్ణవజైనమతముల సమప్రాధాన్యమును తెలుపును. మలయాళదేశమువారు 'హరిః శ్రీగణపతయేనమః' అని యక్షరాభ్యాసము చేయుదురు. ఇందు వైష్ణవ గాణాపత్యమతముల సమప్రాధాన్యము తెలుపఁబడినది. ఆదేశమున శైవ జైనమతముల వ్యాప్తి హెచ్చుగాలేదు కదా! వైవాక్యమున వా రొకవిశేషమును దెలుపుదురు. అక్షర సంకేతము ననుసరించి 'అక్షరము లేఁబదియాఱు' అనియు, అక్షరస్వరూపమయిన సరస్వతియొక్క ధ్యాన మందుఁగలతదనియు చెప్పుదురు. అది ఎట్లనిన 'హరిః' యనుదాని నొకభాగముగాను 'శ్రీగణపతయేనమః' అనుదాని నొకభాగముగాను గ్రహించి అందు హ=౮, రి=౨: 'అంకానాం వామతో గతిః' అనుప్రకారము=౨౮, + శ్రీ=౨, గ=౩, ణ=౫, ప=౧, త=౬*, యే=౧, న=౫†, మః=౫, మొత్తము ౨౮= వెరశి ౫౬

* ఇట 'టాదినవ' అనుదాని ననుసరించి గ్రహింపఁబడినది.

† ఇట 'త' దగ్గరనుండి గ్రహింపఁబడినది.

అక్షరములు అనిరి. మణాక్షరన్యాయమున నీయక్షరసంఖ్య సరిపడుచున్నది. దీని నిట్టు సమన్వయింపఁజేయుట బుద్ధి ప్రావీణ్యమును స్పష్టపరుచును. యాథార్థ్యము మాత్రము వైష్ణవగాణాపత్యమతములనే యామంత్రము కంఠోక్తముగా తెలుపుచున్న దనక తప్పదు. కన్నడదేశమునను ఈ సంప్రదాయము కలదు. 'సిద్ధం' అనుదానికి వర్ణసమామ్నాయ మర్థమని వారు నిర్వచనము చేసికొనిరి. ఈనిర్వచనము బలాత్కారముగా తెచ్చిపెట్టినది. అదియు జైనమతవ్యాప్తి తగ్గినతరువాత కల్పింపఁబడినదే కావచ్చును. జైనమతవ్యాప్తి గలిగినకాలమున శైవమంత్రమునకు ప్రక్కను చేరి పరంపరగా వచ్చుచున్న 'సిద్ధంనమః' అనుదానిని నివారింపఁ జేయఁజాలక, సహింపనొప్పక మనస్తృప్తికై యిట్టినిర్వచనమును కల్పించికొనియు నుండవచ్చును.

మన యాంధ్రదేశమున మొనమొన్నటివఱకు జైనమతము వ్యాపించియుండుటయేకాక, ఇతరమతముల సామరస్యముతో వెలయుచుండుట గలదు. ఏమతమువచ్చినను అందలిగుణమును గ్రహించి, అందు గ్రహింపఁదగినభాగమును గ్రహించి కలయికతో ప్రవర్తించుట ఆంధ్రులకు లక్షణము. కావుననే ద్రావిడాదిదేశములకంటె నాంధ్రదేశమున బహుమతవ్యాప్తియు, బహురూపదేవతారాధనమును, తదనురూపవేషాదిధారణమును హెచ్చుగాఁ గలదు. పరధర్మానుకరణము నేఁటికిని ప్రాయికముగా మనదేశమునఁ గానఁబడుచున్నది.

శైవమతము వీరశైవమనియో, అద్వైతశైవమనియో ఏదియో యొకరూపమున మనలో ననుగతమగుచునే యున్నది. కాన 'ఓంనమఃశివాయ' భాగము మనకు ప్రధానము. జైనము నామమాత్రావశిష్ట మగు నేఁటికాలమునఁగూడ జైనసిద్ధమాతృకను మనమంత్రముతో గలపి యక్షరాభ్యాసకాలమున బాలుర కుపదేశించుట మనలో నిలిచిపోయినది. ఇది ప్రాచీనచారిత్ర విషయస్ఫోరకము. అవిచారమూలకముగా దానిని మన మనుసరించుచున్నామనియు నొప్పుకొనక తప్పదు.

ప్రకృతము బడులలో 'ఓనమాలు' పోవనే పోయినవి. వానితోపాటు 'అఆలు', 'కాఖాలు' చెప్పుక్రమముకూడ నంతరించినది. గ్రహణసౌలభ్యమనుపేర ఆకారసామ్యము, ఉచ్చారణసామ్యముగల 'తల లత' మొదలగుపదములతోడనే 'అక్షరాభ్యాసము' చేయఁబడుచున్నది. దానిపరిణామము వాచకలేఖకశక్తులు అంతరించుటయే. దీనిని గ్రహించి కొందఱు వర్ణసమామ్నాయమును యథాపూర్వముగా బోధించుట యుక్తమని భావించుచున్నారు. తాత్కాలికగ్రహణసౌలభ్య మెంతముఖ్యమో రూఢత్వ సంప్రదాయానుసారిత్వములును అంతముఖ్యములేయని విద్యావ్రణాళిక లేర్పరుచువారు దూరదృష్టితో నాలోచింపవలయును. బాలుర కక్షరాభ్యాస మొనరించునపుడు తలిదండ్రులుకూడ తత్త్వమెఱిఁగి బోధించుట యుక్తము. ఇతరసంస్కారములతోపాటు అక్షరాభ్యాససంస్కారమునుగూడ అర్థజ్ఞానశూన్యముగాఁ జేయుట కంటె తత్త్వమునెఱిఁగి చేయుట ధర్మము.



# రెండవ దశాబ్ద ప్రారంభమున

**"ఆంధ్ర"** తన దశాబ్ది సందర్భమున ఎల్లరకును అభివాదముల నర్పించుచున్నది.

సర్వతోముఖమగు అభివృద్ధిగాంచి, శీఘ్రగతిని ముందుకు సాగుచున్నది.

పేర్కొనదగిన సుస్థిరత్వమును బడసినది.

పైవిషయములు తామే పరిశీలించి, తమ సంపూర్ణ సహాకారాదరణముల నొసంగుదురుగాక!

## ప్రతిమూడుసంవత్సరముల అభివృద్ధి

| సంవత్సరం | అమలులోనున్న వ్యాపారం. | భీమానిధి. | ప్రీమియం ఆదాయము. |
|---|---|---|---|
| **1928** | రు. **19,20,000** | రు. **56,000** | రు. **77,000** |
| **1931** | ,, **43,30,000** | ,, **3,27,000** | ,, **2,11,000** |
| **1934** | ,, **79,34,000** | ,, **9,06,000** | ,, **3,67,000** |
| **1935** | ,, **1,00,00,000** | ,, **11,50,000** | ,, **4,62,000** |

**1935** లో క్రొత్తవ్యాపారము రు. **27,10,000**

**1934** సంవత్సరము రు. **22,00,000**

బోనసు సాలుకు **1000/-**కి రూ. **15/-**లు

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, (లిమిటెడ్).,

మచిలీపట్టణము.



౫. స్వదేశిప్రదర్శనమున నూలు వడకుచున్న ఆంధ్రస్త్రీలు



స్వదేశిప్రదర్శనమున జముకాళ్ళమును నేయుచున్న స్వీడనుయువతి
(శాంతి నికేతనమున నీమె యుపాధ్యాయి)



౭. అధ్యక్షుని యూరేగింపు ౧, లక్నో



౮. అధ్యక్షుని యూరేగింపు ౨, లక్నో



౧౩. కార్యనిర్వాహక సంఘసమావేశమునకయి ఆనంద భవనమునకు (అలహాబాదు) పోవుచున్న డా. పట్టాభి, రాజేంద్రప్రసాదులు



౧౪. స్వదేశీప్రదర్శనమున పండ్లను కాయలను పరికించుచున్న గాంధిమహాత్ముడు



౧౫. వాలంటీరులను పరికించుచున్న గాంధిమహాత్ముడు



౧౯. స్త్రీ పురుష స్వచ్ఛందసేవాదళము నెదుర నుపన్యసించుచున్న మహాత్ముడు



౧౮. విషయనిర్ణయసభయందలి స్త్రీ బృందము

# పంచతంత్రము

కిళాంబి రాఘవాచార్యులు

పంచతంత్రము ప్రాచ్యకథా వాఙ్మయమున నగ్రస్థానమును వహించుచున్నది. ప్రాచీనకాలమునుండియుఁ బంచతంత్ర మెట్టి ప్రాముఖ్యమును గాంచినదో మనకు దాని భాషాంతరీకరణముల వలన విస్పష్టమగును. పాశ్చాత్య విద్వాంసులలోఁ బెక్కురు హిందూదేశమే కథావాఙ్మయమున కుత్పత్తిస్థానమని యంగీకరించియున్నారు. పంచతంత్రము ప్రథమమున నెప్పుడు రచింపఁబడియెనో, దాని మూల మెట్లుండెనో తెలియుటకుఁ దగిన యాధారములులేవు. ఆఱవ శతాబ్దమున నిది పారసీక రాజగు 'ఖుస్రూ నూషిర్వాన్' యొక్క యాస్థాన వైద్యుఁడగు 'బర్జుయీ'చేఁ బ్రాచీన పారశీకము, లేక పహ్లవీ (Pahlavi) భాషలోని కనువదింపఁబడెను. కాని యది మనకు లభించుటలేదు. పహ్లవీభాషనుండి యాఱవశతాబ్దముననే 'సిరియను భాషలోనికిని, ఎనిమిదవ శతాబ్దమున 'అరబిక్' భాషలోనికిని నిది పరివర్తన మొనర్పఁబడినది. ఇవియే మనకు లభించిన ప్రాచీనభాషాంతరీకరణములు. ఈభాషలయందుఁ బంచతంత్ర మను గ్రంథనామము గానవచ్చుటలేదు. కరటక దమనకము లను జంబుకనామముల గ్రహించి Kalilag and Damnag అని సిరియను భాషలోను, Kalilah wa Dimnah అని యారబిక్ భాషలోను బిలువఁబడుచున్నవి. వీనిని మన పంచతంత్రముతోఁ బోల్చిచూచినచో మూలగ్రంథమున నైదుభాగములేకాక మఱికొన్ని భాగము లుండియుండునని విమర్శకు లూహించుచున్నారు.

అరబ్బీభాషనుండి పదునొకండవ శతాబ్దమున గ్రీకుభాషలోనికిని, దానినుండి పదునాఱవ శతాబ్దమున నిటలీభాషలోనికిని, పందొమ్మిదవ శతాబ్దమున జర్మను, ఇంగ్లీషు భాషలలోనికిని నీగ్రంథ మనువదింపఁబడినది. మఱియు నరబ్బీగ్రంథము ననుసరించి క్రీ. శ. 1140 ప్రాంతమున నబ్దుల్ మాలిదుచేఁ బారశీకభాషలో రచింపఁబడిన గ్రంథమునుండి పదునైదవ శతాబ్దమునఁ బారశీకముననే 'అన్వారి సుహైలీ' అను గ్రంథము రచింపఁబడెను. దీనిబట్టి ఫ్రెంచి, ఇంగ్లీషు, స్వీడిషు, జర్మను మున్నగు భాషలలోఁ బెక్కు భాషాంతరీకరణములు గలవు. పండ్రెండవ శతాబ్దమున 'జోల్'అనువానిచే రచింపఁబడిన 'హీబ్రూ' పరివర్తనమునుండి 'జాన్ అఫ్ కాపువా' చే లాటినుభాషలో మఱియొక గ్రంథము రచింపఁబడెను.

కేవలము భాషాంతరీకరణములఁ బ్రశంస యటుండఁ బంచతంత్రములోని కథలు కొన్ని పాశ్చాత్యవాఙ్మయములఁ గానవచ్చుచున్నవి. గెస్టారోమనేరమ్(Gesta Romanarum) నందును, బొకాషియో (Boccacio), ఛాసరు (Chaucer), లా ఫాంటైను (La Fontaine), గ్రిమ్ (Grimm) మొదలగువారి గ్రంథములందును బంచతంత్రమునందలి కథలు గలవు. లా ఫాంటైను తన గ్రంథమున హైందవ ఋషియగు పిల్పెయి (బిడ్పయి) నుండి చాల కథలను గైకొంటినని వ్రాసియున్నాఁడు. పిల్పెయియనునది విద్యా యను సంస్కృతపదమునకు రూపాంతర మని పాశ్చాత్యులు వ్రాసియున్నారు. కథావాఙ్మయమంతయుఁ బెక్కువిషయముల హిందూదేశమున నభివృద్ధిగాంచుటచే నచటినుండియే పాశ్చాత్యులు గైకొని రనుట యుక్తము. బౌద్ధగ్రంథపరివర్తకు లగు 'రిస్ డేవిడ్సు' (Rhys Davids) మున్నగువా రటులనే యూహించుచున్నారు. పాశ్చాత్యదేశములనుండి, ముఖ్యముగ గ్రీసుదేశమునుండి హిందువు లీకథలను గైకొని రనువాదమును గలదు (వీబరు, బెన్ఫీ, బెరడీలు [illegible]తు మున్నగువారు). అది సహేతుకము కాదు.

### పంచతంత్రము - బౌద్ధ వాఙ్మయము

బుద్ధుని నిర్వాణానంతరము రెండు మూఁడు శతాబ్దములకు క్రీ. పూ. 250 సంవత్సరప్రాంతమునఁ బాటలీ

పుత్రనగరమున జాతకకథలు సమకూర్పఁబడెనని తెలియుచున్నది. పంచతంత్రములోని కథలు కొన్ని జాతక కథలయందుఁ గలవు. సుప్రసిద్ధమగు బార్హట్ స్తూప (Barhut Stupa) మునఁ బంచతంత్రకథలు కొన్ని చిత్రింపఁబడినవి.

(౧) సింహచమ్మ జాతకము-(Fausboll - Jataka Stories No, 189) సింహచర్మమును ధరించిన గార్దభము కథ.

(౨) కచ్ఛపజాతకము (No. 215) ప్రలాపముచేఁ జెడిన కచ్ఛపవృత్తాంత మిందుఁగలదు.

(౩) విరీల జాతకము (No. 160) హిమాలయమునకుఁ గొనిపోఁబడిన కాకవృత్తాంతము.

(౪) జంబుఖాదక జాతకము (No. 294) జంబుకము వాయసమును మోసగించి యామిషమును గైకొనిన కథ.

(౫) కోతి గుండెకాయ కథ No. 208).

పంచతంత్రము బౌద్ధగ్రంథము కాకపోయినను, కొంతవఱకు బౌద్ధకథలపై నాధారపడియున్నదని మాక్డొనలు తన సంస్కృతవాఙ్మయచరితమున వ్రాసియున్నాఁడు. ఏడవ శతాబ్దమునాఁటికే బౌద్ధగ్రంథములనుండి చాలకథలు చైనాభాషలోనికనువర్తింపఁబడినటులు తెలియుచున్నది. పైఁ దెలుపఁబడిన జాతకకథలు పంచతంత్రమునఁ జేర్పఁబడినవా, లేక పంచతంత్రకథల ననుసరించి బుద్ధుని యవతారవిశేషములఁ దెలుపుటకై జాతకకథలు రచింపఁబడినవా యనువిషయమున భిన్నాభిప్రాయములు గలవు. రెండును జనసామాన్య గాథలపై నాధారపడియుండవచ్చునని కొందఱు వ్రాయుచున్నారు. బుద్ధుని యవతారవిశేషములఁ దెలుపుటకై కొన్ని కథలను బౌద్ధులు గైకొనిరనుటయే యుక్తియుక్తము.

పంచతంత్రము - సంస్కృత కథావాఙ్మయము

ప్రాచీనకాలమున బృహత్కథయొకటికలదనియు, దానిని గుణాఢ్యుఁడు పైశాచిభాషలో రచించెననియు మనకు క్షేమేంద్రుని బృహత్కథామంజరివలనను, సోమదేవుని కథాసరిత్సాగరమువలనను దెలియుచున్నది. 'భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథాం' అని దండి తనకావ్యాదర్శమున దానిం బ్రశంసించెను. బాణ సుబంధులును బృహత్కథను దమ కావ్యములఁ బేర్కొనియున్నారు. ఈబృహత్కథ క్రీ. శ. 1-2 శతాబ్దములనాఁటికి రచియింపఁబడియుండునని బ్యూలరు (Buhler) మొదలగువారు తలఁచుచున్నారు. క్షేమేంద్రుఁడును, సోమదేవుఁడును దమ గ్రంథములను బృహత్కథానుసారముగ రచించియుండుటచే, వానియందలి కథలు మూలమునఁగూడ నుండియుండునని మన మూహింపనగును. కథాసరిత్సాగరమున శక్తియశోలంబకములోఁ (తరంగ ౬౦-౬౪) గొన్ని పంచతంత్ర కథలు గలవు. కొందఱు విమర్శకులు పంచతంత్రములోని కథల నెవరో బృహత్కథయందుఁ జేర్చియుందురని యూహించుచున్నారు. ఇది విమర్శనీయము.

(౨) పంచతంత్రము ననుసరించి నారాయణ పండితుఁడు తన హితోపదేశమును రచించెను. ధవళచంద్రుని యాస్థానమునఁ గలఁడనుటయే కాని యాతని కాలనిర్ణయమునకుఁ దగిన యాధారములు లేవు. ఈ గ్రంథము పంచతంత్రముకంటెను విశేషముగ మన్ననఁ నందుచు బాలురచేఁ బఠింపఁబడుచున్నది. పాశ్చాత్య దేశములలో, నందు ముఖ్యముగ నింగ్లండు దేశమున సంస్కృత విద్యాభ్యసన మొనర్చువారిచే నిది ప్రథమమునఁ బఠింపఁబడుచున్నదని మాక్డొనలు వ్రాసియున్నాఁడు. ఇందుఁ బంచతంత్రకథలు చాలవఱకుఁ గలవు.

(3) క్రీ. శ. 10-12 శతాబ్దముల నడుమ జైనులచే 'పంచాఖ్యానక, తంత్రాఖ్యాయిక' లను పేర నీ కథలు రెండుమారులు రచింపఁబడినవి. అందు రెండవది పూర్ణభద్రవిరచితము. పంచతంత్రమునకు మొదటిగ్రంథము చేరువుగ నున్నదని పలువు రంగీకరించియున్నారు. పూర్ణభద్రుని గ్రంథమునఁ బెక్కుకథలు తరువాతఁ జేర్ప

బడినవి. పంచాఖ్యానకము నెవరు రచించిరో తెలియుట లేదు. కాని పదునేడవశతాబ్దమున దానికి వివరణముగఁ బంచాఖ్యానోద్ధార మను గ్రంథము మేఘవిజయునిచే రచింపఁబడినది.

### దేశభాషలలోఁ బంచతంత్రము

పంచతంత్రమును, హితోపదేశమును సంస్కృతభాష నభ్యసించు బాలురకుఁ బఠనీయ గ్రంథము లగుటయే కాక దేశభాషలలోనికిఁ బెక్కుసారు లనువదింపఁబడినవి. అధునాతన గ్రంథము లటుండ నాంధ్రమునఁ బంచతంత్రమును నారాయణకవియు, వేంకటనాథకవియుఁ బద్యకావ్యములుగఁ బదునైదవ పదునాఱవ శతాబ్దముల రచించిరి. దుర్గసింహుఁడు పదునొకండవ శతాబ్దముననే దీనికిఁ గన్నడభాషలోనికిఁ బరివర్తన మొనర్చెను. వంగభాషయందు దీనికిఁ బ్రాచీనపరివర్తనములు గానవచ్చుట లేదు. కాని పందొమ్మిదవ శతాబ్దారంభమున మృత్యుంజయుఁడను కవి బేతాళపంచవింశతికథలను, హితోపదేశమును వంగభాషలో రచించెను. గుజరాతీ, మహారాష్ట్రము, తమిళము మున్నగు భాషలలోఁగూడ దీనికిఁ బరివర్తనములు గలవు. ఇదియే పంచతంత్రముయొక్క ప్రాముఖ్యమును వేనోళ్లఁ జాటుచున్నది.

### పంచతంత్రము - వివిధప్రతులు

పంచతంత్రమునకు వివిధదేశ ప్రతులు గన్పడుచున్నవి. వాని మూలము లొకదానితో నొకటి సరిపోవుట లేదు. కాశ్మీర, నేపాళ, దాక్షిణాత్యప్రతులు వీనిలో ముఖ్యములయినవి. తంత్రాఖ్యాయిక, కథాసరిత్సాగరము, బృహత్కథామంజరి మున్నగు గ్రంథములలోని కథాభాగము బహుప్రాచీనమైనదని పలువు రంగీకరించియున్నారు. ఈవివిధప్రతులను సంగ్రహించి పాశ్చాత్య విద్వాంసులు హెర్టల్ (Hertel), బ్యూలరు (Buhler), కీల్‌హారన్ (Keilhorn), యెడ్గర్టన్ (Edgerton) మొదలగువారు తమతమ పంచతంత్రములఁ బ్రకటించియున్నారు. దాక్షిణాత్యప్రతుల మూలములును భిన్నమార్గములఁ బ్రోకు చున్నవి. తొంబదియాఱు కథలు గల పంచతంత్రప్రతియుఁ గలదు. అదియే దూబోగారి (Dubois) పంచతంత్రకథలకు మూలమని వారు వ్రాసియున్నారు.

### పంచతంత్రము - స్మృతులు, శాస్త్రగ్రంథములు

పంచతంత్రము ధర్మార్థ కామ మోక్షములను గూర్చిన పలువిషయములఁ గథాపూర్వకముగ రాజపుత్రుల కుపదేశించుటకై రచింపఁబడియుండుటవలన నందు పెక్కుశ్లోకములు మన్వాదిస్మృతులనుండి కైకొనఁబడినవి. పెక్కుతావుల 'తథాచ మనుః', 'తతో ధర్మశాస్త్రాణి యేన మన్వాదీని', 'ఇతి నారదోఽబ్రవీత్' మున్నగునవి గలవు. మిత్రభేదమునందలి (౧-౩౩౮) "శ్లేష్మాశ్రు బాంధవై ర్ముక్తం......" అనుశ్లోకము యాజ్ఞవల్క్యస్మృతిలో నున్నది. పంచతంత్రకారునికి స్మృతులు, పురాణములు, నీతిశాస్త్రగ్రంథములును దెలియుననుట స్పష్టము. మనుస్మృతి క్రీ. శ. 2. 3 శతాబ్దములనాటికి రచింపఁబడియుండునని పాశ్చాత్త్యులు తలఁచుచున్నారు. పంచతంత్రమునఁ గన్పడు మనుస్మృతి శ్లోకముల నిటఁ జూపుచున్నాఁడను:

పంచ. ౧-౧౭౧ "తృణాని భూమి రుదకం" మను. 3-౧౦౧

౧-౪౪ "ఆకారై రింగితై ర్గత్యా" ౮-౨౬

౧-3౪౪ "ప్రజానాం ధర్మషడ్భాగో" ౮-3౦౪

౨-౧౪ "శత మేకోఽపి సంధత్తే" ౭-౭౪

3-౮౫ "క్షేమ్యాం సస్యప్రదాం" ౭-౨౧౨

3-౮౬ "ఆపదర్థే ధనం రక్షేత్" ౭-౨౧3

3-౨౬ "భూమి ర్మిత్రం హిరణ్యంచ"

ఈశ్లోకము కొలఁదిమార్పులతో మనుస్మృతి (౭-౨౦౮) యం దున్నది.

స్మృతులేకాక పంచతంత్రమున బృహస్పతి, ఔశనసుఁడు, చాణక్యుఁడు, శాలిహోత్రుఁడు, వాత్స్యాయనుఁడు మున్నగువారి శాస్త్రగ్రంథముల ప్రశంస

పెకు. స్థలములు గలవు. వీరందఱును మిగుల ప్రాచీనులు. పంచతంత్ర కాలనిర్ణయమున కుపకరింపరు.

"మనుశాస్త్రాణి మన్వాదీని, అర్థశాస్త్రాణి చ చాణక్యాదీని, కామశాస్త్రాణి వాత్స్యాయనాదీని"

పంచ. పు. ౨.

"ఇత్యువాచ బృహస్పతిః" ౪-౧౯ శ్లో.

"బుద్ధ్వా యత్రో హతా నందా శ్చాణక్యే నాసి-పాణయః" ౫-౪౭ శ్లో.

"భార్గవో౽బ్రవీత్" ౫-౬౩ శ్లో.

"ఔశనస బార్హస్పత్య చాణక్య మతవి త్తదను ష్ఠాతాచ" ౫-పుట ౫౭.

"శాలిహోత్రేణ పున రేతద ప్యుక్తమ్" ౫-పు. ౫౮.

"ప్రోక్త మత్రవి దేయే భగవతా శాలిహోత్రేణ" పు. ౫౯.

"శాస్త్రంచ యస్యోశనసా ప్రణీతం" ౫-౯౦ శ్లో.

"రాత్రి శేషం యావ ద్వాత్స్యాయనోక్తవిధినా నిషేవ్య" ౧-పుట ౩౮.

ఇందుఁ జాణక్య బృహస్పతు లర్థశాస్త్రములను, శుక్రుఁడు నీతిసారమును రచించిరి. శాలిహోత్రుఁడు పశువైద్యశాస్త్రమును రచించెను. అందలి భాగములు కొన్ని కన్నడమున సారసముచ్చయమునఁ గలవని విమర్శకులు వ్రాయుచున్నారు.

మఱియుఁ బంచతంత్రమున దామోదరుని కుట్టనీమతము, వరాహమిహిరుని బృహత్సంహిత, కామందక నీతిసారము, రతిరహస్యము మున్నగు గ్రంథములనుండి కొన్ని శ్లోకము లచటనచట నుదాహరింపఁబడినవి. వరాహమిహిరుఁడు తన బృహత్సంహితను క్రీ. శ. 550 ప్రాంతమున రచించెనని తెలియుచున్నది. పంచతంత్రము క్రీ. శ. 531-579 వఱకు రాజ్యమేలిన ఖుస్రూనూషిర్వాన్ కాలమున పహ్లవీభాషలోనికి తెనువదింపఁబడుటచే నాటికి శతాబ్దమునుండియైనను ప్రాముఖ్యమును గాంచియుండవలయును. వరాహమిహిరుని గ్రంథమును పంచతంత్రకారుఁడు చూచియుండెననుట యుక్తియుక్తము కాదు. బృహత్సంహితలోని శ్లోకములు తరువాతఁ బంచతంత్రమున నెవరో చేర్చియుందురు. కుట్టనీమతకర్త యగు దామోదరగుప్తుఁడు కాశ్మీరదేశ ప్రభువగు జయాపీడుని (క్రీ. శ 779-813) మంత్రి యగుటచే నాతని గ్రంథములోని శ్లోకములఁగూడ నిటీవల చేర్చియుందురు. కామందకనీతిసారకాలమును వాఙ్మయ పరిశోధకులు సరిగ నిర్ణయించి యుండలేదు. కామందకి చాణక్యుని శిష్యురాలనియు, నాతని గ్రంథముపై నాధారపడి తన నీతిసారమును రచించెననియు మాత్రము మనకుఁ దెలియును. కామందకమునుండి యిరువది శ్లోకములు పంచతంత్రమున నీయఁబడినవి. రతిరహస్యముకూడఁ గుట్టనీమతమువలె నాధునిక గ్రంథమే కాన నీ గ్రంథములలోని శ్లోకము లిటీవలఁ బంచతంత్రమునఁ జేర్పఁబడియుండెననుటయే సమంజసము.

### పంచతంత్రము - రామాయణ మహాభారతములు

పంచతంత్రములో మహాభారతములోని శ్లోకములు సుమారు ముప్పది గన్పడుచున్నవి. రామాయణమునుండి రెండుమూఁడు శ్లోకములుమాత్రమే కైకొనఁబడినవి. గ్రంథవిస్తరభీతిచే వాని నిటఁ జూపలేదు. మహాభారత రచనము క్రీస్తుపూర్వమే ప్రారంభింపఁబడెననియు, క్రీ. శ. 1, 2 శతాబ్దములనాఁటి కిప్పటి స్వరూపమును గాంచెననియు విమర్శకుల యభిప్రాయము. అది పంచమవేదమని పిలువఁబడి ధర్మార్థ కామమోక్షముల బోధించు వివిధవిషయముల నుద్ఘాటించుచున్నది. అట్టియెడఁ బంచతంత్రకారుఁడు తాను వచింపఁబోవు నీతులకుఁ బ్రమాణముగ మహాభారతమునుండి శ్లోకముల నుదాహరించుకొనెననుటయే యుక్తము. అందువలనఁ బంచతంత్రము క్రీ. శ. 1, 2 శతాబ్దములకుఁ దరువాత రచియింపఁబడియుండవలెను.

పంచతంత్రము - కావ్యనాటకములు

పంచతంత్రములోని 'ఏతా హసంతిచ రుదంతిచ కార్యహేతోః,' "సముద్రవీచీవ చలస్వభావాః," (౧-౧౯౨,౧౯౪) అనుశ్లోకము మృచ్ఛకటికములోఁ గలవు (అంక ౪). మృచ్ఛకటికము క్రీ. శ. 3, 4 శతాబ్దముల నాటి గ్రంథమని విమర్శకులు నుడువుచున్నారు. పంచతంత్రములో నీశ్లోకములు యువతీ నిర్గుణవిషయమున నీయఁబడినవి. ఈసందర్భమునఁ బదునూఁడు శ్లోకములు గలవు. 'ఏవ మనేకాని సూక్తాని చింతయత స్తస్య......' అని యాఘట్టము ముగింపఁబడినది పంచతంత్రమున నివి మృచ్ఛకటికమునుండి కైకొనఁబడెనని తోఁచుచున్నది.

మఱియుఁ గాళిదాసుని కుమార సంభవములోని (౨-౫౫)

"ఇత స్స దైత్యః ప్రాప్తశ్రీ ర్నేత ఏవార్హతిక్షయమ్,
విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్."

అని బ్రహ్మ తారకాసురునిగూర్చి పల్కిన శ్లోకము సంజీవకునిగూర్చి పింగళకుఁడు చెప్పినటులుగలదు. మహాకవి కాళిదాసుఁడు పాశ్చాత్యు లంగీకరించినటుల గుప్తరాజులకాలముననే యుండినచో నీశ్లోకమును నాల్గవశతాబ్దానంతరము పంచతంత్రకారుఁడు గైకొనియుండును. పంచతంత్రమునందలి శ్లోకములు కొన్ని శార్ఙ్గధరపద్ధతి, సుభాషితావళి మున్నగు గ్రంథము లందు బీజక, ముక్తాపీడ, కృష్ణమిశ్ర, విక్రమాదిత్య, మసూరాక్ష, భట్టోద్భటుల కారోపింపఁబడినవి. వీని సత్యాసత్య నిర్ణయమునకు వలయు నాధారములు మృగ్యములు. సుభాషితావళి మున్నగు గ్రంథములను శ్లోకకర్తలవిషయమునఁ బ్రమాణముగఁ గైకొనరాదు.

ఈక్రిందిశ్లోకములు రెండును మాఘుని శిశుపాలవధ మహాకావ్యమునుండి (స. ౨-౧౦, ౫౪ శ్లో.) పంచతంత్రమునఁ జేర్పఁబడినవి :

"ఉత్తిష్ఠమానస్తు పరో నోపేక్ష్యః పథ్యమిచ్ఛతా,
సమౌహి శిష్టై రామ్నాతౌ వర్త్స్యంతా
వామయస్సచ" (పంచ ౧-౨౩౪)

"చతుర్థోపాయసాధ్యేతు రిపౌ సాంత్వమపక్రియా,
స్వేద్యమామజ్వరం ప్రాజ్ఞః కోంభసా పరిషించతి."
(3-౨౭)

పంచతంత్రము - భర్తృహరి సుభాషితశతకత్రయము

భర్తృహరిశతకత్రయమునఁ బంచతంత్రములోనివి పదెండు శ్లోకములు కొలఁదిమార్పులతోఁ గన్పడుచున్నవి. భర్తృహరి మిగుల ప్రాచీనుఁడని పలువు రంగీకరించియున్నారు. కాని యతనికాలమును సరిగ నిర్ధారణ మొనర్పఁబడి యుండలేదు. వాక్యపదీయ, శతకత్రయకర్త లొక్కరా, యిరువురా యను విషయ మింకను సంశయగ్రస్త మైయున్నది. చీనాయాత్రికుఁడగు 'ఇట్సింగు' వ్రాఁతలనుబట్టి 'మాక్సుమ్యుల్లర్' మొదలగువారు వీరి యైక్యమును సిద్ధాంతీకరించిరి. కాని వాక్యపదీయకర్త బౌద్ధుఁడగుటవలనను, బౌద్ధమతసూచనలు శతకత్రయమునఁ గన్పడకపోవుటచేతను వారిరువురు ప్రత్యేకవ్యక్తులని 'కీత్' మున్నగువారు వ్రాసియున్నారు. భర్తృహరికి భట్టి విక్రమార్కులతోడి సంబంధము నిరాధారమగు విషయములనుబట్టి యూహింపఁబడినది. శతకత్రయములోని శైలిని బరిశీలించినచో నందలి శ్లోకముల నొక కవియే రచించియుండు నని మన మూహింపవలసియున్నది. కాని కొన్నిశ్లోకము లితర గ్రంథములనుండి యందుఁ జేర్పఁబడియుండె ననుట స్పష్టము. పంచతంత్రశతకత్రయముల పౌర్వాపౌర్యముల నిర్ణయించుట సులభమగువిషయము కాదు. ఒకవేళ పంచతంత్రకారుఁడు కొన్నిశ్లోకముల శతకత్రయమునుండి కైకొనియుండవచ్చును. లేదా వాని నెవరయినఁ బంచతంత్రమున నిటీవలఁ జేర్చియుండవచ్చును రెండు గ్రంథములఁ గను శ్లోకము లిట జూపఁబడినవి :

౧. ౧-౮౫, ౮౯ "మధుతిష్ఠతి వాచియోషితాం" శృంగార. ౯౦.
౨. ౧-౧౩౫ "జల్పంతి సార్ధమన్యేన" శృం. ౫౦.
3. ౧-౧౯౮ "దౌర్మంత్ర్యాన్ నృపతి ర్వి" నీతి. 33.

౫-౧౯ ...క్షమాణాం" శృం. ౪౬

౬. ౧-౨౬౦ "సంతాపయసి ...తి ౬౮.

,, ౩౮.

౭. ౨-౧౯ "రవినిశాకరయో ర్గ్రహపీడనం"

నీతి. ౮౬

౮. ౩-౧౭౭ "ప్రారభ్యతే నఖలు" ,, ౭౨

౯. ౪-౩౨ "నామృతం నవిషం కించిత్"

శృం. ౪౪

౧౦. ౪-౩౪ "స్త్రీముద్రాం ఝషకేతనస్య"

శృం. ౭౯

౧౧. ౪-౭౭ "శ్వేతం పరం శిరసి వీక్ష్య"

వైరాగ్య. ౭౭

౧౨. ౪-౭౮ "గాత్రం సంకుచితం" ,, ౭౯

౧౩. ౬-౨౯ "తా నీంద్రియా ణ్యవికలాని" ఇది నీతిశతకములోని దని తెలాంగుగారు తమ యుపోద్ఘాతమున వ్రాసియున్నారు.

౧౪. ౧-౨౭౬ "సేవాధర్మః రమగిహానః" ఇందలి నాల్గవపాదముమాత్రమే నీతిశతకమున ౪౭వ శ్లోకమునఁ గలదు. ఈసందర్భమున బొంబాయి సంస్కృత గ్రంథావళిలో బ్యూలరు, కీల్‌హారనుగార్లచేఁ బ్రకటింపఁబడిన పంచతంత్ర ముపయోగింపఁబడినది.

పంచతంత్రము - జైన బౌద్ధమతములు

పంచతంత్రము బౌద్ధగ్రంథము కాదు. అది హిందూధర్మ పునరుద్ధారణమునకే రచింపఁబడిన దనియు, జైనబౌద్ధ యుగముల యనంతరము గుప్తసామ్రాజ్యాధీశుల కాలమున రచింపఁబడియుండు ననియు (క్రీ. శ. **4, 5** శతాబ్దములు) మార్గోసలు మున్నగువారు వ్రాసియున్నారు. అపరీక్షితకారక మను నైదవతంత్రమున మొదటికథయందు జైనబౌద్ధుల ప్రశంసగలదు.

'అథ తస్య స్వప్నే పద్మనిధిః క్షపణకరూపీ దర్శనం గత్వా ప్రోవాచ' (౫. పుట ౩౯)

'క్షపణకవిహారం గత్వా జినేంద్రస్య ప్రదక్షిణాత్రయం నిధాయ. (౫. పు. ౩౯)

'జయంతి తే జినా యేషాం కేవలజ్ఞానశాలినామ్' శ్లో-౧౨

'సా జిహ్వా యా జినం స్తౌతి త చ్చిత్తం యజ్జినే రతమ్' శ్లో. ౧౩.

హర్షకృతనాగానందనాటకములోని నాందీశ్లోకము (ధ్యానవ్యాజ ముపేత్య) గూడ పై సందర్భముననే పంచతంత్రమునఁ గలదు. (౫-౧౪)

పంచతంత్రకాలము

పైఁ జర్చింపఁబడిన విషయములవలనఁ బంచతంత్రము రామాయణ, మహాభారత యుగానంతరమున క్రీ. శ. 550 సంవత్సరమునకుఁ బూర్వమే రచింపఁబడియుండుననియుఁ, దరువాత శిశుపాలవధ, నాగానందము, బృహత్సంహిత,కుట్టనీమతము మున్నగు గ్రంథములనుండి పెక్కుశ్లోకము లందు నీతిశాస్త్రప్రమాణములకై చేర్పఁబడియుండుననియు విస్పష్టము. పారశీకభాషలోని కాలవ శతాబ్దముననే పరివర్తింపఁబడుటవలన నిది 4, 5 శతాబ్దములనాఁటికే రచింపఁబడియుండ నగును. ఒకవేళ మార్గోసలుగారు వ్రాసినటులు గుప్తులకాలమునాఁటిదేమో? పాశ్చాత్య భాషలనుండి దీనారము (Latin-Denarius), ద్రమ్మ (Greek-Drachma) మున్నగు పదములు గైకొనఁబడినవి. కౌటిల్యుని దని ప్రకటింపఁబడిన యర్థశాస్త్ర మప్పటికున్నను, లేకపోయినను బంచతంత్రకారునికిఁ గామందకనీతిసారము గాని, తత్పూర్వ విరచితములగు నర్థశాస్త్రములుగాని పరిచితము లనుట స్పష్టము. రామాయణాది గ్రంథములవలె సరళమును, సులభమును నగుశైలిని రచింపఁబడకపోవుటచేనిది కావ్యయుగమున రచింపఁబడినదని యూహింపవచ్చును. గ్రంథకర్త యెవరో నిర్ధారణ మొనర్చుటకుఁ దగిన యాధారములు లేవు. ప్రథమమునఁ దెలుపఁబడిన విష్ణుశర్మయే గ్రంథకర్త యగునో నతఁడు మహిళారోప్యనగరమునకుఁ బ్రభువగు నమరశక్తిసూనులకు విద్య గఱపుటకై

దీనిని రచించియుండుటచే దాక్షిణాత్యుఁడే యగును. ఇదియును నిరాధారమని 'కీత్' తన సంస్కృత వాఙ్మయ చరిత్రమున వ్రాసియున్నాఁడు. హిందూదేశమున విశేషప్రాముఖ్యమును గాంచియుండుటచే నీగ్రంథము పెక్కుమార్పులను జెందియున్నది. వివిధదేశ ప్రతులను కథాసరిత్సాగరాది గ్రంథములతో సంప్రతించి మూలప్రతిని నిర్ణయించుటకు ప్రాచ్యపాశ్చాత్యులు శ్రమపడుచున్నారు. కాని యీప్రయత్నమింకను సఫలము కాలేదు.

### గ్రంథప్రాశస్త్యము

వేదయుగమునాఁటినుండియు జంతుజాలమునకు సంబంధించిన కథలు హిందూదేశమునఁ గలవు కాని వాని నన్నిటిని పుష్పమాలయందువలె నొక్కగ్రంథమున సమకూర్చి, యందు ధర్మార్థకామమోక్షముల నుపదేశించు నీతుల నుద్ఘాటించు గ్రంథములలో నిది మిన్నయైయున్నది. అందును గథలలోఁ గథల నిమిడ్చెడి బుద్ధికౌశలములు [illegible] ందువులవేయనియు, వీరినుండియే అరబ్బులు మున్నగువారెట్టి కథారచనమును నమ 'అరేబియను నైట్సు' మొదలగువానియందుఁ గైకొనిరనియు, నిట్టిరచనము చైనాదేశీయుల పెట్టెల దొంతరవలె (Like a set of chinese boxes) హృద్యముగ నుండుననియు మాక్డొనెలు ప్రశంసించియున్నాఁడు. కథలన్నియు వచనరూపముననే రచింపఁబడినవి. అందుగ్గడింపఁబడిన నీతులుమాత్రము శ్లోకరూపము నందినవి. మానవచేష్టాదికముల ననుకరించు జంతువుల కథలగుటచే నొక యపూర్వమగు హాస్య (Quaint humour) మిందుఁ గలదు. అదియుంగాక ఇవి మానవులందుఁ గల దుర్గుణాదికముల గర్హించుచు వారిని సన్మార్గవర్తనులఁ జేయుచున్నవి ఇందుపదేశింపఁబడిన నీతులు కేవలము లౌకికమార్గానుసారుల యుపదేశములు కావు. ప్రతివిషయమును ధర్మశాస్త్రానుసారముగఁ బ్రతిపాదింపఁబడియున్నది. అందుననే నాఁటికిని నేఁటికిని ఈగ్రంథమందఱిచేతను బఠింపఁబడి మన్ననను గాంచుచున్నది.



తృప్తికరముగా లేకఅక్కర లేనిచో వారమురోజులలో వాపసు చేసికొనబడును.

# టి. సి. యస్. గోల్డిన్ మెటల్ జ్యూయలరి

## మార్టువారి వివిధరకముల

### ఆభరణములు, లోక ప్రశస్తమైనవి.

### వివిధ రకములలో సౌందర్య పోషణ ప్రయత్నమే మా ఆశయము.

ఉంగరము 1-కి రూ. 2-0-0
గాజులు పెద్దసైజు జత 1-కి రూ. 3-0-0
గాజులు మీడియం సైజు జత 1-కి 2-8-0
గాజులు బేబి సైజు జత 1-కి 2-0-0
చైను పెద్ద సైజు పేట 1-కి 7-0-0
చైను బేబి సైజు పేట 1-కి 5-0-0
వంకీ వడ్డాణము పెద్ద సైజు 1-కి 20-0-0
వంకీ బేబి సైజు 1-కి 15-0-0
సుండీలు 1-కి 0-5 0
పట్టు చేతిసుండీలు సెట్టు 1-కి 2-0-0
గజ్జలుకట్టిన వంకి 15-0-0
సాదా వంకి గజ్జలు లేనిది 1-కి 7-8-0

వి. పి. ఖర్చులు ప్రత్యేకము.




ప్రత్యేకము స్త్రీలకొరకు స్థాపింపబడినది.

---

మా చే తయారు చేయబడు మెటల్ బంగారు ఆభరణములు మా సోదరీ మణులకు సంతృప్తి కలుగజేయునని నిశ్చయముగా చెప్పగలము. ఒకసారి మీదృష్టిని మా నగలపై ప్రసరింపజేసినచో మీ సౌందర్యాభిలాషలను మా ప్రయత్నము మీకు తెలియగలదు.

### క్యాటలాగు ఉచితము, నేడే వ్రాయుడు.

# టి. సి. నాగలింగప్ప అండు కంపెని.,

280, వాల్ టాక్సు రోడ్డు, పోస్టుబాక్సు నెం 516, పార్కుటవున్ పోస్టు, మదరాసు.

ఏజంట్లు:— పటేలు స్టోర్సు, మునిసిపల్ హైస్కూలు రోడ్డు, బెజవాడ.
ఎస్. ఎస్. గుప్త, జనరల్ ఏజన్సీ, మడకశిరాపోస్టు, (అనంతపురంజిల్లా)
శుకూల్ స్టోర్సు, మైన్ రోడ్డు, శ్రీకాకుళంపోస్టు, (గంజాంజిల్లా)
జానపరెడ్డి రంగారావు, నర్సాపూరు, (పశ్చిమగోదావరిజిల్లా)
కె. వెంకటాచలం, ప్రొప్రయిటరు, సీతారామ ఇండియన్ స్టోర్సు, చిత్తూరు.




## మైసూరు సిల్కు గుడ్డలు

ఆధునిక కాలమునకు తగినవి. అవి ఉపయోగింపబడిన చోటులందెల్లను ఒకవిధమయిన నూతనశోభ, అలంకారము నొడగూర్చును. ఇంతేకాకుండ కృత్రిమమైన పట్టుగాని, విదేశపుపట్టుగాని లేని అచ్చ మైసూరు పట్టుదారముతో తయారుచేసిన వస్త్రములను ధరించుచున్నట్లు తృప్తికలిగి యుండవచ్చును.

మీరు జార్జిజెగాని, క్రెపెగాని సటీన్‌గాని యేరకము కావలసినను, వాటి సరియైన పేర్లతో అడుగుము. అనగా మైసూరు జార్జిజె, మైసూరు క్రెపె, మైసూరు సటీన్ రకములు కావలెనని యడుగుడు. వాటిసౌందర్యము, మితవ్యయములకు మీరు సంతోషించెదరు.

మైసూరు సిల్కుగుడ్డలు యెంతో గంభీరముగాను నాజూకుగాను కనబడును. ధరించుటకు మృదువుగానుండును. పరిశుభ్రమైన అచ్చపట్టుదారముతో యీగుడ్డలు మైసూరు గవర్నమెంటుసిల్కు వీవింగ్ ఫ్యాక్టరీలో తయారు చేయబడినవి.




ఉత్తరసర్కారులు, హైదరాబాదు స్టేటులకు సెల్లింగ్ యేజంట్లు:— యస్. యం. వజీరుద్దీన్ అండ్ సన్సు, బెజవాడ.

కాటేజ్ ఇండస్ట్రీస్ సేల్సు డిపో, హెచ్. యి. హెచ్. ది నైజామ్సు డొమినియన్సు, హైదరాబాదు దక్కన్.

స్టాకిస్టులు:— ది మద్రాసు స్వదేశీ యంపోరియం, లిమిటెడ్, 1/17, ఏ. మౌంటురోడ్డు, మదరాసు.

సేత్ మల్ మిస్రీలాల్ అండ్ కో, కమర్షియల్ రోడ్డు, ఉదకమండలం.

గవర్నమెంటు ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు డిపో, సౌత్ పెరేడ్, బెంగుళూరు.

# అవన్నియు నీ కనువేనా?

ఆంధ్రవిశారద తాపి ధర్మారావు

రంగము 1

[పెద ఇల్లు. సాయంకాలము ఏడు గంటలవేళ. కోదండరాయలు 8 గంటలకు విశ్వకళాపరిషత్తులో "ఆంధ్ర ప్రబంధ వికసనము"ను గూర్చి ఉపన్యసించుటకు సిద్ధపడుచుండును. చినిగినచొక్కా తొడుగుకొనును.]

ఉమ

అబ్బా! జేబుదగ్గర ఎంతచినిగిపోయినది! ఇంకొకచొక్కా ఉన్నదికదా, అది తొడుగుకొనగూడదా?

కోదండరాయలు

అవి ఇంతకన్నను అన్యాయముగా చినిగినది. ఉన్న రెండింటిలో ఇదే మంచిది. (చినుగు సవరించుటకు ప్రయత్నము చేయుచు) కుట్టుటకుగూడ వీలులేనట్లున్నది. పోనిమ్ము. కోటుక్రింద కనబడకుండును. (కోటు తొడుగుకొనుచుండును. చినుగు కనబడుచునేఉండును)

ఉమ

అయ్యో! కోటు వేసుకొనినను చినుగు బయటికి కనబడునండీ.

కోదండరాయలు

ఆ.........(ఆలోచనతో).......దారిద్ర్యమును కప్పుట ఎంతకష్టము!......ఉమా, ఆ కండువా తెమ్ము చూతము.



ఉమ

(కండువా అందిచ్చును.)

కోదండరాయలు

(కండువాను మెడమీదుగా వేసికొని, ఎడమకొనను కోటుక్రిందుగా కుడివైపున మఫ్లరువలె ఇముడ్చును. కండువాచినుగొకటి బయటికి కనబడును.) చొక్కా చినుగు కప్పజూచిన కండువాచినుగు బయట పడుచున్నది. (దానిని సవరించి) ఉమా, ఎందుకయినను మంచిది: సూది, దారము తెచ్చి ఈకండువాను చొక్కాతో కలిపి ఇక్కడ ఒక్క పోగు పోయుము. మరి జారదు.

ఉమ

(అట్లు చేయుచుండును.)

కోదండరాయలు

(మిగిలిన కండువాను మెడచుట్టి వేలవైచుచు)

ఓ! ప్రశస్తముగా ఉన్నది. చొక్కా చినిగినదని ఎవరనుకొనగలరు? ఆకారమునకు ఆంతర్యమునకు అంత భేదము!

ఉమ

పాడు చినుగు. సరిగా గుండెమీదనే చినుగవలెనా, మన దినములు గాని ?

కోదండరాయలు

అక్కడే చినుగును. అక్కడే చినుగవలెను. పేదరికములో హృదయము బయటపడవలయును గదా ! మరెక్కడ చినుగును? (కోటుబొత్తాములను తగిలించుచు) ఆంధ్రప్రబంధ వికసనము—ఎప్పుడు అనుకొననయినా లేదు. ఏమి చెప్పుదునో తెలియదు......

ఉమ

మీరు వచ్చునప్పటి కెంత సేపగునో!

కోదండరాయలు

పీడు ఎనిమిది గంటలలో వత్తును.....చూడుము ఉమా, నారాయణ పంతులుగారిని ఒకరూపాయి బదులు అడిగితిని. వారే గంటలకు ఒక పంపుదుమని చెప్పిరి. ఒకవేళ ఆలస్యమైనయెడల మధురబాలనుగాని వాణినిగాని వారి ఇంటికి పంపి రూపాయి తెప్పించి రాత్రి వంటప్రయత్నమును చేయుము. పిల్లలు మాత్రము నేను వచ్చునంతవరకు భోజనము లేకుండ ఉండవలయును. మధ్యాహ్నమే వారికి ఆకలితీరలేదు.

ఉమ

అయ్యో! బిడ్డలు— (చెప్పుచని చాటుగా కంట నీరు పెట్టుకొనును.)

(వెలుపల పిలుపు)

అయ్యా, కోదండరాయలుగారూ, వస్తారా?

కోదండరాయలు

అయ్యా, అయ్యా, ఇదిగో వచ్చుచున్నాను. ఉమా, వత్తునా? (అని ఉమను చూచి) అదిగో! అదిగో! కంట నీరు పెట్టుకొనుచున్నావు. తప్పు, తప్పు. మ్రింగివేయుము. ఉమా, బిడ్డలు వచ్చువేళ అయినది సుమా! మ్రింగి వేయుము. స్సు—

(వెలుపల)

వేగం రండీ, వేళ అయింది.

కోదండరాయలు

ఇదిగో (ఉమ కన్నీరు తుడుచుచు పోవును).

## రంగము 2

[విశ్వకళాపరిషత్తుద్వారము. రాత్రి ఎనిమిదిగంటలు. ఉపన్యాసము అప్పుడే ముగిసినది లోపలనుండి ఉత్సాహముతో కరతాళధ్వనులు. హాలునుండి ఆమ దిరమునుండి వచ్చుచుందురు. నలుగురైదుగురు ఒక్కొక్కగుంపుగా వచ్చుచు ఇట్లు మాటలాడుకొనుచుందురు.]

ఒకగుంపు (సాధారణులు)

ఒకడు

ఎంతమంది వచ్చారు! క్రిక్కిరిసిపోయింది హాల్ అంతాను!

మరొకడు

వచ్చేవాళ్ళేగాని కదలి వెళ్ళినవాడొక్కడైనా ఉన్నాడా? అంతా అలాగ కొయ్యల్లాగ కూర్చుండిపోయారు.

మరొకడు

ఈహాలులో ఏసభకూ ఇంతమంది ఎప్పుడూ వచ్చి ఉండరు.

మరొకడు

కిటికీలనిండా మనుష్యులే. వరండాలలోనూ మనుష్యులే. ఏదో గారడీ జరిగినట్లు కనబడ్డాది గాని తెలుగుసభలాగ కనబడనే లేదు.

రెండవగుంపు (చదువెరిగినవారు.)

ఒకడు

తెలుగు మీాటింగుల పరువు నిలబెట్టాడురా మహానుభావుడు. ఏమి పాండిత్యము!

మరొకడు

మన పండితులలాగనా? ఎన్ని నిదర్శనాలు, ఎన్ని సంగతులు, ఎంత విమర్శన! అంతా, అంత తేలికగా బోధపడేటట్టు ఒకచక్కని కథలాగ చెప్పాడురా.

మరొకడు

ఇవతల తెలుగు, అవతలసంస్కృతము, అవతల ఇంగ్లీషు అన్నిటిలోను బాగా కృషిచేశాడురా.

మరొకడు

కాబట్టే అంతచక్కగా అంత తేలికగా చెప్పగలిగాడు. కాని ఇతనిఫక్కీ అంతా చాలా అపూర్వం. ఇంగ్లీషులోనూ, సంస్కృతంలోనూగూడా ఇలాటిఫక్కీ కనబడదు.

మూడవగుంపు (పండితులు)

ఒకడు

ప్రబంధంఅంటే కలలోనుగూడా అనుకోనిదగ్గర ఆరంభించి ఎంతసక్రమంగా తీసుకవచ్చాడు. మహా సునిశితమైన విమర్శన. ఎప్పడు చూడాలేదు వినాలేదు, ఇలాంటి విమర్శన.

మరొకడు

సారస్వతంఅంతా అలా నాలుకచివరను ఉందన్నమాట గాని వేరుకాదు. ఆవాగ్ధోరణి చూడండి, మహా ప్రవాహం! మహా ప్రవాహం!

నాలుగవ గుంపు (పెద్దవారు)

ఒకడు

పేరుపొందినవాళ్ల ఉపన్యాసాలు చాలా విన్నాను గాని ఇలాంటిది నా ౫౦ ఏళ్లవయసులోను నే నెప్పుడు వినలేదండి. అద్భుతంగా ఉంది.

మరొకడు

కోదండరాయలు చాలాగొప్పవాడని విన్నాను గాని ఇంతటివాడని నేను అనుకోలేదు. ఇలాంటివాడు ఒక్కడుంటే చాలదా భాషకీ, దేశానికీ అంతటికీ గౌరవం తేవడానికి? భేష్ భేష్!

మరొకడు

పాండిత్యం అంటే అలా ఉండాలి. కవిత్వంగూడా చాలా బాగాఉంటుందంటారు.

ఐదవగుంపు (తలపాగాలవారు, కోదండరాయలు)

ఒకడు

నా కీవేళ ఇంటిదగ్గర ఎంతోఅర్జెంటుపని ఉన్నా, మీా ఉపన్యాసం వదిలివెళ్లడానికి బుద్ధిపుట్టలేదండీ.

మరొకడు

అది ఉపన్యాసంకాదు. అమృతం అలా పంచిపెట్టారు. తెలుగంటే చెవులుమూసుకునేవాళ్లనిగూడా అలా కట్టిపడవేశారు.

మరొకడు

ప్రిన్సిపాల్‌గారూ, ఇలాంటి ఉపన్యాసాలు అప్పుడప్పుడు పెట్టిస్తూఉండండి. చెవుల్తుప్పయినా పోతుంది.

ప్రిన్సిపాలు

రాయలుగారు ఊ అంటే నా అభ్యంతర మేమీా లేదు. వీరి పేరుచెప్పితే పిలవకుండానే వస్తారు వందలకొద్దీ మనుష్యులు.

కోదండరాయలు

అంతయు మీయభిమానముగాని వేరుకాదు. నావలన ఉపయోగము ఏమయిన ఉన్న, తప్పక మీయిష్టము వచ్చినట్లు చేయుడు.

రంగము 3

[కోదండరాయల ఇల్లు. కిటికి అరుగుమీద ఉమ కూర్చుండి ఎదురు చూచుచుండును. లోపల కిరసనాయిల్ బుడ్డీ వెలుగుచుండును. ఒక చింకిచాపమీద చేతులు తలగడలుగా పెట్టుకొని వాసుదేవుడు, మధుసూదనుడును నిద్రించుచుందురు.]

ఉమ

ఎనిమిదికొట్టి చాలసేపయినదే! ఏమి ఇంకను రాలేదు? (చలివలన పిల్లలిద్దరును శరీరములను ముడుచుకొనుచుందురు)

ఉమ

(లేచి, ఒక చినిగినచీరను తెచ్చి రెండుమూడు మడతలు వేసి వారిపై కప్పి మరల అరుగుమీద కూర్చుండి)

ఆహా! నిద్ర అని ఒకటి ఉండబట్టి బ్రతుకుచున్నాము గాని, లేకున్న ఈదారిద్ర్యబాధకు అంత ముందునా? ఆకటిచిచ్చుల పాతమయిపోవలసినదేకదా! అయ్యో! బిడ్డలు——

ఒకజట్టు (పోవుచు)

తెలుగుమీటింగులో ౮ గంటలు నాజన్మంలో ఎప్పుడూ కూర్చోలేదురా. చాలా బాగుంది లెక్చరు.

(కోదండరాయలు వచ్చుచుండును)

ఉమ

(కన్నీరు తుడిచివైచి) సభ చక్కగా జరిగినదా?

కోదండరాయలు

జరిగినదిగాని పిల్లలు భోజనముచేసిరా ఉమా?

ఉమ

అయ్యో భోజనము!

కోదండరాయలు

ఏమీ, ఏమి?

ఉమ

౭ గంటలవరకు నారాయణపంతులుగారు వారి ఇంటికే రాలేదట. తిరిగితిరిగి పిల్లలు సొమ్మసిల్లి అదిగో ఆలాగున ద్రతోనే కడుపునింపుకొనుచున్నారు.

కోదండరాయలు

అహా. నేను పోయి నారాయణగారిని చూచివత్తును. ఏదో పనితొందరలో ఉండిఉందురు.

(మెల్లగ పోవుచుండును).

మరొకజట్టు (వీధిని పోవుచు)

ఓహో! ఏమి ఉపన్యాసం!

ప్రవాహంలాగే ఆమాట్లాడడం!

తెలుగంటే తెలియనివాళ్లకికూడా రక్తికట్టించాడోయ్. బలే!

కోదండరాయలు (నడచుచు)

ఏమైయుండును? తప్పక పంపుదననెనే —— అయ్యో! ఉమా, ఎంతబాధ ననుభవించుచున్నావు! మిమ్ములను మరల సుఖపెట్టుట కేయాభాగ్యము నోచుకొనలేదు గాబోలు! తనవారిని పోషించుకొనుటకు శక్తిలేని వానిని బ్రతుకనీయకుండునట్లు ఒకశాసన ముండవలయును. శక్తిలేనివారిని గుండువేసి కాల్చినను ప్రయోజనములేదే!... నాకు శక్తిలేదా? ఇంతయో అంతయో చదువుకొనినాను. (నవ్వుచు) పట్టభద్రుడను. పట్టి తెలివి తక్కువవాడను కాను. కష్టపడగలను. కష్టపడుటకు ఇష్టమున్నది కాని బ్రతుకుటకు మార్గము కనబడదు. ఆలుబిడ్డలను అంతులేని దుఃఖములో ముంచివేయుచున్నాను——ఎక్కడున్నది ఈలోపము?......(పోవుచుండును).

రంగము 4

[నారాయణగారి మందిరము. కుర్చీలు, మేజామీద మంచిదీపము.]

కోదండరాయలు

నారాయణపంతులుగారూ!

(జవాబులేదు)

కోదండరాయలు

పంతులుగారూ—పంతులుగారు!

(లోపలనుండి)

ఎవరు వారు?

కోదండరాయలు

పంతులుగారు లేరండీ?

పంతులుకొడుకు (వచ్చి)

మీ రెవరు?

కోదండరాయలు

నారాయణపంతులుగా రున్నారా?

పంతులుకొడుకు

ఉన్నారు గాని మీ రెవరు?

కోదండరాయలు

నాపేరు కోదండరాయడు. కొంచెము పంతులుగారికి చెప్పెదరా?

పంతులుకొడుకు

కోదండరాయడా? కోదండరాముడా ?

కోదండరాయలు

రాయడే.

పంతులుకొడుకు

ఏమీ! కోదండరాముడు అని మార్చుకోకూడదు పేరు?

కోదండరామ కోదండరామ

నీదండ నాకు నీవెందు బోకు......కోదండ.

(అని పాడుకొనుచు నాలుగడుగులుపోయి)

నాన్నగారూ, మీకోసం కోదండరాయడట ఎవరో వచ్చారు. (కోదండరాయలనుచూచి) అవునండీ. మీరు కోదండరాముడు అని పేరు పెట్టుకోండి. మీ ముక్కూ మొఖంకూడా మాపటంలో కోదండరాముడు మొఖంలాగే ఉంటుంది. మీరూ నల్లగానేఉన్నారు...

నారాయణగారు (వచ్చి)

అలో! కోదండరాయలుగారూ! దయచేయండి. (కొడుకునుచూచి) ఒరే! వెధవా! వారెవరో ఎరుగుదువా ? మహాపండితులు. బి. ఏ., పెద్దకవి. వారితోనేనా నీ లెక్కరా? ఫో, లోపలికి.

పంతులుకొడుకు

కోదండరామ కోదండరామ....(పాడుకొనుచుపోవును).

నారాయణగారు

అయ్యో, ఆఫీసుగోల 2 గంటలదాకా తీరిందే కాదు. మీమాటే పూర్తిగా మరిచిపోయాను. క్షమించాలి.

కోదండరాయలు

ఎంతమాట. పనితొందరలో ఇవి జ్ఞాపకముండుట కష్టము.

నారాయణగారు

ఇప్పుడు దీపాలుపెట్టిన తరవాత ఇస్తే మావాళ్లు ఒప్పుకోరు...

కోదండరాయలు

పోనిండు. రేపు ఉదయ......

నారాయణగారు

అన్నా ! రేపు మార్గశిరలక్ష్మీవారం అవుతుందే—ఎల్లుండి ప్రొద్దున్న దయచేయండి.

కోదండరాయలు

(నిర్వేదపాటు) హన్నా ! (అని అట్టె చూచుచుండును). మీతో అంతయు...

పంతులుకొడుకు (వచ్చి)

నాన్నగారూ, సినీమాకి డబ్బు అడుగుతున్నాది అమ్మ.

నారాయణగారు

ఎవరెవరు వెళ్తున్నారు ?

పంతులుకొడుకు (లెక్కించుచు)

అమ్మా, అత్తయ్యా, పెద్దక్కయ్యా, చిన్నక్కయ్యా, నేనూ, రామిగాడూ ఆరుగురం.

నారాయణగారు

మీరంతా పావు గంటకు వెళ్లండి. రామి గాడ్ని అనాటికే ...టకు పంపేయ్యండి. తెలుసునా?

...డుకు

అలాగే గాని, మరి వచ్చేయ్యండి.

నారాయణగారు

నాకోటు జేబులో పర్సుఉంటుంది. మీఅమ్మనుతీయమను.

పంతులుకొడుకు (పోవును.)

నారాయణగారు

అమ్మా, ఎల్లుండి ఉదయం దయచేయండి. తప్పకుండా ఇస్తాను. ఎంతపని అయింది! నేను సాఫుగా మరిచే పోయాను మీసంగతి. ఆఫీసుకు వెళ్తే మరేమీ తోచ నీయకుండా చేసేస్తారు.

కోదండరాయలు

చిత్తం—పోవుదునా?

నారాయణగారు

ఎల్లుండి—మరేమీ అనుకోకండి.

కోదండరాయలు

అమ్మా. ఎంతమాట. సెలవు. (నాలుగడుగులు నడచి) మనుష్యులు పగ కావచ్చును. జంతువులు పగ కావచ్చును. చంచలాతిచంచలమగు కాలము-విధి-పగ కావచ్చును. కాని, మావిశేషమేమియో! నిర్జీవములగు వారములుగూడ మాకు పగఅగుచున్నవి. సోమ లక్ష్మి వారము నాపై పగసాధించినది. అందరికిని వెలుగునిచ్చు దీపముగూడ మాకు పగయే. దీపము పెట్టిన తరువాత మాకు ఇవ్వరాదు. ఆహా! అన్ని ప్రయత్నములు నిష్ఫలములయ్యెను. వీరి మాటయే ఆధారముగా సభకు పోయితిని. ఆసభ! ఆఉత్సాహము! అదొకలోకము. ఈయాకలి ఈఆకలి; ఇదొకలోకము. ఈరెంటికిని సంబంధములేదు. కాని, ఏది నిజము? ఆప్రశంస నిజమా, ఈ వస్తు నిజమా? ఆకరతాళధ్వనులు నిజమా, ఈ కడుపు చిచ్చు నిజమా?—ఇదే నిజము. ముమ్మాటికి ఇదే నిజము. పాండిత్యమా, చచ్చిపొమ్ము. బి. ఏ. పట్టమా, మంటిలో కలిసిపొమ్ము. బి. ఏ. కొరకు ప్రాకులాడుటకు బదులు భిక్షాటనము నేర్చికొనుట మేలు. సరస్వతీసేవ చేయుటకు మారు చాకలిపని నేర్చుకొనుట శ్రేయము. ఆహా, ఏమివైపరీత్యము! (సొమ్మసిలినట్లయి ఒకగోడను ఆనుకొని, ఆకాశమును చూచును. చీకటిరాత్రి అగుట చేత నక్షత్రములు దివ్యముగా వెలుగుచుండును.)

ఆవన్నియు నీకనులేనా? చూచుచున్నావా? నెపోలియను ఈనక్షత్రములను చూచియే నీవు ఉన్నావు అని నిశ్చయించినాడట. నిజముగా నీవున్నావా?—నీవున్నావా—ఉన్నావా—(నవ్వుతో) హుః—ఉన్నా? (అని తలఆడించును.)

[అభాగ్య కోదండమునుండి.]

# యతిప్రాసమహాసభ

-ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

(శ్రీనవ్యసాహిత్యమండలి సమంత)

## క

తెలవారి చూసేసరికి సారంగధరుడి మెట్టమీద ఒక పెద్ద తాటాకుపందిరి. దాని పైనీ - కిందా - మామిడాకు తోరణాలు, రంగురంగుల జెండాలు, ఎరుపు, పచ్చ, నీలం కాగితాలగొలుసులూ, బుట్టలూ లేతగాలికి ఊగుతూ కన్నులపండువుగా కనిపిస్తున్నవి. ఆ పందిరికి చుట్టూ చినచిన్న కొత్త తాటాకుపాకలు అందంగా బారులు తీర్చి వీధులువీధులుగా ఉన్నాయి.

ఉదయం ౭ గంటలయింది. బాలసూర్యుని బంగారుకాంతిలో జైలురోడ్డు మొదలుకొని మెట్టదాకా 'దయచేయుఁడు. దయచేయుఁడు' అన్న ఆహ్వానపు టట్టలకు అంతు లేదు. వీరభద్రపురంనుంచి వీరేశలింగంతోటకు ఏదోపనిమీద పోతూన్న నన్ను చూసి మిత్రులు సూర్యనారాయణశాస్త్రిగారూ, సీతాపతిగారూ తొందరగా వెడుతూ "శాస్త్రీ, చప్పున రావాలి. గొప్ప తమాషా జరిగిపోతోంది. పరుగులమీద పోవాలి ర" మ్మన్నారు. 'ఊఁ. ఏదో రాగిశాసనమో, మరణశాసనమో దొరికింది కాబోలు' అని నవ్వుతూ "ఆగండి. ఏమి టాతొందర ?" అన్నాను. "కవిత్వంచేసి చంపక రద్దూ! వస్తేగాని చెప్పం" అన్నారు. 'పదండి' అని బయలుదేరాను.

## చ

సీతాపతిగారు ముందు నడుస్తున్నారు. ఎట్టకేలకు మెట్ట సమీపించాం. పెద్దతాటాకుపందిరి ఏదో సభాభవనంలాగా కనిపిస్తోంది. "కొంపదీసి ఆంధ్రసాహిత్య పరిషత్తు అభినవకపులకు జడిసి ఇక్కడ జరగడం లేదు గదా" అన్నా సూర్యనారాయణశాస్త్రిగారితో. "అంతకన్న ఒక మహాసంస్థ ఒహా టిక్కడ లేవదీశారయ్యా మహానుభావా" అని తీర్చిన 'ఆర్చి' ఒకటి చూపించారు. దానిమీద "అఖిలాంధ్రయతిప్రాసమహాజనసభ" అనే కాకిబంగారంఅక్షరాలు జిగజిగమన్నాయి ఒక్కసారి. సీతాపతిగారు మాతో రహస్యంగా "ఇక్కడ మన మెవరమో ఎవ్వరికీ తెలియగూడదు. తెలిస్తే వీళ్లు మనను చంపేసారు. జాగ్రత్త" అని హెచ్చరించారు.

## ట

బారులుతీరిన తాటాకు పాకల మొదటిశ్రేణిలో వెళ్లి నిలుచున్నాం. నిదానించి సీతాపతిగారు ఒకపాక దగ్గరకు నడిచారు. మేము వెంబడించాం. ఆ పాకకు ఒకవైపున 'ఓరుగల్లు ప్రతినిధులు' అని వ్రాయబడిన ఒక ఉట్ట వ్రేలాడుతున్నది. పాకనిండా ప్రతినిధులు 'కోదండరామునకు..జై' అని కోలాహలం చేస్తున్నారు. సీతాపతిగారు చూపుడువేలు తిప్పుతూ "అదిగో అందులోవారికందరికీ నాయకుడుగా 'అజమాయిషీ' చేస్తున్న ఆజబాల్పన్నా మనిషి 'అనఘం'గారు. ఈయన బమ్మెరపోతరాజుగారికి సమాన మేనత్తకొడుకు. ఆయనపక్కను పసుపుచుట్ట కానుకుని కూర్చున్నాయన 'అమరం'గారు. యీయనా 'అమలం' 'విమలం' 'ప్రవిమలం' ఒకవేలువిడిచిన పెత్తల్లి పింతల్లిబిడ్డలు. వీరి ఎడంపక్కను కూర్చున్న కుర్రవాడు 'నెజి.' అతని పక్క వాడు ఆతని ఆత్మబంధువు 'మజి'." అనిచెప్పి ఈ మూల కూనిరాగాలు తీస్తున్నాయన ఎవరు చెప్మా అని ఆలోచిస్తుండగా ఓస్ ఈయన 'పరగం' గారండీ అన్నా కొంటెగా. 'రైటో. పదండి ముందు' కన్నారు సీతాపతిగారు.

## త

అది కొండవీటి ప్రతినిధులున్న బస.

'నమ స్సాంబశివాయ' అనే కలకలం మాకు దూరానికే వినబడింది. అంతా కుస్తీచేసిన వస్తాదుజబర్దస్తీగా ఉన్నారు. దగ్గరకు వెడితే తంతారేమో అన్న భయంమీద ఓరగా నిలుచున్నాం. సీతాపతిగారు ఎవరి కోసమో వెదికివెదికి ఉండబట్టక పాకలోనూరి 'అయ్యా, ధరాదేవిగారు రాలేదేమండీ' అని అడిగారు. పాకంతా గొల్లుమని నవ్వి 'ఈసభాకార్యక్రమం మీ కేమీ తెలియదు కాబోలు. ఈమహాసభకు మాధరాదేవిగారే అధ్య

క్షత పఠిస్తారు. వారు త్రోవలో సన్మానసభలూ, స్వాగత పత్రాలూ విధీ విరామం లేకుండా అందుకుంటూ ఈవేళ ౯ గంటలరైలుమీద వస్తున్నారు. బ్రహ్మాండమైన ఊరేగింపుతో గోదావరిస్టేషనుకు వెళుతున్నాం' అన్నారు.

'వెళ్లి అంతా గోదారిలో దిగిపొండి. ఆంధ్రకవిత్వంపీడ వదలిపోతుంది.' అన్నారు సన్నగా సూర్యనారాయణశాస్త్రిగారు.

నేను కొంటెగా అందులో ఒకాయనను 'అయ్యా, తమపే రేవరండీ!' అన్నాను. అతడు గూబకు బెత్తెడు చూసినట్టు చూసి 'రాజమండ్రీ కుర్రాళ్లకి బొత్తిగా కళ్లు కనిపించడంలేదు. ఏనాడూ మమ్మల్ని చూస్తేగా' అన్నాడు 'గుస్సా' అయిపోయి. 'పేరడుగుతే తప్పండీ?' అని సీతాపతిగారు సర్ది "శాస్త్రీ, తంటా తెచ్చావుగా! వాళ్ల నడక్కు - రంగం చెడుతుంది. నేను చెబుతా వినండి. ఇదిగో! మనమీద మండిపడినవా డున్నాడే వాడు 'కెరలి' గాడు. వాడిపక్కవాడు 'పంబిన' వాడు. ఆరుద్రాక్షతావళం తిప్పుతున్నాయన 'ఒరిమ' గారు. అతని కెదురుగుండా ఆ వెర్రిమొహంవాడు 'అర్థి'. ఈ హడావడిగా పరిగెత్తేవాడు 'వీకం' గారు." అని చెబుతూ ముందుకు నడిచారు.

## ౫

ఇంకొకపాక. అది 'జమీందారీ' ఛాయా మనుషు లుంపవగినంత 'హోదా' గా తయారుచేశారు. ఆ 'రాత్రియుంబవల్ మరపురానిహాయిలు' చూస్తే ఒక మహాసామ్రాజ్యం పంచుకు అనుభవిస్తున్న దర్జా గోచరిస్తుంది. పరచిన పట్టుతివాసీమీద ఒక పెద్దమనిషి హుక్కాపీలుస్తూ 'ఫక్తుపాదుషా' లా ఉన్నాడు. సీతాపతిగారు తేరిచూచి "ఓహో! వీరు విజయనగరప్రతినిధు లండీ. ఆహుక్కా పీలుస్తున్నాయన 'హరువుమొల్లం' గారు. మాంచి హుషారైనవాడు. ఇటువెంపు చూస్తున్నాడే అతడు 'అల్లన'. ఇతడు పెద్దన్నగారి దత్తపుత్రుడు. ఆ పొడుగాటివాడు 'వావిరి.' ఇతనికి వసు చరిత్రభట్రాజుగారికీ మహా దోస్తీ. ఈ పొట్టిమబ్బుబకుర్రాడు 'సారిద'. ఆ పొడుంపట్టిస్తున్నవాడు 'తలనే' ఎలాగోవచ్చి వీళ్లల్లో పడ్డాడు." అన్నారు. ఆతురత ఎవరండీ వీరిలో ఉన్నారు అన్నారు సూర్యనారాయణశాస్త్రి గారు. నేను గుర్తించి ఇతడు షేక్‌శవకవసాయబు. అదుగో స్త్రీప్రతినిధులు - ఈబక్క పలచని జూకాలావిడ 'అంజజయాన.' ఆపచ్చచీరావిడ 'భీతహరిణేక్షణ.' ఆ పడుచు 'శతపత్రేక్షణ.' వారికెదురుగా కూచుని వెర్రిమొహం వేసి యేమీ తోచక 'క్రతూత్సవసంధాయకుణ్ణి' పిలిచి చుట్ట అంటిస్తూన్నవాడు 'కైతవకుసుమశరాసనుడు.' అనేసరికి మా వారిద్దరూ పొట్టలుపగిలేట్టు నవ్వుతూ ఈ పై ప్రతినిధులతో శాస్త్రి ఎట్లాగూ తంటాతెస్తాడు. అసలు మనపని చెడుతుంది అని సభాభవనంలోకి లాక్కుపోయారు నన్ను.

## ౬

ఆహ్వానసంఘసమావేశము జరుగుతున్నది. అధ్యక్షులు 'జగన్నుగం' గారు, కార్యదర్శి 'మానుగ' గారు. తగ్గినముగ్గురు సభ్యులు 'పోలగ' 'పెలుచ' 'తద్దయు' గార్లు సభాప్రణాళిక, కార్యక్రమంగూర్చి మాట్లాడుకుంటున్నారు. ప్రణాళిక ఇట్లా సిద్ధమయింది:

(౧) ౮ గంటలకు బ్రహ్మాండమైన ఉత్సవముతో వీరేశలింగముతోటమీదుగా గోదావరిస్టేషనుకు వెళ్లి ధరాదేవిగారికి ఘనమగు స్వాగత మిచ్చుట

(౨) యావన్మంది ప్రతినిధులతోను, సభ్యులతోను తిరిగివచ్చి తావన్మందితోను తదుపరి మజ్జన భోజనాదు లాచరించుట

(3) ౨ గంటలకు మహాసభా ప్రారంభము.

(౪) అధ్యక్షుయెన్నికోలు.

(౫) ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము.

(౬) అధ్యక్షుపన్యాసము

(౭) అఖండయతిఆక్రందనము

(౮) క్రొత్తప్రతినిధుల కొన్నిమాటలు.



పక్షితీర్థము — కొండమీద పండార మిడిన ఆహారమును తినిపోవుచున్న పక్షులు

(౯) అభిశంసనతీర్మానములు.

(౧౦) సమాప్తి

'జగన్నుతం' గారు లేచి "సోదరప్రముఖులారా, కార్యప్రణాళిక కడుంగడు చక్కగ కుదిరినది. ఎనిమిది గంటలైనది. లెండు. మన వంశప్రతిష్ఠ కంఠకును మూల విర్భూషిణి యగు సద్ధరాదేవి ఘనస్వాగతమునకై కదలిరండు." అని గంభీరంగా పలికేసరికి ప్రతినిధులందరూ సభాభవనం నిండిపోయి, 'ధరాదేవికీ- మహీరమణికీ—పుడమితల్లికీ—జై' అని తమ భక్త్యుత్సాహముల వెల్లడించి బారులుదీరి బయలుదేరారు.

స్వరయతులందరూ ఒకజట్టు. వ్యంజనవిరామములందరూ ఒకగుంపు. బిందువిశ్రాంతుల చెట్టాపట్టాలు వెనుక. తరువాత విశేషవిరతుల శ్రేణి. అందరివెనకా అఖండయతిగాడు అప్పకవిని తిట్టుకుంటూ భావకవుల్లో కలసిపోదామా అని ఆలోచిస్తూ బయలుదేరాడు. ఇనక వేస్తే రాలని యతిపటాలంతో రోడ్డు ఉక్కిరి బిక్కిరి అవుతూ ఒక మహాప్రబంధంలా ఉంది.

ఊరేగింపు వీరేశలింగంతోట దగ్గరకు వచ్చేసరికి చటుక్కున ఇంకాకొందరిని వెంటబెట్టుకుని 'క్రందుగ' గారు ప్రాసప్రముఖులను వెదుక్కుంటూ వచ్చి కలిశారు.

తిన్నగా ఉత్సవం లక్ష్మీవారప్పేటదగ్గరనుంచి 'సర్కారు పశువుల వైద్యశాల' మీదుగా గోదావరి స్టేషనువద్దకు నడిచింది.

మెయిలువచ్చి స్టేషనులో ఆగింది. అమరప్రకారం అక్షరాలా ధరాదేవికుండే పేర్లజాబితా కంఠతాకే జైజై కొడుతూ ఆహ్వానసంఘంవారు ఆమెయెక్కిన పెట్టెకోసం జనాన్ని తోసుకుని పరుగెత్తుతూండగా, ఒకపెట్టెలోనుంచి తలంతా నెరిసి ఒకప్పుడు తులలేని వైభవం అనుభవించిన ఒకముసిలావిడ తొంగిచూసింది.

'అదుగో వసుంధరాదేవిగారు' అంటూ జనం అంతా అటువెంపు పరిగెత్తారు. అవయవపటుత్వం తప్పినా సకలాంధ్రకవిత్వరంగమూ అపివారుబయలుగా తిరిగిన ప్రాభవమూ, ఏఆంధ్రకవిఆపత్తులోనైనా ఆదుకొని కాపాడిన ఔదార్యమూ ముఖంలో ప్రతిఫలిస్తూండగా ధరాదేవి జరాభరంతో వణకుతూ దిగింది. ఆమె వెంట 'లీలా' కుమారి, 'ఒలి' కన్య స్వాగతపత్రాలూ, సంచీ పట్టుకు దిగారు.

'మానుగ', 'జగన్నుతం' గార్లు గబగబ పరిగెత్తుకువచ్చి ధరాదేవిమెడలో కర్పూరపుదండలూ, పూలదండలూ వేసి సాష్టాంగంగా నమస్కరించి లేచారు. వచ్చిన ప్రతినిధులందరూ సాష్టాంగపడదా మనుకున్నారుగాని ప్లాట్‌ఫారం పట్టదనీ, పాసింజర్లు తొక్కి చంపేస్తారనీ భయపడి జంకి చేతులతోనే 'దండించి' తృప్తి పడ్డారు.

'సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్' లోంచి నవనాగరికులగు ముగ్గురు యువకులు 'పోజు' లిస్తూదిగారు. జన కొత్తప్రతినిధులన్న గోల పుట్టింది. కార్యదర్శి 'మానుగ' గారు తెచ్చికోలునవ్వుతో తేరిచూసి 'అయ్యా, దయచేయండి! తమరు గుంటూరునుంచా, తెనాలినుంచా బయలుదేరారు' అన్నారు. 'అసలు మొన్న గుంటూరిలో బయలుదేరి తెనాలి నిన్నరాత్రికి వచ్చి ఉదయం బెజవాడలో బయలుదేరాం' అన్నాడు అందులో ఒకాయన.

"తమ నామధేయం?"

"నాపేరు మధురం - ఈయన వలపుబరువు. ఆయన 'సుమమం.' ఏదో మీకుటుంబంలోవాళ్లమే కనక బంధువులనందరినీ చూసిపోదామని వచ్చాం."

"మంచిపనిచేశారు. దయచేయండి"

'మానుగ' వారిని వెంటబెట్టుకుని మహాజనంలోకి వెళ్లాడు. లీలాకుమారి మధురాన్ని చూసి తన చురుకైన కళ్లను ఓరగా అప్పళించి పరిచయసూచకంగా నవ్వింది.

'ప్రేమ గుడ్డిది' అనుకున్నాడు 'వలపుబరువు.' ధరాదేవి కారుఎక్కుటకు నిరాకరించగా రెండెడ్లబండి

మీద ఆమెను ఎక్కించారు. 'లలి' కన్య ఆమెతో బండిలోనే కూచుంది. లీలాకుమారి, కొత్తప్రతినిధులూ కారులో ఎక్కగా కారు బయలుదేరింది.

౫

మూడుగంటలకు ఎట్టకేలకు మహాసభ ప్రారబ్ధమయింది.

స్త్రీల ప్రత్యేకస్థలంలో స్త్రీప్రతినిధులు కూర్చున్నారు. 'లీల' వారందరికీ నాయకురాలులాగ కొంచెం ముందు కూచుని 'మధురం'మీద ఓకన్నుపారేసి ఉంచింది. అంతట కార్యదర్శి 'మానుగ'లేచి కన్నులుమూసి, '(శ్రీ)వాణీగిరిజాశ్చిరాయ' అని దైవప్రార్థన చేయగా 'ఎవ్వనిచే జనించు' గూడా చదవితీరాలి. చదవకపోతే లేచి వెళ్లి మే మింకోసభ పెట్టుకుంటా" మని ఓరుగల్లు ప్రతినిధులు తీవ్ర-గగ్గోల చేశారు. ఓమూలనుంచి రాజమంద్రి పెద్దమనిషి లేచి "అయితే '(శ్రీ)మద్భాగవతసహస్ర' ఒదిలిపెట్టవలసిందేనా?" అని గద్దించాడు. మధురం జెండాలా లేచి ఫక్తు బంగాళీలో "గీతాంజలిలోవి పదిలైనులు చదివితేగాని మేం ఒప్పుకోం"అన్నాడు. చట్టున 'జగన్నుతం'గారు లేచి కాంగ్రెసువాదిభీకరారావంతో

"నాయనలారా! అమ్మలక్క-నాయనమ్మలారా! బ్రహ్మాండమైన కార్యక్రమము ముందుబెట్టుకొని దైవప్రార్థనకై తగవులాడుట వట్టి ఆంధ్రత్వము. ఆభారతామ్నాయగంగా భగీరథునియందు,ఆవాగనుశాసనునందు మీకు గౌరవము లేదా! వెండియు నఖండ గౌతమీ జలకణహల్లోహల మదబంభర మల్లధ్వనుల నుల్లసలరు ఉద్దండమండలేశ్వర చండకాండాతికాండ నికురుంబకరంబిత రాజరాజ నరేంద్రచంద్రు పేరోలగమువంటి ఈ 'ధీరోలగము'న నింత పూచీలేని పేచీలు లేవనెత్తుట భావ్యమా? సంభావ్యమా" అని గర్జించి అల్లరి సర్ది "ఏదేవి యాధేయభావంబున స్థావరజంగమ ప్రపంచము కాలూని క్రాలుచున్నదో, ఏదయామయప్రాంత యనుగ్రహంబున నన్నయాదికవులు, వేమనాది యోగులు కృత్యాద్యవస్థ దాటి కృతకృత్యులైరో, ఏయుదారశీల గంటముదించి, ఆకుచించి ఆలోచన తెగక తన్నుకొని చచ్చు ఆంధ్రకవుల కష్టపడి ఆపత్తుదాటించెనో అట్టి (శ్రీ) వసుంధరాదేవిగారు దయచేసి అధ్యక్షపీఠ మలంకరింతురుగాక." అని ఉరిమి కూర్చున్నారు.

"ముసలాళ్లు అధ్యక్షపీఠాలు వదులుకుంటేగాని ఈదేశం బాగుపడ"దన్నాడు మధురం. వెంటనేఒణుకుతూ అధ్యక్షపీఠానికి తడుముతున్న ధరాదేవి చేయిపట్టుకుని 'లలి' కన్య పీఠం ఎక్కించింది. కార్యక్రమం ప్రకారం ఆహ్వానసంఘాధ్యక్షులు తమ ఉపన్యాసం ఇట్లా ప్రారంభించారు:

"అయ్యామ్మలారా! అఖిలాంధ్రయతిప్రాస మహాజనులారా! స్వాగతము. సుస్వాగతము. నేడు ఇప్పుడు ఇక్కడ మనము ఎందుకు సమావిష్టులమైతిమో యందఱకుం దెలిసినయది కాదా? ఒకప్పుడు మనమును తుల లేని గౌరవమును, వెలలేని కానుకలను నింపుదళుకొత్త సంపాదించినవారమె కామా! మనవంశము బహుపురాతనమని యిటీవల దొరికిన కరక్కాయవలన మరణశాసనముంబట్టి సువిదితమైనది కాదా? రాజరాజనరేంద్రుని మొదలు రఘునాథరాయలవఱకు మనధాటి కెదురొడ్డినవా రున్నారా?

నన్నయమొదలు చిన్నయదాక మనల గాదని కాలుకదిపినవా రున్నారా? బాలకవి పార్థసారథిశతకము దగ్గరనుండి మహాకవిభారతమువరకు మనము పెట్టినది భిక్షకాదా! (పొంగివచ్చే కన్నీళ్లు తుడుచుకుని) చచ్చి స్వర్గముననున్న నన్నయతాతగారు పనియున్నను లేకున్నను నన్ను బిలిచి యభిమానపుత్రునిగా జూచిన దినములు తలచుకొన్న నాకు దుఃఖము వచ్చుచున్నయది. కన్నీరు మున్నీరగుచున్నది. 'క్రందుగ బాష్పరోధమున కంఠమునున్' జెడుచున్నది. అయినను గొన్ని సంగతులు మనవిజేసి విరమింతును.

"నేడు కొందరు మనమహాకవు లిచ్చిన ప్రబంధరాజముల జదివి బాగుపడిపోయి, ఎదురుతిరిగి, పొల్లు

పదములు, పడికట్టురాళ్లు అని మన 'భవిష్యము' తీయుచున్నారు. చెల్లరే యిది యెంత విశ్వాసఘాతుకత్వము! అమ్మకచెల వీరి నమ్మగరాదు. వంకాయబజీవలె గీతపద్య మిప్పటివారి కారాధ్యమైనది. ఇందు యతి సోదరులకు భిక్ష దొరకినను ప్రాసప్రముఖుల ప్రాణములు పోవుచున్నవి. ఉభయులను గౌరవించు తెలివి వీరికి లేదా? నేటికాలపు డిప్రెషన్ పద్యములకుగూడ ప్రాకినదా! (భీకరంగా) ఆశార్దూలము లేమి! (గర్వంగా)ఆమత్తేభము లేమి! (మృదువుగా) ఆచంపకమాల లేమి?(సువాసనగా) ఆఉత్పలమాలలేమి ? వాని 'ఘనంబు' ఈ తుక్కుగీతములకు, నీచోప్పగేయములకు వచ్చునా ? మెచ్చు దెచ్చునా? ఇన్నీ యివి లెస్సయే? (సభలో : ఆహా ఏం కొట్టేస్తున్నాడయ్యా దెబ్బలు. బలే! అనేఅభినందనాలు) ఏమయినను పోయినది - పోయినది. ఆంధ్రకవిత్వప్రతిష్ఠ అడుగంటినది. పాపము గోపాలకృష్ణయ్య ఏమన్నాడు? "కొతిమీరికవిగాళ్ల గతు లయోమయము లై నన్ను వీథిని బెట్ట నెన్నుచుండ" అని ఆంధ్రమాతఆవేదనగా వినిపింప లేదా ? లేవరేమి ? నడుములు బిగింపరేమి ? కాళ్లెగుర వేయరేమి ? అల్పులము మన మేమి చేయగలమని యోడకుడు. చెప్పలేదా చిన్నయసూరిమహాకవి 'గడ్డిత్రాటి గంధగజమును బంధించు'నని. కావున మన మందరము మన నవమానించిన క్రొత్తకవులను కెక్కు కెక్కుమనిపించుట కొక క్రొంగ్రొత్తమార్గము కనిపట్టి ప్రచారము చేయ నీమహాసభాసన్నాహము జేసితిని. అది యెట్టిదనః— క్రొత్తకవుల యూహలు విదేశీయములైన భాష స్వదేశీయ కావలయును. కనుక వారు భాషకొఱకు ప్రబంధములు వెదువునప్పుడు మనము మూతిబిగించి బ్రిర బిగిసితిమేని యతడు ఎంత తన్నుకొనినను మన యాంతర్యమును దెలిసికొనలేక చివరకు మనకు దాసోహమయి చెప్పినట్టు వినును. ఈ ఘనకార్యమునకు మీరంద రేకమతులై తోడ్పడినచో కుఱ్ఱకవులను ఘడియలో లొంగదీయగలను.

"నేను చిరకాల మీయఖండగౌతమి నఘమర్షణస్నాన మాచరించి, సారంగధరపర్వతమున ఘనతపమాచరించి ఈ సహాయనిరాకరణోద్యమమును గనిపట్టినాను. గాంధీ వ్యాక్రియశిష్యుడు. చెప్పమరచినాను.

"వఙ్ఝలపండితాదులు వసుచరిత్ర విమర్శనాదికములో మనము వ్యర్థులమని దూషించినను నలుగురిలోను మనము లేకున్న రసభంగ మగునని చెప్పుచుండుటచే వారి నెంతయు మన మభినందింపవలసియున్నది. ఇక మనమనిన నోర్వలేని ముగ్గురను తీవ్రముగ నభిశంసింపవలసియున్నది. సోదరులారా ! చాలతడవైనది. నేను సూచించిన ఉత్కృష్టపద్ధతి ననుసరించి వంశప్రతిష్ఠ నిలువంబెట్టుడు."

అని జగన్నాతంగారు సుఖాసీనులు కాగా ఉద్వేత్తుగా రేగిన తప్పెటలవంటి చప్పట్లమధ్య ధరాదేవి లేచి "చిరంజీవులారా! ఎందరో మహానుభావు లుండగా నన్ను, ఈముసలిముత్తైదువను అగ్రాసన మెక్కించుట కేవలము తమకున్న స్త్రీగౌరవమెయని చెప్పకతప్పదు. ఇంత మహోన్నతపదవికి నేను తగను. శ్రీనాథాదికవిరాజులు నామీద నిష్కారణగౌరవము చూపినట్లే మీరును వ్యర్థరాలనగు నామీద నింతయాదరము, ప్రాముఖ్యము నుంచి మీస్వాభిమానము ప్రదర్శించినందులకు చాల కృతమెరిగినదానను.

"నాజీవము, జవము నేనాడో తెనుగుకవులకే ధారపోసిన నేను ఈ జరాభరమున నేమియు మాటలాడంజాలను. అదియునుంగాక శ్రీ జగన్నాతంగారే చెప్పవలసినదంతయుం జెప్పి నాభారము తగ్గించినారు. వారి యమూల్యోపదేశముల ననుసరించి మీరందరు కృతకృత్యులగుదురు గాతమని కోరుచున్నాను" అని చదికిలబడగా చివ్వున అఖండయతి లేచి "జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యంబుగా మీరు నన్ను దరిజేరనీక తరిమికొట్టినారు. నామీద ఆదరంచూపిన క్రొత్తకవుల వ్యావహారిక భాషతోనే మాట్లాడుతాను.

భారతకవులు నన్నభిమానించినా అప్పకవి వాడి సొమ్మంతా పడిపోయినట్టు నన్ను కాదని అడ్డమైన గడ్డీ

కరచాడు. నాసోదరుడు కలయికకి పునమే పెట్టాడు. నన్ను ఆదరించిన అభినవకవులను నమ్ముకుని మేమిద్దరం వారితోటే ఉంటాం. మేము మీతో ఎప్పటికీ కలియం. నాకు మీసంస్థతో సంబంధంలేదు." అని దబాయించి చెప్పి కూర్చున్నాడు. యతిప్రముఖులు మండిపడి "ఏల చోరంగనిచ్చితిరి యిత్తురకన్ మన సీమలోనికిన్" అన్నట్టు ఉగ్రులై చూశారు. కొత్తప్రతినిధులలో 'మధురం' లేచి 'జగన్నతంగారి అభిప్రాయాలతో కొంతవరకూ ఏకీభవిస్తాం. ఆట్టే చెప్పవలసింది లేదు' అని కూర్చున్నాడు. కార్యదర్శి లేచి 'మహానుభావులరగు నస్మత్సోదరులారా! తమరందరు సాదరభావముతో నందంద తోడ్పడి సభ జయప్రదముగా జరిపించినందులకు నిదే వేనవేలు కృతజ్ఞతావందనము లర్పించుచున్నాను. ఈతీర్మానములను తమరందరు చిత్తగించి సమ్మతింపగోరుచున్నాను.

౧. ప్రస్తుతము, మనసంఘమును బహిష్కరించి క్రొత్తత్రోవలను ద్రొక్కుచున్న ఇప్పటి కవులు ప్రబంధములఁ బట్టుకొనినచో వారి కడుగడ్డన నష్టతగిలి యేడిపించుటకు ఈసభవారు తీర్మానించుచున్నారు

౨. తమ విమర్శనలలో మనము వ్యర్థులమని దూషించి వ్రాసినను,నలుగురిలోను మనవల్ల రస ముప్పతిల్లునని చెప్పు నర్సులపండితాదుల ఈసభవారు అభినందించుచున్నారు.

3. మనలను పీఠికలలోను,పత్రికలలోను దూషించి యిహపరములకు జెడిన ఛందోదర్పణపీఠికాకారుడు సీతాపతి, యతిప్రాస లైచ్ఛికములని యుగాదిసంచికలో వ్రాసిన సూర్యనారాయణశాస్త్రి, పద్యములలో యతిప్రాసలు త్రోసి మనపై కత్తికట్టిన హనుమచ్ఛాస్త్రి గార్లను ఈ సభవారు మిక్కిలి గర్హించుచున్నారు.

సభ్యులంతా 'భేష్—బలే—అవును' అని చప్పట్లు కొట్టి, అట్టహాసాలు చేసి తమ ఆమోదమును తెలియజేస్తూ సభలోంచి లేచారు. మే మెవరమో తెలియకుండా బయటపడేటప్పటికి బ్రహ్మాండ మయిపోయింది.






అప్పుడే వచ్చింది స్టేషనులోకి రైలు. పల్లెటూరవటంచేత స్టేషను చాలా చిన్నది. అయినప్పటికీ యింజను 'దాహం తీర్చుకొనే మకాము' అవటంచేత ఆస్టేషనులో రైలు పదినిముషా లాగుతుంది. స్టేషనుకి వెనకాలే, కొంచెం ఎడమప్రక్కగా వుంటుంది స్టేషను మాస్టరు 'వసారాకొంప'—వాతంచేసిన గొడ్డుకున్నట్లు ఆగీతలూ అవీని. 'ప్లాటుఫారం' చిన్నదౌటంచేత యింజను, యింజనుపక్కని ఒకటి రెండు పెట్టెలు, చిట్టచివరి ఒకటిరెండు పెట్టెలు ప్లాటుఫారం బైటనే వుండిపోతాయి. అంచేత జనం తొక్కిడి ఎక్కనూ, దిగనూ మధ్య పెట్టెల్లోనే వుంటుందిగాని, మిగతావాటిల్లో ఉండదు. ఈసంగతి తెలిసినవాళ్లు సాధారణంగా, విశాలంగా వుంటుందని చివరి పెట్టెల్లోనే ఎక్కుతారు.

గోపాలం కూర్చుంది చిట్టచివరి పెట్టెలో. ఏంతోచక యథాలాపంగా రైల్లోంచి బయటికి చూస్తున్నాడు. అప్పుడే నాట్లు నెయ్యబడిన ఆచేలూ, మధ్యమధ్య గట్లమీద ఆమొగలిదుబ్బులూ, దూరంగా ఆకాశంమీద కాసిని తెల్లని మబ్బుతునకలు మాత్రం కనిపిస్తున్నాయి. గోపాలంకళ్లు అప్రయత్నంగా స్టేషనుమాష్టరుఇంటివేపుకి మళ్లాయి. అతనికి ఉలిక్కిపడ్డట్టయింది. ఆయింటి కిటికీలోంచి ఒక స్త్రీమూర్తి చూస్తోంది రైలుకేసి. కిటికీ చిన్నదౌటంచేత ఒక్క మొహం మాత్రం కనిపిస్తోంది. కొంచెం తలెత్తినప్పుడు మాత్రం 'మానసాయక శంఖం' మాదిరి ఆలేతకంఠం మెరమెరలాడుతోంది. మొహం నిర్మలంగా సహజ హేమచ్ఛాయ లీనుతోంది, 'ఫేస్‌పౌడరు పూత'గాని, 'క్రీం మెత్తుడు'గాని ఏంలేకపోవటంచేత. ఆకోలమొహంలో లేత తమలపాకులకంటే కూడా మృదులంగా వున్నట్టున్నా యానున్నని చెక్కిళ్లు పెదిమెల ఎర్రదనం విస్పష్టంగా కనిపిస్తోంది. రెండువేపులా చుక్కల్లాంటి స్త్రీలని పెట్టుకునికూడా తనివితీరక, రెక్కలు చాచుకు చూస్తున్నట్టుం దా సంపంగిలాంటి పొడవైన నాసిక. మిలమిలలాడుతున్న ఆవెడల్పాంటి కళ్లల్లో చంచలత్వంమాత్రం లేదు. కనిబొమ్మలు కొట్టొచ్చినట్టు కనబడుతున్నాయి. నున్నటి విశాలమైన ఫాలాన్ని తుమ్మెదరెక్కల్లాంటి ముంగురులు ముద్దెట్టుకుంటున్నట్టున్నాయి. నెత్తిమీది ఆసులాబిరంగుసన్ననివలువ వింతఅందాన్ని చేకూరుస్తోంది. జుట్టుచాట్నుంచి లోలకులు మబ్బుచాట్నుంచి మెరపుల్లాగ తొంగిచూస్తున్నాయి. మెళ్లో ఆ వక్కహారమూ చంద్రుడిచుట్టూ నక్షత్రాల్ని కూర్చినట్టుంది. ఏళ్లెన్నుంటాయో స్పష్టంగా తెలీటం లేదు, మనిషి సాంతం కనిపించకపోవటంచేత.

అతని కళ్లలాగే చూస్తున్నా యాకిటికీకేసి. అతను దృష్టి మరల్చదలచుకోలేదు. తలచినా మరలవేమో! ఆ అమ్మాయీ ఆపెట్టెకేసే చూస్తోంది. ఎందుకలా చూస్తోందో వూహించలేకపోయా డతను. ఆపెట్టెలో వుండల్లా యిద్దరు. వెనకస్టేషనులో అతనితోనే ఎక్కిన సిద్దీలాంటి ముసలిసాహేబు. అతనికేసి చూట్టాని కాట్టే సబబు కనిపించలేదు. రెండో ఘనుడు గోపాలం. ఇహ అతనికేనా? ఏమో? అతనికే అట్టే నమ్మకం లేకపోయింది. అయితే, ఆ అమ్మాయి దృష్టి మరల్చకపోవటం తనకేనే చూస్తున్నట్లు నిశ్చయించుకోవాలిసొచ్చింది

గోపాలం. అనూచి ఆనుకునేటప్పటికల్లా అతని కేదో ధన్యత పొందినట్టయింది. కాని ఒళ్లుమాత్రం పులకరించలేదు. అతని కేమేమో ఆలోచనలు పోయాయి.

'మెయ్యి' మనే రైలుకూత అతన్ని భావనిద్రలోంచి లేపింది. అపిల్ల ఉలిక్కిపడ్డట్టు వెనక్కి తిరిగింది. గోపాలంచూపు ప్లాటుఫారమ్మీద్నుంచి పచ్చజెండా చూపిస్తున్న స్టేషనుమాస్టరువేపుకి మరలింది. రైలు కదిలింది. చూ పానినంతవరకూ గోపాలం స్టేషనుమాస్టరుకేసి చూస్తూనేవున్నాడు.

బందరు హిందూకాలేజిలో బి. యే. సీనియరు చదువుతున్నాడు గోపాలం. ఇరవైఏళ్లుంటాయి. పచ్చగా, బక్కపల్చగా వుంటాడు. కొంచెం పొడవరికూడాను. క్రాపింగుకాని, జుట్టుపాలు కాని పెంచకపోవటంచేత సహజస్వరూపాని కేం న్యూనత రాలేదు. నూనూగుమీసాలు వున్న అందానికి మెరుగే పెడుతున్నాయి. హోటలు భోజనం పడకపోవటంచేత "సీజనుటిక్కట్టు" మీద రోజూ వెళుతూ వస్తుంటాడు కాలేజీకి, స్వగ్రామం బందరుకు సమీపమవటంచేత. సరిగ్గా తొమ్మిదింటికి భోజనంచేసి రైలెక్కితే కాలేజీ 'ఫస్టుబెల్' అయేసరికి జేరుకునేవాడు. మళ్లా సాయంత్రం 5 గంటలబండీలో తిరిగివెళ్లిపోతాడు. శేషయ్య గోపాలంతండ్రి. ౫౫ ఏళ్లకి తక్కువుండవు. గ్రామకరణమవటంచేత కొద్దో గొప్పో పలుకుబడి లేక పోలేదు. ౪౦, ౬౦ ఎకరాలు పల్లం ఉంది. కొంచెం వయసుమళ్లిన తర్వాత భార్యపోవటంచేత మళ్లా వివాహంచేసుకోలేదు. మగపిల్లాడుంటంకూడా ఆయన పునర్వివాహం చేసుకోకపోవటాని క్కారణమని అంటారు కొందరు. సూరమ్మ శేషయ్యఅప్ప. చిన్నతనంలోనే వితంతువౌటంచేత తమ్ముడిదగ్గిరే వుంటోంది. తమ్ముడిభార్య పోయిన దగ్గిర్నుంచీ గోపాలాన్ని మరీజాగ్రత్తగాను, ప్రేమతోను పెంచుతూంది. కొడుకూ, కూతురూ, అంతా అతనే అవటంచేత శేషయ్య అయినా గోపాలాన్ని గారాబంగానే చూస్తుంటాడు. 'గారాబపు పెంపకం' గోపాలాన్ని చిన్నప్పట్నుంచీకూడా ఏమీ పాడుచెయ్యలేదు. తండ్రి అంటే భయంగానే వుండేవాడు. పెద్దవాడవుతున్నకొద్దీగౌరవం చూపటంకూడా నేర్చుకున్నాడు. తండ్రి నెప్పుడూ ఎదిరించేవాడు కాదు. నిజానికి ఎదిరించదగినమాటలు చెప్పేవాడూ కాదు తండ్రి.

పెళ్లివిషయం ఒకటిరెండుసార్లు ప్రస్తావిస్తే "బి. యే. అవనియ్యండి" అన్నాడు గోపాలం. దాంట్లోనూ సబబుంటంచేత తండ్రికూడా "సరేలే. అల్లాగే కానియ్యి" అన్నాడు. ఇంగ్లీషు చదువుకుంటున్నా కొడుక్కి దురభ్యాసా లేమీ అలవడకపోవటానికి శేషయ్య సంతోషించేవాడు.

ఆరోజు స్టేషనుమాస్టరుయింటికిటికీలోంచి తనకేసి చూసిన అపిల్లచూపులు గోపాలంమనస్సుకి కొంచెం పనికల్పించాయి. మర్నాడుకూడా అలాగే ఆఅమ్మాయి రైలు స్టేషనులోకొచ్చేసరికి ఆకిటికీలోంచి తనకేసి అలాగే నిర్మలంగా చూడటం అతనికి ఆశ్చర్యంకూడ కలిగించింది. సాయంత్రం బండిలోంచి వచ్చేటప్పుడుకూడా కనిపిస్తుందేమో అని చూశాడు. కాని కనిపించలేదు. ఆ అమ్మాయి కల్లా రైల్లో వెళ్లేవాళ్లని చూట్టం అలవాటేమో ననుకున్నాడు. కాని తనున్న పెట్టెకేసి, తనకేసి, తనకళ్లల్లోకి, అసలే పెద్దకళ్లని యింకా పెద్దవిచేసుకుని, ఎందుకలా చూడాలి? ఆ అమ్మాయి చూపులయొక్క అర్థం తెలుసుకుందామని గోపాలం శని, ఆదివారాల్లోనూ, మధ్యాహ్నపురైళ్లలోనూ, ప్రత్యేకం పనిలేకపోయినా రెండుమూడుసార్లు ప్రయాణంచేశాడు. కాని అపిల్ల కనిపించేదికాదు. మళ్లా సోమవారం ౯ గంటలరైల్లోమటుకు ప్రత్యక్షమయ్యేది 'దేవి'. ఆచూపుల్లో చిలిపితనంకాని, చంచలత్వంకాని ఎప్పుడూ కనిపించేదికాదు. అతని చూపుల్లోమాత్రం కొంటెతనం అదీ వుంటే ఆపిల్ల మళ్లీ అల్లా చూస్తుందా? కాని అతనికిమాత్రం ఎంతసేపైనా ఆముఖాన్ని చూస్తుండా లనిపించేది. వారానికి అయిదురోజులూ, ప్రతిరోజూ ఆపదినిముషాలూ అతనికళ్లకోవిందు. కాని అప్పుడప్పుడు రెండు మూడురోజులు నాగాపడుతూవుండేది విందుకి.

* * * *

౨

గాలీబుసాహెబుపూర్వీకు లసలు కాన్పూరు ప్రాంతపువాళ్లు. ఆరోజుల్లో వాళ్ళకి చిన్న జాగీర్లూ అవీ వుండేవి. కాలక్రమాన ప్రభుత్వాలు మారుతూవుంటంమూలాన వాళ్ల జాగీర్లు క్రమంగా నశిస్తూవచ్చాయి. గాలీబుకి ఐదుతరాలవెనకవరకూ అసలు వాళ్లు హిందూ బ్రాహ్మణులే. అప్పుడు స్వస్త్రీమానసంరక్షణార్థం తప్పనిసరివస్తే నామకార్థం మహమ్మదీయమతం స్వీకరించాలిసొచ్చింది. కాని యితరమహమ్మదీయులతో సంబంధబాంధవ్యా లేమీ చేసుకునేవాళ్లు కాదు. హిందూసంఘం వాళ్లని వెలేసింది. అంచేత అప్పుడు మహమ్మదీయమతం నామకార్థం పుచ్చుకున్న ఆకొద్ది కుటుంబాల్లోనే సంబంధబాంధవ్యాలు జరుపుకుంటూవచ్చారు. జాగీర్లు సాంతం జీర్ణించేసరికి ఆకుటుంబాలవాళ్లు తలోమూలకీ వెళ్లిపోవాలిసొచ్చింది. ఆసందర్భంలో గాలీబుతాత ఆంధ్రదేశానికి వచ్చాడు, తన వక్క కొడుకు, కోడలుతోనూ. గాలీబుతండ్రికి కూడా గాలీబు వక్కడే కొడుకు. ఆరోజుల్లో ఎలాగో తంటాలుపడి, బోలెడుడబ్బు ఖర్చుచేసుకుని, తమకులంట్లో పిల్లని ఎలాగో అలా గాలీబుకి ముడిపెట్టాడు తండ్రి.

ముసలిఘటాలు దాటిపోగానే మిగిలిందల్లా గాలీబు, భార్యాను. మొదట్లో గాలీబుకూడా తండ్రితోపాటే గుంతకల్లులో రైల్వేలో ఎదో ఉద్యోగం సంపాదించాడు. పెద్దవాడౌతున్నకొద్దీ బస్తీజీవితం మీద విసుగుపుట్టి శాంతంగా వుండొచ్చని పల్లెటూరుస్టేషను 'పెడనా'కు 'ట్రాన్సుఫరు' చేయించుకున్నాడు ఓసెలక్రిందట. గాలీబుకైనా

౫౦, ౫౫ ఏళ్లకి తక్కువుండవు. అయినా కాయవంటివాడవటంచేత మనిషి అన్నేళ్లున్నట్టు కనిపించడు. దబ్బపండుఛాయ. మాంచి ఒడ్డూ, పొడుగూ గలవాడు. సాహెబైనప్పటికీ బుర్ర డెక్కించి, గడ్డం పెంచి, లుంగీ అదీ తగిలించి, వికృతంగా తయారవడు. మీసాలు మాత్రం వున్నాయి. వెన్నెలతీగల్లాగా మిసమిసా మెరుస్తున్న ఆ రజతకేశములకి కృత్రిమపు నల్లరంగు వెయ్యకపోవటంచేత మంచిశోభ నిస్తున్నాయి మీసాలు. నెత్తి నొతలపాగా సాధారణంగా వుంటుంది. మామూలు ఆంధ్రులపద్ధతినే పంచకడతాడు. ఏళ్లు ముదిరినప్పటికీ కళ్లల్లో తేజం ఏమాత్రం జంకలేదు. ఆయన్ని చూస్తే ఎవరూ తురక అని అనుకోరు. చెప్పినా నమ్మకుండా ఆశ్చర్యపడతారు కూడాను.

రైల్వేవాళ్లిచ్చే 'కొంప' విశాలమైనది కాకపోవటంచేత యింటి పట్టునే వెనకాల ఓరేకులవసారా గింపించాడు గాలీబు. వసారా ముందు ఓయూభైగజాలు ఆవరణకూడా చేయించాడు. ఆయింట్లో వుండేవల్లా గాలీబు, అతని భార్య మెహర్, కూతురు జానీ. మొదట్లో పుట్టిన పిల్లలంతా నష్టమౌతూవచ్చారు గాలీబుకి. చివరకి జానీ పుట్టటం, పురుట్లోనే పెద్దజబ్బుచేసి ప్రాణంమీదికొచ్చి ఎలాగో అలా బ్రతకడంమూలాన జానీఅంటే మహాగారాబంగా చూసుకుంటారు తలిదండ్రులు. జానీతరవాత అసలు పిల్లలే పుట్టలేదు. నిజానికి 'నా' అనుకునేందుకెవరూ లేరుకూడాను గాలీబుకి. జానీ కిప్పుడు పదిహేనేళ్లుంటాయి. కూతురు ఎదుగుతున్నకొద్దీ గాలీబుకు ఓవిధమైన విచారం కలుగుతూండేది. ఒకొక్కప్పుడు కూతుర్ని ఒళ్లో కూర్చోబెట్టుకుని, యీమాటా ఆమాటా మాట్లాడుతూ, జానీ అమాయకపుకళ్లల్లోకి వెర్రిగా చూసిచూసి ఒక్కమాటుగా చేతుల్లోకి నొక్కుకుని, అదోవిధంగా మొహంపెట్టుకుని, కూతుర్ని ముద్దుపెట్టుకునేవాడు. అతని కళ్లు కొంచెం చెమ్మగిల్లేవికూడాను. బిక్కమొహం వేసుకుని జానీ "ఏమిటి నాన్నా, ఎందుకలా చూస్తారు?" అని ఆదుర్దాగా అడిగితే "ఏం లేదమ్మా. ఏంలేదు" అని మళ్లా కూతుర్ని దగ్గరకు తీసుకుని, శిరస్సు నిమిరేవాడు. ఒకొక్కప్పుడు భార్యతోమాత్రం చెప్పేవాడు "జానీ పరాయిదైపోతుందిగదా యిహ. నాతండ్రి నిన్ను వెతికివెతికి తెచ్చి ముడేసి 'కుమల్లు' దాటకుండా చేశాడు ముత్తంమీద. నాచిన్నిజానీని ఎవరికిస్తాను? ఎక్కడని తిరగను? తిరిగితేమటుకు దొరుకుతారా? ఈసాయిబ్బులకిస్తానా నాచిన్నిని? ఏమిటి చేసేది? హిందువుల్లో మనం వెలి" అని.

"అదేమిటండీ? పిల్లపెళ్లి మానేస్తారా, ఏసాయిబ్బు కుర్రాడికో శాస్త్రబుద్ధిమంతుడిని, చదువుకొన్నవాడినిచూసి యివ్వాలి గాని? నాకర్మంకాలితే 'నా'అనుకునేవాళ్లెవరూ లేకపోయిరి!" అనేది మెహర్ కొంచెం గద్గదతో.

"పోతే పోనియ్యి. ఇక్కడి యీవీళ్లల్లో ఎవరికీ యియ్యను. కాకపోతే నాజానీ నాదగ్గిరే వుంటుంది." అనేవాడు గాలీబు కొంచెం పట్టుదలతో.

"ఐనా చూడండి! మీయిష్టమొచ్చినట్టు చేస్తుగుకానీండి. పిల్లదగ్గిర కళ్లనీళ్లు పెట్టుకున్నట్టుగా వుంటే భయమెయ్యదు టండీ, పసిదయ్యో, దానికి." అని మందలించేది మెహర్.

ఓమాటీసంభావణ జానీ చాటుగుండా నుంచుని విని, తండ్రి అటు వెళ్లగానే "నాన్నగారేమిటంటున్నారు నీతో" అని తల్లి నడిగింది.

"ఏముందీ?...విన్నావేమిటే?...నీ పెళ్లి చేస్తారుట" అంది తల్లి కొంచెం నవ్వుతూను

"కాదులే అమ్మా...నేనే...చూడు...నిన్నూ, నాన్నా నీ విడిచిపెట్టుండలేనే...నాకు పెళ్లి ఒద్దు" అంది జానీ, కొంచెం గద్గదంతోనూ, సిగ్గుతో తడబడుతూ, తల్లివడిలోకి తలదూర్చి తన అమాయకపుకళ్లతో, తల కొంచెం పైకెత్తి ఏమంటుందోఅని తల్లి మొహంలోకి చూస్తూను.

"నిన్ను విడిచిపెట్టి మేంమాత్రం ఉండగలమా అమ్మా..." అంటూ, కొంచెం చిరునవ్వు తెప్పించుకుని బిడ్డను కౌగలించుకుని, నొసట్లో ముద్దుపెట్టుకుంది మెహర్.

3

గోపాలం రోజూ రైల్లో వస్తూపోతూండడంచేత అతను ఫలానాఅనీ, ఫలాని చదువు చదువుతున్నాడనీమాత్రం తెలుసు గాలీబుకి. గోపాలానికీ తెలుసు తనని కిటికీలోంచి రోజూ ఆప్యాయంగా చూసేది గాలీబుకూతురనీ, ఆ అమ్మాయి కింకా పెళ్లికాలేదనీని. అంతకితప్పితే గాలీబుకీ, గోపాలానికీ అట్టే గొప్పపరిచయం లేదు. కాని గాలీ బంటూవుండేవాడు గోపాలంతో..."ఎప్పుడన్నా రండి మాయింటికి. నాకూ యీవేళ ఎవరూ బంధువులూ, స్నేహితులూ లేరు. మీవూరూ దగ్గిరేనయ్యో..." అని.

"దానికేంలెండి?...వస్తాలెండి ఎప్పుడైనా" అనేవాడు గోపాలం.

సెప్టెంబరుఆఖరువారంలో కాలేజీ మూసేశారు. గోపాలానికి పిచ్చెత్తినట్టయింది. అతను బస్తీ కెళ్లటానికి అవసరం అట్టే కనిపించలేదు. ఒకవేళ ప్రత్యేకం పనికట్టుకువెళ్లినా అకిటికీ డొక్కుపోయిన మొహంతో ఏడుకళ్లూ పెట్టుకుని వికృతంగా చూసేది. ఆవదనారవిందం అక్కడుండేదికాదు. ఓరోజు మధ్యాహ్నంరైలులో బందరులో పనుందని యింట్లో చెప్పి బైల్దేరాడు. గాలీబుయింటికనే అతను బైల్దేరిందికూడాను. ఆస్టేషనొచ్చేసరికి గోపాలం రైలు దిగాడు. గాలీబు ఆనందంసూచిస్తూ కరస్పర్శచేసి "చాలా సంతోషమైంది, మీ రిలా వచ్చారు!!" అన్నాడు.

"శెలవలిస్తేను... రోజూ బందరంటే విసుగుపుట్టి యిలా వచ్చాను!" అన్నాడు గోపాలం...... రైలువెళ్లగానే గోపాలం,

గాలీబు కబుర్లుచెప్పుకుంటూ యింట్లోకొచ్చి రేకులవసారాలో చేరో తడిచేత్తో కళ్లుతుడుచుకుని కాళ్లుకడుక్కుని వచ్చేటప్పుడు ఒక్క-కుర్చీలోనూ కూర్చున్నా. గాలీబు చెప్పేవిమీదట రెండు బత్తాయి గులాబిపువ్వు కోసుకుని వాసనచూస్తున్న నెపంతో ఒక్కమాటు ముద్దెట్టుకున్నాడు గులాబిని ఆబుల్లివనం జానీచే దోహదం చేయబడిందని అతనికి తెలిసిందో?

నెమ్మదిగా బత్తాయితొనలు తింటూ గాలీబు, గోపాలంతలోకుర్చీలో కూర్చున్నారు.

"మీరు మాయింటికిరావటం చాలాసంతోషమైంది." అన్నాడు గాలీబు.

కాయలు రెండు సీమరేగుపళ్లు టేబిల్ మీదపెట్టాడు నౌకరు. గోపాలం కాళ్లు కడుక్కొస్తానని దొడ్లో మూలగావున్న నూతిదగ్గిరికెళ్ళాడు. ఇంతలోకే దుస్తులు మార్చుకుంటానని గాలీబు లోపలికెళ్లాడు. ఆచిన్ని వనాన్ని చూసి గోపాలం సంతోషించాడు గులాబి, సన్నజాజి కలసిన ఆఘుమఘుమ అతని ఒళ్లు మైమరపించింది ఆసన్న జాజిమొగ్గలో జానీ తనువు చూశాడు గోపాలం. గులాబి రెక్కల్లో జానీపెదిమల నిగనిగ కనిపించింది. అప్పుడప్పుడే కొంచెంగా చిగురిస్తున్న ఆలేతతమలపాకుల్లో నీమన టిచెక్కిళ్లు ప్రతిఫలించాయి. ఆ అవిసి మొక్కని పెనేసుకున్న ఆ ఒక్క తమలపాకుతీగని చూసిచూసి గోపాలంకళ్లు చెమ్మగిల్లాయి. తనకే వెవరన్నా చూస్తున్నారేమోనని వక్కమాటు వసారావేపుకి తలతిప్పి




"వాసనచూస్తున్న నెపంతో ఒక్కమాటు ముద్దెట్టుకున్నాడు..."

# ఎల్లప్పుడు ఒరిజనల్




## జింక

మరియు

COLAMBIA
અસલ[illegible]
[illegible]
అసలుబుట్టమార్కు




## బుట్ట

మార్కు

# గొడుగులను
# వాడుము

మా పేరులేని గొడుగులు సరియైనవికావు.

# ఇబ్రహీం కరీం అండ్ సన్సు

బొంబాయి, మద్రాసు, కాలికట్.

---

మా వద్దనున్న ప్రత్యేకరకములను అడుగుము:—

అనగా ప్యారిస్, జమీందార్, వైస్‌రాయ్, సిలోను, రాజకుమార, మహారాజ, గవర్నర్, డ్యూరబుల్, కొలంబియా వగైరా రకములను అడుగుడు.

మీ ప్రాణములకు ఆస్తులకు భీమా చేయించుటకు

# జూపిటర్ జనరల్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

(స్థాపితము 1919)










ఇండియా, బర్మా, సిలోను దేశములలో

ముఖ్యమైన పట్టణములలో బ్రాంచీలును

సమర్థులయిన ఏజంట్లు గలరు.

లండన్, అమెరికా దేశములందు ఆఫీసులు కలవు.

ప్రపంచము నందంతటను ఏజంట్లు నియమింపబడి,

క్లెయిములను పరిష్కరించుచున్నారు.

**ఒకకోటి యెన్బదైదు అయిదు లక్షల రూపాయలకు పైగా**

**సెక్యూరిటీ కలిగియున్న కంపెనీ.**

ఈ కంపెనీయొక్క ఏజెన్సీవలన అవిచ్ఛిన్నమైన వరుమానము

రూఢిగా లభింపగలదు.

అగ్ని, జీవితముల భీమా వ్యాపారములకు స్పెషల్ ఏజన్సీలు

కావలసినవారు వివరములకై వ్రాసి కనుగొనుడు.

# నారాయన్ దాస్ గిర్ధర్ దాస్,

**లోకల్ మేనేజర్లు**

99, ఆర్మీనియన్ వీధి, మదరాసు.

"మీరు చాలా ప్రేమస్వభావులు నిజంగా" నన్నాడు గోపాలం కొంచెం నవ్వుతూను.

"అటువంటిస్వభావం ఉన్నవాళ్లకే ఆస్వభావం యితరుల్లోకూడా కనిపిస్తుంది..." అని "చూడండి... తెలీక అడుగుతాను. మీకు వివాహమైందా?" అన్నాడు గాలీబు. "వివాహమైందా?" అనేసరికి గోపాలం ఉలిక్కిపడ్డట్టు చూసి "......అ......లేదు. యింకా చేసుకోలేదు..." అన్నాడు.

గాలీబు అదోరకంగాచూస్తూ "...అయితే...౨౦ ఏళ్ళుంటా యనుకుంటా. బియ్యే పూర్తయింతర్వాత చేసుకుందామనుకున్నారు కాబోలు!" అన్నాడు. గోపాలం తన భావాలేమీ బయటకు కనపరచదలుచుకోలేదు.

"ఆ...లేకేం?...ఆ, 3 నెలల్లో ఫలితాలు కూడాను" అని మొదటిప్రశ్నకి మాత్రం జవాబుచెపుతూ మాటమారుద్దామని... "అయితే...చూడండి...అసలు మీ దీవేపు కావనుకుంటా" అన్నాడు గోపాలం బత్తాయితొన నోట్లో వేసుకుంటూను. "కాదండి. మా పూర్వీకుల దసలు కాన్పూరుప్రాంతం. పెద్ద జాగీర్దారులు కూడాను. కాలక్రమాన మాస్థితిలావచ్చింది...సాయిబ్బులనిపించుకోవాల్సి..." అన్నాడు గాలీబు. గోపాలానికి కొంచెం ఆశ్చర్యంవేసింది "సాయిబ్బులనిపించుకోవాలి సొచ్చింది" అనేటప్పటికి.

"అంటే?" అన్నాడు గోపాలం సాశ్చర్యంగా గాలీబుకళ్లలోకి చూస్తూ.

"౫ తరాలక్రిందట మావాళ్లు స్వచ్ఛమైన హిందూ బ్రాహ్మణులు. మానాన్న చెపుతూండేవాడు...అప్పుడు కొన్ని కారణాలచేత మావాళ్లు మహమ్మదీయమతం పుచ్చుకోవాలిసొచ్చిందిట" అన్నాడు గాలీబు. గోపాలం నిశ్చేష్టుడయ్యాడు. "మొదట్లోనే అన్నా, మిమ్మల్ని చూస్తే సాయిబ్బుల నెవరూ అనుకోరని" అన్నాడు గోపాలం.

"అప్పట్నుంచీ మహమ్మదీయమతం పుచ్చుకున్న మాకుటుంబాలెన్నొద్దీ వున్నాయో వాటిల్లోనే సంబంధ బాంధవ్యాలు చేసుకునేవాళ్లు మావాళ్లు. మాతండ్రి నాపెళ్లికి పడ్డపాట్లు నాకు బాగా గుర్తున్నాయి, కుదుట్లో పిల్ల దొరక్క. ఇతర మహమ్మదీయులకి మాకూ ఏమీ సంబంధంలేదు. మతాంతరులైనామని హిందువులు మమ్మల్ని వెలేశారు మొదట్లో. మళ్లా హిందువుల్లో కొస్తామన్నా రానియ్యలేదు. అంచేత వాళ్లకీ మాకూగూడా ఏమీ సంబంధాలు కలవటానికి వీల్లేకపోయింది. ఇదంతా అప్పటిమాట. అసలు నాకిప్పుడు ఆవుద్దేశమే లేదులెండి. ఇప్పటికీ ఆవేపున మజ్ఞాతులు హిందూ బ్రాహ్మలున్నారు..." అని ముగించాడు గాలీబు. గోపాలం చెవులు దోరబెట్టుకొని విన్నాడు.

"అయితే యిప్పుడు మీ ఆచారవ్యవహారాలు?" అన్నాడు గోపాలం కాస్సేపుండి.

"ఏముందీ?...నాకు తెలిసినంతవరకు మాతండ్రి మసీదుకెళ్లేడు కాదు. దేవాలయాల్లోకి హిందువులు రానిచ్చేవాళ్లూ కాదు. ఇహ నేనన్నారూ? నా కక్కడికి కెళ్లటానికి యిష్టంలేదు. భుజించే వస్తువులు అప్పుడూ యిప్పుడూ ఎప్పుడూ ఒకటే! మత్స్యమాంసాదులు వర్జ్యం!" అన్నాడు గాలీబు.

"మీ కిటువేపు బంధువు లెవరన్నా వున్నారా?" అన్నాడు గోపాలం.

"మీలాంటి స్నేహితులే" అని జవాబుచెప్పాడు గాలీబు నవ్వుతూ. గోపాలం చటుక్కున లేచాడు, నేను మళ్లా మీదర్శనం చేసుకుంటా నంటూ. అల్లా లేవటం గాలీబుకి కొంచెం ఆశ్చర్యం గలిగించింది.

"అప్పుడే వెళుతారా?...ఎప్పుడన్నా యిలాగే కనిపిస్తూండండి...ఈస్టేషనుపనిలో నాకు తీరికే వుండదు ఎక్కడికన్నా రావటానికైనాను" అన్నాడు గాలీబు లేస్తూ.

"ఆఁ...దానికేంలేండి? అలాగే. శెలవు." అంటూ గోపాలం పొలాలకేసి వెళ్లిపోయాడు. పదడుగులు గోపాలంతో బైటికొ, చూపానిసంతవరకూ అతనికేసే చూస్తూ, "మూర్ఖైన కుర్రాడు" కుంటూ లోపలి కెళ్లాడు గాలీబు.

గాలీబు చిన్నగదిలో కొచ్చేసరికి కిటికీలోంచి గబుక్కున ఉరికింది జానీ. "ఏమిటమ్మా...అలా వురికావేమిటి?...దెబ్బతగలదూ?" అన్నాడు గాలీబు.

"ఆఁ. ఏంలేదు." అంటూ తలొంచుకొని నీళ్లునముల్తూ సావిట్లో కొచ్చింది జానీ. కిటికీలోంచి గాలీబు పొలాలికేసి చూశాడు. దూరాన పొలంగట్లమీదుగా నిమ్మదిగా నడుస్తున్న గోపాలం యింకా కనిపిస్తునేవున్నాడు. గాలీబు వెనక్కితిరిగి సావిట్లోకి చూశాడు. అతని కళ్లల్లో ఆలోచన కనిపిస్తోంది. "ఆయన వెళ్లాడేమిటీ?" అంటూ మెహర్ గదిలో కొచ్చింది.

## ర

మొట్టమొదట్లో అతను ఆపిల్లని చూసింది ఏదోతమాషాకే. రెండోరోజుకూడా సరిగ్గా అలాగే చూస్తూండేటప్పటికి ఆపిల్లని గోపాలం కేవలం అందం, సౌందర్యంకోసం చూడటం మానలేకపోయాడు. ప్రతిరోజూ అలా తనకేసే చూస్తూండటం గోపాలం దృష్టికి మరికొంచెం అర్థంకల్పించింది. సహజమానవస్వభావం క్రమంగా గోపాలం 'చూపుల'ని ప్రేమచ్ఛాయల్లోకి దింపింది. గాలీబుపూర్వీకులు హిందూబ్రాహ్మలని తెలుసుకునేసరికి జానీ తన హక్కుభుక్తమైందని అనుకున్నాడు గోపాలం — అక్షరశః సత్యమే!

సంఘంచేత వ్యవహరింపబడేది: అతను స్వచ్ఛమైన హిందూ బ్రాహ్మణయువకుడు. ఆపిల్ల కేవలం మహమ్మదీయస్త్రీ. అతనికీ

ఆపిల్లకీ మన్య యిహిమాలయా లున్నాయి; సముద్రా లున్నాయి. పైగా కర్కశహృదయంతో సంఘం ఉంది.

"ఏతురకయువకుడికో యిచ్చి పెళ్లిచేస్తాడు ఆపిల్లని వాళ్ల నాన్న. ఆ అమ్మాయీ, ఆ అబ్బాయీ కాపురం చేస్తుంటారు. ఆ అబ్బాయి నేనుచూసే ఆ అమాయికపుకళ్లల్లోకి తన క్రూరదృష్టుల్ని బరపుతాడు. ఆయువకుడు ఆపసిచెక్కిళ్లని తన మొరటుపెదిమెల్తో ... ... ... అజాజిమొగ్గను అతను నలిపేస్తాడు. ఆనలిగిపోయిన తనువులోకూడా నాకుమటుకు జీర్ణశృంగారం గోచరిస్తుంది. ఆమే అతనూ భార్యాభర్త లౌతారు ... ... నేనో ? మావాళ్లు నన్ను పెళ్లిచేసుకోమని నిర్బంధిస్తారు. ౫ వేలు కట్నమిస్తాం. అవును, పిల్ల కూడా బాగానే వుంటుంది. ఐతే ఏం ? నా కాపిల్లయం దిష్టం ఉండదు. బలవంతంగా చేస్తారా పెళ్లి ? ఎందుకుచేస్తారు ? చేస్తే ఆపిల్లని చూచినప్పుడు నాకళ్లు తేలిపోవూ ? ముట్టుకుంటే ఒళ్లు గగుర్పొడవనూ ? కౌగలించుకుంటే ముళ్లు గుచ్చుకోవూ ? కాపురం చేస్తే నాశరీరం భస్మమైపోదూ ? ఏమైనాసరే, అటువంటి పిల్లనే చేసుకుని సంఘంకోసం గొడ్డల్లే పిల్లల్ని కనాలీ? ఇది సంఘమర్యాదా? నాకిష్టమైన, నన్ను యిష్టపడిన ఓఅమ్మాయిని వివాహమాడటానికి — తను కల్పించిన మతభేదమంటూ ఓటి తెచ్చిపెట్టి సంఘం అడ్డుతగులుతుందీ ? తరిమివేస్తుందీ ? హత్యచేస్తుందీ ?"

ఈభావాలు అతని మనస్సులో కొచ్చేసరికి గోపాలానికి పిచ్చెత్తినట్టయ్యేది. మనశ్శాంతికోసం పొలంగట్లంబడే షికారు కెళ్లేవాడు. పంటకాలువమీద పిల్లగాలులు వెచ్చగా తగిలేవి. లేతపైరులోని శ్యామలచ్ఛవి ఎడిపోయినట్టు కనిపించేది. పక్షుల కలకలా లతనికి వినబడేవేకావు. ఉదయిస్తున్న చంద్రబింబం ఎర్రగా కాల్చిన ఉక్కుసండల్లే వుండేది. తలలోని రైళ్ల వేగం తగ్గేదికాదు.

"అవును. ఆ అమ్మాయిచూపులు నా కలాగే అర్థమయ్యాయి. ఆ అమ్మాయి నన్ను ప్రేమించకపోయినాకూడా నాప్రేమని నేను మరల్చుకోను. ఆ అమ్మాయి నన్ను ప్రేమించటంకోసం నేను ఆ అమ్మాయిని ప్రేమించడంలేదు ఆ అమ్మాయే నన్ను తిరస్కరిస్తుంది ! నాకు విచారంలేదు. ఆ అమ్మాయితండ్రి మావివాహాని కంగీకరించకపోయినా నేను దుఃఖించను కాని సంఘంకోసం, సంఘానికి భయపడి అలా చేస్తే నేను సహించను. ప్రేమబూదిలో సంఘాన్ని పైశాచికతాండవం చెయ్యనివ్వను" అనుకుని కొంచెం శాంతించేవాడు గోపాలం ఒకొక్కప్పుడు.

తండ్రితో చెపుదామనుకున్నాడు తన ఉద్దేశాన్ని. కాని తగిన శుభకాలం దొరకలేదు. అసందర్భంగానైనా సరే, చెప్పటానికతనికి ఇష్టంలేకపోయింది. కొడుకుమొహంలో మార్పు లేవయ్య కనిపెట్టకపోలేదు. అయితే ఆయన అనుకుంది, యీడొచ్చిన కుర్రాడు, కాస్త పెద్దపిల్లని త్వరలో ముడేస్తే సరిపోతుందని. త్వరలో కోడలింటికొస్తే ఎంతబాగుంటుందో అని అతని కుంది.

ఃడిగ్రీతోబాటు ఈడైన పెళ్లాంకూడా వస్తుందిగదా అని సూరమ్మకి.

కాని గోపాలానికిమటుకు మనోవ్యథ—వ్యథగానేవుంది.

౫

"అతను చాలా బుద్ధిమంతుడు. తెలివిగల అబ్బాయికూడాను. మనిషైనా బాగానేవుంటాడు..." అంది మెహర్.

"ఎవరు?" అన్నాడు గాలీబు.

"ఆయనండీ? మొన్న సాయంత్రం రాలేదూ? ఎర్రగా బక్కపల్చగా వుంటాడు! అంతా మరిచిపోయినట్టు?" అంది మెహర్.

"ఎవరబ్బా? జ్ఞాపకం నుంటుందా?" అన్నాడు మరిచిపోయినట్టు గాలీబు.

"మరీని?...వేషాల్లెండి మీవి....నూటైన గ్రాడు అన్నారు కూడాను. బ్రాహ్మలేట...పెళ్లి కాలేదనీ, అదీ చెప్పాడు...తెల్లని కద్దరుధోవతీ అతనూ...జ్ఞాపక మొచ్చిందా?" అంది మెహర్.

"కానియ్యి వర్ణన...యింకా?...ఏళ్లు ముదిరినకొద్దీ..." భార్య కళ్లల్లోకి అదోరకంగా చూశాడు గాలీబు.

"చాల్లేద్దురూ?...మరీ చిన్న పిల్లాడై పోతున్నారు...అది కాదు కానీండి" అంటూ యింకొంచెం భర్తదగ్గిరగా జరిగి..."ఆ యీడుకుర్రాడుండాలండీ మన జానీకి" అంది మెహర్ కొంచెం నిమ్మదిగాను.

"ఊహూ!...ఇంకా ఎవరి కెలాంటివాళ్లు కావాలో చెప్పు" అన్నాడు గాలీబు తమాషాగాను.

"ఉబ్బ! నవ్వులు గాదండీ! అసలు అది ఎలాగో వుంటోంది ఈ మధ్య మరీని...యీడొచ్చిన పిల్లవునా?" అంది మెహర్.

"నాకు మాత్రం తెలీ దేమిటి? సంబంధం కుదరాలా?" అన్నాడు గాలీబు.

"కుదరాలా అంటే ? యింట్లో కూర్చుంటే ఎలా కుదుర్తుం దేమిటి? ఆ అబ్బాయికి పెళ్లి కాలేదని కాదూ చెప్పింది?" అంది మెహర్. ఆమెచూపులలో అర్థం లేకపోలేదు.

"అంటే? నీ కల్లుడవాలనా ఆ అబ్బాయి?" అన్నాడు గాలీబు కొంచెంగా నవ్వుతూ, మెహర్ మొహంలోకి చూస్తూను.

"అవాలనుంటే ఐతుందేమిటి?...ఏనా అనుకుంటానికే నా ఏదోశాస్త్రంచెప్పినట్టు....ఆ అబ్బాయి హిందూబ్రాహ్మలు...మన మో తురకబ్రాహ్మలమూనర్యే" అంది మెహర్. ఆమెమాటల్లో కొంచెం విసుగూ, విచారం కనిపిస్తుంది.

"ఏమోలెండి...అదుగో అప్పుడే పదకొండైంది...గడియ వేస్తాస్తా." అని లేచింది మెహర్.

గాలీబుకి మొట్టమొదట్లో గోపాలాన్ని చూసినప్పుడే అతనంటే మంచి అభిప్రాయం ఏర్పడింది. అతనితో పరిచయం ఎక్కువైన కొద్దీ అతనిమీద ఓవిధమైన అభిమానంకూడా ఏర్పడింది. అతను తనింటికి వస్తూపోతూండడం గాలీబుఅభిమానాన్ని ఓవిధమైన ప్రేమగా మార్చింది. అతనికి పెళ్లింకా కాలేదని తెలుసుకునేసరికి తన ముద్దుకూతురు జానీ చటుక్కున జ్ఞాపకంవచ్చింది. మెహర్ మాటల వల్ల గోపాలాన్ని తన అల్లుడుగా చేసుకోవాలనిపించింది గాలీబుకి కూడా. ఆరోజు తను చిన్నగదిలోకి వెళ్లినప్పుడు 'జానీ' చటుక్కున కిటికీలోంచి దుమకటం, కిటికీలోంచి చూస్తే దూరాన గోపాలం పొలంగట్లంబడే నడుస్తూండటం గాలీబుఉద్దేశాన్ని స్థిరపరచింది.

కాని—గోపాలం యిష్టపడొద్దూ?...గోపాలం బంధువులు, వాళ్లు అంగీకరించొద్దూ?...అన్నిటికంటె సంఘం వూరుకో వద్దూ?...ఆప్రశ్నలకి సమాధానం గోపాలమే చెప్పాలనుకున్నాడు గాలీబు. అతన్నడిగితే ఏమనుకుంటాడో? ఐనా అడగటానికే నిశ్చయించుకున్నాడు.

జానీమనస్సుయొక్క అస్థితేమిటో ఆమెకే తెలియాలి. అసలు మొదట్లో యధాలాపంగా తూర్పువేపుకిటికీలోంచి పొలంకేసి చూసింది. చూసేచూట్టంతోటే గోపాలంమొహం కొట్టచ్చినట్టు కనిపించింది. అప్పట్లో ఆమెకి ఏయితరభావాలు లేవు. కాని ఎంతసేపైనా ఆముఖం ఊరికే చూడబుద్ధయేది. నిజాని కాకాసేపు ఆమె కితరము లేవీ కనిపించేవేకావు. మర్నాడుకూడా రైలొచ్చేవేళకి అతను కనిపిస్తాడేమో చూద్దా మనిపించింది. కిటికీలోంచి చూస్తే ఆసుందర విగ్రహం ప్రత్యక్షమైంది.

అతనికి తనమీద అంతదయ ఎందుకు కలిగిందో ఆమెకే ఆశ్చర్యమేసింది. ఆమె సంతోషించింది. ఆమె అతన్ని మొదట్లో వూరికే సౌందర్యంకోసమే చూసింది. క్రమంగా అతని కళ్లల్లో బుద్ధిసూక్ష్మత చదివింది. అతను కూడా తనవేపే చూస్తున్నట్టు ఆమెకి తెలుసు. యుక్తవయస్సువచ్చిన తాను అల్లా ప్రవర్తించటం తప్పేమో అనుకునేది ఒకొక్కప్పుడు.తప్పయితే తన కలా చూడాలనిపిస్తుంది? తప్పయితే తన గుండెలు కొట్టుకోవూ? అలా జరగటం లేదుకనక తప్పుకాదని సమాధానపరచుకొనేది. కాని ఎవరన్నా చూస్తారేమోనని భయమేసేది. చూస్తేమాత్రం ఏం తప్పులేన ప్పుడు అనుకునేది వెంటనే. ఏరోజన్నా తను అక్కడ కనిపించకపోతే పాపం అతని కెలా వుంటుందో అని జాలిపడేదికూడాను. అతను తన వలా ఎందుకు చూడాలి తను అతన్ని చూసినట్టు? తనేమో అతన్ని 'సౌందర్యం' కోసం చూస్తోంది. అతనుకూడా అందుకేనేమో? ఔలే, తనూ అందంగానే వుంటుందికామాలు. అతను తనని 'సౌందర్యం' కోసం చూస్తున్నాడనుకునేసరికి జానీకి ముసిముసినవ్వులు, నునుసిగ్గు వచ్చేవి.

ఆరోజు గోపాలం వాళ్లింటికి వస్తాడని జానీ అనుకోలేదు. గదిలో ఏదో పుస్తకం చదువుకుంటున్న జానీ బైట కాళ్లచప్పుడు వినబడేసరికి కిటికీలోంచి యిట్టే చూస్తే అతనూ, తనతండ్రీ ఏదో మాట్లాడుకుంటూ వాళ్లింటివేపుకే వస్తున్నారు. అత న్నదివరకెప్పుడూ అంతసమీపంలో చూడలే దామె. అతని మాటకూడా ఆమె ఎప్పుడూ వినలేదు. అంతదగ్గిర్లో ఆమె అతన్ని చూట్టం, పైగా అతను మాట్లాడుతూండటం జానీఒళ్లు పులకరించినట్టయింది. అప్రయత్నంగానే జానీచెయ్యి ఆమెపైట సవరించింది. నిట్టూర్పు రావటం ఎందుకో ఆమెకే తెలియలేదు. మొహంమీది రెండు స్వేదబిందువులూ పైటచెంగుతోనే తుడుచుకుంది. రెండునిముషా లలాగే నుంచుని, పుస్తకం మూసేసి, దక్షిణంవైపు దొడ్లోకున్న కిటికీదగ్గర కెళ్లి కిటికీ కేసున్న తెరను కాస్త ఒత్తిగించి దొడ్లోకి చూసింది. గోపాలం దొడ్లో నూతిదగ్గిర కాళ్లు కడుక్కుంటున్నాడు. అతను తాను పెంచిన సన్నజాజులకేసి, తమలపాకుతీగకేసి, గులాబిమొక్కల కేసి బహుఆప్యాయంగా చూస్తూండటం జానీకి పట్టరాని సంతోషమైంది. తాను పెంచిన 'ఆచిన్నివనాన్ని' తాను చూసుకున్నప్పుడు పొందే ఆనందంకంటె అతను చూస్తే ఎక్కువఆనందం పొందిందెంచేతో జానీ. అత నాలేతతమలపాకును తన నున్నటి బంగారుకణికెల్లాంటి వేళ్లతో తాకుతే జానీచెక్కిళ్లు గిలిగింతలుపెట్టినట్టయినాయి. అతను ఒక్కపువ్వు కోసుకుంటే బావుండు ననిపించింది జానీకి. వాళ్ల అమ్మ,నాన్నా అక్కడుండకపోతే తనే కోసిస్తే ఎంతబావుంటుంది అనుకుంది. అతను ఒక్కగులాబిని తుంచాడు. ఆమె సంతసించింది. అత నాపువ్వును వాసనచూస్తూ, యిటూ అటూ చూసి ఆపువ్వుని ముద్దెట్టుకున్నాడు. జానీకి సిగ్గేసింది కాస్త. పెదిమెలు నాలికతో ఒక్కమాటు తుడుచుకొని, ఒక్కగుటక వేసింది. అతని మీద బుల్లికోపం వచ్చిందికూడాను. చిన్నకోపంతో మిళితమైన ముసిముసినవ్వులు నవ్వుకుంది లోలోపల. ఒక్కమాటు తలవంచుకుని, పైటతొలగిన తన ఉరోభాగాన్ని వక్కమాటు చూచుకొని, మోకాళ్లు ముడిచిపెట్టి, చేతులు రెండూ దగ్గిరికి తీసుకుని, పైటకొంగు ఒళ్లంతా కప్పుకుంది...తమలపాకుతీగకేసి అత నలా చూసినప్పుడు అతనికళ్లు కొంచెముగా ఎందుకు చెమ్మగిలాయో జానీ వూహించలేకపోయింది. జానీకి జాలేసింది. కొంచెంగా భయం కూడా వేసింది. అత న్నడుగుదా మనుకుందికూడాను జానీ. కాని సాహసించలేదు.

తాను అతని మాటలు వింది. దగ్గరలో అతని నడక చూసింది. తా నెంతో ఆనందంపొందింది. అతను గూడా తనని చూస్తే అత నెంతసంతోషిస్తాడో!...అత నింటికి వెళుతుంటే తాను కిటికీలోంచి చూపు అందేదాకా చూస్తూనేవుంది. అతను నిజానికి కనిపించనంత

దూరం వెళ్లిపోయినప్పటికీకూడా తన హృదయంలో అతను మెసులుతున్నట్టుగానే వుంచి జానీకి...ఆరోజురాత్రి తను నిద్ర పోతున్నాననుకుని ప్రక్కగదిలో తల్లీ, తండ్రీ మాట్లాడుకునే మాటలు తాను విన్నది...... 'అతను నీ కలు డవాలనుందా?' అన్నాడు తండ్రి. ఆమాట వినేసరికి జానీకి కొంచెం సిగ్గేసింది కూడాను. కాని "అంతభాగ్యంకూడానా? అవాలనుంటే మాత్రం అవుతుందీ?" అని తల్లి అన్నప్పుడు మాత్రం తనకి ఎక్కడలేని దుఃఖమూ వచ్చింది 'అతను నన్ను పెళ్లిచేసుకోడూ? ఏం? ఎందుకని? నే సంపంగా లేనూ? లేకపోతే అత నెందు కలా అప్యాయంగా నాకేసి, ఆపెద్దకళ్లు పెట్టుకుని చూస్తాడు? అతను చేసుకోనంటే నేనే అతనిదగ్గిరికెళ్లి 'నన్ను పెళ్లిచేసుకోవూ' అని దీనంగా అడుగుతా, అతని నున్నటివేళ్లు సెమ్మదిగా పట్టుకుని, అసుందరమైన మోహంలోకి చూస్తూ. అప్పటికి చేసుకోనంటాడూ?...అనడు. అత నంత కఠినమైనఆయన కాడు. అతని కళ్లల్లో కర్కశత్వం లేదు అతని అందమైన ఆచేతులు నన్ను తిరస్కరించలేవు...ఎంతకీ [illegible] కపోతే నే నిలాగే వుండిపోతా." అనుకుంటూ వుండేది జాని లోలోపల. జానీమనోవీథిలో యీదృశ్యాలన్నీ తెరమీద సినిమాబొమ్మలల్లే పరుగెడుతుండేవి.

*        *        *        *

ఆరోజు ఆదివారమూటంచేత గోపాలం గాలీబుదగ్గిరికి ప్రయాణమయ్యాడు. రైలుదిగేదిగటంతోటే గాలీబు గోపాలాన్ని చిరునవ్వుతో ఆహ్వానించి, రైలు వెళ్లిపోగానే యిద్దరూ యింటికి వచ్చారు. దొడ్డి వసారాలో టేబిల్‌మీద చక్కరకేళీ పండ్లు, మైసూరుపాకం అచ్చులు పెట్టివున్నాయి. రెండు వెండిగ్లాసులతో మంచినీళ్లు గూడా వున్నాయి. ఇద్దరూ మామూలుగా చెరోకుర్చీలో కూర్చున్నారు.

"అలా సందేహిస్తారేం? మొహమాటమల్లే వుంది మీకు?" అన్నాడు గాలీబు కొంచెంగా నవ్వుతూను.

"మీదగ్గిరా? ఉంటే మటుకు? నిజంగా మీ ప్రేమపూరితమైన హృదయం నన్నీ ఆదరణని తిరస్కరించ నియ్యడం లేదు" అన్నాడు గోపాలం.

"స్నేహధర్మం మీ ప్రతిమాటలోనూ కనిపిస్తూనేవుంది.... నిజానికి స్నేహితుల ముందు బంధువు లోలెక్కా? ఒక్కొక్కప్పుడనుకుంటూవుంటా, స్నేహితులే బంధువులైతే ఎంత సంతోషంగా ఉంటుందో అని" అన్నాడు గాలీబు. అతని కళ్లల్లో ఎంతో అర్థం వుందని గ్రహించాడు గోపాలం.

"అనిపిస్తుందిగాని నిజానికి క్రియలో కొచ్చేసరికి మనమే జంకుతాం! స్నేహితులంటే ఒక్క మతంలో వాళ్లుమాత్రమే కాదయ్యో!" అన్నాడు గోపాలం. ఒకళ్ల మొహంలోకి ఒకళ్లు చూసుకున్నారు.

"మాశారూ! యీ మత భేదాలంటే నాకు పరమాసహ్యం. స్నేహ ధర్మానికి ప్రేమ ధర్మానికి అడ్డం ఒచ్చే మతాలంటే మరీని" అన్నాడు గాలీబు. గోపాలం జవాబు చెప్పలేదు.

"అలా షికారుగా వెడదామేమిటి?" అన్నాడు గాలీబే కాస్సేపాగి.

"ఓ. అంతకన్నానా?" అన్నాడు గోపాలం. అతనిమనస్సు కేవలం అక్కడే లేదు.

'డ్రస్సు' మార్చుకొస్తానని గాలీబు లోపలి కెళ్లాడు. గోపాలం కుర్చీలో కూర్చునికూర్చుని, ఏం తోచక, వసార్లోనే పచారుచేయడం మొదలెట్టాడు. అతని దృష్టి అప్రయత్నంగానే వసారాలోంచి గదిలోకున్న కిటికీవేపుకు మళ్లింది. కిటికీకున్న తెర ఓమూలకి వత్తిగించబడుంది. అతను ముగ్ధుడైపోయాడు. అంతదగ్గిరలో జానీ నెప్పుడూ అతను చూడలేదు. పైగా ఆమెవిగ్రహమంతా యిప్పుడు సంపూర్ణంగా కనిపిస్తోంది. ఉల్లిపొరలాంటి గులాబిరంగు పైటలోంచి పట్టుపూలజాకెట్టు స్పష్టంగా కనిపిస్తూ పైటయొక్క ఉనికినే సంశయాస్పదం చేస్తోంది. రెండుచేతులూ పైకెత్తి కిటికీఊచలు పట్టుకుని, ఆ నల్లటి కళ్లల్లోంచి తనకేసి నిశ్చలంగా చూస్తూంటే గోపాలంఒళ్లు పులకరించింది. ఆమె యీనాటి చూపుల్లో అతను యిదివరదాకా గ్రహించరాని ఓగొప్ప అర్థం గ్రహించాడు. గ్రహించి ఆనందించాడు. ఆనందించి కళ్లుమూసుకున్నాడు. కళ్లు తెరిచేసరికి కిటికీలో ఎవరూ లేరు.

"పంతులుగారూ వెడదామా?" అని వెనకనుంచి గాలీబు మాటలు వినిపించాయి. గోపాలం ఉలిక్కిపడలేదు. మౌనంగా గాలీబుని అనుసరించాడు. గాలీబుకి ఆశ్చర్యం అయింది. తాను జానీకేసి చూస్తూనుంచున్నప్పుడు వెనకనుంచి గాలీబు రావటం, తండ్రిని చూసి, జానీ ఉలిక్కిపడకపోయినా అక్కడ నుంచోలేక గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్లటం గోపాలానికి తెలీదు.

ఊరివెలుపలి డొంక దాటేదాకా ఎవరూ మాట్లాడలేదు.

"నాజీవితంలోకల్లా నేను చెయ్యాలిసినవాటిల్లో కల్లా మిగిలిందల్లా ఒక్కటి" అన్నాడు గాలీబు, ఆ నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ.

"ఆఁ...ఏమిటి అన్నారు?..." అన్నాడు గోపాలం ఏ ప్రపంచంలోంచో దిగొచ్చినట్టు.

"అవును...మా జానీపెళ్లి. అదొక్కటంటే ఒక్కటే...మా చిన్నిపెళ్లి..."అన్నాడు గాలీబు. గోపాలంప్రశ్న సరిగా వినిపించుకోలే దతను.

"అంటే?...మీఅమ్మాయిపెళ్లి? ఎప్పుడు చెయ్యాలని? వరికిచ్చి?"అన్నాడు గోపాలం. గాలీబుకళ్లల్లోకి కొంచెం ఆత్రంగాం చూస్తూను. గాలీబు కాస్సేపటిదాకా జవాబు చెప్పలేదు. గోపాలవి

క్కేసి వివరంగా చూశాడు. అతని కేంవిశేషం కనిపించలేదు. జేబు రుమాలుతో మొహం తుడుచుకున్నాడు.

"మీకు అంతర్వర్ణవివాహాలు యిష్టమేనా ?" అన్నాడు గాలీబు. గోపాలానికి ఆశ్చర్యంవేసింది. గాలీబుమొహంలోకి వింతగా చూస్తూ "క్షమించాలి. నే నడిగింది మీ అమ్మాయిపెళ్లివిషయం! మీ ప్రశ్న, మీ రెండు కలా అనుసతున్నారో నేను తెలుసుకోలేక పోతున్నాను" అన్నాడు.

"క్షమించాలి, సరిగ్గా సమాధానం చెప్పలేనందుకు. అంతర్వర్ణ వివాహాలవిషయంలో తమ ఉద్దేశం చెప్పాలి దయచేసి"...అన్నాడు గాలీబు రుమాలుతో మళ్లా మొహం తుడుచుకుంటూను. గోపాలానికి విషయం బాగా అర్ధంకాకపోయినా తన అభిప్రాయం చెప్పటం కంటే వేరే సమాధానం కనిపించలేదు.

"బాహ్యవర్ణ మేదైనా ఫరవాలేదు, భావవర్ణ మేకమైతేను" అని జవాబు చెప్పాడు గోపాలం, గాలీ బేమంటాడో అని ఆత్రంగా చూస్తూను.

"అంటే ?" అన్నాడు గాలీబు.

"ఒకరొకరి భావాలు కలిస్తే, వారివారి మతాలు వేరయి నప్పటికీ ఫరవాలేదు, నిజాని కది అంతర్వర్ణవివాహమే కాదు. ఏక వర్ణులైనప్పటికీ పరస్పరవిరుద్ధమైన భావములు గలవారి వివాహమే అంతర్వర్ణవివాహ మంటేను...క్షమించాలి...యిది నాఅభిప్రాయము మాత్రమేసుమండీ!!" అన్నాడు గోపాలం. గాలీబు ఏమంటాడో అని గోపాలం ఆత్రంగా చూస్తున్నాడు. గాలీబు రెండునిముషా లేమీ మాట్లాడలేదు.

"ఔతే ఒక్క విషయం అడుగుతా, మీకు కోపంరాకుంటేను" అన్నాడు చివరకి గాలీబు. గోపాలానికి తొంద రెక్కువౌతోంది. అతని కేమీ సరిగ్గా బోధపడటంలేదు.

"తొందరగా అడగాలి...కోప మేమాత్రమూ లేదు. మీ ఉద్దేశం తెలుసుకుంటానికి నామన స్సెంత తొందరపడుతోందీ మీకు తెలుసు ననుకుంటా" అన్నాడు గోపాలం.

"మాజానీని మీకిచ్చి వివాహంచేయాలని నాఉద్దేశం, కోరిక, ప్రార్థనకూడాను" అన్నాడు గాలీబు. ఆత్రంతో చూశాడు గోపాలం మొహంలోకి. గోపాలం విస్మితుడయ్యాడు. తనచెవుల్నే తాను నమ్మలేకపోయాడు. ఆనందంతో ఉప్పొంగిపోయాడు. మొహం మీద చెమటబిందువులు మొలిచాయి. జేబురుమాలుతో తుడుచు కుంటూ పెద్దనిట్టూర్పు విడుస్తూ..."మీరు నిజంగా అంటున్నారా ?" అన్నాడు గోపాలం. ఈ ప్రశ్నవల్ల గాలీబు ఆదుర్దా తీరలేదు. పైగా ఎక్కువైంది కూడాను.

"నిస్సందేహంగాను! ప్రమాణపూర్తిగా కూడాను!!" అన్నాడు గాలీబు.

"మీ అనుగ్రహానికి కృతజ్ఞుణ్ని." అనిమాత్రం అన్నాడు గోపాలం జవాబుగా. ఈజవాబైనా గాలీబుకి సంపూర్ణంగా కనిపించలేదు. గోపాలాన్ని ప్రశ్నించలేకపోయాడు. మౌనంగా యిద్దరూ యింటి వైపు మళ్లారు. ఇల్లు జేరేదాకా ఒకళ్లతో ఒకళ్లు ఏమీ మాట్లాడుకోకపోయినా ఇద్దరిబుర్రలూ మాత్రం తీవ్రంగా పనిచేస్తున్నాయి.

గాలీబు యింతత్వరలో తనంతటతానే "మాజానీని పెళ్లి చేసుకోండి మీరు." అని అంటాడని గోపాలం కలలోకూడా అనుకోలేదు. తాను మనసారా ప్రేమించాడు ఆ అమ్మాయిని. అంత వరకు తనకి తెలుసు. ఆపిల్లతండ్రి "మాఅమ్మాయిని మీరు వివాహమాడ గోరిక" అని తనతో అన్నాడు. కాని సంఘం ఒప్పుకోదు తమ పెండ్లికి. కాని సంఘాన్ని లెక్కచెయ్యడు గోపాలం. కాని తన తండ్రి అంగీకరిస్తాడా? అంగీకరించకపోయినా చేసుకుంటే తన్ను యింతవానినిగా చేసిన తండ్రికి ద్రోహంచేసినవా డవడూ? లేక తన హృదయాన్ని చంపుకుంటాడా? ఏమో ఒకవేళ తండ్రికూడా అంగీకరిస్తాడా?—ఇదే ఆలోచన గోపాలానికి దారిపొడుగూనూ.

"కుర్రాడు బుద్ధిమంతుడే. తెలివిగలవాడేకూడాను. తాను మనస్ఫూర్తిగానే అన్నాడు నాకూతుర్ని మీరు పెండ్లిచేసుకోమని. కాని సంఘం ఒప్పుకోవద్దూ? సంఘానికి ఎదురీత యీదాలి. తాను యీదుతాడు తన కూతురికోసం. అతనూ యీదొచ్చు! కాని వాళ్ల వాళ్లు, అతని తండ్రి ఒప్పుకోవద్దూ? బహుశః ఒప్పుకోడు. కాని నేనన టంమాత్రం అనేశా. ఈసంగతి తెలిస్తే లోకు లేమనుకుంటారు? ఏమో? నేను నాకూతురికోసం సంఘాన్ని ఎదుర్కొనవలచినట్టే అతనితండ్రికూడా తనకొడుకుకోసం సంఘాన్ని ఎదుర్కోరాదూ? అలా ఔతే చిక్కేలేదు! కాని అలా జరుగుతుందీ?" — గాలీబు బుర్రలో తిరిగే విషయా లివే ఆకాస్సేపూను.

"ఒక్కొక్కప్పుడు సంఘంయొక్క కర్కశత్వం మనకి కనిపించదు." అన్నాడు గాలీబు గోపాలంతో యింటికి జేరినతర్వాత. "అప్పుడు నిజంగా సంఘంలో కర్కశత్వమనేదే లేదనుకుని వ్యవహరిస్తేమటుకు ప్రమాదమే సంభవిస్తుంది."

గాలీ బిలా ఎందుకంటున్నాడో గోపాలానికి తెలీలేదు. కాని సమాధానం ఏదో చెప్పాలికనక "కర్కశత్వం హృదయాలోతుల్లోనే గంభీరమైన ప్రేమవుంది. కాని ఆసంగతి 'కర్కశుని' కి తెలీదు." అన్నాడు.

"ఉన్నప్పటికీ అక్కరకొచ్చేది కాదనుకుంటా" అన్నాడు గాలీబు.

"ధర్మబద్ధమైన విషయాల్లోమాత్రం ఆప్రేమ సహాయపడుతుంది. కానప్పుడుమాత్రం ఆ 'కర్కశత్వం' విజృంభిస్తుంది. నిజానికి ప్రేమ తన హృదయంలోని దని కర్కశత్వానికి తెలిస్తే కర్కశత్వం అంతక్రూరంగా వుండదేమో!" అన్నాడు గోపాలం అదోరకంగా చూస్తూ.

పక్కకి తిరిగి గబుక్కున కుర్చీలోంచి లేచి "నేను చూడనేలేదు. వచ్చి స్నానంగూడా చేశారూ అప్పుడేను. అబ్బ! ఒకటే తిరుగుడు, యిలా పడకుర్చీలో కూర్చోండి. భోజనం చెయ్యకపోయారూ" అన్నాడు అతి ఆదుర్దాగాను.

"ఫరవాలేదులే నాన్నా... కూర్చో అమ్మా. లేవకు. నే నిక్కడ కూచున్నాగా" అన్నాడు శేషయ్య.

"ఎంతఎండలండీ అప్పుడేనూ? మీమొహం ఎంతవాడిపోయిందండీ? వెధవపరీక్షలోటి, నేను తిరుగుదామన్నా. ఆట్టే తిరక్కండి. శలవులివ్వగానే నేనన్నా చూస్తాను. ముందిలా పడకుర్చీలో కూర్చోండి..." అంటూ, గోపాలం తండ్రిని బలవంతంగా పడకుర్చీలో కూచోపెట్టి ఒక్క అంగలో యింట్లోకెళ్లి వట్టివేళ్ల విసనకర్రను, సుగంధపాల షర్బత్తు తీసుకొచ్చి "ముందిది త్రాగండి. విశ్రాంతిగా వుంటుంది" అంటూ పేముకుర్చీ తండ్రికింకా దగ్గిరిగా లాక్కొని ట్టాడు తండ్రికి. గోపాలంచేసే ప్రతిపనీ శేషయ్యహృదయంలో ఆడుతున్న ఆవేదనాతరంగాన్ని బయటికి నెట్టుతోంది. కొడుకుచేసే ఆదరానికి, చూపించే ప్రేమకి శేషయ్య కుమిలిపోతున్నాడు. తనకొడుకు, ఏకొడుకూ ఏతండ్రికి చూపని ఆదరము, ప్రేమ చూపుతున్నాడు. తనో? ఏతండ్రీ ఏకొడుకుకీ చెయ్యనంత అపచారం చేస్తున్నాడు. తన కొడుకుని ఓ 'సన్యాసి'గా తయారుచేశాడు. తనే! తన కొడుకునే! తనకొడుకో? దానికి ప్రతిక్రియగా తనకు పూర్వంకంటేగూడా భక్తిశ్రద్ధలనూ, గౌరవాదరములనూ చూపుతున్నాడు. తనో ఘోరరాక్షసి. తన కొడుకో? ఆరాక్షసియొక్క కర్కశత్వాన్ని తెలుసుకుని కూడా దానినే పూజిస్తున్న ఓ అమాయిక తపస్వి. తానో క్రూర వ్యాఘ్రము. తన కొడుకో? వ్యాఘ్రంకోసం బలైపోతున్న ఓనిర్మల జీవి. తాను కేవలం పశువు. తన కొడుకు మానవుడు"

శేషయ్య కంపించిపోయాడు... "నాన్నా, విసరకోయి" అన్నాడు. అతని ఆవేదనాతరంగము తీవ్రవేగంతో నేత్రాలదగ్గిర కొచ్చి భంగమై, తుంపురులై, కన్నీళ్లయి ప్రవహించింది. గోపాలం కంగారైపోయాడు, అకారణంగా తండ్రలా కన్నీళ్లు పెట్టుకున్నందుకు. గాభరాతో

"ఎందుకు నాన్నగారూ?... అలా ఎందుకు? నాకు భయమేస్తోంది. చెప్పరూ?...చెప్పండి...వూరుకోండి."

అంటూ పడకుర్చీపట్టెమీద కూర్చుని, తండ్రిమీదికి ఒరిగి ఓచెయ్యి తండ్రిభుజంమీద వేసి ఇంకో చేత్తో తండ్రికన్నీళ్లు ఒత్తుతూ తండ్రిమొహంలోకి చూశాడు. శేషయ్య మాట్లాడలేకపోయాడు.కన్నీళ్లాగనూ లేదు. తనమీదికి ఒరిగివున్న కొడుకుమెడ తన చేతుల్తో చుట్టేసి, కన్నీళ్లు యింకా కారుస్తూనే "యీ దుర్మార్గుడు కనక బతికాడు......యింకోళ్లాతే యీపాటికి చచ్చిపోను, నీకుచేసిన అపచారానికి" అన్నాడు శేషయ్య గద్గదికతో. గోపాలాని కర్థంకాలేదు తండ్రిమాటలు. అతనికళ్లుకూడా చెమ్మగిల్లినాయి కొద్దిగా. కాని యువకహృదయ మవటంచేత కన్నీళ్లు క్రిందమాత్రం పడలేదు. తండ్రిచేతులు తనమెడకి కాల్చిన ఉక్కుకడ్డీలల్లే తగిలాయి.

"నువ్వు వివాహం చేసుకోకపోతే యీఘటం బ్రతకదు." అన్నాడు శేషయ్య దుఃఖం దిగమ్రింగి కొంచెంగా.

"చేసుకుంటా...తప్పకుండా చేసుకుంటా...ఆభాగ్యానికి మీకింత యిదివాలా?" అంటూ గోపాలం తండ్రిమొహం తడిగుడ్డతో అద్దాడు. తండ్రియొక్క ఆస్థితి చూడలేకపోయాడు గోపాలం. చచ్చిపోతాడంటే భయమేసిందికూడాను. తన కిష్టంలేని పిల్లనైనా సరే చేసుకుందామనే అనుకున్నాడు తండ్రికోసం. తనని పెంచి పెద్దచేసిన తండ్రిమాట జవదాటరాదనే ధర్మసూత్రం స్ఫురణకివచ్చి



"నువ్వు వివాహం చేసుకోకపోతే యీఘటం బ్రతకదు అన్నాడు..."

తరా

## శుద్ధ స్వదేశి వస్త్రములు

భారతదేశమునందే భారతీయులచే స్థాపింపబడిన యంత్రసహాయమున తయారుచేయబడిన పాప్లిన్ షర్టింగ్, ఇతర పలురకముల షర్టింగులు, కోటుగుడ్డలు, చీరెలు, అంగవస్త్రములు, ధోవతులు, లాంగ్ క్లాత్ ట్విల్, బెడ్ షీట్లు, జాకెట్టురకములు, వగైరా స్వదేశి జవిళీరకము లన్నియు సిద్ధముగా నున్నవి. మామూలు ఖాతాదారులందరికి చాలతృప్తిగలిగినది. గాన ఇతరులకు తప్పకతృప్తికలుగుననియే మాదృఢనమ్మకము

ఒకసారి వాడిచూచినచో మా వస్త్రముల నాణ్యదనము తెలియును.

**కృష్ణా అండ్ కంపెనీ,**

242 244, చైనాబజారురోడు, మదరాసు

## కామలీలా మాత్రలు

పైన పూయబడు లేపనమైనను.

ధాతుపుష్టికి దాంపత్య సౌఖ్యమునకు మంచి దోహదములు.



నీ యౌవన సౌభాగ్యము పోగొట్టుకొనక జీవిత సౌఖ్యమును కాలంకముగ ననుభవింపుము.

ఒకమాత్రను నోటిలోవేసికొని పాలుత్రాగుము. మంచి ధాతుపుష్టి కలిగి జీవిత సౌఖ్యము ననుభవింపవచ్చును. లేపనమునకు ఒకతైలము గూడ పంపబడును.

వీటివలన పుంస్త్వహీనత, దుర్బలత్వము నశించును. మానవుల పాలిటికి కేవలము వరప్రసాదము వంటిది.

ఔషధములతో పాటు మా ప్రకల గ్యారంటీ పత్రము పంపబడును. సరిగా పనిచేయనిచో, సొమ్ము తిరిగి వాపసుచేయబడును. 24 మాత్రల ఖరీదు రు 2/- లు.

లభానా తైలము బుడ్డి 1 కి రు 1/- వివరములకు

The Manager:—

**The Kamaleela Pills Depot,**
**Salem.**

వెలస్వల్పము. ఫలమధికము.

## గళరోగనివారిణి
## (Tonsils Cure)

అపూర్వమైన యౌషధరాజము.

డాక్టరులచే పరీక్షింపబడి గొప్పవారివలన యోగ్యతాపత్రముల వడసినది

శస్త్రచికిత్స చేయనక్కరలేదు. శస్త్రచికిత్స వ్యయప్రయాసలకు మూలము. ఈ గళరోగనివారిణి 'టాన్సిల్సు' లేక గళగ్రంథులను రూపుమాపును. సిద్ధులచే కనిపెట్టబడిన చికిత్స. రసవిష గంధకాదుల సంబంధములేదు. గుణమివ్వనిచో సొమ్ము వాపసుచేయబడును. ఇచ్ఛాపథ్యము. అందఱకు సులభమగునట్లు స్వల్పధర కివ్వబడుచున్నది. అనేకులు వాడి గుణము చెందిరి. మావద్ద యితరమందులుగూడ దొరకును.

మా పెద్ద క్యాటలాగుకు వ్రాయుడు.

ఇరువదిరోజులమందు రు. 2-0-0. పోష్టుఖర్చులు ప్రత్యేకము.

**డాక్టర్, బి. వి. రంగాచార్యులు,**

ప్రొప్రైటర్ శ్రీ చెన్నకేశవ ఆయుర్వేదవైద్యశాల

తరకటూరు, కాజపోస్టు, కృష్ణా.

## మా సలహా గమనించండి!

భారతదేశమందంతటను గల 317 పుణ్యతీర్థములను గురించిన సంపూర్ణ వివరణలతో పెద్దప్లాను గలిగి వెలువడిన మా

## తీర్థయాత్రాప్రదర్శిని

ప్రతివారును విధిగా కొనదగినది

"గ్రంథము చిన్నదైనను గుణమున మిన్న. తగినంతమంది జనుల తోడ్పాటుగాని యితర సాహాయ్యముగాని లేకయే తీర్థయాత్రలు చేయదలచువారికిది చింతామణివంటి గ్రంథము" అని బ్రహ్మశ్రీ పం॥ ఆదినారాయణ శాస్త్రిలుగా రభిప్రాయమొసంగిరి.

వెల ప్రతి 1 కి పో॥ ఖ॥ సహా రు. 1-0-0 మాత్రమే.

వలయువారు:—

**ఇర్రింకి నరసింహమూర్తి,**

తోలేరు, వీరవాసరంపోస్టు, భీమవరంతాలూకా,

పశ్చిమగోదావరి జిల్లా.

కాదతనలా అంది. తండ్రిమీద వుండే గాఢ ప్రేమాతిశయం అలా పలికించింది. ఆ సమయంలో గోపాలంమనస్సులో జానీఛాయ అయినా కనిపించలేదు.

'చేసుకుంటా' అనేసరికి శేషయ్యప్రాణం లేచొచ్చింది. 'మరి ఆపిల్లకి పెళ్లికాలేదా యింకాను.' అన్నాడు ఆత్రంగాను. "అప్పుడే పెద్దదన్నావల్లే వుంది"

"ఏపిల్ల ?" అన్నాడు గోపాలం ఆశ్చర్యపోతూ.

"మనపక్కస్టేషనే అన్నావు?......"అన్నాడు శేషయ్య.

గోపాలానికి సంతోషంకంటే ఆశ్చర్యం బహుళమైంది.

"ఆపిల్లా? ... ఒద్దన్నారు ... యిదివరకు ..." అన్నాడు గోపాలం.

"మళ్లీ అప్పటిమాట ఎత్తి నన్ను ఏడిపించకు...చెప్పు' ఆపిల్లకి పెళ్లయిందా ?" అన్నాడు శేషయ్య తొందరపడుతూను.

"లేదు..." అన్నాడు గోపాలం, తండ్రికేసి నివ్వెరపోయి చూస్తూను. శేషయ్య సంతోషంతో కుర్చీలోంచి గబుక్కున లేచాడు..."రేపే బైల్దేరుతున్నా మహూర్తనిశ్చయానికి... నీ కేం అభ్యంతరం లేదుగదా ?...నన్నేం అడక్కు యిహ. లేదు అని చెప్పు"...అన్నాడు శేషయ్య.

"లేదు" అన్నాడు గోపాలం సరిగ్గా చెప్పే దేంలేక.

శేషయ్యకళ్లల్లో మెరిసే విప్పు డానంగబాష్పాలు. అత నిప్పుడు కొడుకుని కౌగలించుకుంది సంతోష సూచనార్థం.

*　　　*　　　*　　　*

"గాలీబుసాహెబుగారి రిక్కడేగదండీ వుండేది ?"

"చిత్తం...దయచేయండిలా కుర్చీలో."

"లోపలున్నారాండి ?...తమ రెవరు ?"

"క్షమించాలి...నన్నే గాలీబంటారు...తమ దేయూరు ?"

శేషయ్య దిగ్భ్రమచెందాడు. గాలీబంటే నల్లగా, పొట్టిగా, బోడిగుండుతో, మూరెడుగడ్డం వేసుకుని చుట్టకాలుస్తూ వుంటాడని అతనియూహ. తీరాచూస్తే యితను. గోపాలం ఆయనమనస్సుకి జ్ఞాపక మొచ్చేసరికి శేషయ్యమొహంలో చిరుమందహాసం తాండవించింది.

"మీరే నన్ను క్షమించాలి...ఎదుటున్నవారినిగూడా తెలుసుకోలేకపోయినందుకు... మీరు మహమ్మదీయులని ఎవరూ అనుకోరనుకుంటా" అన్నాడు శేషయ్య.

"ఆ...అలాగే ... ఏవూ రన్నారు తమది ?" అన్నాడు గాలీబు.

"యీపక్కస్టేషనే...తమతో మాట్లాడుదామని..."అన్నాడు శేషయ్య.

"నాతోనా?" అన్నాడు గాలీబు సాశ్చర్యంగా, ఆజంఘ్యాలు, పిలకజుట్టుకేసి చూస్తూ.

"అలా అన్నారేం?...తమతోనే!!...మీకు వివాహం కావాల్సినవారు రుందికదూ?" అన్నాడు శేషయ్య కొంచెంగా నవ్వుతూను.

'ఈపక్క స్టేషనే' అన్నప్పుడే కలిగిన అనుమానం గాలీబుకిప్పుడు కొంచెం దృఢపడ్డది గోపాలం తాలూకేమో నని. "అయినా అదెల్లా సందర్భమాతుం" దని ఒకవేళ ఏజ్యోతిష్కుడో అవుతే అవచ్చుననుకుని, "జనాబ్ మీరు జ్యోతిష్కు లనుకుంటా. నాకైనా అట్టే నమ్మకం లేకపోయినా జ్యోతిషమంటే సరదామాత్రం లేకపోలేదు" అన్నాడు గాలీబు.

"అబ్బే! కాదండీ!! మా అబ్బాయి .డు." అన్నాడు శేషయ్య. అతని ముసలిపెదిమెలమీద లేతినవ్వు చిందులాడింది.

"మీఅబ్బాయంటే...గోపాలంగారా?" అన్నాడు ఆత్రంతో గాలీబు.

"మరేం?...మీకూ,మావాడికీ చాలాపరిచయమనీ...మీఅమ్మాయి వివాహవిషయం ఆలోని..." అన్నాడు శేషయ్య. గాలీ బనుకుంది గోపాలం తనతండ్రితో ఆవిషయం చెప్పాడనీ, అంచేత కాఫీ తియ్యటాని కిలా వచ్చాడనీ అతనితండ్రి. అంచేత డబ్బున వదిలించుకుందామని "జనాబ్, తమరు నాతో ఏదో ప ంచని శెలవిచ్చారు...అసలు విషయం విడిచి చాలా దూరం వచ్చినట్టున్నాం" అన్నాడు గాలీబు.

"లేదులెండి. వచ్చిన విషయమే మాట్లాడుతున్నాం...మీ అమ్మాయి కింకా పెళ్లి కాలేదనీ...అదీ మావాడితో చెప్పారట" అన్నాడు శేషయ్య మళ్లీని.

"ఆఁ... ఏదోలెండి ... స్నేహభగ్నంలో, ఏదో లోకాభిరామాయణంగా మాట్లాడుకున్నాం లెండి...మీతో చెప్పాడేమిటి? అనవసరం...పాపం...ఏదో చెప్పాడు కామాల్ను..." అన్నాడు గాలీబు కొంచెం విసుగులతోను, చిరాకుతోను, గోపాలం ఎందుకు చెప్పాడా అనే కోపంతోకూడాను.

"మీకు విసుగు కల్గిస్తున్నా. క్షమించాలి....మీరు మీ అభిప్రాయం మార్చుకున్నట్టు కనిపిస్తోంది" అన్నాడు శేషయ్య. అతను కొంచెం కలవరపడ్డాడు.

"జనాబ్, మీరెందుకొచ్చారో నాకు బోధపడటంలేదు. ఏదో స్నేహంలో ఏమిటేమిటో మాట్లాడుకుంటాం. నిజాని కాయన మీతో చెప్పకూడదు. మీకు కష్టంగా వుండల్లే వుంది...క్షమించాలి... మీకు నాతో యింకేం పనిలేదనుకుంటా", అన్నాడు గాలీబు.

"వివరంగా చెప్తున్నా వినండి...మీరూ మేమూ వియ్యం పొందాలని వుద్దేశం. మావాడితో మీ రిదివరకే అనివున్నారుట. మీపిల్ల కింకా పెళ్లికాలేదని మావా డన్నాడు. మీ అభిప్రాయం మారకపోతే శీఘ్రంలోనే వివాహం చేద్దామని అభిప్రాయం. నేనిలా చెప్తుంటే మీకు ఆశ్చర్యంగా వుండొచ్చు నావాలకం, అదీ మాస్తే. నా కొడుకుకోసం నేను సంఘాన్ని విడిచిపెట్ట దలచుకున్నా..." అన్నాడు శేషయ్య.

గాలీబు తెల్లబోయాడు, ఆశ్చర్య పడ్డాడు, నివ్వెరపొందాడు. ఇలా జరుగుతుందని అత డెప్పుడూ అనుకోలేదు. కాకపోతే తండ్రినీ వాళ్లనీ విడిచేసి గోపాలం తనకూతుర్ని పెళ్లి చేసుకుంటే చూసుకుంటూ డనుకున్నాడు తప్పితే.



"ఇవాళ నిజంగా సుదినం"

"ఇవాళ నిజంగా సుదినం...క్షమించాలి... మీ ఉద్దేశం మొదట్లో తెలుసుకోలేక మీ మనస్సు కలవరపరచినందుకు" అన్నాడు గాలీబు.

వీళ్ల సంభాషణ పక్క గదిలోంచి వింటూన్న మెహర్ సంతోషంతో ఒక్కంగం తేసి గదిలో రుమాలు అల్లుకుంటున్న కూతురి ముంగురులు దిద్దింది. గాలీబు లోపలి కెళ్లి జానీని తీసుకొచ్చి మామగారికి నమస్కారం చేయించాడు. కోడల్ని చూసుకుని శేషయ్య ముగిసిపోయాడు. "సౌభాగ్యమస్తు!! దీర్ఘాయురస్తు!!!" అని దీవించాడు.

"నా ఆనందా న్నెలా వెలిబుచ్చాలో నాకే తెలీటంలేదు." అన్నాడు గాలీబు.

"వివాహం సత్వరం చెయ్యటంమూలంగానే" అన్నాడు శేషయ్య.

"అంతేకన్నానా? ముహూర్తనిశ్చయం మీ ఆచార ప్రకారమే కానివ్వండి" అన్నాడు గాలీబు.

"మా ఏమిటి ?......మీ ఏమిటి ?........వైశాఖశుద్ధదశమి బాగుంది. మీబంధువులకి ఆహ్వానాలు పంపండి వెంటనే" అన్నాడు శేషయ్య.

"మీరే బంధువులు..."అన్నాడు గాలీబు.

"పోతే మామా మీరే.....మావాళ్లెవరూ యీవివాహానికి రారు......"అన్నాడు శేషయ్య.

ఇద్దరూ కలిసి తిరుగుతూనే శేషయ్య యింటి కొచ్చారు. గోపాలం గాలీబుకి నమస్కారం చేశాడు. సూరమ్మ విషయం తెలుసుకుని తెల్లబోయింది. కాని ఏమీ ప్రతిఘటించలేదు.

వివాహం రాజమండ్రిలో జరిపారు, ఆర్భాటా లేమాత్రం లేకుండాను. జరిగినట్లా జాతిమత వివక్షతలేకుండా అయిదురోజులూ రాత్రింబవళ్ళు లేదనకుండా మృష్టాన్నతృప్తి. సంస్కరణానుకూలురు కొంతమంది వివాహానికి విచ్చేశార్తు—బ్రాహ్మలకి సంభావన లియ్యలేదు.

ఆరోజు తనప్రక్కనే ప్రపంచంలో వుండే సౌందర్యవంతుల అందమంతా మూర్తీభవించిన అందపుకుప్పల్లే కూచున్న జానీని చూచుకొని గోపాలం పొందిన ఆనన్యత వర్ణనాతీతము. గోపాలం పొందిన 'ఆస్థితి' యేమాత్రం తీసిపోదు జానీ పొందినది.

అల్లుడూ, కూతురూ తనకి నమస్కరించటానికి వచ్చినప్పుడు మెహర్ కేవలం ముగ్ధురాలైపోయింది. గాలీబు, శేషయ్యలు పురుషులవడం చేత వారి సంతోషాన్ని పొంగిపోకుండా మొహాల్లోనే నిలబెట్టుకున్నారు. సూరమ్మ మేనల్లుడి భార్యని చూసి మురిసిపోయింది.

వాళ్ళందరూ యిప్పుడు రాజమండ్రిలో కాపురం పెట్టారు. ఎవరిపేర్లూ మార్చుకోలేదు. వేషా లంతకన్నాను. వాళ్లు ఏమతస్థులూ కారు. నాస్తికు లంతకన్నా కారు. హిందూసంఘం, మహమ్మదీయసంఘం రెండింటి దృష్టిలోనూ వాళ్లు పతితులు, ధర్మద్రోహులు. సత్యమైన ధర్మదృష్టిలోమాత్రం వాళ్లు పరమపూజ్యులు. వాళ్లు హిందువులూ కారు, మహమ్మదీయులూ కారు—భారతీయులు.

౧౦

" నీమీద నా కోపం వస్తుందికూడాను ఒక్కొక్కప్పుడు"

" మామీదమాత్రం రాదేం నాకు ? "

" నే నేంచేశా ? "

" నేనుమాత్ర మేం చేశానమ్మా ? "

" ఏంచేశావా ? చెప్పనా ? ఒకటి. అసలు నువ్వెందు కంతం దంగా వుండాలి? "

" అబ్బ! ...ఏంగడుసుతనమండీ? మీరుమాత్రం...? "

" నేనుగూడా నా ?...నీమూలానేగదా మరి యింత..."

" ఏంఅమ్మా? నామూలా నేం కష్టపడ్డారు ?"

" కష్టపడటంకాదు !! ఇంతసౌఖ్యం పొందటం..."

" పోతే నామీద కోపమెందుకు ?"

" చెప్పనియ్యి మరి...అదుగో అడ్డువస్తూం టేనే ?..."

" ఆఁ...అదిగాదు నన్ను చెప్పనియ్యండి...మీమీద నాకు కోపమెందుకో ?"

" ఊఁ...సరే...చెప్పు ...దగ్గిరికొస్తేగాని నడవదేమిటి? "

" ఎందుకంటే ?...చెప్పనా ?...ఆరోజు...గుర్తుందా ? మీరు మొట్టమొదటగా మాయింటి కొచ్చారు ?...ఏం ? "

" ఊఁ...లేకేం ?...అప్పు డేంచేశా ?..."

" అబ్బదొంగ! ...చెప్తా నుండండీ...నూతిదగ్గిర కాళ్లు కూడా కడుక్కున్నారు..."

" కడుక్కుంటే ?..."

" ఉండండి...కడుక్కుని రాక,...నేను పెంచుకున్న ఆ మొక్కలకేసి ఎందుకూ అలా చూడటం ?...నవ్వుతారేం ?..."

" అబ్బ...చాలా తప్పుచేశా...గొప్ప నేరమే..."

" పోనీ...చూస్తే చూశారు ... గులాబిపువ్వు కొయ్యడ మెందుకు ఎవర్నీ అడక్కుండాను ?..."

" కోస్తే తప్పా ? నువ్వు కనిపించకపోయావ్ ! అమ్మగారూ ఒక్కపువ్వు యిలా కోసుకుంటా నని అడిగేవాణ్ణి..."

" అబ్బ !...అదే మీదగ్గిరుంది... పోనియ్యవయ్యా కోస్తే కోశా రనుకోండి...కోసి ఏంచేశారు మీరే చెప్పండి ?...ఆనవ్వు చూడండి...మరిచిపోయినట్టు ?...నేను చూళ్లేదనుకున్నారేం ?"

" ఏంచేశానూ పువ్వుకోసి ?...ఆఁ, గుర్తొచ్చింది...చెప్పనా? ఏంచేశానో ?..."

"అలా నుంచుని చెప్పరాదేమిటి? దగ్గిర కెందుకు?..."

"సరిగ్గా చెప్పాలా ఒద్దా? ఆపువ్వు యిందాక చెప్పినట్టుగా యిలా..."

"అబ్బ! చేతులాడకపోతే చెప్పలేరు కాబోల్సు..."

"ఇలా...కోసి...ఇదిగో యిలా పట్టుకుని, దాని రేకులమీద...చెప్పనియ్యి...అలా వెనక్కి జరక్కు. దానిరేకులమీద...యిల్లా ...తెలిసిందా?......యిలాగ... తెలిసిందా అమ్మా?..."

"మరీ మోటసరస మండీ?...అందుకనే నా కోపం"

"కాని ఆపువ్వు యిలా తుడుచుకోలేదు..."



"మెహర్ సంతోషంతో ఒక్కగం

"చాల్లెద్దురూ...ఎవరన్నా వింటే నవ్విపోతారు..."

"సరేగాని...అప్పు డెవరన్నా చూశారేమిటి?..."

"చూడకేం?...మాఅమ్మ నవ్విందికూడాను..."

"నువ్వేం చేశావో నేం చెప్పనా?..."

"చెప్పండి...చూస్తాను..."

"చెప్పనా, పెదిమెత్నే...నాలికతో నే...అబద్ధ మాడరాదు. యిలా, తుడుచుకున్నావ్ ...ఏం? నిజంగాదూ?"

"అబ్బ...మీకు సమాధానం చెప్పలేనండీ...మీరు చూశారు కామాలు?..."

"ఆఁ...నిజంగా చెపుతున్నా...నేను చూళ్లేదు...ఊహించా. ఇంకా ఏం చేశావో చెప్పనా?...నీబుగ్గల్లో బుల్లి సొట్టలు పడ్డాయి కూడాను...సరిగ్గా...యిదిగో యిప్పుడు పడ్డట్టుగానే..."

"పోనిద్దురూ?..."

"ఇలాగే, బుల్లికోపంకూడా వచ్చింది..."

"అలాగా ?...యింకా ? ఓసే కవిత్వం ?"

"ఇప్పటిమాదిరిగానే పమిట సవరించుకున్నావు...గుర్తు లేదేం?"

"నా కెందుకు బాబూ...నే నిలా కూర్చుంటే, మీయిష్ట మొచ్చినట్టు వర్ణించండి......"

"నువ్వు గుర్తు చేస్తునే ఓనూల ?......ఇలాగే...ముడుచుకు కూర్చున్నావు...అప్పుడుకూడాను...కూర్చుని ఏమనుకున్నావంటే?

"నవ్వొస్తోంది కానీండి...వూరికే! నే నేం అనుకోలేదు."

"నాకు తెలుసులెండి అమ్మగారూ...ఏమనుకున్నావంటే! ఆనూతిదగ్గిర కాళ్లుకడుక్కుంటున్న అబ్బాయి...యిలా నిమ్మదిగా నాదగ్గిరి కొచ్చి.

"వూరుకుందురూ మరీ చిన్నపిల్లా డైపోతున్నారు ?"

"చెయ్యడ్డంపెట్టకు మరి...ఆ అబ్బా యిలా వచ్చి నాభుజం మీద యిలా చెయ్యేసి, ఓచేత్తో గడ్డం యిలా పట్టుకుని ఎత్తి...ఉండుమరి...నాకళ్లల్లోకి చూస్తూ...ఆ అబ్బాయితల నాతలదగ్గిరికి యిలా తెచ్చి......... లేవకు మరి. దబ్బున...యిలా...అని..."

"అబ్బ ! వూరుకోం ! యిహ...అదుగో పిన్నిగారు పిలుస్తున్నారలేవుంది......వెళ్లనీయండి"

"చెప్పనియ్యి సాంతం..... ...దబ్బున యిలా,యిలా,యిలా ......అని...... టుక్కున రెండుచేతుల్తో యిలా ఎత్తే......సినడుంమీద...గిలి...గిలీ...గిలి...యిలా చక్కిలిగిలి పెడితే ఎంత బాగుంటుంది అని అనుకోలేదు నువ్వు?......ఆసినీ! పారిపోతున్నావ్...జాగ్రత్త. మెట్లు నిమ్మదిగా దిగు. రానులే...జాగర్తంటుంటే ? మొత్తంమీద తురకపిల్ల చేష్టలు పోనియ్యలేదు..."

"చాల్లెద్దురూ ?...మీరుమాత్రం తురకబ్బాయికాదేమిటి"

* * * *



# అప్పయ్య దీక్షితులు

* * * * * *

**నాగపూడి కుప్పుస్వామయ్య**

**అద్వైతమతమును** దొలుత మన దేశంబున సాంఖ్యజైన బౌద్ధాదిమతము లధిక్షేపించుచుండఁగా వానిని వేదప్రమాణములతోడను, నప్రతిహతంబులగు స్వకీయయుక్తులతోడను నిరసించి యామతమును స్థాపించిన మహనీయులు శ్రీ శంకరభగవత్పాదాచార్యులు. వారి కనంతరము దాని నుద్ధరించి పోషించినవారు పెక్కురున్నను వారిలో ముఖ్యులు శ్రీ విద్యారణ్యులు, వాచస్పతిమిశ్రులు, మధుసూదనసరస్వతులు, అప్పయ్యదీక్షితులు. వారిలో అప్పయ్యదీక్షితులవారింగూర్చి కొన్ని యంశములు "అప్పయ్యదీక్షితేంద్ర విజయము"నుండి కైకొని యీక్రింద వ్రాయఁబడుచున్నవి.

తుండీరమండలంబునందలి కాంచీపురమునకు సమీపమున నార్త్తార్కాడుజిల్లాకుఁ జేరిన ఆరణి (Arni) కి దగ్గఱ అడయప్పలము గ్రామంబున భారద్వాజగోత్రోద్భవులును, నద్వైతాచార్యవర్యులును, ద్రావిడబ్రాహ్మణులును నగు ఆచార్యదీక్షితు లను నొక మహావిద్వాంసు లుండిరి. న్యాయరక్షామణి యనుగ్రంథమునందు వారి పౌత్రు లగు అప్పయ్యదీక్షితులు వారి నిట్లు స్తుతించిరి:

"ఆసేతుబంధతట మాచ తుషారశైలా
దాచార్యదీక్షిత ఇతి ప్రథితాభిధానమ్,
అద్వైతచిత్సుఖమహాంబుధిమగ్నభావ
మస్మత్పితామహ మశేషగురుం ప్రపద్యే."

ఒకనాఁడు విజయనగరసామ్రాజ్యధురంధరుం డగు కృష్ణదేవరాయమహారాజు కాంచీనగరంబున శ్రీవరదరాజస్వామివారి వసంతమహోత్సవమును సేవించుచుండునపు డద్దేవుని వర్ణింపుఁడని యాచార్యులవారిం గోరిన వా రిప్పగిడిని గీర్వాణశ్లోకమును జెప్పి వర్ణించిరి:

"కాంచి త్కాంచనగౌరాంగీం వీక్ష్య సాక్షాదివ శ్రియమ్,
వరద స్సంశయాపన్నో వక్షస్థల మవేక్షతే."

అనఁగా, వరదరాజస్వామి హేమకాంతివిలసితయై సాక్షాల్లక్ష్మీదేవి యనఁ జెలువారు నొకయంగనామణిం గని సంశయగ్రస్తుఁడై నిజవక్షఃప్రదేశమును జూచుచున్నాఁడు అని భావము.

ఈశ్లోకమును సందేహాలంకారధ్వని కుదాహరణముగా శ్రీమదప్పయ్యదీక్షితులవారు చిత్రమీమాంస యను స్వవిరచితాలంకారశాస్త్రగ్రంథములో నుదాహరించియున్నారు. ఈ శ్లోకమువలన ఆచార్యదీక్షితులవారికి వక్షస్స్థలాచార్యు లను బిరుదనామధేయము గలిగెను.

వారి కిద్దఱు భార్యలుండిరి: ఒకతె స్మార్తకులోద్భవ, మఱియొకతె వైష్ణవకులప్రసూత – ఆడమణివైకుంఠాచార్యు లను నామాంతరముగల రంగాచార్యుల పుత్త్రిక. ఆవైకుంఠాచార్యుల ప్రార్థనము చొప్పున నాపుత్త్రికయందుఁ గలిగిన ప్రథమపుత్త్రుని కాచార్యదీక్షితులు రంగరా జను పేరుఁ బెట్టిరి. ఆచార్యదీక్షితుల కెనమండ్రు కుమారులు పుట్టిరి. జ్యేష్ఠభార్యకు నలుగురు; కనిష్ఠభార్యకు నలుగురు. వీరందఱిలోను ప్రథమపుత్త్రుఁడు రంగరాజు. అనేకక్రతువులొనర్చుటచే నతనికి రంగరాజాధ్వరి యను సుప్రసిద్ధనామధేయము గలిగెను.

ఆచార్యదీక్షితుఁడు సకలశాస్త్రవిదుండగు మహాపండితుఁడై అద్వైతవిద్యాముకురము, వివరణప్రకాశము మొదలగు గొప్పశాస్త్రగ్రంథములను రచియించెను; అష్టక్రతువుల నొనరించెను; అష్టశివాలయములను బ్రతిష్ఠించెను; అష్టతటాకములను నిర్మించెను; అష్టపుత్త్రులను సకలవిద్యావిశారదులనువారిం గనెను; అష్టదిశలయందుఁ దన యశస్సును వ్యాపింపఁజేసెను.

తత్సుతుఁడు రంగరాజు తండ్రివలెనే మహావిద్వాంసుఁడై ప్రసిద్ధిఁగాంచెను. అతఁడు సంతానకాంక్షియై కులదేవతయగు విరించిపురంబున నెలకొనియుండు            సనాథుండగు మార్గసహాయేశ్వరు నారాధింప నశరీరవాణి చిదంబరమున కరిగి నటరాజేశ్వరుని భజించిన నీ కభీష్టసిద్ధి యగునని పలికెను. రంగరాజాధ్వరి యమ్మాడ్కిని జిదంబరక్షేత్రమునకుఁ జని శ్రీనటేశ్వరు నారాధింప నద్దేవుని యనుగ్రహంబున నతని కిరువురు విద్వద్వతంసులగు పుత్త్రులును, నొక్క కొమరితెయుం బుట్టిరి. వారిలోఁ దొలుతటి శిశువే అప్పయ్యదీక్షితులు. వారు కలియుగాబ్దములు ౪౬౫౪ (క్రీస్తుశకము ౧౫౫౪ సం.) అగు ప్రమాదీచసంవత్సరము కన్యామాసంబునఁ గృష్ణపక్షప్రథమాతిథి సోమవాసరము ఉత్తరప్రోష్ఠపదానక్షత్రము కన్యాలగ్నమునఁ బరమేశ్వరాంశంబున జనియించిరి. పరమేశ్వరాంశసంభవులనుటకు నీలకంఠవిజయకావ్యంబున నీలకంఠదీక్షితు లిట్లు వర్ణించిరి:

"లీఢాలీఢపురాణసూక్తిశకలావష్టంభసంభావనా
పర్యస్తశ్రుతిసేతుభిః కతిపయై ర్నీతే కలౌ సాంద్రతామ్,
శ్రీకంఠోఽవతతార యస్య వపుషా కల్యాత్మనేవాచ్యుతః
శ్రీమా నప్పయదీక్షిత స్స జయతి శ్రీకంఠవిద్యాగురుః."

ఆమ్మహాత్ముఁడు పుట్టఁగానే తజ్జనకుఁడగు రంగరాజాధ్వరి "అప్ప"యని పిలిచెను. ఆది మొదలందఱును అప్పయని శైశవంబున, పిదప అప్పయ్యదీక్షితు లనియు వ్యవహరించుచువచ్చిరి. జనకులతనికి సమంత్రకముగా వినాయకసుబ్రహ్మణ్యుఁడను పేరిడిరి. అతని యనుజుఁడు ఆచ్చాన్దీక్షితు లని ప్రసిద్ధినొందిన ఆచార్యదీక్షితులు. ఆచ్చాన్దీక్షితుల సుతుఁడు నారాయణాధ్వరి. అతని కేవురుపుత్త్రి లుదయించిరి. వారిలో రెండవకొమరుఁడే మహాకవియును, విఖ్యాత పండితవరేణ్యుండును, శివతత్త్వరహస్య నీలకంఠవిజయ శివలీలార్ణవాది బహుగ్రంథకర్తయును నగు నీలకంఠదీక్షితులు.

అప్పయదీక్షితులు సుబ్రామకవి యనునతనియొద్దఁ గావ్యనాటకాలంకారాది సాహిత్యవిద్యల నభ్యసించి తండ్రియొద్దనే సామవేదాధ్యయనమును, సకలశాస్త్రాధ్యయనమును గావించెను. తండ్రియే తన గురువని న్యాయరక్షామణి, శివార్కమణిదీపిక మొదలగు గ్రంథములలో అప్పయ్యదీక్షితు లిట్లు స్తుతించియున్నారు:

"యం బ్రహ్మనిశ్చితధియః ప్రవదంతి సాక్షాత్
తద్దర్శనా దఖిలదర్శనపారభాజమ్,
తం సర్వవేదసమశేషబుధాధిరాజం
శ్రీరంగరాజమఖినం గురుమానతోఽస్మి."

పైవ్రాసినదానివలన అప్పయ్యదీక్షితుల పితామహి వైష్ణవబ్రాహ్మణకుమారి యనియు, నాకాలంబున వైదికాచారనిరతులగు పరమశిష్టులును స్మార్తవైష్ణవభేదంబులఁ బాటింపక యామతద్వయమువారును నొండొరులతో వివాహసంబంధములు గావించుచుండిరనియుఁ దెలియనగును.

రంగరాజాధ్వరిపాండిత్యవిశేషంబుల నెఱింగి యాకాలంబున వేలూరుపురంబు నేలుచుండిన చిన్నబొమ్మరాజతని నిజాస్థానపండితునిగాఁ జేకొని కరంబు గౌరవించెను. రంగరాజాధ్వరి కాలగతిం జెందినయనంతర మయ్యవనీపతి యప్పయ్య దీక్షితులను, నతనితమ్ముఁడు ఆచ్చాన్దీక్షితులను డన లనుగా స్వీకరించి యాదరించెను. అయ్యవసరంబున విశిష్టాద్వైతమతప్రవర్తకులును, గొప్పపండితులును నగు శ్రీనివాసగురు వనంబడు తాతాచార్యులు చిన్నబొమ్మమహీపాలుని వైష్ణవ మతానుయాయిగాఁ గావించిరి. షోడశవర్షవయస్సునందే యప్పయ్యదీక్షితు లారాజసభలో శివపారమ్యముంగూర్చి శ్రుతిశతప్రమాణములచేతను, నవ్యాహతములగు స్వకీయయుక్తులచేతను నుపన్యసించి ప్రతిపాదించిరి. వారి వేదశాస్త్రప్రావీణ్యములను విని తంజానగరము, కార్వేటినగరము, కాళహస్తి, వేంకటగిరి మున్నగు సంస్థానముల ప్రభువర్యులు వారిం దమ సభలకు రప్పించి యుచిత సమ్మానంబుల గౌరవించిరి. అంతట వారు గృహస్థాశ్రమంబు స్వీకరింప నెంచుచుండిరి.

ఆకాలంబున శూరప్పనాయకుం డను నొక నృపాలునియాస్థానంబున రత్నఖేటదీక్షితుఁ డను నొక మహావిద్వాంసుఁడుండెను. అతఁడు చేసిన సంధ్యావర్ణనమునందలి చాతుర్యముం గాంచి యానరపతి ం బను నొక ఖేటంబును బహుమానముగా నొసఁగి రత్నఖేటాధ్వరి యను బిరుదనామము నిచ్చెనఁట. అతని విద్యామహిమలను విని కాశీనగరపండితు లతనిని జయింపుటకై యతని నివాసస్థలమునకు వచ్చి యరుణోదయసమయంబున నతని యింటిబయటి తిన్నెపైఁ గూర్చుండియుండిరి. అప్పు డచ్చట నాదీక్షితుల పత్ని కలయంపి చల్లుచుండఁ గాంచి యాపండితు లామెతో "అమ్మా, దీక్షితులవా రింట నున్నారా? మేము కాశీపండితులము, వారి దర్శనముం గోరి యిట కు వచ్చినారము" అని యడిగిన విదుషియగు నమ్మానిని వారి గర్వం బడంపఁదలంచి చమత్కారవిలసితంబగు పంచచామరశ్లోకంబున నిట్లు బదులు చెప్పెను:

"విపశ్చితా మపశ్చిమే ఒధ రత్నఖేటదీక్షితే
సపత్నజిత్యయాత్మతో వినోదకేళి మాగతే,
బృహస్పతిః ప్రజల్పతి ప్రసర్పతి క్వ సర్పరాట్
షడాననో నతానన శ్చతుర్ముఖశ్చ గుర్ముఖః."

అనిచెప్పిన నప్పండితు లచ్చెరువంది యీ నారీమణిసాహిత్యమే యిట్లుండ నాదీక్షితుల దర్శనంబున మన కెట్టిపరాభవము గలుగునో యని లజ్జాభయంబు లొంది వెడలిచనిరి.

ఆ మహావిద్వాంసుఁడు మంగళాంబయను తన పుత్త్రికను అప్పయ్యదీక్షితుల కిచ్చి పెండ్లికావించెను.

అప్పయ్యదీక్షితులు కొంతకాలమునకు జ్యోతిష్టోమయాగము చేసి పిదప వాజపేయమహాక్రతువును గావించిరి. ఆకాలంబునఁ దాతాచార్యుల ప్రేరణంబునఁ జినబొమ్మమహీపతి యప్పయ్యదీక్షితులగారిదెస నించుక యనాదరము సూపుచు వాజపేయయాగమునకు రాక యుపేక్షించినను నరసింహవర్మయను క్షితీశ్వరుఁ డమ్మహాధ్వరమునకు వచ్చి ముక్తాసర శోభితంబగు శ్వేతాతపత్రంబును స్వయముగా దీక్షితులవారికిఁ బట్టి నిజమంత్రులచే ధవళచామరవీజనంబు గావించి యనేకవిధముల బహూకరించుటను విని పశ్చాత్తప్తుఁడై యాదీక్షితేంద్రులను బ్రార్థించి నిజాస్థానంబునకు రప్పించుకొని తొంటిచందమున మన్నించెను.

ఒకనాఁడు రాజసభయందు నీలగ్రీవశబ్దార్థమును దీక్షితులవారుపన్యసించి బ్రహ్మవిష్ణ్వాది దేవతలకును నలవికాని కాలకూట భక్షణము చేసి జగంబులను రక్షించుటవలన శివుఁడే సకలదేవతామూర్ధన్యుఁడని నుడివినఁ దాతాచార్యులు "దీక్షితవర్యా, శివపారమ్యము నిరూపించెదు శివోపాసకులగు మీరును విషపానముచేసి సుఖులై యుండఁగలరా?" యని యడిగినఁ బరమశివునిదెసఁ దమకుఁ గల యపారభక్తిని - నప్పరమేశ్వరుని మాహాత్మ్యమును నాక్షోణీవల్లభునకును, నితరజనంబులకును దెల్లంబుగాఁ దెలుపఁగోరి "నిస్సంశయముగా నట్లుచేసెద"మనిచెప్పిరి. అప్పుడే తాతాచార్యులు గరళమును దెప్పించి

యాసభవారి సమక్షంబున నిప్పించిన నప్పుడమి ఱేఁడు వలదని వారిం చుచున్నను నతనిని సమాధానపఱచి పరమశివుని ధ్యానించుచు నావిష మును ద్రావి యేకీడునుం బొరయకుండిరి. అందఱు నతనిని లోకాను గ్రహార్థ మవతరించిన నీలకంఠుఁ డని కొనియాడిరి.

దీక్షితులవారికి నీలకంఠుఁడు, ఉమామహేశ్వరుఁడు, చంద్రా వతంసుఁడు అను ముగ్గురు పుత్త్రులును, మరకతవల్లి, మంగళాంబ యను నిరువురు కొమరితెలును నుదయించిరి.

కొండొకకాలంబు సనుసు మంగళాంబయను కన్య బుతు మతియైనకతంబునఁ దాను నియతంబుగా సలుపుచుండిన శివపూజను జేయుటకును, విడిచిపెట్టుటకును నొల్లక ఖిన్నయై తండ్రిగారితో విన్నవించిన నిట్లనిరి: "అమ్మా, ఈవిషయమును నీయక్కయుఁ జెప్పి యున్నాను. నీవును నవ్విధమున నే యీ సందర్భమునఁ గరచరణం బులు గడిగికొని భక్తితో మానసికంబుగా శివపూజను గావింపుము" అని యుపదేశించిన నత్తరుణి యత్తెఱంగున శివపూజాచరణంబొనర్చె. ఈ విషయమును తాతాచార్యుల మూలమున ధరణిపతి యెఱింగి దీక్షి తులవారిం గని "మఖీంద్రా, శివార్చనాపద్ధతులను విశదంబుగా నెఱిం గింపు" మని కోరిన వా రిట్లుపదేశించిరి. "నరేంద్రా, మానసికభక్తి చేతనే పరమశివుఁడు ప్రసన్నుం డగును. పార్థుని గాండీవప్రహారము చేతను, గన్నప్పచేసిన యుచ్ఛిష్టమాంసనివేదనముచేతను సంతోషిం చిన మహాదేవుఁడు బాహ్యపూజలయందెక్కువయాదరము చూపునా? పరమేశ్వరునియందుఁ జేయఁబడు పరమానురాగముకదా భక్తియనం బడును. మానసికభక్తియే యుపాసన యనంబడును. అదియే శివార్చన మందు ముఖ్యసాధనము. ప్రాణము పోవుసమయంబునను శివార్చనము చేయవలయునని స్మృతులు వాక్రుచ్చుచున్నవి." అని యుపదేశించి యామనుజవల్లభుని యభ్యర్థనంబున 'శివార్చనచంద్రిక' యనుగ్రంథ మును రచించి శివపూజావిధానంబును దెలిపి యాగ్రంథము నతని కొసఁగి దీక్షితులవా రిట్లుపదేశించిరి:

"యావ న్నయాతి మరణం యావ న్నాక్రమతే జరా,
శ్రద్ధామాత్రేణ సకలై రర్చనీయోహి శంకరః"

అని చెప్పిన నప్పార్థివుం డదిమొదలు శివార్చనానుష్ఠానపరుండై వారనుగ్రహపాత్రుం డయ్యె.

అప్పయ్యదీక్షితులవా రద్వైతులయ్యు, శివవిష్ణ్వాదిదేవతామూర్తి భేదంబును బాటింపనివారయ్యును శివోత్కర్ష ప్రతిపాదనము చేయు టకుఁ గారణము వివరింపఁబడుచున్నది. శ్రీ రామానుజాచార్యులు, వేదాంతదేశికులు మొదలగు విశిష్టాద్వైతమత ప్రవర్తకులును, వదనుయా యులును విష్ణూత్కర్ష శివాపకర్షములఁ గావించుచుండుటచే లోకులు భ్రమించి దేవతామూర్తి ద్వేషపరులు గాకుండుటకై దీక్షితులవారు శివోత్కర్ష మును స్థాపింపఁబూనిరి. ఈయంశమును వారే యీక్రిందఁ గనిన శ్లోకమువలనఁ జెప్పిరి.

"విష్ణుర్వా శంకరోవా శ్రుతిశిఖరగిరా మస్తు తాత్పర్యభూమిః
నాస్మాకం తత్ర వాదః ప్రసరతి కిమపి స్పష్ట మద్వైతభాజామ్,
కిం త్వీశద్వేషగాఢానలకలితహృదాం దుర్మతీనాం దురుక్తి
ర్భంక్తుం యత్నో మమాయం నహి భవతు తతో విష్ణువిద్వేష
శంకా."

దీక్షితులవారికి విష్ణుమూర్తిద్వేషము లేదని వేదాంతదేశికులు విరచించిన యాదవాభ్యుదయమునకు వారు వ్యాఖ్యానము చేయుట చేతను,

"మారమణ మమారమణం ఫణధరతల్పం ఫణాధరాకల్పమ్,
మురమథనం పురమథనం వందే బాణారి మసమబాణారిమ్."

"వస్త్రం పీతంగం వసనం దిశోవా గరుత్మతాయాతు కకుద్మతావా,
శ్రీరంగ వా నృత్యసభాధిరంగం భేదం నపశ్యామి పరస్యవస్తునః"

అను హరిహరస్తోత్రము చేయుటచేతను శ్రీరంగము, కాంచీనగరము మున్నగు స్థలములలో విష్ణుదేవుని దర్శనము చేయుటచేతను స్పష్టం బగును.

వైష్ణవమతావలంబులు కొందఱు శివనిందను మేరాతిమముగాఁ గావించుచుండుటం గని చిన్నబొమ్మమహీపాలుని ప్రార్థనంబునను, పరమశివుని నిదేశంబునను అప్పయ్యదీక్షితులవారు బ్రహ్మసూత్రము లకు శ్రీకంఠాచార్యులు తత్పూర్వము శివాద్వైతపరముగా రచించిన భాష్యమునకు శ్రుతి ప్రమాణ మీమాంసా న్యాయ పరిష్కృతంబగు "శివార్కమణిదీపిక" యను నొక ప్రౌఢతమవ్యాఖ్యానమును విర చించిరి.

ఇదియునుగాక విశిష్టాద్వైతులును, ద్వైతమతస్థులును నద్వైత మతమును దూషించుచుండుటచే నామతములు రెంటిని నిరసించి యద్వైతమతమును బోధించుటకై శ్రీదీక్షితులవా రనేకశాస్త్రవాద గ్రంథములను రచియించిరి. వారు రచించిన గ్రంథములు ౧౦౪ అని పెద్దలు నుడివెదరు. 'చతురధికశతగ్రంథనిర్మాణధురీణాః' అని వారిం బేర్కొందురు. తత్కృతగ్రంథములలోఁ గొన్నిటిని వివరించెద.

అలంకారశాస్త్రము:—కువలయానందము, చిత్రమీమాంస, వృత్తివార్తికము మొదలగునవి.

అద్వైతశాస్త్రగ్రంథములు:—పరిమళము (బ్రహ్మసూత్రశాంకర భాష్యవ్యాఖ్యానమగు భామతికి అమలానందకృతమగు కల్పతరువను నది వ్యాఖ్యానము. కల్పతరువునకు వ్యాఖ్య పరిమళము), న్యాయరక్షా మణి, సిద్ధాంతలేశసంగ్రహము మొదలగునవి.

మీమాంసాశాస్త్రము:—విధిరసాయనము, మీమాంసా నక్షత్ర వాదావళి మున్నగునవి.

శివోత్కర్ష ప్రతిపాదకగ్రంథములు:—శివార్కమణిదీపిక, శివ తత్త్వవివేకము, శివకర్ణామృతము, బ్రహ్మతర్కస్తవము, ఆనందలహరి,

రామాయణతాత్పర్యసంగ్రహము, భారతతాత్పర్యసంగ్రహము, శివార్చనచంద్రిక, శివధ్యానపద్ధతి మొదలగునవి.

కావ్యము:—యాదవాభ్యుదయకావ్యవ్యాఖ్య, హంససందేశవ్యాఖ్య, ప్రబోధచంద్రోదయటీక, పాదుకాసహస్రవ్యాఖ్య మున్నగునవి.

వివిధవిషయములు:—ప్రాకృతచంద్రిక, తిఙన్తశేషసంగ్రహము, శ్రీవిద్యాతత్త్వవివరణము, న్యాయముక్తావళి, నయమయూఖమాలిక, రత్నత్రయపరీక్ష మొదలగునవి.

శ్రీదీక్షితులవారు చరమదశయందు జిదంబరక్షేత్రమున వసించుచు యోగాభ్యాసపరులై కాలముఁ గడపుచువచ్చిరి. వారు డెబ్బదిరెండుసంవత్సరములు జీవించిరి. అవసానసమయము సమీపించిన విషయమును సార్వజ్ఞులెఱింగి తమతమ్ముని పౌత్రుఁడగు నీలకంఠుఁడను బాలునిం జేరఁబిలిచి పరమానుగ్రహంబున నతని నాశీర్వదించి యిట్లని యార్యావృత్తపాదరూపముగ "ఆపది కిం కరణీయం" అని యడిగిరి. నీలకంఠుడు "స్మరణీయం చరణయుగళ మంబాయాః" అనియుత్తర మొసంగెను. మఱల దీక్షితులవారు "తత్స్మరణం కిం కురుతే" అని యడిగిన, నీలకంఠుఁడు "బ్రహ్మాదీనపి చ కింకరీకురుతే" అని బదులు చెప్పెను. అది విని దీక్షితులవారు రాజానసిద్ధంబగు నాబాలుని భక్తివిశేషముం బ్రశంసించి "వత్సా, నీ కేమికావలయును, కోరుమా" అని యడిగిరి. నీలకంఠుఁ డిట్లనియె:

"ఆశైశవా దమరదుర్లభ మీప్సితం చ
ప్రాప్తం మయా భువనమాన్య భవత్ప్రసాదాత్,
నాన్య ద్వృణే భవదనుగ్రహపూర్ణభాగ్యా
త్తస్మై ఽనుశాధి హృదయం కృపయా మహాత్మన్."

"నజానే పితరం దేవం గురుంవాపి సుహృత్తమమ్,
త్వత్తః పరం తదాబాల్యా ద్రక్షేతి శరణం యయౌ"

అని శరణాగతుండయ్యె. దానికి శ్రీమదప్పయ్యదీక్షితేంద్రులు ప్రముదితహృదయులై ఈశాన, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష నామధేయంబులనొప్పారు పంచశివలింగములను, రామాయణకావ్యమును నాబాలుని కిచ్చి వీనిం బూజించుటచే నీకు సర్వాభీష్టసిద్ధి యగునని యనుగ్రహించి భూములు, ధనములు మొదలగువానిం దనయుల కిచ్చి సకలవిద్యలు నేర్చి ప్రతిభావంతుఁడై యలరారు నీలకంఠుని నాదరముతోఁ జూడుఁడు. ఇతఁ డుత్తరకాలంబునఁ బరమేశ్వరుని కరుణచేఁ బాండ్యనృపాలుని మంత్రియై మహావిభవశాలియై విదితయశుఁడు కాఁగలఁడని యానతిచ్చిరి. అంతఁ దత్పుత్రులు లోవగువారు తదీయావసానంబునకై చింతిల్లఁగా దీక్షితేంద్రులు స్వానుభవము నివ్విధంబున వచియించిరి.

"తుర్యాతీత స్త్రిగుణరహితో నామరూపాదిదూరః
శుద్ధాద్వైతామృతజలనిధి ప్రోద్యదానందసాంద్రః,
బ్రహ్మైవాహం ముకురహృదయస్వచ్ఛచేతస్సు నిత్యం
మూర్తి స్సాక్షీ రవిరివ సదా భామి పూర్ణ శ్చిదాత్మా."

అని వెండియు నిట్లని వ్రాసిచ్చిరి:

"చిదంబర మిదం పురం ప్రథితమేవ పుణ్యస్థలం
సుతాశ్చ జలాః సుకృతియశ్చ కాశ్చిత్కృతాః,
వయాంసి మమ సప్తతే రుపరి నైవ భోగే స్పృహా
నకించి దిహ మర్థయే శివపదం దిదృక్షే పదమ్."

"ఆభాతి హాటకసభానటపాదపద్మ (?)
జ్యోతిర్మయో మనసి మే తరుణారుణోఽయమ్"

అని యర్ధశ్లోకమును వచించి బ్రహ్మపదప్రాప్తులైరి.

పరమపావనంబగు శ్రీమదప్పయ్యదీక్షితులవారి దివ్యచరిత్రమునఁ గొన్ని యంశములుమాత్ర మిందు వ్రాసినాఁడను. వారి మహాత్త్వాతిశయములను సాకల్యముగా నెఱుంగఁగోరువారు బ్ర. శ్రీ. కె. వి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (మధుర) రచించి ప్రకటించిన "శ్రీమదప్పయ్యదీక్షితేంద్రవిజయ" మను గ్రంథమును బఠింపనగు.

శ్రీదీక్షితుల వంశమువారు తిరునల్వేలిజిల్లాయందలి కొన్ని గ్రామములలోను, తంజావూరుజిల్లాయందలి మన్నారుగుడియను పట్టణమునందును గలరు. మన్నారుగుడియందుఁ దద్వంశ్యులు బ్రహ్మశ్రీ యజ్ఞస్వామిదీక్షితులవారు గొప్పవిద్వాంసు లిప్పుడున్నవారు. వీరి పితామహులు సమస్తశాస్త్రపారంగతులై రాజుశాస్త్రిలవారని ప్రసిద్ధిఁ గాంచిన శ్రీత్యాగరాజశాస్త్రిలవారు. వారు నలువదిసంవత్సరముల మున్ను శ్రీజ్ఞానప్రసూనాంబాసమేత శ్రీకాళహస్తీశ్వర సందర్శనఁ జేయుటకై కాళహస్తికి వచ్చియుండినప్పుడు తదీయదర్శనభాగ్యః నాకు లభించెను. వారి కప్పు డెనుబదియేండ్లకుఁ బైఁబడిన వయసు విభూతిరుద్రాక్షమాలికాలంకృతులై పరమశివునివలెం దేజరిల్లుచుండి వారి దర్శనము మహాపుణ్యప్రదంబని మనంబునఁ దలంపుగలిగెను.



# మద్రాసు ఆనందపన్నీరు

కర్మాగారమందు తయారుచేయు సామానులనే ఉపయోగింపుడు.

అన్ని చోట్ల దొరకును.

రిజిష్టర్డు ట్రేడ్ మార్కు చూచికొనుడు. సమూనాలను చూచి మోసపోకుడు.

**ఆనందషర్బత్తులు:-రోస్, నన్నారి, మొగలి.**

మాదిరిబుడ్లు:—పన్నీరు 2 ఔన్సులు 4 అణాలు. షర్బత్తు 2 ఔన్సులు 2 అణాలు.

## ఆనంద తైలము




ఈ తైలమును అనేక పచ్చి ఆకులు మూలికలచేతను అంగటి సామానుల చేతను బాగుగా తయారుచేయబడినది. ఇది కండ్లచూపు తగ్గుటను, కండ్ల మంటలు, కండ్లయందు నీరుకారుట మొదలగు మెదడు సంబంధమైన చెడుపులను పోగొట్టి మెదడును చల్లపరచును. నల్లనైన వెండ్రుకలను పెరుగునట్లు చేయును. దేహమునకు తేజస్సును ఆరోగ్యమును కలుగచేయును. ఒకతడవ వాడిచూచినచో దీని విలువ మీకే తెలియగలదు.

10 ఔన్సుల బుడ్డి 1-కి రూ 1-0-0.

## ఆనంద చందనాది తైలము

ఈ తైలము పలురకములగు మూలికల చేతను అమూల్యమగు అంగటిసామానులచేతను తయారుచేయబడినది. అత్యుష్ణము, కండ్లమంటలు మొదలగు జాడ్యములను పోగొట్టును. మహాపరిశ్రమ చేయువారికి చేతిపరిశ్రమలు చేయువారికిని మరి యితరులకును అమృతమువంటిది. దీనిని వాడి దీనివలన కలుగు సుఖమును పొంది పెక్కుమంది పొగడుచున్నారు. మీరు ఒకమారు వాడి చూడుడు.

10 ఔన్సుల బుడ్డి 1-కి రూ 1-0-0.




విక్రయించుచోట్లు:

రసికిలాల్ అండ్ కంపెనీ,

234 గోవిందప్పనాయక్ వీథి, మద్రాసు.

# ఆనంద పన్నీరు ఫ్యాక్టరీ,

రాయపేటపోస్టు, మదరాసు.




ఆంధ్రవాఙ్మయ మాకందంబు మూలకందంబుచందంబున నతిశ యిల్లు నాంధ్రమహాభారతంబు వివిధ విశేషోపబృంహితంబయి, కవితారీతులకు, చమత్కృతులకు సంక్రాంత్త విజ్ఞానంబు నలవరించు చున్నది. అందును నన్నియభట్టురచనంబు నిట్టివానికి దావలంబు. తెలుగుకైతకు నన్నయ తొలివాడైనను నాతని రచనారీతులు నిరవద్య హృద్యంబులై, భాషాప్రౌఢిమ బ్రకటించుచు విమర్శకపాఠకులకు స్తోత్రసంగతుల నెరిగించుచునే యుండెను. నానారుచిరార్థసూ నిధి, విద్యాదయితుండు నగు నన్నియభట్టు భారతంబును నిశ్శేషం బుగ నాంధ్రీకరింపమికి జింతిల్లుచు, నుభయకవిమిత్రుండు, కవిబ్రహ్మయు నగు తిక్కనార్యుం డద్దానిని వాఙ్మయరసికులకు దరుగనిగనిగా జెలుగు నగిషీలతో బూర్తిగావించినందులకు మిక్కిలి సంతసిల్లుచు, వీరిద్దరికి నెఱ్ఱాప్రగడ నీడయినవాడని గొనియాడుచు, నీకవిత్రయమును త్రిమూ ర్తులుగా నిచ్చలు భజింపుముగాక.

ఇంతకుమున్నె నన్నియభారత భాగమునందలి వ్యాకరణ ఛందోవిషయములను, రచనావిశేషములను, కవితాచమత్కృతులను, తత్పూర్వభాషాపరిస్థితులను సాకల్యముగ మనపండితులు చర్చించియే యున్నారు. కాని నన్నియభట్టు చింతామణికర్తృత్వము సర్వజనాను మతిం బడయలేదు. నారాయణభట్టునకు భారతకర్తృత్వము నంట గట్టిరి. మధ్యాక్కరల సమన్వయము మిగిలియేయున్నది. "ఆదికవి" యనుమాట యు సంశయాస్పదమయినది. అరణ్యపర్వశేషపూరణవిష యము నిలిచియేయున్నది. వీని నింకను బండితులు విమర్శకులు, కూలం కషముగ జర్చింపవలసియుండెనని వేడికొనుచు బ్రస్తుతము పర్యాలో చింతము.

అనంతుడు, అప్పకవి మొదలగు ఛందఃకర్తలు నన్నియవాడిం చిన సీసభేదములను గమనించి, యందు గొన్నిటికి తమ తమ గ్రంథ ములందు లక్షణంబులు పలికియున్నారు. కాని వారి లక్షణములకు గూడ మిగిలియున్న సీసభేదముల నెక్కటిని సమగ్రముగ శ్రీ గిడుగు వారు సోదాహరణముగ వివరించియున్నారు.

నన్నియ సీసములవలెనే గీతముల, నాటవెలదులను బెక్కువిధ ముల వాడియున్నాడు. వాని నేలనో మనలక్షణకర్తలు పేర్కొనియైన యుండలేదు. సీసభేదములకు సామాన్యముగా సరిపోయియుండురో గదా యని తలపోసినారో- చెప్పదగినంతటివి యని వారు తలంప లేదో -పోనిండు. నేటి విమర్శకులు గూడ నాజూచినంతవరకు వాని దడవలేదనియే నాతలంపు. ఇవి నాదృష్టికి వేర్కొనదగినవిగా నుండు టచే వీనిని సోదాహరణముగ వివరింపబూని యీ రచనకు గడంగితిని.

మొదట నాటవెలదిగీతముల లక్షణములు సూక్ష్మముగ బలికి తదుపరి భేదముల బేర్కొనుట సమంజసము గదా.

"ఇనగణత్రయంబు నింద్రద్వయంబును
హంసపంచకంబు నాటవెలది
సూర్యు డొకనిమీద సురరాజు లిద్దరు
దినకరద్వయంబు తేటగీతి"

యని కవిజనాశ్రయకారుడు వచించియున్నాడు. ఈ రెంటికిని చతుర్థగణాద్యక్షరము విరతిస్థలము. ప్రాస లక్కఱలేదు. యతులకు మారుగా బ్రాసయతులను బ్రయోగింపనగును. ఇదియ ఆటవెలదికి గీతమునకు సామాన్యలక్షణము. వీనికి ఉదాహరణపద్యంబు లెచట నైనను గోచరించును. అయినను మచ్చునకు కొన్ని -

ఆటవెలదికి—

అనిన నగడు వల్లె యని వాని కనిరొగం
ధర్వ నిన్ను గరుణ ధర్మరాజు
గురుకులేశ్వరుం డశరణశరణ్యుండు
విడువబంచె నింక వెడలకుండు. ఆది. ౭ ఆ. ౪౮.

ఎట్టిరాజులును మహీసురోత్తము లెదు
రరుగు దెంచునప్డు డధికభక్తి
నెరిగి ప్రియము వలికి తెరువిత్తు రిట్టిద
ధర్మ వెరిగి దీని దలప నెట్టు. ఆది. ౭ ఆ. ౧౧౨

గీతమునకు—

కడగి సూతుండు పుత్రకు గౌగిలించి
కొని తదీయ మూర్ధాఘ్రాణ మొనరజేసి
యంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరము
దడిపె వెండియు హర్షాశ్రుతతుల నొప్ప. ఆది. ౬ ఆ. ౫౧

తరుణి యేపురకంబె నొక్కరుడ భర్త
యగుట లగ్గు జూదంబునం దాలి నోటు
వడనివానిగా దగు భర్త బడయు మింక
ననుచు రాధేయు డుల్లసమాడె నంత. సభా. ౨ ఆ. ౨౮౬

ఇట్టివి సామాన్యంబు లనబడు. ఇవియ యే క్షేని యొక నియమంబుచే నిబంధింపబడినవో భేదంబులుగా చేర్కొందురు. పైవాన నెట్టి నియమంబును లేదుగదా. ఇక వీని భేదములను సోదాహరణముగా విమర్శింతము.

విరతిస్థానములందు విరతులకుమారుగా ప్రాసములనే పాటించుచుందురు.

ఆటవెలదికి—

మనుజయోని బుట్టుడని వారి కప్పుడు
కోపమడర మునియు శాపమిచ్చె
భయము నొంది పవరులయి వచ్చి వారును
వినయమొనర నిట్టులనిరి మునికి. ఆది. ౪ ఆ. ౧౬౦.

మాయనుగ్రహమున జేయంగ గడగితి
నిమ్మహాధ్వరంబు నెమ్మితోడ
దీని నందఱును నధానంబుగా బూని
పెంపుమెఱపి నిర్వహింపవలయు. సభా. ౧ ఆ. ౨౭౬.

గీతమునకు—

దీనికంటెను నొప్పెడువాని నొక్క
లక్షమొదవుల నిచ్చెద నక్షయముగ
రాజ్యమయిన నిచ్చెద జగత్పూజ్య నాకు
నిమ్ము నీహోమధేనువు నెమ్మితోడ. ఆది. ౭ ఆ. ౧౦౦.

దీనికొడబడు మొడబడవేని నేడ
యాతుణము సర్వభూతుంచే భక్షితుండ
వగుదు దెల్లమే నెప్పిన వగపుదక్కి
విదురుడును నీవు మందుడు ముదముతోడ. సభా. ౨ఆ. ౨౧౭.

విరతిస్థానములందు విరతులనే వాడుచుందురు. ప్రాసయతులను వాడకుండుదురు.

ఆటవెలదికి—

పరగ నన్ను సాల్వ పతి వరియించిన
దండ్రిచేత బూర్వదత్తనైతి
నమ్మహీశునకు నయంబున నెయ్యది
ధర్మనెఱిగి దాని దపుడు డీరు. ఆది. ౮ ఆ. ౨౧౦

ఎఱుగ జెప్ప మబల యెవ్వరిదాన వి
ట్లేల యున్నదాన వేకతంబ
క్రూరవనమృగములు గ్రుమ్మరుచున్న
యజనవిమనుశైల, విపినభూమి. ఆది. ౭ ఆ. ౭౬.

గీతమునకు—

రాక్షసావిష్టుడైనప్డు రాజ్యలీల
విడిచి తన్నెఱుంగక తదావేశరహితు
డై యప్పుడు రాజ్యకార్యంబులందు
బద్ధబుద్ధియై కల్మాష పాదుడండె. ౭ ఆ. ౧౧౪.

పంకజాక్షి నీపతి ప్రతిపక్షవీర
విజయుడయ్యెడు నీవును వీరపుత్ర
జననివగుదువు దీవించె సంతసంబు
వసుదేవపుత్రి నాగ్రుపదపుత్రి. ఆది. ౮ ఆ. ౨౧౨

విషమపాదములందు ప్రాసయతులను, సమపాదములందు యతులను వాడుచుందురు.

ఆటవెలదికి—

దాని నెరిగి కమలయోని దానికి నర
మర్త్యయోనియందు బుట్టు
మనియు శాపమిచ్చె నొనరంగ వాడు
గగము నెఱచి కరయుగంబు మొగిచి. ఆది. ౩ ఆ. ౧౨౨

సకల జీవరాశి సుకృత దుష్కృతఫల
మెరిగి నడపుచున్న యిట్టి ధర్ము
డిందు శూద్రయోని యందు మాండవ్యుచే
శప్తుడై యుదేల సంభవించె. ఆది. ౪ ఆ. ౨౫౫

గీతమునకు—

వినయమున ద్రోణురూపు మున్నన సమర్చి
దాని కతిభక్తితోడ బ్రదక్షిణంబు
జేసి మ్రొక్కుచు సంతతాభ్యాసశక్తి
నస్త్రవిద్యారహస్యంబు లర్థిబడసె. ఆది. ౫ ఆ. ౨౩౧

ముదుసళుబు దను కిమ్మగ జదివికొండ్రు
గాక పతులకు హితవును కర్జమేల
యొలసి చెప్పదు రహితుల గలపికొనుట
ధర్మమని రిది నయవిరుద్ధంబుగాదె. ఆర. ౧ ఆ. ౩౫

సరిపాదములయందు ప్రాసయతులను, బేసిపాదములయందు యతులను బ్రయోగించుచుందురు.

ఆటవెలదికి-

కుటిలమార్గులయిన కుత్సితకితవుల
తోడ గడగి జూద మాడజనదు
దానజేసి యఖిల ధర్మవివర్జితు
లగుదు రెట్టివారు జగములోన. సభా. ౨ ఆ. ౧౮౭.

దాని నెరిగి రామ దామోదరులు వృష్ణి
వరులతోడ బ్రీతి నరుగుదెంచి
కనిరి సకలతీర్థ గమనపథశ్లేశ
కృశుల బాండుసుతుల విశదయశుల. అర. ౩ ఆ. ౧౫౬.

# నన్నయజాతులు—కొన్ని టిరీతులు

గీతమునకు—

సకలభూతసంఘంబు పర్జన్యు బక్షి
సమితి బహుఫలవృక్షంబు నమరు లింద్రు
ననిశమును నుపజీవించు నట్లు బంధు
జనులు నిన్నుపజీవింప మనుము పేర్మి. భా. ౨ ఆ. ౭౯.

సఖ్యసంబంధములజేసి చక్రహస్తుడు
ద్రుపదుడును దక్క దక్కిన నృపతులెల్ల
నరియు జెట్టలివారు లే రఖిలజలధి
వలయితక్షోణిలో బాండవులకు బ్రీతి. సభా. ౨ ఆ. ౧౦౬.

విషమపాదములందు వృత్తంబులకువలె ప్రాసములును, యతులును, సమపాదములు ప్రాస, ప్రాసయతివిరహితములుగను బాటింపబడుచుండును.

ఆటవెలదికి—

ఏను జహ్నుకన్య నింద్రసమాన నీ
సద్గుణావళులకు సంతసిల్లి
భానుతేజ నీకు భార్యగా వచ్చితి
నిష్టమున బరిగ్రహింపు నన్ను. ఆది. ౪ ఆ. ౧౩౫.

జలములందు నుండు సర్వలోకంబులు
గాన నీమహోగ్ర కలుషవహ్ని
జలధిలోన విడిచి సత్యప్రతిజ్ఞుండ
వసుమ జలధిజలము లది దహించు. ఆ. ౬ ఆ. ౧౪౯.

గీతమునకు—

తనకు మరి తానె చుట్టంబు దానె తనకు
గతియు దన్నిచ్చుచో దానె కర్తయనగ
వనజనేత్ర గాంధర్వవివాహ మతిర
హస్యమును సమంత్రకమును నగుచు నొప్పు. ఆది. ౪ ఆ. ౫౬.

భర్తచేత నియోగింపబడక సతికి
నేదియును జేయగాదగ దెద్దియైన
భర్తచేత నియోగింప బడినదాని
జేయకునికి దోషంబని జెప్పె మనువు. ఆది. ౫ ఆ. ౯౯

సమపాదములందు వృత్తములకువలె ప్రాసములు, యతులు, విషమపాదములు ప్రాస, ప్రాసయతివిరహితములుగ వాడబడుచుండును.

ఆటవెలదికి—

పుట్టుచీకు వృద్ధు బూతిగంధానను
వేదజడుని బొందవెలది రోసి
తన్నుబోనిదాని దన్వి గోమలి దన
దాదికూతు బంచె దపసికడకు. ఆది ౪ ఆ. ౨౩౧

ఇంకనైన నిమ్ము నెరుగంగ నవనాక
యనుచు నుల్లసంబు లాడి ద్రుపదు
విడిచిపుచ్చె గురుడు విప్రుల యలుకయు
ప్రణహుతాశనంబు దీర్ఘమునకె. ఆది. ఆ. ౯౯

గీతమునకు—

అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టికన్నుల లేవను టంతె కాని
యుత్తముడు గాడె సద్గుణయుక్తి నతడు. ౫ ఆ. ౧౧

హరుడు వానికి బ్రత్యక్షమయి వరంబు
వేడు మనవుడు త్రైలోక్యవిభుడ నాకు
నయ నొనర్పుము సంతానదాన మనుచు
వేడె బుత్రార్థియై కడు వేడ్కతోడ ఆరణ్య. ౩ ఆ. ౫౦.

విషమపాదములందు వృత్తములరీతి ప్రాసములు, ప్రాసయతులు, సమపాదములందు ప్రాస యుండదుగాని యతి యైచ్ఛికముగా వాడబడుచుండును.

ఆటవెలదికి—

పరులవలన బాధవొరయకుండగ సాధు
జనుల ధనము గాచుజనవిభుండు
గరుణదప్పి తానహరియించువాడగు
నేని సాధులోక మేమిసేయు. ఆది. ౬ ఆ. ౧౦౪.

నలునకాని యొరుల నలినాక్షి వరియింప
దట్టె చూతమనుచు నమరవరులు
నలువురును గడంగినలరూపముల వచ్చి
రాస్వయంవరమున కతిముదమున. ఆర. ౨ ఆ. ౫౭

గీతమునకు—

అందు గిరమొప్పి సుందరీబృంద మఖిల
రత్నరాజితకనకధరాధరేంద్ర
కందరాంతరమున నున్న-సుందరామృ
తాశనాంగనాబృందంబు ననుకరించె. ఆది. ౬ ఆ. ౫.

బిలము జొచ్చితిమేని నందెలుక సంపు
నిందయుండితిమేని దానేర్చు నగ్ని
యెలుకచే జచ్చుకంటె నీజ్వాలనశిఖల
గాగి పుణ్యలోకంబుల గాంతు మేము. ఆది. ౯ ఆ. ౩౦౭.

ప్రథమద్వితీయపాదములందు వృత్తములరీతి ప్రాస లుండును. యతులు, ప్రాసయతులుగూడ నుండును. తృతీయ-చతుర్థపాదములు మాత్రము ప్రాసలేక సామాన్యముగా నుండును.

ఆటవెలదికి—

వెఱచి తల్లిశోకగఱపించుకొని దివి
బఱచువాని జూచి పార్థుడలిగి
వానితల్లిశిరముతోన తత్పుచ్ఛంబు
దునిసి యగ్నిశిఖల దొరగసేసె. ఆది. ౭ ఆ. ౨౪౩

పరుషవిషమభూరి పాషాణభీషణ
గిరులు వచ్చి నన్నుదెరలగప్ప
వజ్రబాణమేసి వాని నన్నింటిని
చాచియున్న నన్నుజూచి యపుడు. ఆర. ౧ ఆ. ౧౯౫

గీతమునకు—

ద్వారవతినుండి నే యుయు ధానువలన
ధారుణీశ యింతయు విని తత్క్షణంబు
యరుగుదెంచి యాపన్నుడవైన నిన్ను
జూచి దుఃఖోపహతమనస్కుండ నైతి. ఆర. ౧ ఆ. ౧౮౪

అనలునకు గాడ్పు దోడైనయట్టు లింద్ర
తనయునకు నీవు దోడైన దడయ కాజి
బోర రిపులకు బ్రదుకంగ బోలదైన
నరయ నిది కోపమున కవసరముగాదు. ఆర. ౧ ఆ. ౩౯౬

తృతీయచతుర్థపాదములందు వృత్తములకువలె ప్రాసలుండును. యతులుగాని, ప్రాసయతులుగాని యుండును. ప్రథమ ద్వితీయపాదములు మాత్రము ప్రాసలేక సామాన్యముగా నుండును.

ఆటవెలదికి—

భ్రమవిమోహలోభ భయపరిభూతనై
కొడుకు విడువ నంతవెడగనయ్యు
యేను భీముశక్తి యెరుగక పంచిన
దానగాను వినుము వీని శక్తి. ఆది. ౬ ఆ. ౨౪౯

ఎంతమిత్రులైన నెన్నండు నొరులచే
విద్యయును శుభంబు విత్తచయము
గొనగ నొల్ల నాకు గూర్తేని ననలాస్త్ర
మనఘ నీవు గొనుము హయము నిమ్ము. ఆది. ౪ ఆ. ౫౮

గీతమునకు—

సుతుల రాక్షసనిహతుల జూచి పరమ
యోగధరుడయ్యు బుత్రవియోగశోక
భరము దాల్చె వసిష్ఠుం డపారభూరి
ధరణిభరము నగేంద్రుండు దాల్చునట్లు. ఆది. ౪ ఆ. ౧౧౪

కపిలు కోపాగ్నిజేసి సాగరులు గ్రాగి
రనియు గతిగానకున్నవారనియు నెరిగి
వారికి హితంబు సేయంగవలసి గంగ
జేర గడగె విరుండు భగీరథుండు. ఆర. ౩ ఆ. ౪౬

ప్రథమద్వితీయపాదముల నొకప్రాసయు, తృతీయచతుర్థపాదముల మరియొక ప్రాసయు ప్రయోగించుచు యతులనే పాటించుచుండును.

వృద్ధు కొడుకుపలుకు విని క్రూరుడై పాప
బుద్ధిజేసి మిమ్ము భూతలంబు
వెలువరించి రాజ్యవిభవంబు గొని యిప్పు
డలుకసెశి సుచిత్తు డయ్యె నొక్కొ. ఆర. ౧ ఆ. ౨౦౭.

ఈపైభేదమును ప్రాసయతినిబద్ధముగను నొక్కచో వ్రాసియుండెను.

ఇన్న రేంద్రుచేత మున్నగ్రహీతనై
యున్న నాకరంబు గ్రన్న నింక
నొరుల కర్హమగునె పరిణయవిషయమై
ధర బరిగ్రహింప బరమమూర్తి. ఆది. ౩ ఆ. ౧౬౪.

ఈరెండుభేదంబులకు యతివిషయంబుననె విశేషంబుగాని తక్కినది యంతయు సమానంబు. ఇట్టివి పెక్కు కానవచ్చుటలేదు. విమర్శకాగ్రేసరులు బర్యాలోచింతురుగాక. మరియు నివిరెండును నాటవెలదికి లక్ష్యంబులయిమాత్రమే యున్నవి. గీతమునకు కానరాలేదు. మరియు నొక్కచో మూడుపాదములందుమాత్రము సర్వతఃప్రాసము గానవచ్చుచున్నది. నాలుగవపాదంబునందు లేమి దాని నుదాహరింపనైతి. ఆది. ౪ ఆ. ౧౧ వ పద్యమును చూచుకొందురుగాక.

వృత్తమువలె నాలుగుచరణంబులందును బ్రాసను, యతిని వాడుచుండును.

క్షత్రియులు నాయుషయను దాని
కజరు లధికవీర్యులతులభూరి
భుజులు శక్రరిపులు పుట్టిరి నలువురు
విజయవిపుల వీరవృత్తు లనగ. ఆది. ౪ ఆ. ౪౬౩.

పరనరేంద్రమకుటపద్మరాగద్యుతి
నరుణమగు భవత్పదాబ్జయుగము
పరుషధాతుశిలలపై నిప్పుడరుగుట
నరుణమయ్యె బర్వతాంతరముల. ఆర. ౧ ఆ. ౧౧౨.

ఈభేదములును గీతమునకు గానరావు. పాఠకులు పరామర్శింతురుగాక.

సమపాదములందు వృత్తములరీతి ప్రాసములను, ప్రాసయతులను వాడుచు, విషమపాదములందుమాత్రము ప్రాసయుండదు; యతి యైచ్ఛికము.

పగఱ గని సైతురేనియు మృగకులంబు
గని సహింపరు రాజులు మొనసి దాని
గ్రచ్చఱగ జంపుదురు నమ్మికిచ్చి చంప
జనదు మాయాబలంబున జనదు చంప. ఆది. ౫ ఆ. ౫౬.

ఇట్టివి యొండురెండుకన్న నుండియుండలేదు. అవియు నాటవెలదికి పాడగట్టుటలేదు. ఇంకను విచారింపవలసియుండును.

ఇంకను నచటచట నీపఞ్చమాత్రభేదంబులు పొడకట్టినవి గాని వ్యాసవిస్తరభీతిచే వాని నన్నిటి సమగ్రంబుగ వివరింపనయితి. ఇంత వఱ కుదాహరించిన పదుమూడుభేదంబులకే లక్ష్యంబులు విరళంబులుగా దొరకుచున్నయవి. తదేకదృష్టింగాంచిన నింకను రెండుమూడు దొరకునేమొ. ఇందు మొదటి మూఁడుభేదంబులకుమాత్రము లక్ష్యంబులు పెక్కు గానవచ్చుచున్నవి. 8, 9, 10 భేదంబులకును లక్ష్యంబులు మిక్కిలిగా లేకపోలేదుగాని పైవానికన్న కొంచెము తక్కువగా నున్నవి. తక్కిన భేదంబులకు శూన్యంబన్నను సత్యదూరము కానేరదేమొ. అయినను పండితులు పరిశీలింపవలసియుండును.

నన్నియపద్యంబులన్నియు నీపదుమూఁడుభేదంబులకు సరిపడియే యుండుననిమాత్రము తలంపవలదు. ఈభేదంబులయెడ "బహుళంబు" సరిపడియుండును. ఇట్టిభేదంబు లున్నవియనియే పాఠకులకు నివేదించితిగాని యేతదతిరిక్తంబులు లేవని గాదుసుమీ.

భేదంబుల లక్షణంబులు వివరించుపట్టున నొకచో కర్తరిప్రయోగంబులను, మఱొక్కచో కర్మణిప్రయోగంబులనుగూడ వాడియుంటిని. యథార్థంబుగా కర్తరిపక్షం బభ్యాహార్యంబని పాఠకులకు సవినయముగ మనవి. నన్నియపద్యంబులందును నరసన్నలను నిడనందులకు వైయాకరణులు క్షమియించుదురు గాక.

"నన్నయ"యనియే విశేషముగా వ్యవహారమున్నను శీర్షికకు ననుప్రాసత్వంబు నాపాదింపదలంచి 'నన్నియ' యని వాడియుంటిని. 'నన్నియ'యనియు వ్యవహరించువారు గలరుగదా.

మఱియు నాటవెలది, గీతము లుపజాతిఛందోభేదంబులయినను జాత్యధికారంబునందె తరచుగా నివి పఠియింపబడియుండుటచేతను, పై హేతువుచేతను జాతులనియే వ్యవహరించితిని.

ఆటవెలదిగీతముల నిట్టినియమంబులతో నన్నియరచించియుండుట మిక్కిలి విస్మయజనకంబై యాతని రచనాచాతుర్యమును వేనోళ్ల జాటుచున్నది. పరిశీలింపగా వీనిని మిక్కిలి తరచుగా వాడియుండెనుగూడ. ఒకొక్కచో వందపద్యంబులకు పదిపద్యములైనను నాటవెలదిగీతములు కానరాకున్నవి. ఆతని భాగంబున నాకు మిక్కిలిగా గానవచ్చిన పద్యంబులు కందంబుల. ఆటవెలదిగీతములు మిక్కిలి విరళములుగా నున్నను నిన్నిరీతుల నిబంధించియుండుట మాత్రము వాగనుశాసనత్వమును శాసించుచున్నదనియ నాతలపు. ఇట్టిభేదములను దిక్కనాదికవీంద్రులును వాడియుండిరేమొ పరిశీలింపవలసియుండును.

ఆంధ్రమహాభారతరత్నరాశియందు నింకనెన్నియనర్ఘరత్నంబులు మాటువడియుండెనోగదా.



# చిన్నయసూరి

## తుమ్మల సీతారామమూర్తి చౌదరి

౧

ప్రాంజలిలేని పాండితియు
సన్మృదురాసదశాబ్దికత్వపుం
బొంకము నీక దక్కెనది
పొమ్ము! తెలుంగుల నెల్లకాలముం
దెంకలఁ జేసికొంటివి బ
లే! కనుసన్నలఁ గోవిదాళిచే
సుంకము లందుకొంటివి య
శోనిధి వైతిగదోయి చిన్నయా!

౨

గాసటబీసటల్ సదివి
కర్జ మెఱుంగఁగలేక సంతతా
యాసమునందు సోదరుల
నారసి వాఙ్మయవార్ధి శేముషీ
భాసురమంథదండమునఁ
బట్టి మథించి సుధీజగత్తు "నే
బా" నన లక్షణామృతము
పంచితి వంచితవై భవంబునన్.

పురుషార్థము తురీయము నెఱుంగఁగోరుచో
నుపనిషద్రాజమై యొప్పుదాని
భాషాస్వరూపంబు పరికింప నెంచుచో
శబ్దలక్షణమై యెసంగుదాని
లోకజ్ఞతావిశేషాకృతుల్ సూచుచో
నీతిశాస్త్రంబునై నెగడుదాని
చేతోహర రసానుభూతి నర్థించుచో
నుత్తమకావ్యమై యుండుదాని
సకల ధర్మతత్త్వసారమై విశ్వజ
నీనమై వెలుంగు "నీతిచంద్రి
క"ను రచించి తెల్గుజనయిత్రి కిచ్చు నీ
పుట్టు ధన్యమయ్యెఁబో! కవీంద్ర!

వ్రాయఁగవచ్చుఁ గబ్బములు
వందలు వేలెటులో శ్రమించి దే
శీయులు వానిఁ గైకొని భ
జింపరదే నవి యేల? భాస్కర
చ్ఛాయలు నీదుసత్కృతులు
సంచరణం బొనరింపకున్నచో
టీ యఖిలాంధ్రభూమిఁ గల
దే? వలదే యిటువంటిభాగ్యముల్?

౫

ఎందాఁక గౌతమీకృష్ణవేణీ తుంగ
భద్రాస్రవంతులు పఱువులెత్తు
ఎందాఁకఁ దెల్గుల కిలువేల్పుగా వేంక
టేశుండు లోకంబు నేలుచుండు
ఎందాఁక నమృతనిష్యంది కవిత్రయ
రచితకావ్యమ్ము భారతము వెలయు
ఎందాఁక "నాంధ్రుఁడ నే" నంను భావించు
మానిసి జగతిపై మలయుచుండు
ప్రాక్పయోనిధివీచికాపాణిదత్త
మర్ఘ్యపాద్యాది పూజనం బందికొనుచు
నీ తెలుఁగుతల్లి యెందాఁక నెసఁగుచుండు
నీకుఁ దక్కిన కీర్తి యందాఁక నిలుచు!

మహాత్మ

# తులసీదాసుఁడు

విక్రమదేవవర్మ

ఈ మహాత్ముఁడు హిందీభాషయందు రామాయణమును, వినయపత్త్రికను మఱికొన్ని పొత్తములను రచించి ప్రసిద్ధిగనినవాఁడు. ఇతని పొత్తములలోఁ బైనిఁ జెప్పఁబడిన రెండును మిగుల వన్నెగాంచెను. అందు రామాయణముయొక్క ప్రసిద్ధి చెప్ప నలవిగాదు. దాని ప్రచారము దక్షిణదేశములందు నంతగా లేకున్నను, బశ్చిమోత్తరదేశములందు నత్యధికముగాఁ గలదు. ఆదేశములందుఁ దులసీరామాయణము లేని యిల్లు లేదనినచో నత్యుక్తి గాఁజాలదు. ఆదేశవాసులకుఁ దులసీదాసరామాయణమునందుఁ గల గౌరవ మాదికవి-వాల్మీకిరామాయణమునందుఁగాని మఱి యేరామాయణమునందుఁగాని లేదు. పెఱరామాయణములకంటెఁ దులసీదాసరామాయణమునందు నధికతరవిషయములు గలవు. తులసీదాసుఁడు కవిమాత్రుఁడె కాఁడు. అతఁడు విమలజ్ఞానియుఁ బరమభక్తుఁడు నగును. అట్టివానిచరితము దెలియుట యుక్తముగదా. దానిని బెక్కురు వ్రాసిరి. ఒకవిషయము ననేకజనులు వ్రాయునపు డది యించుక భేదయుక్తమగుట స్వాభావికము. దాసుని చరిత మాధర్మము నతిక్రమింపలేదు. ప్రధానవిషయములందుఁ బ్రభేదము లేకుండుటవలన వానిని గైకొని తచ్చరితము సంక్షేపముగా నిట నుడువుదును.

తులసీదాసుఁ డుత్తరదేశమునందున్న బాందా జిల్లాలోని రాజాపురగ్రామమునందు క్రీ. శ. పదునేడవ శతాబ్దముయొక్క పరభాగమున మూలానక్షత్రయుత దివసమునందు నొక కులీనబ్రాహ్మణదంపతులకు జనియించెను. ఆనక్షత్రము పితృగండమనియుఁ దనకు ముప్పు వాటిల్లుననియునిశ్చయించిస్వార్థపరు డయిన తండ్రివాత్సల్యమూరుఁడగుచు నానిసువు నొకయడవియందునొకానొక చెట్టుమొదట నుంచివచ్చెను. ఆశిశువు క్షుధాతురుఁడయి యేడ్చుచుండఁగానాదారిని శ్రీరామనామస్మరణము సేయుచు నేగుచున్న యొకానొక సన్న్యాసి యాయాక్రందనధ్వని విని కృపాంతరంగుఁడయి యాశిశువును గొని నిజాశ్రమమునకు వెళ్లెను; మఱియు నాశిశువునకుఁ దులసీదాసనామ మిడెను. అరక్షితులు దైవరక్షితులు గదా!

ఆసన్న్యాసియొక్క లాలనపాలనములవలన నా శిశువు శుక్లపక్షసుధాకరుని మాడ్కి దినదినాభివృద్ధి నొందెను. నారదునివలన విష్ణుమహత్త్వము విని విష్ణుభక్తుఁడయిన ప్రహ్లాదుఁడువోలె సన్న్యాసివలన రామాయణకథను విని తులసీదాసుఁడు బాల్యమునందె రామభక్తుఁడయ్యెను. సన్న్యాసి యతనికిఁ జదువు సెప్పుటయె కాక, జ్ఞానమార్గమును భక్తిమార్గము నుపదేశించి దీనబంధుపాఠకుని పుత్త్రికయు, రూపవతియు, గుణవతియు నయిన రత్నావళియను కన్యామణిని బెండ్లిచేసి యొక యింటివానిని జేసెను.

తులసీదాసుఁ డొకగడియయైనను బెండ్లాము నెడఁ బాయక కడుముదముతోఁ గాలమును గడపుచుండెను. దానంజేసి రత్నావళి దన పుట్టినింటికి నొకప్పుడును వెళ్లుటకు వలనుపడకుండెను. ఒకనాఁడు దాసుఁడు దానమాడ గంగ కేగియుండఁగా రత్నావళిసోదరుఁ డామె కడకు వచ్చి "నీ విప్పుడే బయలుదేఱి మాయింటికిరమ్ము. నీమగఁడు వచ్చునేని నిన్ను విడువఁ" డని నచ్చఁజెప్పి యామెను వెంటఁగొని నిజనివాసమునకు నేగెను. పిమ్మట దాసుఁ డింటికి వచ్చి భార్యను గానక మిగులవ్యాకులము నొందెను. ఇరుగుపొరుగువారివలనఁ బ్రేయసియొక్క పోకడను దెలిసికొని యతఁడు గట్టియున్న తడిబట్టతోడనె యత్తవారియింటికిఁ బరుగెత్తెను. అప్పుడు రత్నావళి దనవారితో సంభాషించుచుండెను. ఆమె మగనిని

గని సిగ్గును గినుకను బూని భవితవ్యమును భావింపక యిట్లనియె :—

> నాథ,మీరు సిగ్గును విడనాడి యిట్టు
> లిటకు వచ్చుట దగవా నె? యిట్టి మమత
> దగునె? నాదు హేయంబగు తనువునందు
> నిలు. ప్రేమంబు జానకీనేతయందు
> నిలుపునెడ నిహపరసౌఖ్యములు లభించు.

ఈ పలుకులు వినినంతనె యతని ప్రాక్తనవాసనా ఫలముగా జ్ఞానచక్షు వున్మీలిత మయ్యెను. అతఁడు తత్క్షణము బయలువెడలి కాశిని జేరి యక్కడి సాధుజనులతోఁ గలిసి రామభజనలాలసుఁ డగుచుఁ గొన్ని యేండ్లు గడపిన నతని మనమునకు నెమ్మది గలుగ లేదు. శ్రీరామదర్శనాభిలాష మాతని మనమును బ్రతిక్షణము వేధించుచుండెను. అతఁడు ప్రతిదినము నదికాచమనముకొఱకు వెడలి శౌచము చేసికొనినఁ బిమ్మటఁ జెంబున మిగిలిన జలము నొకమఱ్ఱిచెట్టుమొదటఁ బోయుచుండువాఁడు. ఒకనాఁ డాతఁ డట్లు నీరుపోయు నంతనె యాచెట్టుమీఁదినుండి యొక బొమ్మరక్కసి దిగివచ్చి "మహాత్మా, మీరు ప్రత్యేకదినమును బోసిన జలముచేత నాయాత్మ పవిత్రమయ్యెను; నేను సంతుష్టుఁడ నయితిని. మీరు దేని నాదేశించిన నద్దానిం జేయుదు" ననెను. అది విని "మీరు నాకు శ్రీరామునిఁ జూపుఁ" డని దాసుఁ డనఁగా "నేను బాపాత్ముఁడను; ఆదేవదేవు నెట్లు చూపఁగలను? కాని, యొకయుపాయ ముపదేశింతును. గంగాతీరమునందు సాధుజనులు శ్రీమద్రామాయణపఠనశ్రవణములు సలుపుచుందురుగదా. అక్కడకు నాంజనేయుఁ డొకకుంటివానిరూపున వచ్చి తచ్చరితమును వినుచుఁ బఠనానంతరము వెళ్లుచుండును. మీ రాతనిని బ్రార్థింతురేని యతఁ డాస్వామిని జూపఁగలఁ"డని పలికి తదనుమతిని బొంది యారక్కసి యంతర్హితుఁడయ్యెను. దాసుఁడు ముదమొంది నిజసదనమున కేగెను. మఱునాఁడు దాసుఁడు గంగాతీరమునకు వెళ్లిచూడఁగా నచ్చోట నొకకుంటివాఁడు సాధుజనుల కొంతదవ్వునం గూర్చుండి శ్రీరామచరితమును వినుచుండెను. దాసుఁడు వేచియుండి పఠనానంతరము కుంటివానిని వెంబడించి యతని పాదములను బట్టుకొని విడువకుండ నతివినయముతోఁ బ్రార్థించెను. అప్పు డాంజనేయుఁడు ప్రసన్నుఁడయి "కొలఁది దినములలోఁ బ్రయాగతీర్థమునందు 'కుంభమేలా' (మకర మాసమునందు జరుగు జనులసమావేశము) యగును; అక్కడకు శ్రీరామ లక్ష్మణులు వత్తురు; అపుడు నీ వటకు వతువేని వారిని గుర్తింపం జేయుదు" నని చెప్పి తిరోహితుఁ డయ్యెను. దాసుఁడు ప్రయాగమునందు నాంజనేయుని కృపవలన శ్రీరామలక్ష్మణులను దర్శించి ధన్యుఁడయ్యెను. తరువాత నతఁడు కాశికి మరలివచ్చి రామాయణమును, వినయపత్త్రికను మఱికొన్ని గ్రంథములను రచించెను; దేశోపకార కార్యములను జేసెను; ధర్మోపదేష్ట యయ్యెను. అతఁడు క్రీ. శ. ౧౬౨౩నందు వైకుంఠమును జేరెను. అతనినిగూర్చి పెక్కుగాథలు గలవు. వాని నన్నింటిని వ్రాయఁబూనినచో నొక పెద్దపొత్తమగును.

# D K. W. CARS

. కే. డబ్ల్యు. కారులు



**7 H. P. 47 Miles Per gallon** గాలను 47 మైళ్లు.

వడిగా పోవును-విశాలముగా నుండును-తక్కువ ఖర్చు అగును.

ట్రిబ్యూటరులు:— బైరాం షా అండు కంపెనీ, డ్.

## BYRAMSHAW & Co., Ltd.,

**MOUNT ROAD, - - - - - - MADRAS**

మౌంటురోడ్, - - - - - - - మదరాసు.

# వ్యక్తిరక్షణమే దేశరక్షణము

జాతి యను గొలుసునకు ప్రతిమానవుడు ఒక్కొక్క కొక్కెముగా నుండును. అతనిరక్షణమే దేశరక్షణము. ప్రజలు ఐశ్వర్యవంతులై యున్నప్పుడే దేశము సమస్తవైభవములతో విరాజిల్లుచుండును. అట్టి ఐశ్వర్యము మానవులనుబట్టియుండును.

మానవవికాసమునకు మనోదేహములు రెండును ప్రశాంతముగ నుండవలెను. సంశయము యావత్తు పారద్రోలి, భవిష్యజ్జీవితమునకు కావలసిన రక్షణమునుగురించి యిప్పుడే వార్డన్ భీమా పట్టాద్వారా కట్టుదిట్టముచేసికొనుము. కొద్ది కాలములోనే వార్డన్ భీమాపట్టాలు దేశసౌభాగ్యమునకు ఎంతయు తోడ్పడియున్నవి. అసంఖ్యాకములైన సౌకర్యములు, భీమా సంబంధమయిన క్లిష్టపరిస్థితుల నన్నిటిని పోగొట్టగల మంచిస్కీములు, ఉత్సాహముతో పనిచేయు ఉద్యోగబృందము మొదలగు పరికరములతో కూడియుండి వార్డన్ కంపెనీ జాతీయరక్షణకు అండగా నిలిచి యున్నది.

వార్డన్ కంపెనీ,

రిచీ రోడ్,

అహమ్మదాబాద్.




యిన్స్యూరెన్సు లిమిటెడ్.,

బ్రాంచీలు,

బొంబాయి, మదరాసు, కలకత్తా.

# లివర్ క్యూర్

(రిజిష్టర్డు)

30 సంవత్సరములకు పైనుండి తయారుచేయబడుచు, అనేకవేల శిశువులను మృత్యుముఖమునుండి తప్పించి, అనేకమంది వైద్యప్రముఖులచే ప్రతిదినము వారిరోగులకు వాడబడుచు అద్భుతమైన కీర్తిని సంపాదించిన ఔషధమేది అన **జమ్మి వెంకటరమణయ్య గారిదే** అని హిందూదేశమందు ఎల్లరకును తెలిసిన విషయమే. దీనిని గురించి ప్రత్యేకముగా వ్రాయ ననవసరము.

గాని వీరి అద్భుత ఔషధరాజముయొక్క ఖ్యాతినిగని, కన్నెఱ్ఱనై అనేకమందిచే పలువిధములగు ఔషధములు తయారుచేయబడి, బయలుదేరుచున్నవి అను విషయముమాత్రము తెలియుట అవసరము.

డా. టి. కె. నటేశన్, రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టిషనర్, కంజీవరం వ్రాయునది:

"జమ్మి వెంకటరమణయ్యగారు:—వారి అద్భుత ఔషధరాజము దైవప్రసాదమువలె వెలుపలికి వచ్చుటకు ముందు అనేక సంవత్సరములనుండి లివర్ వ్యాధికి చికిత్స అను విషయము కష్టసాధ్యమై యుండెను. యీఔషధము **శిశువుల లివర్ (బల్ల) అను కష్టమైన వ్యాధికి నిజముగా ఒక వరప్రసాదమే** అని చెప్పదగును. ఇప్పుడు వెలువడిన మిగతా ఔషధములతో సరిచూడగా జమ్మి వెంకటరమణయ్యగారి ఔషధమే నిశ్చయముగ గుణముచేయునని నేను కనుగొనగల్గితిని."

రూపము, చికిత్స, అనేకవేలమందిచే నొసంగబడిన అభిప్రాయములను తెలియచేయు పుస్తకము కోరినవారికి ఉచితముగా పంపబడును.

వివరములకు :

## డా॥ జమ్మి వెంకటరమణయ్య

**లివర్ అండ్ స్ప్లీన్ స్పెషలిస్టు, మైలాపూరు, మద్రాసు.**

బ్రాంచీలు :

| హారిసన్ రోడ్, | ఆర్కాటు శ్రీనివాసాచారి | రాజాబజారు, |
|---|---|---|
| కలకత్తా. | బెంగుళూరు సిటీ. | విజయనగరం. |

ఆంధ్రనాటకకళాపరిషత్తు నాల్గవసమావేశము (౧౯౩౬ డిసంబరు) చెన్నపురి. అధ్యక్షుడు: శ్రీమోతే నారాయణరావుగారు.



ఆంధ్రనాటక కళాపరిషత్తు నాల్గవసమావేశమున పాలుగొనిన ఆంధ్ర నటీనటులు.



శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, వారి సహధర్మచారిణి; శాస్త్రిగారి షష్టిపూర్తినాటి యూరేగింపు.



శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి షష్టిపూర్తి
అధ్యక్షుడు : శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

# కావ్యవినోదము

*

## తిరుమల రంగాచార్యులు

"ఏకక్రియా ద్వ్యర్థకరీ" అన్నట్లు ఒకపనివలన రెండింతలు లాభ ముండవలెననుట పెద్దల యభిప్రాయము. ఉబుసుపోకకై మూఢులు ద్యూతాదులందుఁ బాల్గొందురు. కాలము జరిగిపోవును. కాని తుదకు వారికి మిగులునది ధనమానసష్టమువలని దుఃఖము. కాలము తెలియకనే జరిగిపోయినను కలకాలమువఱకు మఱవరాని మహానందమును గల్గించునది కావ్యవినోదము. దీనివలన ధనహాని యిసుమంతయు లేదనుట యటుండ రసికులకు మానాభివృద్ధియే కల్గును. కావ్యవినోదములఁ బ్రవర్తిల్లువారి కాహారముగూడ నొకప్పుడు రుచింపదు గదా! "కాదంబరీరసజ్ఞానా మాహారోఽపి న రోచతే" అనునట్టివి వట్టిమాటలు కావుగదా!

కడచిన యువసంచికలో 'గవ్యకాలక్షేప' మను శీర్షికక్రిందఁ గొన్ని యంశముల వ్రాసియుంటిని. ఈతూరి మఱికొన్ని యంశములను కావ్యవినోద మను శీర్షికతో వివరింపఁదలఁచితిని. పాఠకమహాశయులు సావధానచిత్తులగుదురుగాక!

ఈ క్రింద వివరింపఁబడు శ్లోకములకు సామాన్యాభిప్రాయమును 'సా' అను గుర్తుతోను, వాస్తవాభిప్రాయమును 'వా' అను గుర్తుతోను వ్రాసితిని. పాఠకులు దీనిని మనస్సున నుంచుకొనవలయు.

విద్యావంతు లగువారొక్కచోఁ గూడినపుడు వాస్తవార్థమును మఱుఁగుపఱుచుచు సామాన్యార్థమును మాత్రము స్ఫురింపఁజేయు పద్దెములతో నొండొరులను బరీక్షించికొందురు; నేర్పరులు వాస్తవార్థమును గ్రహించి చెప్పఁగలరు. కాని సామాన్యు లటు చేయఁజాలక మిణకరింతురు. అట్టిశ్లోకము లివి. ఇందు కర్త మఱుఁగుగా నున్నది:

> ౧. అసితైః కుందకుసుమైః సితైః పాటలకుట్మలైః,
> వాసుదేవాలయం గత్వా సోమశేఖర మర్చయ!

సా. విష్ణ్వాలయమునకుఁ బోయి నల్లని మల్లెపూలతోను, తెల్లని కలిగొట్టుపూలతోను శివుని బూజింపుము.

(వా. వాసువా! (నాట్యపరిభాషలో బాలికాయనియర్థము) దేవాలయమునకు వెడలి కట్టఁబడని మల్లెపూలతోను, కట్టఁబడిన కలిగొట్టుపూలతోను శివునిబూజింపుము

వాసు, సితశబ్దములకు బాలిక, కట్టఁబడినది అను నర్థములు గలుగుటకుఁ బ్రమాణములు:

అమరకోశము, ౧. అథ బాలా స్యా ద్వాసూ రార్యస్తు...... ౨. బద్ధే సందానితం మూత సుద్దితం సందితం సితమ్.

> ౨. అన్నవస్త్రసువర్ణాని రత్నాని వివిధానిచ,
> బ్రాహ్మణేభ్యో నదీతీరే దదాతి వ్రజ సత్వరమ్.

సా. ఏటిగట్టున బ్రాహ్మణులకు అన్నవస్త్రములను, బంగారమును, వివిధములగు రత్నములను ఇచ్చుచున్నాఁడు పొమ్ము. ఎవఁడు?

వా. బ్రాహ్మణుఁడా! రాజు ఏటిగట్టున.
...పొమ్ము.

బ్రాహ్మణ + ఇభ్యః అని పదచ్ఛేదము చేయవలయు. "ఇభ్య ఆఢ్యో ధనీ స్వామీ" యని యమరకారుఁడు.

> 3. నకరోతి నామ రోషం నవదతి పరుషం నహంత్యయం
> శత్రూన్, రంజయతి మహీ మఖిలాం తథాపి ధీరస్యలోకస్య.

సా. ఇతఁడు కోపింపఁడు, కఠినముగా మాటలాడఁడు, శత్రువులఁ జంపఁడు అనుట ప్రసిద్ధమేకదా! ఐనను ధీరుఁడైన యీ వీరునియొక్క...... ......(కర్తృలోపము) సమస్తభూమిని రంజింపఁజేయుచున్నది.

వా. ఈ వీరునియొక్క బుద్ధి సమస్త.
చేయుచున్నది.

ధీః + అస్య అని పదచ్ఛేదము.

ఈక్రింది శ్లోకమున కర్మ గుప్తముగా నున్నది:

> ౪. శీకరాసారసంవాహి సరోజవనమారుతః,
> ప్రక్షోభయతి పాంథస్త్రీనిశ్వాసైరివ మాతులః.

సా. నీటితుంపరల జడివానను మోసికొన్నట్టియు, కమలముల గుంపుపై నచ్చినట్టియు గాలి త్రోవనడచు స్త్రీల నిశ్వాసములచే బలిసినదా యన్నట్లు......(కర్మ గుప్తము) కలఁత పెట్టుచున్నది.

వా. నీటితుంపరల జడివానను మోసికొన్నట్టి వేగవంతమైన గాలి పాంథస్త్రీల నిశ్వాసములచే బలిసినదా యన్నట్లు సరస్సును గలఁతపెట్టుచున్నది.

సరః + జవనమారుతః అని పదచ్ఛేదము.

ఈ క్రింది శ్లోకములు క్రియాగుప్తములు:

౫. ప్రాతః ప్రాత స్సముత్థాయ ద్వౌ మునీచ కమండలూ,
అత్ర క్రియాపదం గుప్తం మర్యాదా దశవార్షికీ.

సా. ఇద్దఱు మునులు ప్రతిదిన ముదయమున లేచి రెండు కమండలువులను ... ... ... (క్రియగుప్తము)

ఇచటఁ గ్రియను గన్గొన గడువు పదియేండ్లు.

వా. ఇద్దఱు మునులు ప్రాతఃకాలమున లేచి రెండుకమండులువులను పూరించుచున్నారు.

'ప్రాతః'అనునది క్రియ. ప్రాపూరణే అనుధాతువు యొక్క వర్తమానార్థక ప్రథమపురుష ద్వివచనము.

౬. విరాటనగరే రమ్యే కీచకా దుపకీచకమ్,
కర్తృక్రియాపదే గుప్తే యో జానాతి స పండితః.

సా. ఇంపైన విరాటనగరమునందు ఒక వేణువు నుండి మఱియొక వేణువునుగూర్చి ... ... (కర్త, క్రియ గుప్తములు) ఎవఁడు కర్తృక్రియలను దెలిసికొనునో వాఁడు పండితుఁడు.

వా. ఇంపైన పట్టణమునందు వేణువునుండి వేణువునకు పక్షి యెగిరెను.

విః + ఆట అని పదచ్ఛేదము చేయవలెను.

కర్తృకర్మ క్రియాగుప్తము:

౭. భవానిశంకరోమేశం ప్రతిపూజాపరాయణః,
కర్తృకర్మక్రియాగుప్తా యో జానాతి స పండితః.

సా. పూజాపరాయణుఁడవు.....(కర్త, కర్మ, క్రియ మూఁడును గుప్తములు.)

వా. ఓహ స్తమా, ఎల్లపుడును శివునిగూర్చి పూజాపరాయణావు కమ్ము.

భవ + అనిశం, శర + ఉమేశం అని పదవిభాగము చేయవలెను.

సమాసగుప్తము:

౮. విషాదీ భైక్ష్య మశ్నాతి సదా రోగం నముంచతి,
రుష్టేనాపి త్వయా వీర శంభు నారి స్సమః కృతః.

సా. వీరుఁడా, నీశత్రువు దుఃఖముగలవాఁడై తిరిపె మెత్తుచున్నాఁడు. రోగము నెపుడును విడువకున్నాఁడు. నీవు కోపించియు నీశత్రువు శివునిసమానుఁడుగాఁ జేయఁబడెను.

వా. ఇచట విషాదీ, సదారః అనునవి సమాసములు. నీశత్రువు విషముతినువాఁడై భార్యతోఁ గూడి కొండను విడువకున్నాఁడు కాన శివునిబోలినవాఁడయ్యెను. 'విషాదీ' అనునది ఉపపదసమాసము. 'సదారః' అనునది సహపూర్వపదబహువ్రీహిసమాసము.

గూఢాభిప్రాయములు గలవియుఁ, బరస్పరవిరుద్ధార్థముల స్ఫురింపఁజేయునవియు కూటము లనఁబడును. అవేవన,

౧. ఏకోనా వింశతిః స్త్రీణాం స్నానార్థం సరయూం గతాః,
వింశతిః పున రాయాతా ఏకో వ్యాఘ్రేణ భక్షితః.

సా. ఒకటితక్కువయిరువదిమందిస్త్రీలు స్నానము చేయుటకై సరయూనదికి వెడలిరి. వారిలో నిరువదిమంది వెనుకకు మరలిరి. ఒకఁడు పులిచేత భక్షింపఁబడెను.

వా. ఏకః + నా అని విభజించి ఒకపురుషుఁడును, ఇరువదిమంది స్త్రీలు నని యన్వయించికొనవలెను.

౨. రామం స్కందం లక్ష్మణం జీవికార్థే
విక్రీణీతే యో నర స్తంచ ధిగ్ధిక్,
అస్మి న్పద్యే యోఽపశబ్దా న్నవేత్తి
వ్యర్థ ప్రజ్ఞం పండితం తంచ ధిగ్ధిక్.

అభి. ఎవఁడు రామునిని, లక్ష్మణుని, కుమారస్వామిని జీవనార్థమై యమ్ముకొనునో వానిని, ఈశ్లోకము

నందు అపశబ్దములను దెలిసికొనఁజాలని పండితుని ఛీ! ఛీ! యనవలెను.

వ్యాకరణజ్ఞానము చక్కఁగ లేనివారి కిందు నెట్టి యపశబ్దము కనఁబడదు. కాని "జీవికార్థే చాపణ్యే" అను నది పాణినీయసూత్రము. 'జీవికార్థం య దవిక్రీయమాణం తస్మిన్నర్థే కనో లుప్స్యాత్' అని వ్యాఖ్యానము. దీని ప్రకారము విక్రయింపఁబడునట్టి ప్రతిమ లనునర్థ మిచ్చు నపుడు పదములకు 'కన్' ప్రత్యయము రావలెను. కాన రామకం, స్కందకం, లక్ష్మణకం అనిమాత్రమే చెప్ప వలెను. అపుడు రాముని స్కందుని లక్ష్మణుని ప్రతిమ లని యర్థము సిద్ధించును.

3. అహంచ త్వంచ రాజేంద్ర లోకనాథా వుభావపి,
బహువ్రీహి రహం రాజన్ షష్ఠీతత్పురుషో భవాన్.

అభి. రాజశ్రేష్ఠుఁడా, నీవును, నేనును లోకనాథు లమే! కాని నేను బహువ్రీహిని. నీవు తత్పురుషమవు. ఇదొక యాచకుఁడు రాజుతో నన్నమాట. యాచకుని పక్షమున లోకులు నాథుఁడుగాఁ గలవాఁడని బహు వ్రీహి; రాజుపక్షమున లోకులకు నాథుఁడని షష్ఠీ తత్పు రుషము.

౪. దేవరాజో మయా దృష్టో వారివారణమస్తకే,
భక్షయిత్వార్కపర్ణాని విషం పీత్వా క్షయం గతః.

సా. ఐరావతముపై నింద్రునిఁ జూచితి. అతఁడు జిల్లెడాకులు తిని విషముమ ద్రాగి నాశము పొందెను.

వా. బావా! సేతువుపై మేకను జూచితిని. అది జిల్లేడాకులు తిని నీరు త్రాగి ఇంటికిఁ బోయెను.

దేవర + అజః అని పదచ్ఛేదము. విష మనఁగా నీరనుటకు 'జీవనీయం కుశం విషం', క్షయమనఁగా నిల్ల నుటకు 'నివేశ శ్శరణం క్షయః' అని యమరము.

ఇట్టివి పెక్కుశ్లోకములు గలవు. మచ్చునకై కొన్నింటిమాత్రము వ్రాసితిని. పై నుదాహరింపఁబడిన శ్లోకములకుఁ గర్త యెక్కఁడు కాఁడు. రాఁబోవుసంవ త్సరమున నొక్కొక్కకవినిగూర్చియు, నతని చిత్ర విచిత్రపద్యములఁగూర్చియుఁ జర్చింపఁదలఁచితిని.

ఒకవిద్యార్థి శిరస్తదారుని బాధపడలేక యతని నిందించిన శ్లోకమును వ్రాయుచు నిప్పటికి విరమించెదను.

ఉరస్థదారో భగవాన్ రమేశః
పార్శ్వస్థదారో భగవా నుమేశః,
ముఖస్థదారో భవగవా న్విరిజేశః
శిరస్థదారోస్తి మనుష్యలోకే.

అభి. విష్ణువు ఎదపై భార్యనుంచుకొనెను. శివుఁడు ప్రక్కను భార్య నుంచుకొనెను. బ్రహ్మ ముఖమున భార్య నుంచుకొనెను. కాని యీమనుష్యలోకమున మాత్రము నెత్తిని భార్య నుంచుకొన్నవాఁడు కలఁడు. అతఁ డెవఁడ నఁగా శిరస్థదారుఁడు.





# కళకోసం

చంద్రుపట్ల రామారావు

కళాప్రపంచంలో విరుచుకుపడి కొన్ని ఉరకలమీద గమ్యస్థానానికి చేరుకొన్నాడు జయరాం. అందుకు కావలసిన అడ్డదార్లన్నీ ముందుగానే అవగాహన చేసుకొన్నాడు. ఒక్కసారిగా రొమ్ములు విరుచుకొని బయటపడేసరికి తందానతానగాళ్లు వాళ్లంతట వాళ్లే బయలుదేరి బోట్లు బనాయించి కప్పీలమీద పైకెత్తేశారు జయరాంని. "భారతీయ చిత్రకళ—భారతీయ చిత్రకళ" అంటూ కళాసముద్రపుటొడ్డున ముక్కుపట్టుకొని కూర్చున్న ఛాందస విమర్శకులో, నిత్యం మడిగట్టుకొనే ఉన్న ఏ ఒకటి రెండు పత్రికలో తప్ప యావదాంధ్ర దేశమూ బ్రహ్మరథం పట్టించసే అనాలి అతన్ని. నలుదిక్కులా అతని జయఘంటికలు ఘల్లున మ్రోగిపోయాయి అతను చిత్రించేది భారతీయ సంప్రదాయానికి విరుద్ధమనిగానీ, భావలావణ్యం లేక వాస్తవ జగత్తుకు అనుకరణ మాత్రమే అనిగానీ ఎవరయినా సాహసించి అన్నారా, రైంయిమని గాలిదుమారాలూ, వడగండ్ల వానలూ తప్పవు. ఇంతకీ అత నార్జించినంత డబ్బూ, పేరూ ఎవడయ్యా సంపాదించాడు అని అంతా ప్రశ్నించేవారే. అదే అతని గొప్పతనానికి తార్కాణ. ఏపత్రికలో చూచినా అతని బొమ్మలే. విషయవాసన ఎక్కువగాగల పడుచువాళ్ల రక్తాన్ని పొంగించి కళాసామ్రాజ్యానికి పట్టం గట్టించుకొన్న జయరాంబొమ్మలు పతివ్రతలవైనా తడికల బజారుగుంటల ప్రతిబింబాలేనని చాటుచాటున అనుకొనేవారూ లేకపోలేదు. ఇది ఉపోద్ఘాతం. సరే, అసలు కథ ఏమిటూ?

పదిరోజులక్రితం జయరాంభార్య రమణ పుట్టింటికి వెళ్లి తిరిగి వొచ్చేటప్పుడు నెలరోజులపాటు ఉంచుకొని పంపిస్తానని చెల్లెల్ని వెంటపెట్టుకొని వొచ్చింది. మీనాక్షి ఇంకా అవివాహిత. అప్పుడే మన్మథుడు మెరుగులుదిద్దిన నవయౌవన.

జయరాంహృదయంలో అతనికి తెలియని ఓమార్పు వొచ్చిపడింది మీనాక్షివొచ్చినప్పట్నుంచిన్నీ. అతనికి మీనాక్షిపైగలముద్దూ, ప్రేమా చివరకి పట్టరాని మోహంగా పరిణమించి, క్రమక్రమంగా అతనిమనసును గిలకొట్టడం మొదలుపెట్టింది.

అసలు చిన్నప్పట్నుంచీ మీనాక్షికి జయరాం అంటే ఎరవరిక ఏమీలేదు. జయరాంకూడా ఆమెతో వేళాకోళాలాడుతూఉండేవాడు. మధ్యమధ్య మీనాక్షిరూపాన్ని చిత్రించి ఆమెను సంతోషపెట్టేవాడు. కాగితంలో తనరూపాన్ని అచ్చంగా వ్రాసేశాడే అని ఎంతో ఆశ్చర్యపడేది. తాను రమణవిస్తూరీమాదిరిగా వ్రాయాలని ఎన్నితంటాలు పడ్డా సాధ్యపడేదికాదు. అలాంటిది మాస్తూమాస్తూ ఉండగా తన ఆకారాన్ని ఇట్టే వ్రాశాడు బావ అని అబ్బురపడిపోయేది. తనబొమ్మ చూచుకొని ఆనందంతో మైమరచి పోయేది. అప్పటినుంచి రోజూ అతన్ని తనరూపు వ్రాయమని బలవంతపెట్టడం, అతను రకరకాలుగా ఆమెను చిత్రించి ఏవో పేరుతగిలించి లోకానికి సమర్పించడం మామూలైంది. అతని కళావైదగ్ధ్యం నానాటికి మిన్ను ముట్టిపోతోం దని అందరూ ప్రశంసలు కురిపించడం మొదలుపెట్టారు. ఇలా జయరాం మీనాక్షిసౌందర్యాన్ని సాధనంగాచేసుకొని కళాలక్ష్మిని ఆరాధించి సఫలుడయ్యాడు. మీనాక్షిసౌందర్యకిరణం సోకని అతని పాతరచనలన్నీ ఇప్పుడు పేలవంగా కనిపిస్తున్నాయి. దానా దీనా మీనాక్షి లేకపోయిందా అతనికి యశస్సూ లేదు. ఇలా తేలింది

గుండ్రనిముఖం—చారడేసికళ్లు-నువ్వుపువ్వులాంటి కొనదేరిన ముక్కు-చిన్నినోరు-సుందరములు వర్తులములైన వక్షోజాలు-సన్నని నడుం-పెద్దపిరుదులు-అరటిబోదెల్లాంటి తొడలు-చేపలబోలినపిక్కలు-పద్మాల్ని దలపించే అంఘ్రులు- ఓః, మీనాక్షి అవతారమెత్తిన కళాధిష్ఠానదేవతగా భావించుకొని తన్మయుడైపోయాడు జయరాం. ఆమె లావణ్యాన్నీ, సౌకుమార్యాన్నీ, విశేషించి ఆమె అవయవ సౌభాగ్యాన్నీ పరీక్షగా మాస్తూ?, కళ్లతో ఆమెసౌందర్యాన్నంతనీ త్రాగేసేవాడు. క్రమేణా అతనిలో ఓ విపరీతమైన పరివర్తనకూడా కలిగిపోవడంలో ఆశ్చర్యమేముంది! అది ఆమెసౌందర్యాన్ని స్వయంగా అనుభవించాలనే వెర్రిదాహమే. మీనాక్షి ఇంకా వలపుతీపెరుగని అమాయికబాలికే. కాని, జయరాంమాత్రం అవకాశం చిక్కినప్పుడల్లా చూపుల్లో, మాటల్లో తన ప్రేమను ప్రకటించకుండా ఉండలేకపోయేవాడు.

ఓరోజున సాయంసంధ్యాశోభను చిత్రంలో ప్రతిఫలింపజేయాలని పెన్సిలు, కాగితం తీసుకొని డాబామీద కూర్చున్నాడు

జయరాం. తనకు నచ్చినవిధంగా నీలమేఘాలన్నీ ఓచోట కూడుకొనేవరకూ, సంధ్యారాగం తెల్లమబ్బుల దొంతర్లలో పేరుకొనే వరకూ కనిపెట్టుకొని చూస్తున్నాడు. ఇంతట్లో యాదాలాపంగా క్రిందికి దొడ్డివైపుకు చూచేసరికి రమణీయమైన దృశ్యమొకటి కనిపించి అతని మనస్సు నాహరించింది. ఆదృశ్యం మరేమీకాదు. నూతి దగ్గర మీనాక్షి స్నానం చేస్తోంది. బీరపువ్వురంగు సన్నచీర తడిసి శరీరాన్ని అంటిపెట్టుకుపోయి చాయపసుపు నలదుకొన్నట్టుగా ఉంది. యౌవనోద్రేకంతో మిసమిసలాడిపోతున్న ఆమె శరీరంలోని ఉన్నతభాగాలు స్ఫుటంగా పైకి కనిపిస్తూ సంజనీరెండలు పసిడికాంతుల్లో మిలమిలలాడుతున్నాయి. ప్రకృతిచిత్రం వ్రాయాలని కూర్చున్న జయరాందృష్టి ఒక్కసారిగా మారిపోయింది. గబగబా క్రిందికి దిగి మీనాక్షిదగ్గరకు చేరుకున్నాడు. మీనాక్షి ఇతన్ని చూచి కొంచెం సిగ్గుపడింది. "మీనం, తడిబట్టవిప్పకుండా అలాగే నుంచో. నీబొమ్మవ్రాస్తాను" అన్నాడు. "ఇప్పుడుకాదు." అంది మీనాక్షి. "ఇప్పుడే వ్రాయాలి. ఇక్కడ నుంచోడానికి సందియంగా ఉంటే గదిలోకి నడు." అంటూ బలవంతపెట్టాడు. తాను అడిగినప్పుడల్లా తనమాట తీసివెయ్యకుండా అతను వ్రాస్తున్నప్పుడు అతను కోరినప్పుడు తాను అంగీకరించకపోవడం భావ్యంకాదనుకొంది. సరేనని లేతనవ్వు నునుబుగ్గలమీద చిందులాడగా అతనివెనుక నడిచింది.

నల్లని తెరముందు జుట్టులో పూలు పెట్టుకొంటూ నిలబడమన్నాడు మీనాక్షిని. ఆభంగిమంలో ముందుకు ఉబికే ఆమె రొమ్ముల అందాన్ని తడిబట్టలోంచి తనివితీరా చూడాలనే అతని కాంక్ష. మీనాక్షికి ఈమాయ ఏమీ తెలియదు ప్రక్కనుంచి వెలుతురు ఆమెమీద పడేటట్టు అద్దాలకిటికీ తెరచి ఎదురుగా కూర్చుని బొమ్మగీయడానికి మొదలుపెట్టాడు. మీనాక్షిమీదకు వ్రాలిన చూపులు వెనక్కు మళ్లడంలేదు. మళ్లినా, పెన్సిలు తన ఇష్టం చొప్పున నడవడంలేదు. ఎంత ప్రయత్నించినా ఒక్కగీతయినా సరిగా రావడంలేదు. మనస్సులో సంకల్ప వికల్పాలు శతసహస్రముఖాలుగా విజృంభిస్తున్నాయి. అలాగే ఆసౌందర్యజ్యోతిమూర్తివైపు విస్తుపోయి చూస్తూకూర్చున్నాడు. కొంతసేపటికి "అబ్బా" అని వొళ్లు విరుచుకొంది మీనాక్షి. జయరాం కాగితం క్రిందపడేసి చేరుమాలుతో మొఖం తుడుచుకొని ఒక్కనిట్టూర్పు విడిచాడు. నెమ్మదిగా గొంతుక పెకలించుకొంటూ "ఈపోజు చాలాబాగుంది." అన్నాడు.

"అయిందా?"

"కాలేదు."

"ఎంతసేపు ఇంకా? చలివేస్తోంది నడుం లాగుతోంది కూడాను."

జయరాంకి ముచ్చెమటలుపోశాయి. ఒణకుతున్న కంఠంతో "వ్రాయలేను మీనం" అన్నాడు సన్నయెలుగున.

"ఏం? అలావున్నావేమిటి?"

"ఎలాగో ఉంది."

"అంటే?"

"అంటే అంటేనే."

"అదేమిటి బావా! ఇందాకటి ఉత్సాహమంతా ఏమైపోయిందిప్పుడు?"

"నాకు తెలుసుకాని చెప్పలేను."

"అదేమో?"



"ఈపోజు చాలాబాగుంది." అన్నాడు.

"నువ్వేమంటావో నని."

"బలేబాగుంది. నేనేమంటాను? ఎందుకంటాను?"

"అంటావులే."

"నీకేమన్నా పిచ్చా? బొమ్మ వ్రాయనందుకు నేను చిన్న పుచ్చుకుంటానని ముందుగానే ముందరికాళ్లకు బందాలేస్తున్నావు."

"అదికాదు. నువ్వు కోప్పడనంటే చెబుతా."

"ఎందుకు కోప్పడతానూ అసలు. చెప్పుబావా."

"నువ్వు ఉత్థఅమాయికవు సుమా మీనం."

"ఏం?"

జయరాం హృదయం చింపుకొని తనమనస్సు పొందుతూన్న ఆరాటాన్నంతనీ దీనంగా ఏకరువు పెట్టాడు. మీనాక్షి కేలాగో అనిపించింది. ఆమెరెండుచేతులూ పట్టుకొని ప్రణయభిక్షు పెట్టుమని ప్రార్థేయపడ్డాడు. ఆమెను ప్రేమపుష్పాలతో అభిషేకించి తనహృదయ సామ్రాజ్యానికి పట్టంకడతానని చెమ్మగిలిన నయనాలతో, రాగపులకిత హృదయంతో చెప్పుకొన్నాడు. మీనాక్షి కేమీ తెలియలేదు. ఇంతవరకు ప్రణయమంటే ఏమిటో ఎరుగదు. ఇతని ప్రసంగం ఆమె కేమీ అర్థం కాలేదు. కాని, ఆతన్ని చూచి జాలిపడింది. "ఏమంటావు" అని జయరాం హఠాత్తుగా ఆమెను గుండెల కదుముకొన్నాడు. ఆమె నిలువునా చలించిపోయింది. దొండపండులాంటి ఆమెపెదవి మునిపళ్లతో నొక్కి ఊపిరితిత్తులనిండా గాలితీసుకొని, ఆమెఅవయవాల పొంగు అణగేటట్టుగా శక్తికొద్దీ కౌగిట్లో నలిపేశాడు. మీనాక్షికి పాదాల క్రింద భూమి కదిలినట్టయింది. నిమిషాలకొద్దీ అతని కౌగిలిలో చైతన్యం లేకుండా అలా ఉండిపోయింది.

మొదట్లో అతనిమీద తనకున్న గౌరవంకొద్దీ మర్యాదకీ, మొగమాటానికీ తనశరీరాన్ని అతని ఇష్టంచొప్పున వప్పగించి ఊరుకొంది. కాని, ఆమెకు తెలియకుండా ఒకవిద్యుత్ప్రవాహం ఆసమయంలో ఆమెలో ప్రవేశించిందనీ, అది క్రమంగా నరనరానికీ ప్రాకిపోయిందనీ తర్వాత తెలుసుకొంది. ఆ ముహూర్తంనుంచీ ఆమెలో విచిత్రమైన మార్పు కనబడడం ప్రారంభించింది. ఆమె నేత్రాల్లో యౌవనాశ, శృంగారచిహ్నాలు, ప్రణయపిపాస గోచరిస్తున్నాయి. మునుపటి ముగ్ధత్వానికి ఓవికమైన లజ్జ మెరుగులు పెడుతోంది. పురుషుని స్పర్శ జ్ఞప్తికి వచ్చినపుడల్లా మేన పులకలు జనిస్తున్నాయి. అలాంటి వెచ్చని కౌగిలింతకోసం, తజ్జనితమైన అమృతపారవశ్యంకోసం ఆమె కన్నెమనసు ఉరకలువేయడం మొదలుపెట్టింది. మీనాక్షిలో కలిగిన ఈమార్పును చూచి రమణ చకితఅయింది. వయస్సుతోపాటు ఆమెలో మధురభావనలు పెరుగుతున్నాయని ఊహించి ఊరుకొంది.

కాని, తెరవెనుక జరిగిన ఈప్రణయనాటకం కొంత చూచాయగా తెలిసింది రమణకి. ఓరోజున చెల్లెలికి జడవేస్తూ మృదువుగా చిన్నఉపన్యాసం ఇచ్చింది, ఇలాంటిచర్యలవల్ల కన్యలజీవితం ఎంత అధోగతిపాలయేదీ నిరూపిస్తూ. మొదట్లో మొదట్లో తన రహస్యం తెలుసుకొన్నందుకు రమణమీద కోపంకలిగినా, వెంటనే తెప్పరిల్లి తనలో తాను చాలా పశ్చాత్తాపపడింది మీనాక్షి. తన అక్కగారి ప్రణయధనాన్ని తానే దోచుకోడానికి ప్రయత్నించడం ఎంతటి ద్రోహం అనుకొంది. పైగా, తనజీవితం ఎంతదుఃఖభాజనం కావలిసుందోనని భయపడింది. ఎప్పటికీ తాను జయరాంకి అర్థాంగికావడం తలచరాని మాటగదా. అలాంటప్పుడు తానే తన సతీత్వాన్నెందుకు



"ఏమండీ, మీ కిది భావ్యంగా ఉందా?"

భంగపరుమకోః యోచిస్తూ ఆరాత్రంతా దుఃఖిస్తూనే ఉన్నా అపవిత్రమైపోయిన తనదేహం తనకే రోతగా తోచింది.

ఇక, జయరాం పట్టరానిమోహంతో, కైపుతో తనగోతాను తికమకలు పడిపోతున్నాడు. పరస్త్రీని, అందులోనూ అవివాహితను అసనిం ంగా వాంఛించి ఆమెబ్రతుకును పాడుచేయడానికి మూస్తున్నాననే యోచనేలే ఏతనికి. నిర్మలమైన ఆమె ప్రణయమధువు, ముఖ్యంగా ఆమెఅంగసంపద తనకోసమే, తన అనుభవంకోసమే, తన ఆనందంకోసమే, తన కళారాధనకోసమేనని అతనిఊహ. కాని, రమణ ఆదిలోనే తన ప్రణయనాటకపు మొదటిరంగంలోనే హఠాత్తుగా నల్లతెరదించేసి అంతా అభాసుచేసేసిందని గ్రహించి తనలో తాను కుమిలికుమిలిపోయాడు. ఆగ్రహంతో మండిపోయాడు. రమణ అతనిపళ్లసందున కరకరలాడిపోయింది. కానైతే బహిరంగంగా ఆమెను ధిక్కరించి తన వాంఛితాన్ని నెరవేర్చుకోగలిగిన ధైర్యం, సాహసం అతనికిలేదు. కారణం అతని ఆశయానికి ధర్మబలం లేకపోవడమేనేమో.

రోజులు గడచిపోతున్నాయి. మీనాక్షి ఎప్పుడూ రమణ వెంటే తిరుగుతోంది. ఒక్కసారైనా తనతో ఏకాంత సమావేశానికి సందీయడం లేదు జయరాంకి. పైగా, పుట్టింటికి వెళ్లిపోతానని తొందరచేయడం సాగించింది. జయరాం కేమీ పాలుపోవడంలేదు. రమణను ప్రతిఘటించలేడు. మీనాక్షిని సమీపించలేడు. పోనీ, మనస్సునైనా ఉండబట్టుకోలేడు. ఇలా వ్యధపడిపోతున్నాడు. కళారాధన నిలిచిపోయింది. అతని తూలికాసన్యాసానికి లోకం విభ్రమంతో ప్రశ్నిస్తోంది. నిద్రాహారాలులేక అతనిమొగం నిస్తేజమైపోయింది. శరీరం కృశిస్తోంది. క్రమేణా జబ్బ వ్యాధిలోకి దిగింది జయరాం మంచంపట్టేశాడు. రమణ హఠాత్తుగా కలిగిన ఇతని స్థితికి చాలా బెంగపెట్టుకొంది. ఉపచారాలుచేస్తోంది ఒక్కనిమిషమేనా అతన్ని వొదలకుండా. ఎప్పుడైనా మీనాక్షి కంటపడితే వెర్రిమొగంపెట్టుకొని కళ్లలో నీళ్లు తొణుకులాడగా ఆమెవైపు అదేపనిగా చూస్తున్నాడు. మందూ, మాకూ పుచ్చుకోడు. తనకి మరణ సమయ మాసన్నమైనదని చెప్పేవాడు భార్యతో. రమణ ఎంతలాలించినా మందు పుచ్చుకోనడంలేదు. తన హృదయంలో ఉన్న కల్మషాన్ని క్షాళనంచేసుకోవడం లేదు. రమణ కళ్ల నీరుకారుస్తూ జయరాం పాదాలమీదపడి అతని జబ్బకు కారణం చెప్పమని వేడుకొంది. తన మీద ఒట్టుపెట్టుకొంది. చివరకి అతికష్టంమీద తన కోరికను విప్పాడు జయరాం. రమణ అనేకవిధాలుగా నచ్చజెప్పాలని చూసింది అతనికోరిక సరియైనదికాదని. అతను ససేమిరా అని పట్టిన పట్టు వొదలలేదు. అతన్ని ఎలాగైనా బ్రతికించుకోవలిసిన బాధ్యత రమణదే. ఆమె వెంటనే లేచివెళ్లి మీనాక్షిని అంగీకరింపజేసి ఆమెను తీసుకొచ్చింది. మీనాక్షిని తనలో లీనంచేస్తానని రమణ నమ్మకంపుట్టించగానే జయరాం ఔషధం పుచ్చుకొన్నాడు. భర్త కోసం ఆమెచూపిన త్యాగానికి, ఉదారతను జయరాం కృతజ్ఞతాపూర్వకంగా ఆమెను ప్రశంసించాడు. మీనాక్షి కన్నీటిబిందువులో లేనవ్వు తళుకుచూపింది. రమణ అడిగింది మందహాసంచేస్తూ జయరాంని "ఏమండీ, మీకిది భావ్యంగా ఉందా?"

"నాకోసమూ ఏమిటి? కళకోసం" అన్నాడు జయరాం కళ్లలో బ్రహ్మానందాన్ని వ్యక్తీకరిస్తూ.

జయరాంగారి బొమ్మలు నూతనమార్గం త్రొక్కి జగాన్ని ఆనందింపజేస్తాయని పత్రికలో ఒకవిలేఖరి వ్రాశాడు. సరే. చూదాం.





బ్ర. శ్రీ. మహామహోపాధ్యాయులు తాతా సుబ్బరాయశాస్త్రిగారి షష్టిపూర్తి, విజయనగరము
అధ్యక్షులు : బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయులు యస్. కుప్పుస్వామిశాస్త్రిగారు.



కవితాసమితి వార్షికోత్సవము, విశాఖపట్టణము. అధ్యక్షుడు : శ్రీ శివశంకరశాస్త్రిగారు.



హిందూయువజనసంఘము, ప్రథమవార్షికోత్సవము, ఏలూరు. అధ్యక్షుడు : శ్రీ యస్. రాధాకృష్ణ పండితుడు.



ఆంధ్రసారస్వత-పరిషత్తుసభ, నరసారావుపేట. అధ్యక్షుడు: బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రిలుగారు.



నా పూర్వపరిచితులు

# శ్రీయుత కూచి నరసింహముపంతులు

రాయసం వెంకటశివుడు

నడకయందు నదులలో భేదము లనేకములు గలవు. కొన్ని నిడివికిఁ దగిన వెడలుపు, దీని కనువగు లోఁతును గలిగి, గంభీరగమనమున విలసిల్లుచున్నవి. కొన్ని లోఁతు పొడుగు వెడల్పుల లోపములు గప్పిపుచ్చుటకా యనునట్లుగ నతివేగమునఁ బరుగులిడుచున్నవి. ఈ రెండు గతులకును మధ్యస్థమగు వేర్వేఱు నడకలతో నొప్పారు వాహినులును పెక్కులు గలవు. జీవిత పద్ధతులందు మనుజులలోఁగూడ నిట్టి వ్యత్యాసములు గానగును. ఈ తారతమ్యముల ననుసరించి నరులలో ఘనులు, నల్పులు, సామాన్యులు నను భేదము లేర్పడుచున్నవి. ఐనను నదీప్రవాహమునకు నరజీవితమునకు నొక గొప్ప భేదము గన్పట్టుచున్నది. ఎంతటిమహానదియును మొదట సామాన్యముగ సూక్ష్మరూపముననె దాల్చియుండును. హరిద్వారమునొద్ద గంగానది, నాసికదగ్గఱ గోదావరియును వట్టి సెలయేఱులె. మనుష్యులలో మాత్రము కొందఱు బాల్యము మొదలు వార్ధక్యము వఱకును సమాన గాంభీర్యమునఁ జూపఱ కెపుడు నాకర్షణీయులె. అవస్థాపరిస్థితులను లెక్కసేయక, ఎగుడుదిగుడులు లేని సమభావమున మెలంగుచు, నిరతము నేకరీతిని తోడివారల మన్ననలఁ గైకొను నిట్టి పుణ్యపురుషులలో శ్రీయుత కూచి నరసింహముగా రొకరు.



కూచి నరసింహముపంతులుగారు

విద్యార్థిదశనుండియును వీరి పరిచయభాగ్యము నాకుఁ గలదు. రాజమహేంద్రవరమున నరసింహముగారు విద్యాస్వీకార మొనర్చుకాలమున, ఆ నగరమందే యిన్నిసుపేట పాఠశాలలోను, కళాశాలలోను నేనును జదువుచుండువాఁడను. వీరి తమ్ములగు శ్రీ రామలింగముగారు, నేనును పిమ్మట సహపాఠులము. కుశాగ్రబుద్ధికిఁ దీసిపోని శీలసౌషవముచేత నరసింహముగారు తమ యధ్యాపక సహాధ్యాయుల మన్ననల నందుచుండుట నా కెఱుకయే. అంతట నుపాధ్యాయులై, ఎనలేని బోధనాప్రజ్ఞచేతను, నిష్కళంక ప్రవర్తనముచేతను ఆంధ్రదేశమున నుతి కెక్కుటయు, ఇపుడు వార్ధకమునఁ బ్రశస్తగ్రంథరచనచేఁ గీర్తి గడించుచుండుటయును లోకవిదితవిషయములు.

[illegible]

జీవితభాగ్య మనుభవించు మహనీయులు లెక్కకు మిక్కిలి తక్కువ!

ధనము, పలుకుబడి మున్నగు లౌకికసంపదలందు సామాన్యముగ వెనుకఁబడియుండు నుపాధ్యాయుఁడు మన దేశమునఁ బ్రకృతమున నంతగ జనులకు గౌరవాస్పదుఁడు గాకున్నాఁడు. లేమి వలన వచ్చిన కక్కుఱితి, అనావశ్యకమగు వినయము, ఆశయములు సాధించుపట్ల బిడియము, నియమరహితమగు నడవడియును, బోధనావృత్తిని జనులకు

మఱెంత చులుకన చేయుచున్నవి. బోధకలోకమున కాపాదిల్లిన యీయపవాదమును తమ యసమాన ప్రజ్ఞాసాక్ష్యములచేఁ దొలఁగించి, ప్రాచీనకాలపు గురుసంప్రదాయముల నాంధ్రావనిని బునరుద్ధరింపఁబూనిన యుపాధ్యాయులలో నరసింహముగారొకరు. ఉపాధ్యాయత్వము గౌరవమందే వృత్తికిని దీసిపోదని వాక్కునసే కాక క్రియారూపమునను తెలుఁగువారికి నచ్చఁజెప్పిన బోధకవీరులలో వీరు ముఖ్యులు.

శ్రీయుత నరసింహముగారు పశ్చిమగోదావరి మండలమందలి కుంచనపల్లిలో ౧౭-౧౨-౧౮౬౬ తేదిని యాజ్ఞవల్క్య బ్రాహ్మణ సద్వంశమున జన్మించిరి. తండ్రియుఁ, బినతండ్రియును పిఠాపురాధీశుని యాస్థానమున నుండుటవలన నరసింహముగారు పట్టణమున నాంగ్లమారంభించి, ఉన్నతవిద్యకు రాజమహేంద్రవరము పోయి, అప్పటి "ఆస్తికపాఠశాల"లో ౧౮౮౨-వ సంవత్సరమున మాధ్యమికపరీక్షలోను, ప్రభుత్వకళాశాల నుండి ౧౮౮౪ లో ప్రవేశపరీక్షలోను, ౧౮౮౬ లో ప్రథమశాస్త్రపరీక్షయందును మొదటితరగతియందు తీర్ణులయిరి. ఆ కళాశాలనుండియె పట్టపరీక్షకుఁబోయి, ౧౮౮౮-వ సంవత్సరాంతమందా పరీక్షలో రెండవ తరగతిని గృతార్థత నొందిరి. కళాశాలతరగతులలో శ్రీయుతులు పానుగంటి లక్ష్మీనరసింహారావు, ఆసూరి కాంతయ్య, చెన్నాప్రెగడ భానుమూర్తి, న్యాపతి హనుమంతరావు, పాలావజ్ఝల లక్ష్మీనారాయణగార్లకు నరసింహముగారు ముఖ్యసహాధ్యాయమిత్రులని చెప్పనప్పుడు మేధాశక్తికిని, ఋజువర్తనమునకును విద్యార్థిదశ నుండియును వీరికిఁగల ప్రతిష్ఠను వేఱె వర్ణింపనక్కఱలేదు. ఆ కళాశాలాధ్యక్షులగు కే. శే. మెట్కాఫుదొర మున్నగు నుపాధ్యాయులు నరసింహముగారియందుఁ గానవచ్చిన శక్తిసామర్థ్యములకును, నయవినయములకును వారి నెంతో ప్రేమించుచుండిరి.

విద్యాబోధనము తమ మనస్తత్త్వమున కనుగుణమగు వృత్తియని గ్రహించి, నరసింహముగారు యెలమంచిలిలోని బోర్డు ఉన్నతపాఠశాలకు ౧౮౮౯-వ సంవత్సరమునఁ బ్రధానోపాధ్యాయులై, అచట ౧౮౯౧ వఱకు నుండిరి. ఇట్టి బుద్ధిమంతునికి బోధనాభ్యసనకళాశాలలోని తరిబీతు అనగత్యమని, అపుడు పాఠశాలాపరీక్షాధికారియుద్యోగమునుగూడఁ జేయుచుండు మెట్కాఫుదొర దొరతనమువారికి వ్రాసిరఁట. అంతట ౧౮౯౨-వ సంవత్సరమున నరసాపురమందలి హైలరోన్నతపాఠశాలలో మూఁడుసంవత్సరములు నరసింహముగారు ప్రథమసహాధ్యాయులుగను, ౧౯౦౧ వఱకును ప్రధానోపాధ్యాయులుగను పనిచేసిరి. తమ బోధనాకౌశలమువలన విద్యార్థులలో దాదాపుగ నందఱిని ప్రవేశపరీక్షలో గెలుపొందింపఁగల సమర్థత వీరియందుఁ గలదను పేరు దేశమున నప్పటికే వెలగియగుటచేత నరసింహముగారికి నూజవీడు పాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయపదవి లభించెను. వీరి కృషివలన నావిద్యాశాలకు మంచిపేరువచ్చుట కానందపరవశులై పాఠశాలాధికారులగు శ్రీ రాజారంగయ్యప్పారావుబహద్దరుగారు నరసింహముగారి నెంతో గారవించి బంగరుమురుగులు వీరికి బహుమతి చేసిరి. ౧౯౦౩ మార్చి నెలలో పిఠాపురమందలి మాధ్యమికపాఠశాల యున్నత విద్యాలయమైనప్పుడు అందలి ప్రధానోపాధ్యాయపదవి నరసింహముగారి కొసంగఁబడెను. జననీజనకులు, నొకసోదరుఁడును గతించి, కుటుంబభారము తమ శిరమునఁ బడుటచేత స్వస్థలమున సమకూరిన యీ యుద్యోగము నరసింహముగారి కెంతయు శాంతిదాయక మయ్యెను. ఇచటనే వీరు ౧౮ సంవత్సరములు ప్రధానోపాధ్యాయులుగ నుండి, ౧౯౨౧ లో నుద్యోగవిరామ మొనర్చిరి. ఐనను ఆర్థికకష్టములచేత నరసింహముగారింకను ద్రవ్యమార్జింపవలసివచ్చుటచేత పిఠాపురమునందు నెలకొల్పఁబడిన సూర్యారాయాంధ్రనిఘంటు కార్యస్థానమున వీరు ప్రవేశించి నేటివఱకును ఉద్యోగము చేయుచున్నారు. వీరి యభిమానపుత్రుఁడగు శ్రీ గౌరాంగశర్మగారిటీవల పరీక్షలో జయమంది, ప్రభుత్వోద్యోగమున కర్హుఁడై

డగుటచేత కుటుంబపోషణభార మాయన కొప్పగించి, కొలఁదికాలములోనే నరసింహముగారు విశ్రాంతినొంద నాసించుచున్నారు.

నరసింహముగారికి ఆంధ్రాంగ్లములం దసమాన పాండిత్యము గలదు. కవిత్వమందును, గానకళయందును మొదటినుండియు వీరి కభిరుచి మెండు.

"కవిత

యందు నాసక్తి పుట్టించినట్టి గురుఁడు
కందుకూరి వీరేశలింగ కవివరుఁడె"

యని నరసింహముగారు తమ "శ్రీరామకృష్ణ పరమహంసచరిత్రము" నఁ జెప్పికొనియున్నారు. ఆ గ్రంథమును వీరు ౧౯౦౪ లోఁ బద్యరూపమునఁ బ్రచురించిరి. ౧౯౧౩ సంవత్సరమున "శ్రీ గౌరాంగచరిత్ర" ప్రథమభాగమును, ౧౯౧౪ లో ద్వితీయభాగమును రచించిరి. ౧౯౧౬ లో వీరు రచించిన "రూపలత" యను చక్కని సొంత నాటకమును "ఆంధ్రపత్రిక" లోనో, వేఱొక పత్రికలోనో నేను విమర్శించితిని. ౧౯౧౮ లో వ్రాసిన "వనవాసి" పార్నెలువిరచితమగు నింగ్లీషు కావ్యమునకు భాషాంతరమె. ఇవిగాక వీరు "శ్రీ వివేకానందస్వామి యుపన్యాసములు" మహాత్మా గాంధీగారి "ఆత్మసంయమము — అమితవిషయాసక్తి" యను పుస్తకములను వచనరూపమున భాషాంతరము చేసిరి. పెక్కులు చిన్న పుస్తకములు, వ్యాసములునుగాక వీనిటీవల "ఆదర్శసుఖజీవనము" అను శ్రీ కుశీరాముగారి యాంగ్లగ్రంథమునకుఁ దెలుఁగు వ్రాసిరి. విద్యార్థులకు జనసామాన్యమునకు నుపయోగించునట్టి పురాణకథలును, వార్తాపత్రికలలో వ్యాసములును ఈయన వ్రాయుచుందురు. "ప్రహసనములు — పత్రికావిలేఖనము" అను వీరి వ్యాసముల పుస్తక మొకటి నే నిటీవల చదివి, నరసింహముగారికి హాస్యరస ప్రధానమగు రచనలందును గల దక్షతను జూచి సంతోషించితిని.

"పెద్దవానికిఁ బితరుండు పిన్న వాఁడు"

అని వర్డ్సువర్తు కవీశ్వరుఁడు నుడివినట్లు మనలో శైశవమున నణఁగియుండెడి గుణబీజములు జీవితక్షేత్రమున వికాసమందుచుండును. స్వతస్సిద్ధమగు సౌశీల్యమున నొప్పారు నరసింహముగారి మనస్తత్త్వమునకు ఋజువర్తనము, నియమపూర్వక జీవితమును ముఖ్యాశయము లయ్యెను. ఉపాధ్యాయత్వ మిట్టి జీవితపద్ధతి కనుగుణమగు వృత్తియని విశ్వసించి వీరు విద్యాబోధకులుగనే జీవితమును గడపిరి. అట్లుగాక కీర్తిధనాదులె వీరి కపేక్షణీయములై యుండినచో అప్పటి పరిస్థితుల ననుసరించి యేన్యాయవాదులో యై వేలకొలఁది రూపాయలు నిలువ చేసియుందురు; లేదా, ఏ మండల న్యాయాధిపతులో యై గొప్పపలుకుబడికితాబులను సంపాదించియుందురు. అట్లుగాక సంతృప్తి, మనశ్శాంతియును ముఖ్యములుగఁ జేసికొని నరసింహముగారు తమ స్వల్పవేతనముతోఁ దనివినొంది సంసారయాత్ర నడపిరి. ఆదర్శప్రాయులగు బోధకు లయిరి. నిరాడంబరులగు సత్పురుషులయ్యును తమ విధుల నెఱవేర్చుపట్ల నసమాన సాహస సామర్థ్యములు వ్యక్తపఱిచిరి. వీఁరేటేఁ దమపాఠశాలలోనుండి పరీక్షకేగు విద్యార్థులలో దాదాపుగ నందఱిని కృతార్థులఁ జేయుట యనునది ప్రథమోపాధ్యాయునియందు సామాన్యప్రజ్ఞ కాదని బోధకలోక మెఱుఁగును. ఇట్టి పాఠశాలాధ్యక్షుఁడు ఒకమూల తనతోపాటుగఁ దన సహోపాధ్యాయు లందఱును విద్యాబోధనమం దప్రమత్తతతోఁ గృషిసల్పునట్లును, ఇంకొకమూల బోధకుల పాటనకుఁ దగినట్టుగ విద్యార్థులు ప్రాలుమాలిక లేక పరిశ్రమించునట్లును నిరతము చూచుచుండవలెను. తమ బోధన బాలుర మనస్సులలోని కెక్కి, వారి నెల్లరఁ బరీక్షలో నెగ్గించుట సాధారణబోధనాప్రతిభ కానేరదు. దీనికిఁ దోడుగ నరసింహముగారియొద్ద తరిబీతయిన శిష్యులు గురువువలెనె యాదర్శవిద్యార్థులుగ నుండిరని స్వానుభవమును, ఇతరుల యనుభవమునుబట్టి చెప్పుచున్నాను.

గురువులు తమకును లోఁబడు
తెరువులు చెప్పెదరు; విష్ణుదివ్యపదవికిన్
తెరువులు చెప్పరు; కటకట
బరువులు వెట్టంగనేల బాలకులారా !

అని ప్రహ్లాదుఁడు బోధకలోకముమీఁద మోపిన నిందను కల్లచేయుటకుఁ బాటుపడి, తమశిష్యులు చదువు నందెగాక శీలసంపదలోను, దైవభక్తియందును మిన్న లగునట్లు కృషిచేసిన బోధకోత్తములలో నరసింహముగారొకరు. నేఁటి విద్యార్థియె ౘేపు పౌరుఁ డగుచున్నాఁడు. తమ శిష్యులను క్రమశిక్షలో నుంచి, మెలఁకువతోను, మంచితనముతోను సువిద్యయు, సదాచారములును వారికి వెన్నతోఁ బెట్టినవిగఁ జేసి, లోకమును సుజనులకు వాసయోగ్యముగఁ జేయు నుపాధ్యాయులు నిజమగు దేశోపకారు లగుదురేని, ఆంధ్రావనిలోఁగల దేశారాధకులలో నరసింహముగారొక రని చెప్పవచ్చును.

చదువు పుస్తకములు, చేయు సహవాసమును, ఒకపురుషుని శీలమును సూచించు ననునపుడు, రచియించిన గ్రంథావళి యాతని స్వభావమున కద్దమువంటిదే కదా. నరసింహముగారి రచనములు వారి సుశీలమునకుఁ బ్రతిబింబములె. గ్రంథకర్తకు నాతని కావ్యకథానాయకునకును శీలమునందు సామ్య మేర్పడియుండును. చర్చించిన విషయములు, వర్ణించిన పాత్రములును కృతికర్త స్వభావలక్షణముల కమోఘమగు చిహ్నములు. నరసింహముగారి కవిత కాశ్రయ మయిన వివేకానందుని మేధాశక్తియొక్కయు, గౌరాంగుని నిర్మల ప్రేమయొక్కయు, పరమహంసరామకృష్ణుల భక్తిసాధనయొక్కయు పోకడలు ఈ రచయితహృదయము నలరించు నున్నతాశయముల నీడలె!

నరసింహముగారికి సంస్కృతమం దంతగఁ బ్రవేశము లేకున్నను, ఆంధ్రాంగ్లములం దసమాన వైదుష్యము గలదు. ఈ సంవత్సరమె వీరు వ్రాసిన "ఆదర్శసుఖజీవనము" చదివినవారు సులభమును, మనోహరమును నగు వీరి వచనశైలి మెచ్చుకొనకమానరు. ఈ పుస్తకమున కింతటి రుచిరత గలుగుటకుఁ గారణము విషయప్రాశస్త్య మెంతవఱకొ, సరళము, నిర్దుష్టము నగు శైలిపాటవ మెంతవఱకొ నిశ్చయించుట కష్టము. కొన్నిపట్టులు చూచినచో పుస్తకము స్వవచనమువలెఁ దోఁచుచున్నది. యువకులకు హితబోధనము చేయువిషయమున నరసింహముగారి నాలుకవలెనే కలముగూడ ఖ్యాతి గాంచియున్నది. ప్రస్తుతకాలమందలి యువకులకు విద్యార్థులకును ఆదర్శజీవిత మలవఱచుకొను విషయమున నుపయుక్తములగు పుస్తకము లింకను వీరు రచింపఁబూనుట ముఖ్యము.

నరసింహముగారు గ్రాంథికభాషావాదులు. గ్రామ్యభాషలో పత్రికలు, పుస్తకములు నింతగ వ్యాపించుట విద్యార్థు లాంధ్రభాషాజ్ఞానమున వెనుకఁబడియుండుటకు ప్రబలకారణమని వీరి నిశ్చితాభిప్రాయము. ఆరితేఱిన గ్రంథరచయితలయ్యును వక్తృత్వవిషయమున వీరి కంత యభిరుచిగాని, యనుభవముగాని యున్నట్లు కానఁబడదు.

పదునాఱుసంవత్సరములక్రిందట వీరికిఁ గళత్రవియోగము గలిగెను. సంతానము లేకున్నను, "అపుత్రస్య గతి ర్నాస్తి" అనువాక్యమునందుఁ దమ కంతగ విశ్వాసము లేకుండుటచేత తాము దత్తుచేసికొనలేదనుచున్నారు. ఐనను, పుత్రులులేని లోపము వీరి కేమియు లేదు. తమ్ములు కీ. శే. గోపాలముగారి యేకపుత్రుఁడు గౌరాంగశర్మగారు వీరియొద్దనే పెరిఁగి, వీరికిఁ జేయూఁతయగు నభిమానపుత్రుఁడె.

నరసింహముగా రంతగ సంఘసంస్కరణాభిమానులుగాకున్నను, ప్రజలలో నీతిపునరుద్ధరణముచేయు విషయమున నెట్టి సంఘసంస్కర్తకును దీసిపోని పట్టుదల గలిగియున్నారు. హిందూసంఘాభ్యున్నతికి జనులలో నీతిబలము పెంపొందుటయు, ముఖ్యముగ ప్రస్తుతకాలపు విద్యార్థులు సచ్ఛీల మలవఱచుకొనుటయు నత్యావశ్యక మని వీరి విశ్వాసము.

## శ్రీయుత కూచి నరసింహముపంతులు

చిరకాలము బోధకులుగ నుండి విద్యార్థుల మీఁదను, పాఠశాలాధ్యక్షులుగ నుండి సహోపాధ్యాయులమీఁదను అధికారము చెల్లించుట కలవాటుపడిన యుపాధ్యాయునియందు ప్రాయికముగఁ గానఁబడు కేగిర పాటు, వాక్పారుష్యమును నరసింహముగారియందించుకయును గానరావు! "నిండుకుండ తొనఁకదు" చందమున వీరి శాంతిగాంభీర్యము లెట్టి క్లిష్టపరిస్థితుల తాఁకుడునకును జలింపకున్నవి. సహృదయతకుఁ దగు మృదువాక్యతతో నీ రొప్పుచుందురు. శాంతరసము చిందు మందహాసవదనమున విలసిల్లు సాధుపురుషులు, సతత శ్రీరామభక్తి పారవశ్యులును.

౧౯౨౦ వ సంవత్సరమున నరసింహముగారు పిఠాపురోన్నతపాఠశాలనుండి విశ్రాంతిగైకొను సందర్భమున వీరి సహాధ్యాయులగు శ్రీ జనమంచి సీతారామస్వామిగారు చదివిన యొకపద్యములో వీరి వృత్తాంతమును ముగించుచున్నాను:

కన్నతండ్రియటులు కడు గారవంబున
　　శిష్యకోటికి విద్య చెప్పినావు
చేతిక్రిందను బనిసేయు నొజ్జల కల్ల
　　మిత్రభావంబున మెలఁగినావు
మనసునొప్పించెడి మాటాడి యెఱుఁగక
　　భృత్యవర్గమును బాలించినావు
పైవారియందలి భయభక్తు లొప్పార
　　నెల్లపనులు నిర్వహించినావు
అందఱకు నన్నివేళల నన్నిగతుల
హితుఁడ వనిపించుకొన్న నీ కెవరు సాటి?
యింకనైనను సుఖియింపు మీశకృపను
శ్రితజనావనరంహ! కూచి నరసింహ!

## ఎవరికి తెలుసు, ఇరవై సంవత్సరములలో నేను



# ఉదయనృత్యము

**అడివి బాపిరాజు**

ఉదయరేఖ
చెదిరె దెసలు.

౧

మధురలాస్య పరవశరతి
పదము లల్లె లయలు గతులు.

* * *

నవ్యప్రణయావేశము
అవ్యక్తప్రథమత్వము
హావభావ విభ్రమాలు
హాస్య కరుణ రాగమ్ములు
వ్రీడాపూరితమాధుర్యము
విప్రలంభసంవేగము
కరుగు కనులు కలరవాలు
కలల తలపు లుత్సాహము
మధురలాస్యపరవశరతి,
పదము లల్లె లయలు గతులు.

౨

అరుణశవళమిశ్రహాలు
చరణయుగళసుమకలాలు
కాలాతీతపథమ్ముల,
నీలాంచితనృత్తమ్ములు.

* * *

అర్థమెరుగరాని శిశువు
కుర్దనములు, ముద్దుపలుకు
భావరహితవ్యంజనమ్ము
గోవత్సపు పేరెమ్ములు
హరిణనేత్రసంచలనము
అలవోకకు వెడలుపాట
స్వరలహరీవిహరణమ్ము
మురజధింధిమిధ్వానము
మధురనృత్తపరవశరతి,
పదము లల్లె లయలు గతులు.

ఉదయరేఖ
పొదివె దెసల.



# కర్ణపిశాచి

డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

కర్ణపిశాచినిగూర్చి విననివారు అరుదు. కర్ణపిశాచిని వశముచేసికొన్నచో భూతభవిష్యద్వర్తమానవిషయము లేవి గావలసియున్నను అదిమనచెవిలో రహస్యముగ చెప్పుచునేయుండును. కొందరుమంత్రోపాసకులు ఈకర్ణపిశాచికి భవిష్యద్వృత్తాంతము లేవియు తెలియవనియు, భూత వర్తమాన విషయములను మాత్రము ఇది తప్పులులేక తెలియజేయగలదనియు చెప్పుచున్నారు. వర్తమాన విషయములయినను మనమున్నచున్న స్థలమునుండి కదలకనే మరొక గ్రామమునందుగాని, లేక చాలదూరమునందున్న ఇంకొక ప్రదేశమునందుగాని జరుగుచున్న విషయములను ఆలస్య మేమాత్రమును లేకయే తెలిసికొనుట యసాధ్యమని సుమారు నూరేండ్లకు ముందు జనసామాన్యము తలచియుండును. కాని శాస్త్రజ్ఞుల శక్తి సామర్థ్యములచేత కర్ణపిశాచిని గాకపోయినను కర్ణపిశాచివంటి శక్తిని వశీకరణము జేసికొనియున్నారు. నేడు మనము ఎన్ని వేలమైళ్ల దూరములో నున్నవారికైనను తలచుకొన్న సంగతిని ఏమాత్రమును ఆలస్యములేకయే తెలుపగలము. ఒక యామకాలపరిణతియందే వేలకొలది మైళ్లదూరమునందున్నవారితోగూడ ఉత్తరప్రత్యుత్తరములు నడుపగలము. వలయునన్నచో ఇంతమాత్రమే గాక మనకిష్టమువచ్చినవారితో నేరుగనే మాటలాడగలము. మనమాటలను ఒకరిద్దరేగాక నానాదేశములందున్న జనులు వినవలయునన్నను ఏమాత్రమును శ్రమలేకయే మనకోరికను నెరవేర్చుకొనగలము.

ఈసంగతి ప్రతి పల్లెటూరివానికిని తెలిసియున్నను ఈవిచిత్రమునకు సరియైన అర్థము చాలమందికి తెలియదు. ప్రమాదకరమగు జబ్బుతో బాధపడుచున్నప్పుడుగాని, మరి యే యితర అవసర కార్యము లున్నప్పుడు గాని సమీపమునందు ఏ పెద్ద తపాలాఫీసునకో వెళ్లి తంతివర్తమాన మంపనివారరుదు. జాబుమూలముగ విషయమును తెలుప రెండుమూడు గోజులకాలము బట్టు సందర్భమునందు గూడ కొన్నిగంటలలోనే తంత్రీవార్త ద్వారా వర్తమానము నందజేయవచ్చును. ఒకయూరినుండి మరియొకయూరికి మాత్రమే గాక ఒక దేశమునుండి మరొక దేశమునకును, కడకు ఈ భూమిపైనున్న ఏపట్టణమునుండి మరి ఏఇతరపట్టణమునకైనను తంత్రీవార్త నంపవచ్చును.

ఇదిమాత్రమేగాక మదరాసు, బెంగుళూరు మున్నగు గొప్ప పట్టణములందు మైళ్లకొలది దూరమునందున్న ఇరువురు టెలిఫోను ద్వారా మాటలాడుకొనుచుండుటను మనలో చాలమంది చూచియేయుందురు. ఈ టెలిఫోను మార్గమున ఒకయూరియం దుండువారితో మాత్రమేగాక ఖండాంతరములం దుండువారితోగూడ మాటలాడవచ్చును. కాని తంత్రీవార్తను తెలుపుటకుగాని, టెలిఫోనుద్వారా మాటలాడుటకుగాని ఏప్రదేశమునకైనను తంతెలతో సంబంధ ముండియే తీరవలయును. మనము రైలులో ప్రయాణము చేయునపుడు మన మెన్నియూర్లుదాటి ఎంతదూరము ప్రయాణించినను టెలిగ్రాఫ్ తంతెలు ఏమాత్రమును ఎడతెగకయుండుట జూచియేయున్నాము. ఇట్టితంత్రీ సంబంధములేని జిల్లాపట్టణములుగాని, కడకు తాలూకా పట్టణములుగాని యుండుట యరుదు. దూరదేశములకుగూడ ఇట్టి తంత్రీ సంబంధము గలదు. భూగోళము నెరుగని ఖేచరులెవరయిన పైనుండి భూమిని పరీక్షించినచో ఎక్కడజూచినను భూమిని తంతెలతో బంధించినట్లగపడును. ఐనను ప్రతిపల్లెకును ఈతంత్రీ సంబంధమును కలిగించుటకు హిందూదేశమువంటి బీదదేశమునందు సాధ్యముగాదు. అందువలననే పల్లెటూళ్లందలి చాల తపాలాఫీసులనుండి తంత్రీవార్త నంప సాధ్యముగాదు.

ఇటీవల శాస్త్రపరిశోధనలవలన తంత్రీసంబంధము లేకనే వర్తమాన మంపుటకును, మాటలాడుటకును శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. దీనినే తంత్రీరహిత శాస్త్ర (Science of wireless) మని యందురు. టెలిఫోనుద్వారా నాలుగు వేర్వేరు ప్రదేశములందుండువారు మనమాటలను వినుచుండవలయునన్న మనతో ఆ నలుగురికిని ప్రత్యేకతంత్రీ సంబంధ ముండవలెను. కాని తంత్రీరహిత పద్ధతి మూలముగ ఎన్నిప్రదేశములవారయినను మన వచనములనుగాని, కడకు మనపాటలనుగాని, సంగీతమునుగాని వినగలరు. టెలిఫోను ద్వారా సంభాషణ జరుగుచున్నప్పుడు టెలిఫోనుగుండా వినబడు మాటలు సంభాషించుచున్నవానికిమాత్రము వినబడునుగాని ప్రక్కనున్నవారికి వినబడవు. కాని శబ్ద ప్రవర్ధకము (Loud - speaker) అను చిన్నయంత్రమును టెలిఫోనునకు జేర్చి ప్రక్కనున్న ఒకరిద్దరికే గాక ఎక్కువమందికిగూడ వినబడునట్లు జేయవచ్చును. ఈశబ్ద ప్రవర్ధక యంత్రమునే తంత్రీరహితమైన టెలిఫోనువంటి శబ్దగ్రాహకయంత్రమునకుజేర్చి మనము ఏదేశమునందో పాడుచున్న పాటలను, మాటలను వినగలము. ఇట్టి యంత్రములవలననే మదరాసునందు తిరువల్లికేణి సముద్రతీరమునందో, లేక మైలాపూరు సముద్రతీరమునందో సుఖముగ గూర్చొని సముద్రవాయువును పీల్చుచు కార్పొరేషను (Corporation) ఆఫీసునందు పాడబడు పాటలను, సంగీతమును విన

గలము. ఇట్టి శబ్దగ్రాహకయంత్రముచేత కలకత్తానుండియు, బొంబాయి నుండియు, మరి యింకేదూర ప్రదేశమునుండియైనను మనరాగునందు పాడుచున్న సంగీతమును వినగలము. మార్చి మొదటి తారీఖున ఎడ్వర్డుచక్రవర్తిగారు ఇంగ్లాండుదేశమునుండి తమ నానాదేశ ప్రజలకును ఒకసందేశ మివ్వగా ఆసందేశమును ప్రపంచమునందలి అన్ని దేశములవారును తమ శబ్దగ్రాహకయంత్రముల మూలముగ వినగలిగిరి. మనరాష్ట్రమందు ఇట్టియంత్రముల నుంచిన వివిధప్రదేశములందును రాత్రి ౯౻ గంటలకు చాల జనులు సమిగూడి ఇంగ్లాండుదేశమునుండి మాటలాడుచున్న చక్రవర్తిగారి మాటలను వినగలిగిరి.

ఈయంత్రమునకు ఇట్టి విచిత్రశక్తి ఎట్లు కలిగినదో తెలిసికొనవలయునన్న తంత్రీవార్తాహర యంత్రమునుగూర్చియు, టెలిఫోను యంత్రమునుగూర్చియు గూడ కొంత తెలిసికొనవలయును.

తంత్రీవార్తాసందేశము సంజ్ఞలమూలముగనే జరుగును. తంత్రీవార్తాకార్యాలయమునందు మనకు కట్టు, కడకట్టు అని హ్రస్వముగను, దీర్ఘముగను నుండు చిన్న శబ్దములేగాని ఇంకేమియు వినబడదు. ఈ శబ్దములు మనకేమియు అర్థము గాకున్నను, అచ్చట పనిచేయువారికి మాత్రము అవి ఫలానా అక్షరములను దెల్పు సంజ్ఞలని తెలియుచుండును. పాశ్చాత్యభాషలన్నిటికిని సమానమగు అక్షరసమామ్నాయమున ౨౬ అక్షరములు మాత్రమే గలవు. వానిలో ప్రతిదానికిని సాంకేతికముగ ఈహ్రస్వదీర్ఘ శబ్దములను వివిధములుగ జేర్చి ఒక పద్ధతి నేర్పరచియున్నారు. ఈపద్ధతిని మోర్సు శాస్త్రజ్ఞునిపేర మోర్సు పద్ధతియని అందురు. ఈపద్ధతియందు పాశ్చాత్యభాషలందలి అక్షరములలో దేనికి ఎట్టి సంజ్ఞకలదో ఈక్రిందిపట్టికయం దివ్వబడినది:

[మరా:—హ్రస్వశబ్దమునకు చుక్కను, దీర్ఘశబ్దమునకు గీతను గుర్తుగ వాడియున్నాను.]

| | |
|---|---|
| ఎ . — | యన్ — . |
| బి — . . . | ఓ — — — |
| సి — . — . | పి . — — . |
| డి — . . | క్యూ — — . — |
| ఇ . | ఆర్ . — . |
| ఎఫ్ . . — . | యస్ . . . |
| జి — — . | టి — |
| హెచ్ . . . . | యు . . — |
| ఐ . . | వి . . . — |
| జె . — — — | డబ్ల్యు . — — |
| కె — . — | ఎక్స్ — . . — |
| యల్ . — . . | వై — . — — |
| యమ్ — — | జడ్ — — . . |

సంఖ్యలకు ఈక్రింది గుర్తులు గలవు:

| | |
|---|---|
| ౧ . — — — — | ౬ — . . . . |
| ౨ . . — — — | ౭ — — . . . |
| ౩ . . . — — | ౮ — — — . . |
| ౪ . . . . — | ౯ — — — — . |
| ౫ . . . . . | ౦ — — — — — |

ఉదాహరణముగ ఒక చిన్న సందేశమును గైకొందము. దూరపట్టణమునందున్న ఒకరిని మనము త్వరలో రాగోరెద మనుకొందము. మనము తంత్రీవార్తా కార్యాలయమునకు వెళ్లి అతని పైవిలాసమును, మన సందేశమును ఒక నియమిత కాగితముపైన వ్రాసి డబ్బు చెల్లించిన వెంటనే అచ్చటి యంత్రజ్ఞుడు మన సందేశమునందలి ప్రతియక్షరమును సంజ్ఞారూపముగ దెలియునట్లు సందేశహర యంత్రమునందు హ్రస్వములును, దీర్ఘములును అను శబ్దములను జేయును. మన సందేశము ఆంగ్లమునందు కమ్ సూన్ (Come soon) అని యున్నదనుకొందము. ఈరెండు పదములందున్న అక్షరములను పై వ్రాసిన సంజ్ఞల రూపముగ నిట్లు వ్రాయవచ్చును:

ఈసంజ్ఞల దెల్పు హ్రస్వదీర్ఘ శబ్దములు తంత్రీవార్తా కార్యస్థానాంతరమునందు వినబడినంతనే అచ్చటివారు వాడుకవలన ఈసంజ్ఞలు తెలియజేయుచున్న అక్షరములను త్వరత్వరగ గుర్తించి మనసందేశమును వ్రాసుకొందురు.

కాని ఇట్టి చిన్నశబ్దములు నూర్లకొలది మైళ్లదూరమునందున్న తంత్రీవార్తా కార్యాంతరస్థానమున ఎట్లు వినబడు ననుప్రశ్నకు సమాధానము విద్యుచ్ఛక్తియే. విద్యుచ్ఛక్తి తంతెల మూలముగ ప్రవహించునని అందరికిని తెలిసినవిషయమే. కాని విద్యుచ్ఛక్తి ధనశక్తి (Positive) యనియు, ఋణశక్తి (Negative) యనియు రెండు విభాగములుగ నున్నదనియు, ఈరెండుశక్తులకును సంబంధము గలిపినగాని శక్తి ప్రవహించదనియు జ్ఞాపక ముంచుకొనవలయును. దీనినే విద్యుద్వలయము (Electric circuit) అని యందురు. సందేశహరయంత్రమున నున్న ఒక గుండిని వ్రేలితో ఒత్తినవెంటనే ఒక విద్యుద్వలయ మేర్పడి, సందేశగ్రాహక యంత్రమునందుండు అయస్కాంతము గుండ విద్యుచ్ఛక్తి ప్రవహించునట్లు చేయును. వెంటనే అయస్కాంతము దాని దగ్గరనుండు ఒక చిన్న ఇనుపముక్కను ఆకర్షించును. ఈఇనుపముక్క నంటియుండు మరొకముక్క కదలి టక్కని శబ్దము జేయును. ఇంతలో సందేశహరస్థానమున నున్న యంత్రజ్ఞుడు గుండినుండి వ్రేలిని తీసివేయగనే విద్యుద్వలయము భగ్నమై సందేశగ్రాహకయంత్రమునందలి అయస్కాంతమునకు ఆకర్షకశక్తి క్షీణించి ఇనుపముక్కను స్వస్థానమునకు పోవిడచును. టిక్ అను శబ్దమైన వెనువెంటనే ఇనుపముక్క స్వస్థానమునకు మరలివచ్చి చేరినయెడల హ్రస్వశబ్దమనియు, మోర్సు

## కాంగ్రెసు అధ్యక్షుని ఆంధ్రదేశ సంచార చిత్రములు :



౧. కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ రాజేంద్ర ప్రసాదగారికి చెన్నపురి సెంట్రల్ స్టేషనువద్ద స్వాగతము.



 ౨. కాంగ్రెసు అధ్యక్షులు రాజేంద్ర ప్రసాదగారికి ద్రావిడదేశసంచారానంతరము చెన్నపురి కాంగ్రెసు భవనమున సమ్మానము.



౩ ఏలూరున శ్రీ రాజేంద్ర ప్రసాదగారు, హరిజనులు.



౪. తిరుత్తనిలో శ్రీ రాజేంద్ర ప్రసాదగారు.

పద్ధతి మూలముగ చుక్కయనియు, అట్లు తిరిగివచ్చి స్వస్థానము జేరుటలో కొంత తామసించినయెడల అది గీతయనియు పరిగణింతురు. ఈవిధముగ నిమిషమునకు సుమారు ౩౦ పదముల చొప్పున వార్తలను సంజ్ఞారూపముగ తెలియజేయవచ్చును.

కాని నేడు ఈమాత్రము నిదానముగగూడ నుండకుండునట్లుగ శాస్త్రజ్ఞులు ఈయంత్రము నింకను చాలవిధములుగ నభివృద్ధిజేసి నిమిషమునకు ౨౦౦, ౨౫౦ పదముల చొప్పున వార్తాసందేశము చేయగలిగియున్నారు. ఇంత త్వరగా చేతితో వ్రాసికొనుటకుగాని, సందేశము నంపుటకుగాని ఏమానవునికిని సాధ్యముకాదు. కాన ఇంచుమించుగ పనియంతయు యంత్రమూలముగనే జరుగుచున్నది. ఒక్కొక్క అక్షర సంజ్ఞయందు దండు చుక్కగీతలను తెలియజేయుటకు గుండిని వ్రేలితో నొక్కి విడుచుటకు బదులు టైప్‌రైటరవంటి యంత్రముమీద వివిధాక్షరముల గుండీలపై వ్రేళ్లను నొక్కినయెడల ఒక్కొక్క నొక్కునకును ఆయక్షరమునకు సంబంధించిన చుక్క గీతలన్నియును ఏర్పడును. సందేశగ్రహణమునుగూడ యంత్రమే జేయుచున్నది. ఈయంత్రము కేవలము సంజ్ఞలను వ్రాయుటమాత్రమేగాక ఆయాసంజ్ఞలను దెల్పు అక్షరములను పదరూపముగ రిబ్బనువంటి పొడుగాటి కాగితముపైన వ్రాయును.

ఈతంత్రీవార్తాపద్ధతియందు కొన్ని మార్పులుజేసి దీనిని క్రమముగ విదేశవార్తా హరణమునకుగూడ ఉపయోగపడునట్లు చేయగలిగిరి. కాని ఇట్లు చేయుటకు పూర్వము ఎన్నియో ప్రయత్నములు వ్యర్థములాయెను. నేలమీద దగ్గరదగ్గరగ స్తంభములను పాతి వానిమీదుగా తంతెలను తీసికొనిపోయి ఒకదేశమునందలి రెండుపట్టణములకు తంత్రీసంబంధములను ఏర్పరచవచ్చును. కాని మహాసముద్ర మడ్డమైనపుడు రెండుదేశములకు తంత్రీసంబంధము కలిగించుట చాలకష్టము. ఇట్టి సందర్భములందు తంతెలలో కొన్నిమార్పులుజేసి అట్టితంతెలను సముద్రపుటడుగున పడవేతురు. ఇంత పొడవుగల తంతెలను తయారుజేయుటయు, ఆతంతెలు మధ్య విరిగిపోకుండ సముద్రమునందు వేయుచు పోవుటయు ఎంతకష్టమో యూహించుకొనవచ్చును. అమెరికాకును ఇంగ్లాండునకును సుమారు ౨౫౦౦ పడవ మైళ్లుండును. ఈరెండుదేశములకును తంత్రీసంబంధము కలుగజేయుటకు చేసిన ప్రథమ ప్రయత్నమునందు సుమారు ౨౦,౦౦౦ మైళ్లపొడవుగల రాగితంతెను, దానిచుట్టును వర్తులాకారముగ చుట్టబడియుండిన ౩,౬౭,౦౦౦మైళ్ల పొడవుగల ఇనుపతంతెను తయారుజేసిరి. నీటిలో పడవేయుచున్న తంతె ఎన్నియోమారులు విరిగిపోవుటచేత నీటబడినతంతె కనబడక నూర్లకొలది మైళ్ల పొడవుగల తంతెనుగూడ వదలిపోవలసివచ్చెను. అట్లాంటిక్ సముద్రము కొన్నిచోట్ల ౩౭౩౩ పాదములు, అనగా సుమారు ౩౼ మైళ్ల లోతుగలదు. కాన తంతెను వేయుచు పోవుటకు ముందు ఒక యోడ నియమితమార్గమును పరీక్షించుచు ముందు పోవు చుండవలయును. ఈయోడ సముద్రపుఅడుగున్న మాటిమాటికిని పరీక్షించుచు నీటియడుగుననుండు నీటిని, మట్టిని యంత్రసహాయముతో పైకితెచ్చి మాటిమాటికిని పరీక్షించుచుండవలెను. తంతెను నీటిలో పడవేయుటకుముందు ప్రతిభాగము నిర్దుష్టముగనున్నదా, లేదా యని పరీక్షింపవలెను. నీటిలో పడవేసిన పిమ్మటగూడ మాటిమాటికిని సముద్రతీరమునందుండి ఓడకు అతంతె మూలముననే సంజ్ఞల నంపి తంతి సరిగా నున్నదా, లేదా యనునంశమును పరీక్షించుచునే యుందురు. దీనినిబట్టి అంతర్దేశీయ తంత్రీవార్తాహరణ పద్ధతిని ... ట కష్టముల నిర్జించి సాధించిరో తెలియును.

అంతర్దేశీయ వార్తాహరణ పద్ధతికిని సాముద్రతంత్రీవార్తాహరణ పద్ధతికిని కొన్ని భేదములు గలవు. కాని వాని నన్నిటిని ఇక్కడ విశదీకరింప బనిలేదు. ఇక టెలిఫోనునుగూర్చి కొంత యోచింతము. సంజ్ఞలనంపుట మనకంతయాశ్చర్యకరముగ దోచదుగాని మనమాటలే కడుదూరముననున్న మరొకరికి వినబడుట అత్యాశ్చర్యకరముగదోచును కాని సూక్ష్మముగ పరిశీలించినచో ఇదికూడ సామాన్యవిషయముగనే గనబడును.

శబ్ద మననేమి? శబ్దమును మన మెట్లు వినగలుగుచున్నాము? అను ప్రశ్నలకు మనముందు సమాధాన మొసగవలెను. ఒక తంబురతంతెను మీటినచో ఒక విధమైన శబ్దము కలుగును. తంతెను మీటి జాగ్రత్తగ పరీక్షించినచో తంతె పరిస్పందనము చేయుచున్నట్లు తెలియును. మీటిన తంతెమాత్రమేగాక దానికి సన్నిహితముగనున్న తంతెగూడ పరిస్పందనము చేయుచున్నట్లే తెలియును. మన మొక నిశ్చలకూపజలమున నొకచిన్నరాయిని పడవేసినచో నీటియందు చిన్నచిన్న యలలేర్పడి గుండ్రముగ బావిగట్టువరకును వ్యాపించి నీటిలో తేలుచున్న చిన్న బెండుముక్కనో, లేక పండుటాకునో పైకి క్రిందికి అలలతోపాటు ఆడునట్లుచేయును. అట్లనే మనము తంబురతంతెను మీటినయెడల తంతెయొక్క పరిస్పందనమువలన దాని నావరించియుండు గాలిలో అల్లోలము గలిగి గాలియందుండు రేణువులకును, అణువులకునుగూడ ఈపరిస్పందనము కలుగును. ఈ పరిస్పందన శక్తి అలలవలె ప్రసరించునుగాన ఈఅలలను ధ్వనికెరటము లనవచ్చును. ధ్వని కెరటములు మనచెవియందుండు నగారవంటి చర్మముమీద పడినవెంటనే అచ్చటి నరముల నిర్దిష్టగుణములవలన మనకు శబ్దజ్ఞానము కలుగుచున్నది. ధ్వని కెరటములు వాయుపదార్థమునకన్న ద్రవపదార్థముగుండను, అందునకన్న ఘనపదార్థముగుండను సులభముగ ప్రయాణించగలవు.

దీని నుదాహరించుటకొక చిన్నపరిశోధన జేయవచ్చును. దీనికి కావలసిన యుపకరణములు రెండు చిన్నఅట్టపెట్టెలును, ఒక పొడుగాటిదారమును మాత్రమే. దారముకొనల రెంటిని చెరియొక పెట్టె క్రిందనుండు రంధ్రముగుండ పెట్టెలోనికి జొనిపి లోన ఒక ముడివేసి భద్రపరచవలెను. ఇప్పుడీపెట్టెలను గట్టిగ లాగిపట్టి ఒకకొన నుండు అట్టపెట్టెవద్ద గుసగుసలాడినచో ఇంకొక కొనవద్దనుండు పెట్టెవద్ద స్పష్టముగ వినబడును. ఈవిధముగ ౨౦, లేక ౩౦ గజముల దూరము,

నరకును ఎఱగలదు. దీని నింకను కొంతవృద్ధిజేసి దారమునకు బదులొక తంతెను, అట్టిపెట్టెలకు బదులు పలుచని లోహపు రేకులను ఉపయోగించినచో ఇంతకన్న బాగుగ చాలదూరము ధ్వనికెరటములను ప్రయాణింపజేయవచ్చును. కాని ఇట్టిపద్ధతులచే ధ్వనికెరటములు మైళ్లకొలది దూరము ప్రయాణింపజాలవు గాన టెలిఫోనునందు విద్యుచ్ఛక్తియొక్క సాయము గావలసియుండును.

టెలిఫోనును మనలో చాలమంది చూచియే యుందురు. దీనిలో రెండుగొట్టము లున్నవి. మొదటిదాని కొననుండు దొప్పలోనికి మనము మాటలాడుదుము. రెండవగొట్టపుకొనను మనమొక చెవియొద్ద నుంచుకొని ఇతరుని మాటలను విందుము. ఈరెండు గొట్టములునున్నని ఫౌంటెన్ పెనానుచేయుపదార్ధమువంటి పదార్ధముతో చేయుదురు.

టెలిఫోనును కనిపెట్టి దాని సహాయముతో చాలదూరమున నున్నవారితో ప్రప్రథమమున మాటలాడగలిగినవాడు గ్రాహాము బెల్ అను అమెరికాదేశపు శాస్త్రజ్ఞుడు. అతని టెలిఫోను యంత్రమునకును, నేడు మన ముపయోగించు యంత్రమునకును కొంచెముభేద మున్నను ముఖ్యవిధాన మంతయు నొక్కటే.

టెలిఫోనుగొట్టముల రెంటియందును వీమున్నదో చూతము. వదనిక మొదట గైకొందము. ఇందు క్రిందనున్న బొమ్మయందగపడు మూడు ముఖ్యభాగము లుండును.




1. అయస్కాంతము, 2. చుట్లతీగె, 3. పరిస్పందనము జేయు పలుచనిరేకు

మూడవది మాటలాడు గవికెదురుగనుండు పలుచని ఇనుపరేకు. మనమాటల శబ్దవైఖరినిబట్టి ఈరేకు చలించుచుండును. ఈరేకుయొక్క సంచలనమువలన లోనున్న అయస్కాంతముచే వ్యాపించియుండు రంగమున పరిస్పందనము కలుగును. వెంటనే అయస్కాంతమును చుట్టుకొనియున్న తీగెయందు హెచ్చుతగ్గుగ విద్యుచ్ఛక్తి యేర్పడి[౧] ఈతీగెకొనల కంటించిన తంతులగుండ ప్రవహించును. ఇక ఈ శక్తి ఇంకొక టెలిఫోను యంత్రమునందు ప్రవేశించి మాటలు వినబడునట్లు ఎట్లు చేయగలదో శ్రోత్రేంద్రియవ్యాపార సాదృశ్యమును బట్టియే బోధపడగలదు. ఉచ్చారణభేదములనుబట్టియే టెలిఫోనునం దుద్భవించు విద్యుచ్ఛక్తి మారుచుండునుగాన అట్టి మార్పులతోనే ఆశక్తి ప్రవహించి దానికి సంబంధముండు ఇంకొక టెలిఫోనునందలి అయస్కాంతమునకును, దానిని చుట్టియుండు చుట్లతీగకును అట్టిమార్పులనే కలిగించును. వెంటనే ఈరెండవ టెలిఫోనునందలి ఇనుపరేకును గూడ మొదటి టెలిఫోనునందలి రేకువలెనే పరిస్పందనము జేసి అక్కడ జెప్పుచున్న మాట లట్లనే వినబడునట్లు జేయును. అనగా ఈరెండవ టెలిఫోనునందు వినబడుమాటలు మొదటి టెలిఫోనునందలి మాటలకు ప్రకృష్టమైన యనుకరణము. విద్యుచ్ఛక్తిసహాయముచేత ఈరెండవ టెలిఫోనునందు మొదటిదానియందు జేయుచున్న ధ్వనులవంటి ధ్వనులనే లేశమాత్రభేదమైనను లేక యుత్పత్తి జేయుచున్నది. కనుకనే యెంతమంచి టెలిఫోనునందు వినబడు వాక్యముల శబ్దమైనను సామాన్యవాక్యశబ్దములవలె నుండదు.

దీనినిబట్టి వదనికకును, కర్ణికకును భేదమేమియు లేదని తెలియుచున్నది. కాని ఈపద్ధతిమూలముగ మనము చాల దూరస్థలములతో వ్యవహరించునపుడు మాట లంతసుస్పష్టముగ వినబడవు. కాన వదనికయందు కొన్నిమార్పులనుజేసి టెలిఫోనును నేడు చాల ఉపయోగకరముగ జేసియున్నారు. నేటి టెలిఫోనునందలి వదనిక ఈక్రింద జూపబడిన పటమునందువలె నుండును.




1. చిన్నచిన్న కార్బనుముక్కలు, 2. కార్బనుగడ్డ, 3. పరిస్పందనముచేయురేకు

ఈపటమునందు చుట్లతీగ, అయస్కాంతములకు బదులు ఒక కార్బనుగడ్డయును, దానికిని పరిస్పందనముచేయు రేకునకును మధ్యను చిన్నచిన్న కార్బనుముక్కలును ఉండును ఈకార్బనుముక్కలకున్న విశేషమేమన, ఇవి విడివిడిగా నుండినయెడల వీనిగుండ విద్యుచ్ఛక్తి ప్రవహింపజాలదు. కాని వీనికి యెంతమాత్రము ఒత్తిడి గలిగినను ఒత్తిడి యాధిక్యమునుబట్టి విద్యుచ్ఛక్తిప్రవాహమునకు అవకాశము ఎక్కువగుచుండును. మనమాటల ధ్వనికెరటములవలన ఇనుప రేకు చలించుచు దాని కంటుకొని వెనుకనున్న ఈకార్బనుముక్కలను హెచ్చుగ, తగ్గుగ నానావిధముల ఒత్తుచుండును. ఈఒత్తిడికి అనుగుణముగ ప్రవహించు విద్యుచ్ఛక్తియందు మార్పులు కలిగి దూరమున నున్న టెలిఫోనునందు ఉక్తశబ్దానుకరణము కలుగును.

రెండవ టెలిఫోనునందలి శబ్దములు మనకు గట్టిగ వినబడవలెననినను, చాలమందికి వినబడవలెననినను మొదటి టెలిఫోనునుండి వచ్చు

౧. ఇటువంటి శక్తి అయస్కాంతముచుట్టును పరిమితముగ నుండును.

౨. అయస్కాంతముదగ్గర నొకచుట్లతీగను వడిగ త్రిప్పినచో తీగెయందు విద్యుచ్ఛక్తి యేర్పడునని యందరికిని తెలిసిన విషయమే.

చున్న విద్యుత్ప్రవాహమునకు ఒక చిన్న విద్యుచ్ఛక్త్యుత్పత్తిస్థానముతో సంబంధము కలుపవలెను. దీనివలన విద్యుచ్ఛక్తియొక్క ప్రవాహ మధికమైనను మిగత యింకేమి మార్పులును కలుగక మొదటి టెలిఫోనునందుండు రేనుపరేకు ఎట్లు పరిస్పందనము చేయుచుండునో ఈ రెండవ టెలిఫోనునందును కూడ అట్లే పరిస్పందనమును కలిగించును. విద్యుత్ప్రవాహమునకు మైకొలదిని పరిస్పందనము తీవ్రమై ఉత్పన్నశబ్దములు చాల గట్టిగ వినబడును.

ఇటీవల టెలిఫోనుయంత్రమునందు కొన్నికొన్ని మార్పులను, కొన్నికొన్ని కూర్పులను కలుగజేసి అనేకవిచిత్ర కార్యములను సాధించుచున్నారు. వానిలో కొన్ని ఇవి. టెలిఫోనునకు ఇంకొక చిన్నయంత్రమును అంటగట్టిన యెడల ఇంట నెవరును లేనపుడు అది టెలిఫోనుమీద పిలుచువారి సందేశమును గ్రామఫోను రికార్డునందువలె వ్రాసియుంచి, ఇంటివారు వచ్చినవెంటనే సందేశమును తెలియజేయును. ఈ ఈ కార్యములను ఎట్లు సాధించుచున్నారో, వీనికొరకు యంత్రమునందు గావించినమార్పులును, కూర్పులును ఎవ్వియో వివరముగ చెప్పుటకు సాధ్యముగాదు.

తంత్రీవార్తాపద్ధతి జనసామాన్యమున కలవాటైనకొలదిని ఈపద్ధతినింకను అభివృద్ధిచేయుటకు శాస్త్రజ్ఞులు ప్రయత్నించుచున్నారు. ఈ పద్ధతిలో వార్తల నడపించుటకు తంత్రీ సంబంధ మత్యావసరము. సందేశము నియమిత గమ్యస్థానమున కొక్కదానికే పోయిచేరును. ప్రతిస్థలమునకును తంత్రీసంబంధము కలిగించుటకు సాధ్యము గాదు. మరియు రెండుప్రదేశములకు సంబంధమును కలుగజేయు తంతెలు మధ్య ఎచ్చట విరిగిపోయినను, మరి ఏవిధముగ చెడిపోయినను సందేశ మంప సాధ్యముగాదు. ఇక చలనములందుండు ఓడలకుగాని, వాయు విమానములకు గాని తంత్రీసంబంధ మేర్పరుప సాధ్యముగాదు. కాన వానికి సందేశహరణ మసాధ్యము ఇంతమాత్రమే గాక పలుతావుల నొకేమారు తెలుపవలసిన విషయము లీపద్ధతిని కష్టసాధ్యములాయెను. ఒకరాజు తన ప్రజలకు సందేశ మంపవలసినను, ఒక గొప్ప శాస్త్రవేత్త ఒక ఉపన్యాస మొనరించినను, ఒక గానశిఖామణి యొకపాటకచేరి చేసినను ఈపద్ధతిని నానాప్రదేశములవారును వినునట్లు చేయుటకు సాధ్యముగాదు. కాన తంత్రియాధారము లేకయే శబ్దములనుగాని, సంజ్ఞలనుగాని తెల్పుటకు శాస్త్రజ్ఞులు మార్గమున్వేషింప దొడగిరి.

ఆధునిక తంత్రీ రహితవార్తాహరణ పద్ధతికి ఇటలీ దేశీయుడగు మార్కొనీ జనకప్రాయుడైనను మాక్స్వెల్ (Maxwell), లాడ్జ్ (Lodge), హర్జు (Hertz) అను శాస్త్రజ్ఞుల పరిశోధనలే ఈపద్ధతియుత్పత్తికి మార్గము కలిగించెను. ఈమహామహుల ప్రయత్నములను గూర్చియు, శాస్త్రవికాసమునకై వా రనుభవించిన కష్టములను గూర్చియు ఎన్నియో హృదయాకర్షకరములగు సంశము లున్నను వాని నన్నిటిని వ్యాసవిస్తరభీతిచే వదలివేయవలసినదే. కాని తంత్రీసహాయముగూడ లేకుండ వార్తాహరణ మేవిధముగ జేయగలరో, ఏవిధముగ వేలకొలది మైళ్లదూరముననున్న ఒకస్థలమునందు మరల అదేవార్తలను, ధ్వనులను విన సాధ్యమగునో కొంత తెలిసికొనవలయును.

ధ్వని కెరటములరూపముగనే ప్రసరించు నని మన మిదివరకే కనుగొనియున్నాము. ఈ కెరటములలో ఒక కెరటముయొక్క అగ్రమునుండి రెండవదాని యగ్రమువరకునుగల దూరమునకు కెరటపునిడివి యనిపేరు. శబ్దతైక్ష్ణ్య మెక్కువగుకొలదిని ఈ కెరటపునిడివి హెచ్చగుచుండును. కాని ఎంతతీక్ష్ణమైన శబ్దమైనను దూరదేశములకు వినిపించదు. క్రీ. శ. ౧౮౮౩ వ సంవత్సరమునందు క్రాకటోవా అగ్నిపర్వతము విజృంభించినపు డుద్భవించిన శబ్దములు సుమారు 3000 లమైళ్ల దూరమువరకును వినిపించెనట. కాని ఇట్టి సందర్భములు మానవయుగమున విశేషముగ లేవు. ఎట్టికర్ణకఠోర ధ్వనిగలదైనను ౧౫ మైళ్లదూరమున కెక్కువగ వినిపించదు కాన తంత్రీరహితముగ శబ్దహరణము జేయవలెనన్న సామాన్యములగు ధ్వనికెరటములను ఏవిధముగనైన విస్తృతి నొందింప సమకట్టవలెను. ఈ విస్తృతమైన కెరటముల కెరటపునిడివి చాలయధికముగ నుండును గాన ఈ ధ్వనికెరటములు చాలదూరము వ్యాపించగలవు. దూరమునను౦డివచ్చు ఈ కెరటములను ఆకర్షించి సామాన్యధ్వనులుగ నెట్లు మార్చుచున్నారో ఇక గమనింతము. తంత్రీవార్తా, టెలిఫోను పద్ధతులనుగూర్చి వ్రాయునపుడు శబ్దస్వరూపము నేవిధముగ భిన్నపరిణామము నొందించగలమో, అట్లు అవస్థాభేదమును జెందిన శబ్దస్వరూపములను మరల ఎట్లు కేవలశబ్దములుగ మార్చగలమో తెల్పియున్నాను. ఈపరిణామ పరివర్తన స్వరూపములకు ఆధారహేతువు విద్యుచ్ఛక్తియే యని కూడ తెల్పియున్నాను. తంత్రీరహితవార్తా పద్ధతికి గూడ విద్యుచ్ఛక్తియే ఆధారహేతువు.

రెండు లోహపురేకులను గైకొని వాని నొక గాజుపలక కిటునటు జేర్చియుంచి, ద్వివిధశక్తి వికారమైన విద్యుచ్ఛక్తియందలి ధనశక్తిని ఒకరేకునందును, ఋణశక్తిని రెండవ రేకునందును నిక్షేపించిన యెడల ఈ రెండు రేకుల మధ్య నుండు గాజుపలకగుండ విద్యుచ్ఛక్తిప్రవహింపజాలదు గాన ఈ ద్వివిధశక్తులును సమ్మేళనము జెందజాలవు. ఇప్పు డీరెండు రేకులకును ఒక లోహపుతీగచేత సంబంధమును గల్పినచో ఈ రెండు శక్తులును ఒక దాని నొకటి యాశ్రయించి ధనశక్తి నిక్షిప్తమైన రేకునకు ఋణశక్తియు, ఋణశక్తి నిక్షిప్తమైన రేకునకు ధనశక్తియు ప్రవహించును. కడకు రేకులు రెంటియందును రెండుశక్తులును సమానమై సమ్మేళనమగును. కాని అట్లు సమ్మేళన మగుటకు పూర్వము పరస్పరాకర్షణోద్వేగముచేత ఈ శక్తులు రెండును ఒకరేకునుండి ఇంకొక రేకునకు ముందుకును, మరల

వెనుకకును ప్రవహించుచుండును. అవగా ఋణశక్తిపూరితమైన రేకు నుండి విద్యుదృణ పరమాణువులు ఒక్కపెట్టున ధనశక్తిపూరితమైన రేకునకు ప్రవహించును. కాని వెంటనే అవి యచ్చట అధికమగుటచే గాబోలు మరలఋణశక్తిపూరితమైన రేకునకు వెనుకకు మరలివచ్చును. మరలివచ్చుటలో గూడ చాలయధికముగ మరలివచ్చినందువలన ఇంకొకమారు ధనశక్తిపూరితమైన రేకునకు పరుగెత్తును. ఈ విధముగనే కొన్నిమారులు ముందునకును, వెనుకకును తిరిగిన పిమ్మట గాని యవి కుదుటబడవు. ఈ రెండురేకులకును సంబంధము కలిగించక వానిని రెంటిని దగ్గరకు దెచ్చినయెడల విద్యుచ్ఛక్తి గాలియందు ప్రవహింపజాలకపోయినప్పటికిని శక్త్యావేగముచేత రేకులకు మధ్యనుండు కొంచెము దూరమును దుమికి దాటగలదు. కాని అప్పటికిని ఒకమారుమాత్రమే దాటియుండజాలక శక్తివృద్ధిచేత ముందునకును, వెనుకకును చాలమార్లు మధ్య ప్రదేశముమీదుగ దుముకుచుండును. ఈసూత్రముపై నాధారపడియే తంత్రీరహిత వార్తాపద్ధతిని కనుగొనగలిగిరి.

పైజెప్పిన విధముగ విద్యుదృణపరమాణువులు వేగముగ దుముకునప్పుడును, చలించునప్పుడును వానికి చుట్టునున్న అంతరాళ ప్రదేశమున కొంత క్షోభ కలుగును. ఇది కెరట రూపముగ నానాదిశలకును వ్యాపించును. ఋణపరమాణువుల ప్రవాహావేగ మెక్కువైన కొలదిని ఈ కెరటము లధికములగుచు వీని సమ్మేళనమున ఒక పెద్దకెరటము తయారగును. ఈ కెరటములను విద్యుదయస్కాంతకెరటము లనియు, వీనిని కనుగొన్న శాస్త్రజ్ఞుని పేర హర్ట్సు (Hertz) కెరటము లనియు అందురు.

తంత్రీరహితవార్తాహరణ మీ హర్ట్సు కెరటముల మూలముగనే జరుగుచున్నది. ఈ కెరటముల నుత్పత్తిజేయుటకు వలయు యంత్రము ఈ క్రిందజూపబడిన పటమునందలి పద్ధతి ననుసరించి యుండును.




'త'యనునది విద్యుచ్ఛక్తి జనకస్థానము. విద్యుద్వలయ మేర్పడి విద్యుచ్ఛక్తి ప్రవహింపజేయుటకు సంబంధము కలుగ జేయునది 'ట' యను గుండి. దీనిని ఒత్తినయెడల విద్యుచ్ఛక్తి ప్రవహించి 'చ' దగ్గరకు వచ్చును. వెంటనే 'చ' దాని నాకర్షించి దాని యొత్తిడిని ఎక్కువగ జేయగలదు. శక్తియొక్క ఒత్తిడి (Voltage) యధికముగనున్న గాని విద్యుదృణపరమాణువులు 'క' 'క' యను రెండు చిన్న ఇత్తడిగుండ్లనుండి మధ్యనున్న స్థలముమీదుగ ముందుకును, వెనుకకును దుముకజాలవు. ఈ'చ'నే విద్యుత్ప్రేపకవల్లరి (Induction coil) అని యందురు. ఒకచుట్లతీగయందు విద్యుచ్ఛక్తి ప్రవహించుచున్న దనుకొనుడు. దానికి ప్రక్కన మరొక చుట్లతీగ యున్నయెడల మొదటి తీగయందలి విద్యుచ్ఛక్తిలో మార్పులు కలిగినపుడెల్ల రెండవతీగ విద్యుత్పూరితమగును. విద్యుత్ప్రవాహముగల మొదటితీగ రెండవతీగయందు తనశక్తిని కొంతపంపి దానిని విద్యున్మయము జేయుచున్నది గనుక ఈయంత్రమును విద్యుత్ప్రేపకవల్లరి యని అందురు.

ఇం దొక విశేషమున్నది. మొదటిదానియందున్న చుట్లకంటె రెండవదానియందు చుట్లు ఎన్నిరెట్లు ఎక్కువగ నున్నయెడల విద్యుచ్ఛక్తియొక్క ఒత్తిడి మొదటిదానియందుకంటె రెండవదానియందు అన్నిరెట్లు ఎక్కువగ నుండును.

ఇంత ఒత్తిడి ప్రమాణముతో వచ్చుచున్న శక్తికి 'క' 'క' లకు మధ్యనున్న స్వల్పదూరము ప్రతిబంధకము కాజాలదు. కాననే పైన జెప్పిన విధముగ విద్యుదృణ పరమాణువుల డోలనము (Oscillation) సంభవించి తజ్జనిత మగు హర్ట్సుకెరటములు ఆకాశతంతె గుండ బహిర్గతమగును. సాధారణముగ ఈఆకాశతంతెను ఒకఎత్తయిన స్తంభాగ్రమునకు గొనిపోవుటవలన ఈకెరటములు నేలపైన అధికముగనుండు ధ్వనికెరటములు మొదలగువానితో కలిసి స్వరూపభేదము చెందకుండగనే దశదిశలకును ప్రసరించగలవు. ఇట్టి ఎత్తయిన రెండు ఆకాశ స్తంభములు మదరాసునందుకూడ హైకోర్టునకు దక్షిణమున గలవు.

పై పటమునందలి'ట'యనుగుండిని ఒకసారి ఒత్తి విడిచినయెడల కొంతశక్తియే ఉత్పన్నమగును గాన తత్ఫలితముగ బహిర్గతమగు హర్ట్సుకెరట సముదాయము స్వల్పమే. కాని ఈగుండిని యొత్తిపట్టి నిదానముగ వదలినయెడల ఉత్పన్నమగు శక్తి యధికముగాన బహిర్గతమగు హర్ట్సుకెరటసముదాయముగూడ నధికము. వీనిని మోర్సు పద్ధతి ననుసరించి చుక్కలుగను, గీతలుగను ఎన్నవచ్చును.

పై జెప్పినపద్ధతి చాలా సులభమైనదిగాని చాల దూరప్రదేశములకు వార్తాహరణము జేయవలసివచ్చినప్పుడు ఇది అంత అనుకూలముగ నుండకపోవుటచేత ఈ పద్ధతియందు చాల మార్పులను చేసియున్నారు. శాస్త్రజ్ఞుల ప్రతిభవలన నీయంత్రములు నానాటికిని వృద్ధి బొందుచున్నవి.

ఈ కిరణములు నిమిషమునకు ౧౮౬,౦౦౦ మైళ్ల వేగముతో, అనగా వెల్తురుకిరణముల వేగముతో నానాదిక్కులకు ప్రయాణించ గలవు. అట్లు ప్రయాణించుచు మార్గమధ్యమున ఏతీగెయున్నను దాని యందు విద్యుచ్ఛక్తి నుత్పన్నము జేయ ప్రయత్నించును. కాని అంత దూరమునుండి వచ్చుటవలన ఈకిరణములకే కాలదుర్బలముగనుండు టచేత వానిని టెలిఫోనునందలి కర్ణికవంటిదానిగుండ పోనిచ్చినగాని లాభములేదు. ఈచిన్నయంత్రము దుర్బలమగు విద్యుచ్ఛక్తి నేవిధముగ నాకర్షించి వృద్ధినొందజేయగలదో ఇదివరకే తెలిసికొనియున్నాము. కాని ఇందును ఒక విశేషము గలదు. వచ్చుచున్న ప్రవాహము నట్లనే టెలిఫోను యంత్రముగుండా పోనిచ్చిన యెడల ప్రవహించు శక్తులు వేగముగ నొకమార్గమునకు ప్రవహించి మరల వెంటనే ఇంకొక మార్గమునకు ప్రవహించుచుండుటచేత ఏమాత్రమును ఉపయోగకరము గా జాలవు. కాన ఈశక్తులను ఏకముఖగతములుగ జేయ నొకచిన్నయంత్రమును గనిపెట్టియున్నారు. ఈ యంత్రమును పలువిధములుగ జేసి యున్నారు. వానిలో ముఖ్యమైనది స్ఫటికశోధిని (Crystal Rectifier). స్ఫటికాకారము గల కొన్ని పదార్థములలో దేనినయినను ఒకదానిని దీని కుపయోగింపవచ్చును. స్ఫటికములు తమగుండా ఒక మార్గముననే విద్యుచ్ఛక్తులను ప్రవహింపనిచ్చునుగాని మరల వెనుకకు ప్రవహింపనీయవు. ఈ లఘుయంత్రసహాయమున సందేశహరస్థానమున మోర్సుపద్ధతి ననుసరించి పంపబడు సంజ్ఞలనన్నిటిని చాలదూరమునుండు సందేశగ్రాహకస్థానమునందు ఎట్టి తంత్రీసంబంధము లేకయే విని సందేశమును తెలిసికొనవచ్చును.

కాని ఇంతకన్న మాటలను, పాటలను వినునట్లు జేయుటయే ప్రపంచవిచిత్రములలో నొకటి. ఇక్కడికి ఐదారువేలమైళ్ల దూరమునున్న ఇంగ్లాండుదేశపువారితో ఢిల్లీనగరమునుండి కాని, మదరాసునుండిగాని వైర్లెసుగా నైనను, లేక మరెవ్వరైనను సంభాషణ జరుపవచ్చును. ఫిడెల్ వాద్యసాధనమున లోకైక పురుషుడగు క్రయిస్లరుగాని, భూలోక గాయకశిఖామణులలో నగ్రస్థానమును వహించిన ఛాలియపినుగాని నేడు లండనునగరమునందో, లేక పారిస్‌నగరమునందో సంగీత కచేరీని నడపినయెడల మదరాసునుండిగూడ మనము విని యానందించవచ్చును.

ఇది అత్యంతాశ్చర్యకరముగ దోచుచున్నను పై పద్ధతులను బట్టి చూచినచో ఇది దురవగాహముగ గన్పట్టదు. తంతెల మూలముగ సంజ్ఞల నంప మొదలిడినవెనుక సంభాషణమును నడుపు టెలిఫోను యంత్రమును కనుగొనవెట్లు సులభసాధ్య మయ్యెనో అట్లనే తంత్రీరహితముగ సంజ్ఞల నంపగలిగినపిమ్మట ఈ యంత్రమునందే కొన్ని మార్పులు చేసి సంభాషణోపన్యాసములను, గానమునుగూడ తెలియజేయుటకు నేర్చుకొనిరి.

ఈ యంత్రాభివృద్ధికి కడుంగడు ముఖ్యమైన యంశము విద్యున్నిర్యామకద్వారయంత్ర నిర్మాణమే. ఇది చూచుటకు విద్యుద్దీపగోళమువలె నుండును. ఇందు మూడు ముఖ్యభాగములు గన్పించుచుండును. మొదటిది గొట్టమువంటిరేకు. కాని ఈ గొట్టమునకు రెండువైపులను మూతలు లేవు. దీనిమధ్యను దీని కేమాత్రము అంటుకొనకుండ కేసరము (సన్ననితీగె) అడ్డముగ నుండి దాని రెండుకొనలును వేరువేరుగ యంత్రపు క్రిందిభాగమునకు జేరియుండును. ఈ కేసరముచుట్టును ఒక సాధన ముండును. ఇది ధనశక్తిపూరిత మైనయెడలనే ఋణపరమాణువులను దానిగుండ పోనిచ్చునుగాని ఋణపూరిత మైనచో నట్లు చేయదు.

వాయురహితాంతర్భాగము గల ఈ చిన్ని యంత్రమునందు గొట్టమువలె నుండు రేకును ధనశక్తిపూరితముగ జేసినయెడల ఋణశక్తిపూరిత మగు కేసరమునుండి ఋణపరమాణువు లధికముగ రేకు మీదికి దుమికి ప్రవహించును. కాని మార్గమధ్యమున జాల ముండుటచే ఈజాలము ధనశక్తియుత మైననే ఋణపరమాణువుల నాకర్షించి రేకుమీదికి ప్రవహింపజేయును గాని ఋణశక్తిపూరిత మైనయెడల అట్లు సాగనీయదు. ఈ జాలమునకు ఆకాశతంతెతో సంబంధము కలిగించినచో దానియందు కలుగు మార్పుల కనుగుణముగ దీనియందు గూడ మార్పులు కలిగి ధనశక్తియుతముగను, ఋణశక్తియుతముగను మారుచుండును. ఇందువలన ఋణ పరమాణువులు ఒక మార్గమున ప్రసరించుటయే గాక వీని ప్రసరణము ఆకాశతంతెకు కలుగు మార్పులమీద నాధారపడియుండును. ఈ చిన్నియంత్రము సందేశహరణయంత్రమునకును, సందేశ గ్రాహక యంత్రమునకును గూడ సహాయమగును.

ఇంకొక చిన్నవిషయమును గూడ జ్ఞాపకముంచుకొన్న యెడల తంత్రీరహిత సంభాషణాపద్ధతియందున్న శాస్త్రవిధానము సుబోధ మగును. ఇదివరకును హర్ట్సు కిరణములను గూర్చి మాటలాడినపుడెల్ల సాధారణముగ నుండు ఒకవిధమైన హర్ట్సు కిరణములను గూర్చియే చెప్పితిమి. ఈకిరణములు ఈక్రింది రూపమును దాల్చి యుండును.

అనగా ఈకిరణముల రూపము క్రమక్రమముగ హ్రస్వమగుచు ఆకారము మారుచుండును. (మొదటివరుస) వీనిని చెమ్మకిరణములని యందురు. పాడికిరణముల యాకారము ఎంత దూరము పోయినను సన్నగిల్లక రెండవవరుసను జూపబడిన విధముగ నొక్కరీతి నుండును.

చెమ్మకిరణములు



పాడికిరణములు

తంత్రీరహిత పద్ధతిని సంభాషణమును, సంగీతమును స్థలాంతరమునకు బంపవలెనన్న పాడికిరణములే ఉపయోగకరములు. వీనిని తయారుజేయు విధానమునందున్న సూక్ష్మాంశము లన్నిటిని ఇట వివరింప సాధ్యముగాదు.

ఇప్పుడీ క్రిందిపటమునుండి తంత్రీరహితముగ దూరప్రదేశములతో సంభాషణము జరుప నెట్లు సాధ్యమగునో విశదమగును.

**1.** ఆకాశతంతి, 2. కర్ణిక, 3. పొడికెరటములు, 4 విద్యున్నియామక ద్వారయంత్రము, 5 భూమితంతి, 6 పొడికెరటములను కమారుజేయుయంత్రము.




సందేశహరయంత్రము




సందేశగ్రాహకయంత్రము

ప్రథమమున ఆకాశతంతియందు పొడికెరటములను 1 వ సంఖ్యగల యంత్రముచేత ప్రవేశపెట్టుదురు. ఇవి టెలిఫోనువంటి యంత్రమునుండి ప్రవహించి 2 వ సంఖ్యగలచోట చెప్పబడుచున్న మాటలచేతనో, లేక గానముచేతనో మరి ఏ ఇతర ధ్వనుల చేతనో తత్తచ్ఛబ్దానుగుణముగ వికృతి నొందుచుండును. అట్లు వికృతినొందిన ఈ పొడికెరటములు 1 వ సంఖ్యగల ఆకాశతంతినుండి నానాదిక్కులకును ప్రసరించి దూరమునందున్న ఒక సందేశగ్రాహకయంత్రమునందలి ఆకాశతంతిని తాకిన వెంటనే అందుండి ఆయంత్ర గర్భమునకు ప్రసరించి విద్యున్నియామక ద్వారయంత్రముచే సంస్కృతములై మరల టెలిఫోనువంటి యంత్రమునుండి ప్రయాణించి 2 వ సంఖ్యగలచోట కర్ణిక (Ear-piece)నుండి మనకు వినబడును.

దీనినిబట్టి ఒకదేశమున నున్నవారితో దూరదేశమునందున్న ఇంకొకరు సంభాషణము నెంతసులభముగ జరుపగలరో విశదమగును. క్రింది పటమును చూడుడు.







ఎడమవైపునందుండు భూభాగము హిందూదేశమునందలి మదరాసుపట్టణ మనుకొందము. కుడివైపు నుండు భాగము జపానుదేశమునందలి టోకియో నగరభూభాగ మనుకొందము. మదరాసునందున్న 'క'యను నొకగొప్పవర్తకుడు జపానునందలి 'య' అను నొకగొప్పవర్తకునితో మాటాడగోరును. 'క' తనసాధారణ టెలిఫోను తీసికొని దానియందు 'ట' యను టెలిఫోనుకార్యస్థానపువారికి తాను జపానుదేశమునందొకనితో మాటాడగోరుచున్నానని చెప్పును. వారు వెంటనే అతని టెలిఫోనునకును, 'హ'యను సందేశహర స్థానమునకును 'గ'యను సందేశగ్రాహక స్థానమునకును తంత్రీసంబంధము గలుపుదురు. సందేశహర స్థానమువారు పంపు హెర్ట్జ్‌కెరటములవలన జపానునందలి టోకియోసందేశగ్రాహకస్థానము వారు 'య' అనువానితో హిందూదేశీయుడొకడు మాటాడ గోరుచున్నాడను సంగతిని టోకియో టెలిఫోను కార్యస్థానమువారికి దెల్పుదురు. వారు 'య'వర్తకుని ఇంటియందు టెలిఫోనుతో అచ్చటి సందేశహర, సందేశగ్రాహక యంత్రములకు సంబంధము గలుగజేతురు. అప్పుడు 'క' 'య' లకు సంభాషణ జరుగును. 'క' మాటలు మదరాసు టెలిఫోను కార్యస్థానమునుండి సందేశహర స్థానమునకు వెళ్లి అచటినుండి హెర్ట్జ్‌కెరటరూపముగ ప్రసరించి జపానునందలి సందేశగ్రాహకయంత్రముల మూలముగ టోకియో టెలిఫోను కార్యస్థానమునకును, అటనుండి 'య'కును వచ్చి వినబడును. 'య' యొక్క మాటలును అట్లనే తననగరమునందలి సందేశహర యంత్రమునుండియు, మదరాసునందలి గ్రాహకయంత్రమునుండియు 'క'కు వచ్చి వినబడును.

వీరి మాటలను వీరిద్దరేగాక ప్రపంచమునందింకెవ్వరు గాని యున్నను తమ సందేశగ్రాహకయంత్రముతో వినగలరు. తంత్రీరహితపద్ధతిని ఈచిక్కొకటి గలదు. ఈచిక్కును తొలగించుటకై చాలపరిశోధనలు జరుగుచున్నవి. కాని రహస్యముగనుండ నావశ్యకము లేక అందరును వినదగు విషయములందు ఇట్టికష్టములేవియు నుండజాలవు. కాననే మనము మూడునాలుగు నూర్ల రూపాయలవెలకు ఒక మంచి సందేశగ్రాహక యంత్రమును కొని మన ఇంటియందుంచుకొన్న యెడల నానాదేశములందుండు సందేశహరణ యంత్రములనుండి పంపబడు వార్తలను, వృత్తాంతములను, సంగీతమును వినగలము.

కాని ఇందొక యనుమానము గలుగవచ్చును. చాలసందేశహర యంత్రములు ఒకటేసారి హెర్ట్జ్‌కెరటములను బంపుచుండిన యెడల మన సందేశగ్రాహకయంత్రమునందవియన్నియు చేరి విన

బడి అనర్థముగలుగదా యని తోచవచ్చును. ఈగందరగోళమును తొలగించుటకే వేరువేరు సందేశహర స్థానములకు వేరువేరు కెరటపు నిడివిని నియమితము చేసియున్నారు. గాన మన సందేశగ్రాహక యంత్రములను అభిమత సందేశ హరస్థానమునకు గల కెరటపు నిడివి శ్రుతిజేసి (Tuning) అక్కడనుండి వచ్చు కెరటములు దప్ప మిగత వేవియును ప్రవేశించి యనర్థము జేయకుండునట్లు జేయవచ్చును. ఈ విషయమునకు సంబంధించినట్టియు, తంత్రీరహిత సందేశ హరగ్రాహక పద్ధతికి సంబంధించినట్టి మిగిలిన అంతర్జాతీయ విషయములను గూర్చి యు చర్చించి నిర్ధరించుటకై ఒక అంతర్జాతీయసంస్థగలదు. ఆ సంస్థ యొనరించు నియమ నిబంధనలకు లోబడి నానాదేశములవారును తమదేశమునందలి తంత్రీ రహిత పద్ధతిని నడుపుకొనవలెను.

తంత్రీరహిత పద్ధతి మూలముగ ప్రజలకు ఉపన్యాసముల నొసగియు, వార్తల దెలియజేసియు, గాయకశిఖామణుల సంగీతమును వినిపించియు, నానా విధములుగ ప్రజలకు జ్ఞానాభివృద్ధిని గలిగించ ప్రయత్నించని దేశమే లేదు. కొన్ని దేశములందు ఈ భారమంతయు ప్రభుత్వమే వహించియున్నది. కొన్నికొన్ని ప్రదేశములందు ప్రత్యేకసంస్థలీ కార్యములను జరుపుచుండ ప్రభుత్వము ఆసంస్థలకు తన సహాయముమాత్రము జేయుచున్నది. దగ్గరగనున్న దేశములందలి గానమును, ఉపన్యాసములను వినుటకు ౨౦ లేక ౩౦ రూపాయల స్వల్పమూల్యమునకు వచ్చు చిన్న సందేశ గ్రాహక యంత్రములను గొని ఇంట నుంచుకొననివారు ఇంగ్లాండు మొదలగు దేశములందు అరుదు. కూలివారి ఇండ్లలో గూడ ఇవి చాల ఇండ్లలో నుండును. కావునే ఇంగ్లాండు దేశమునందు ఎట్టివారికిని జ్ఞానాభివృద్ధికి ఎంతయో అవకాశము గలదు. ఇంతప్రయత్నమునకు ప్రభుత్వమువారికి సందేశగ్రాహకయంత్రము నింట నుంచుకొనువారు చెల్లించు రుసుము చాల స్వల్పమే. కొన్ని దేశములలో ఈ రుసుము సంవత్సరమునకు ౨ రూపాయలు గూడ లేదు.

ఈ శాస్త్రజ్ఞానాభివృద్ధివలన మానవునికి ఎన్ని యనుకూలము లేర్పడినవో మానవజీవిత మెంత ఆనంద ప్రదమైనదో చెప్ప నలవిగాదు. ఓడలో ప్రయాణించునపుడు సముద్ర మధ్యమున ఏదైన అపాయము సంభవించినయెడల దిశదిశలకును వర్తమానమంపి ప్రాణ సంరక్షణమును జేసికొనవచ్చును. వాయువిమానములనుండి సంభాషణము నడిపించుటకు సాధ్యమగుట ఎంత ఉపయోగమో చెప్పనవసర మేలేదు. నానాదేశములవారును ఒకరినిగూర్చి యొకరు మూఢత్వము వహించి వివిధ హేయభావములను వహించుటకు బదులు నేడు తంత్రీరహిత పద్ధతిమూలముగ ఒకరొకరిని గూర్చి ఎక్కువగ తెలిసికొనుచు పరిచయముచేసికొనుచు అన్యోన్య స్నేహ మభివృద్ధి చేసికొనుటకు అవకాశము మెండుగ గలదు.

ఇట్టి మానవాతీతములగు కార్యములను నెరవేర్ప గలిగిన శాస్త్రజ్ఞుల నేమని కొనియాడగలము! జ్ఞానాభివృద్ధికై, శాస్త్రాభివృద్ధికై తమ జీవితములను ధారవోసిన శాస్త్రజ్ఞులు పాశ్చాత్య దేశములం దెందరో గలరు జనసామాన్యము గూడ జ్ఞానార్జనమునకై వలయు శ్రద్ధ గైకొనుచున్నది. అట్లనే మనముగూడ జ్ఞానార్జనమునకును, జ్ఞానాభివృద్ధికిని పాటుపడిన గాని హిందూదేశము ప్రపంచమునం దగ్రస్థానము వహింపజాలదు.



# గోవర్ధనాచార్యసప్తశతీసారము

## సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

నరణ స్రజంబు నిడి శ్రీ
హరి తన కంఠమున మాయలాఁడయితొల్పం
దరుణీవేషము నవ్విరి
సురాసురులు లజ్జపడుచుఁ జూచెను సిరియున్.

తన బింబాధరరసమును
గొన వేడుకపడి నిశాటకులు త్యజియింపం
గను భీయూషంబును మో
హినిరూపముగొన్న హరి రహిన్ మదిఁ
దలఁతున్.

పొలయల్క వాంచఁ దలఁ బద
జలజంబులఁ బ్రియుఁడు, గౌరిజంఘాకాండం
బిల హరుని దాఁక గెలిచిన
వలరాజుజయధ్వజంబువలెఁ జెన్నారెన్.

అగ్రమునయందు శ్రీవత్స మలరుచున్న
మాధవుని రోమవల్లరి మనుచుఁగాతఁ
దాప మడఁగించి, యున్నాలదండమైన
నాభిజలజంపుఁ జాయచందమున మిమ్ము.

అతివ కాలిగోటికంటినిండుగఁ దోఁచుఁ
దగిలి యందె ద్విగుణముగ నొనర్చు;
నలరుఁ జీలమండ వలపునంకెలగాఁగ;
శర్వు శిరసుపైనిఁ జంద్రలేఖ.

ప్రతిఫలించు హైమవతి మోముఁ గాంచుటఁ
గదలి చేతిపట్టు వదలి జారి
యూటలూరు చెమటనీటఁ గ్రమ్మెఱనిండు
చున్న హరు జలాంజలి న్నుతింతు.

జడలు కేసరములు చదలేటి తేనియల్
వలయమైన తలయె వటులు దుద్దు
అతితి విసపు రొంపియందు జన్మించిన
హరుని మొగముఁదమ్మి కగుదుఁ దేఁటి.

నవ్వుటాలకు సిఃకొమ్మ నాభిచక్ర
మంటుచున్నట్టి చక్రి పాదాంబుజంబు
జలజనాభున కనురూపసతిగ నాపె
దిద్దఁ బ్రయతించుచున్నరీతిగఁ దనర్చె.

అవ:— లక్ష్మీసరస్వతుల పరిచయము
నొకఁడు చెలుపుచున్నాఁడు:

ఎలయించుం బణ్యాంగన
వలె మిక్కిలి కలిమికొమ్మ పరిచయలవమున్
నిలుపదు మదిని; సరస్వతి
కులసతివలె జన్మజన్మకును విడువ దొగిన్.

అవ:- చెలికత్తె నాయకునితో ననుచు
న్నది:

సురఁటి పెనువీవులకు డస్సి కరయుగంబు
వ్రాలుచున్నది సకియకు రమ్యమూర్తి!
ముగియ దుద్వర్తనము మేనఁ బుట్టు చెమటఁ
బామ్మ! కొంతావలకు నది ముగియుదనుక.

అవ:—ఒకతె మరొకతెతో ననుచున్నది:

ముగుదా! ప్రసన్నురాలుగ
నగుమీ యని చిలుకపలుక నళికి గృహిణికిన్
దగఁ బ్రియుఁడు వెడలె గది; చెలి
నగియె; సవతి పొగిలె; బాల నానంగొనియెన్.

అవ:—నాయకుఁడు వయస్యునితో
ననుచున్నాఁడు:

విదిలించుఁ గేలు; సైఁపక
రుదియించుం, బరిహసించు; గ్రుచ్చు; నఖంబుల్.



శ్రీ రాజేంద్ర ప్రసాదగారు; అనంతపురంజిల్లా, పెనుగొండలో శ్రీ యన్. వెంకటరావుగారి చిత్రశాలయందు.



గుణదల ఖద్దరు సంస్థానమున శ్రీ రాజేంద్రప్రసాదగారు.

చాటితివి లోకమున నోటిచేఁటకీఱ
లలనవగు రూపరేఖావిలాసమిూవ
యువకదంబంబు నీయింటె యుతకలెత్తఁ
బ్రతిదిన మమర్చుచుఁ బ్రయాసపడెద విపుడు.

అవ:—అసమయమున రతి నభిల
షించు నాయకునితో నాయిక యనుచున్నది:

ఒకమూల గురులు వాఁకిట; [జెలుల్
నొకమూలం జిలుకమొకరి, యొకమూలఁ
ఒకమూలఁ బిల్లి; కేఁక నో
పికఁబట్టుము ప్రొద్దుగ్రుంకు వేగమె ప్రియుఁడా!

అవ:—ఒకరి ముచ్చట నొకతె చెప్పు
చున్నది:

కాళులం జిమ్మియున్న పలాలరాశిఁ
గని యలుక గేస్తు వృషభంబుఁ గట్టి మోఁదఁ
గాఁపుపిల్లయు మఱఁదియు దాఁపునిలిచి
యొండొరులఁ జూచుకొని నవ్వుచుండి రెడఁద.

అవ:—ఒకదంపతుల ముచ్చట నొకతె
తెలుపుచున్నది:

మరుని తూపుల పిండు దగ్గఱకుఁ దార్ప
వదలకయు మౌనదీక్షను మదనకేళిఁ
దేలుచున్నను దంపతుల్ త్రెస్సిపోక
ప్రిదులకయు మౌనపుగ్రంథి పొదలువల్లె.

ఆంధ్రుని చిత్తవృత్తి





# లాలోచి

## ఎ.యన్.భూషన్

[ఏ కాం క నా టి క]

పాత్రలు

*    *    *    *

శేషూబాయి:—నేపాలి అంగన. పాతికేళ్ల వయస్సు. భర్తను గోల్పోయి ఆరునెలలైంది. అంతగా విచారంతో గాదు, సంఘభీతిచే బయటికి పోవడం లేదు యింకా.

నరహరి:—మాధవరావు బ్రతికివుండే వకీలువృత్తి సాగిస్తున్న కాలంలో గుమాస్తా. ఆయనగతించినా యజమానురాలి అనుగ్రహంతో యింకా నౌకరీలోవుండి, ఆవిడెలావాదేవీవ్యవహారాలు చూస్తున్నాడు. నలభయ్యో పడిలోవున్నా ఓకన్ను శేషూబాయిమీద వేసేవుంచి, ప్రేమభిక్ష అందుకోడానికి మనస్సు దృఢపర్చుకొన్నాడు.

జగన్నాథం:—తీవ్రమైన వడ్డీవ్యాపారంతో మిద్దెలు మేడలు గట్టి యింకా డబ్బులోనే మునిగి తేలుతున్న వైశ్యశిఖామణి. అతని వృత్తికి వుండవలసిన కఠినహృదయం, నిర్మోహమాటం పూర్తిగా గలవాడు. ముప్పైఅయిదు నలభై మధ్య వుంటుంది వయస్సు.

రత్నాబాయి:—అరవై దాటిన ముసలి. శేషూబాయికి దూరంగా సంబంధి. తనవా రెవ్వరూ లేకపోవడంచేత చాలాకాలంనుంచీ శేషూబాయిని భర్తని కనిపెట్టుకొని వుంది. కష్టకాలంలో శేషూబాయికి వంట చేసిపెడ్తూను, ఓదార్పుమాటలు చెప్తూను వున్నది.

*    *    *    *

[శేషూబాయి ఇల్లు- రెండస్థులది. క్రిందహాల్లో దృశ్యం. సోఫాలు, కుర్చీలు, మేజాలు. ఓ కుర్చీలో మూలగా శేషూబాయి కూర్చున్నది విచారంగా. వెడల్పు అంచు మైసూరు సిల్కుచీరకట్టు కుంది. మొఖాన బొట్టుమాత్రం లేదు. కాని దూరాన్నుంచి చూచి ఆమె వితంతువని అనుకోడానికి వీల్లేదు. అయిదుపాయల పాలుజడ బుజంమీదనుంచి ముందు వక్షోజంమీదికి వ్రేలాడుతోంది. టైము సాయంత్రం. కాని యింకా దీపాలవేళ కాలేదు. హాల్లోవున్న పటాల వంక వెర్రిగా చూస్తూ ఏదోతీవ్రంగా యోచిస్తూంది శేషూబాయి.]

రత్నాబాయి:— (మండువాలోనుంచి హాల్లోకి ప్రవేశిస్తూ) శేషూ, ఎన్నిమాట్లుచెప్పినా వినవుగద. ఎందుకిల్లా పెంకెపట్టు

పడ్తావు? ఏం ప్రయోజనం చెప్పు, ఆరోగ్యం చెడ్డమేనా మరేమన్నా వుందా? అనుకున్నాం అంతా సరిగావుంటుంది, సంసారం వృద్ధి అవుతుంది-సుఖంగావుంటామని, కాని విధితప్పుతుందా మరి? ఆయన కాలంతీరింది- వెళ్లిపోయినాడు. ఇక వున్నవాళ్లం మనకే కష్టం. అయిపోయి అప్పుడే ఆరునెలలు. ఎంతకాలమని అదే తల్చుకుంటూ వ్యసనపడ్తావు? లాభమేమన్నా వుందా? అట్లాకూర్చుని వొక్కసారి తోట లోనేనా ఒక్కమారుగూడా కాలుకదపకుండా ఏమిటిచెప్పు? నిఆరోగ్యం ఎందుకేనా పనికివస్తుందా? చెడ్డ తర్వాత చేసేదేముంది యిక? చెప్పి చెప్పి నా ప్రాణం విసుగు వస్తోంది. లే, పద. తోటలో అట్లా షికారుచెయ్యి కాస్సేపు. లే, రోడ్డువెంట పోయేవాళ్లు కన్పడరులే. చీకటిమరుగు. పద శేషూ.

శేషూబాయి:—ఎందుకుపిన్నీ, అన్నిసార్లు చెప్పడం? నీచేత చెప్పించుకోడం, బ్రతిమాలించుకోడం నాకోసరదా అనుకున్నావా ఏం? నామనస్సు బాగుంటే నాకొకరు చెప్పాలా ఏం? నా యౌవనం - నాఊహలు - నాస్వప్నాలు - నాసౌఖ్యం - అన్నీ ఒక్కమారుగా మట్టిలో కలిసిపోయినాయే యని నేను దిగులుపడ్తూంటే, ఏమిటో చెప్తావు. పాతికేళ్లు నిండినయ్యోలేదో అప్పుడే నాజీవితం అస్తమించింది. ఇక—నాకు ఆరోగ్యమెందుకు-చల్లగాలి ఎందుకు-షికార్లెందుకు-హాయి ఎందుకు? నట్టేట మున్గిన నావ నయ్యాను. అదృష్ట వశాన మంచి పెళ్లిసంబంధం కుదరడం, ఆయన వెంటనే ప్లీడరీ వృత్తిలో ప్రవేశించడం, మంచి రాబడివుండడం అంతా నా అదృష్టమే అని వుబ్బిపోయారాను. వరసారం ఏనిమిదేళ్లేనా గడవలేదు. అంతా బోర్లపడ్డది. ఇంకెందుకు బ్రతికి. అయ్యోరామ! నాదీ ఒకబ్రతుకే!

రత్నాబాయి:—అవును శేషూ, నువ్వూ అనుకున్నావు, మేమూ అట్లాగే ననుకున్నాం......కాని విధి తప్పుతుందా మరి? విచారపడ్తే పోయిన అవకాశం, ఆనందం తిరిగి లభిస్తాయా? దేవుడు నీయందుంటే అన్నీ తిరిగి సమకూడ్తాయి నీకు.

శేషూ:—ఎందుకు అట్లా ఎత్తి పొడుస్తావు? ఏం మళ్లీ పెళ్లి చేసుకొని కులుకుతా ననుకున్నావా? నాచేత కాదు అల్లాంటిపని. ఒకరి దగ్గర హృదయపూర్వకంగా అన్నీ తీసుకొని, అనుభవించి మరొకర్నా? అబ్బా! నాకు చెప్పకు అల్లాంటి మాటలు.

రత్నాబాయి:—శేషూ, నీకింకా చిన్నతనం పోలేదు. నా మోస్తరు ముసలిదానవా ఏం? ముందుజీవితంమాట ఆలోచించు. ఈ ఆరునెల్లకేం, ముందు అరవై ఏళ్లూ ఎట్లా గడుస్తాయో యోచించు. నేను నిన్ను కనిపెట్టుకుంటూ ఎంతకాలం శాశ్వతం. నీకుమాత్రం ఎవరున్నారు? వున్న పదివేల ఆస్తి ఎంతకాలమని మళ్లుతుంది? దానికేం, మొదట మోహం ఎవరికేనా వుంటుంది, మమకారం, అభిమానం. కాని అవసరాన్ని బట్టి నడుచుకోవాలి? మొగాడుగాని, ఆడదిగాని జీవితంలో అందులో పిన్నవయస్సులో ముఖ్యంగా, ఒంటరిగా వుండడానికి

వీల్లేదు. రెండు అరసున్నలు కలిస్తేగాని సున్నాగానట్టు స్త్రీ పురుషులు కలిస్తేగాని జీవితంలో సుఖంలేదు. పెద్దదాన్ని నాకి మాత్రం తెలుసు.

శేషూ:—పిన్నీ, పూర్వకాలం దానివైనా వాదనలో గట్టి దానవు. కాని నువ్వు వంద చెప్పు వెయ్యి చెప్పు, నా మనస్సు మారుతుందని తోచదు......(కొంచెం బెదురుతో) అదిగో, బయట ఎవరో పిలుస్తున్నారు. గేటు తీస్తున్నట్టుంది. వెళ్లి చూడు.

(రత్నాబాయి హాల్లోంచి తొందరగా నడచిపోయి చూస్తుంది. మూడు నాలుగు నిమిషాల్లో తిరిగి వచ్చి) శేషూ, ఎవరో జగన్నాథంట. అవసరంగా నీతో మాట్లాడాలిట. వీల్లేదంటే వినడంలేదు.

శేషూ:—గట్టిగా చెప్పు. నావంట్లో బాగుండలేదనిగూడా చెప్పు. వెళ్లి గుమాస్తావుండగా రమ్మను.

రత్నాబాయి:—(వెళ్లి, తిరిగి రెండునిమిషాల్లో తిరిగివచ్చి) చెప్పాను శేషూ. కాని వినడం లేదు. శుద్ధ మోటమనిషిలా గున్నాడు. ఎవరో ప్రాణం పొయ్యేపనిట, అత్యవసరంట, వరండా మెట్లెక్కాడు అప్పుడే. లోపలికి తోసుకువస్తాడేమోగూడ (ద్వారంవంక చూస్తూ) అదిగో రానేవచ్చాడు. అఘాయిత్యంగా (వెరపుతో రత్నాబాయి మండువాలోకి పోతుంది. శేషూబాయి పైట సవరించుకొని కుర్చీ లోంచి కదలకుండా పెడముఖం పెడుతుంది.)

జగన్నాథం:—(కొంచెం జంకు చూపులున్నా, నిర్భయత్వం ప్రకటించే గమనంతో ప్రవేశిస్తాడు. నడివయసు. ఆజానుబాహువు. వైశ్యవర్తకునికి వుండాలిసిన లక్షణాలన్నీ పూర్తిగా వున్నాయి. చేతిలో కాగితాల దస్తరం.) క్షమించాలండీ బాయమ్మగారూ, తోసుకు లోపలికి వచ్చినందుకు. మొహమాటం పోతే లాభం లేదని, పని అవసరం కాబట్టి, ఆలస్యంచేస్తే నాకు నష్టం కాబట్టి-

శేషూబాయి:—(ఓరగా, కొంచెం కోపం స్ఫురింపజేసే కళ్లతో చూస్తుంది.)

జగన్నాథం:—క్షమించాలి...కోపంవద్దు...మీరే ననుకుంటూ బాయమ్మగారు, పొరబాటుకాదుగదా, నాది.

శేషూబాయమ్మ:—(ఉరిమిచూస్తూ)......బాయమ్మగారూ ఏమిటి?...శేషూబాయమ్మగారూ అని పూర్తిపేరు అనడానికి నోరు తిరగదా ఏం?

జగన్నాథం:—చిత్తం, చిత్తం...క్షమించాలి...అసలు పేరు తప్పిన జ్ఞాపకంరాలేదు. అట్లాగే పూర్తిపేరు నోటినిండాపట్టి ఉచ్చరిస్తాను...అంతకన్నా నా, నా పనిఅయితేసరి.

శేషూబాయి:—(ఇంకా కోపంగానేచూస్తూ) మీరెవరో నాకు తెలీదు. మర్యాదలేకుండా ఎందుకిల్లా తోసుకురావడం? ఆడ

వాళ్ళం వొంటరిగా వున్నామని తెలీదూ?...అదీగాక నావొంట్లో బాగులేదు...పనేమన్నావుంటే, రేపుప్రొద్దున గుమాస్తావుంటేగా రండి

జగన్నాథం:—అవును, మీరు వొంటరిగావున్నమాటా నిజమే, నేను నిర్మొహమాటంగా లోపలికివచ్చినమాటా నిజమే. కాని దురుద్దేశమేమీ లేదని తెలుసుకోవాలి మీరు...

శేషూబాయి:—ఎందుకు అసందర్భపుమాటలు?

జగన్నాథం:—క్షమించాలి.కోమటి ముండావాణ్ణి. నా కాస్తైనా నగిషీమాటలు చేతకావు.

శేషూబాయి:—ఏవి వినడానికీ నాకు తీరిక లేదు.

జగన్నాథం:—నన్ను మీరెప్పుడూ యింతవరకూ చూచి వుండకపోవచ్చు. నాపేరు జగన్నాథం. మీభర్తగారైన లేటుశ్రీ మానవరావుగారికీ నాకూ స్నేహం...తర్వాత లావాదేవీలుగూడను.

శేషూబాయి:—వినడానికి తీరికలేదని చెప్పటంలేదూ?

(జేబులోంచి చత్వారంసులోచనాలు తీసి పెట్టుకుని కాగితం చదువుతూ)...ఆన 1933 సంవత్సరం......

శేషూబాయి:—ఏమి [illegible]...మతివుందా లేదా?

జగన్నాథం:—మతా అండీ, అసలు దేవుడిచ్చింది కొద్దిగా వుంది. కాని అదికాస్తా-యీ కాగితాన్ని తల్చుకున్నప్పుడల్లా, చూచి [illegible]-మాయమవుతుంది.

శేషూబాయి:—(కోపంతో లేచి, కుర్చీకెనగ్గా నిల్చుని) పో, వెళ్లు యిక్కడనుంచి. పిచ్చివాళ్లతో నాకు పనిలేదు.

జగన్నాథం:— (ఆవిడేవంక నిదానించిచూస్తూ) నిజంగానే పిచ్చెక్కేనట్టుంది. రెండువేల రూపాయలు, కాస్తాకూస్తా, ఇవ్వాల్లిమను నుతుంటని తెలిస్తే యిచ్చేవాణ్ణా ప్రాణంపోయినా?

శేషూబాయి:—(మండువావేపు తిరిగి) పిన్నీ, నౌకర్నిపిలు. ఇతని పనిచెస్తాను.

జగన్నాథం:—బాయమ్మగారూ, క్షమించాలి, శేషూబాయమ్మగారూ, అసలు సంగతి చెప్తాను కొంచెం సావకాశంగా వినండి.



"ఇదిగో యిది ఆయన పోతూ నాకు ఉరిపోసి పోయినాడు"

అత్యవసరం అని, అదే పోలంకిస్తు చెల్లించాలనీ, ఇన్సూరెన్సు ప్రీమియం కట్టాలనీ, కారుకొనడానికి కొంతతక్కువైందనీ అంతా మొత్తం రెండు వేల రూపాయలు మానవరావుగారు నాదగ్గరనుంచిఅప్పు తీసుకున్నారు. ఇదిగో, దస్తావేజు. నేను కల్పించిందికాదు. తర్వాత మూడు నెల్లకు ఆయన చచ్చారు ... క్షమించాలి... కాలంచేశారు. ఈ ఆరునెల్లూ ఓపికపట్టి వూరుకొన్నాను. మీ గుమస్తాకు అయిదారుసార్లు చెప్పాను. నిర్లక్ష్యంగా వూరుకొన్నాడు. ఇకనాకు ఆగడానికి వీల్లేదు. ఎంచేతా......

జగన్నాథం:—ఆయన ఇక మూడునెల్లకు కాలంచేస్తాడనగా, అదే జూలై 10 తారీకున (అంటూ దగ్గరున్న కుర్చీలో చతికిలబడి, చేతిలోవున్న దస్తరం విప్పుతూంటాడు.)

శేషూబాయి:—(అతనివైఖరికి ఆశ్చర్యపోతూ) ఏమిటి అఘాయిత్యం? వినబడలేదూ, నాకు తీరికలేదని చెప్పాను?

జగన్నాథం:— (కాగితాలు సవరించి, ఓటి బయటికిలాగి) ఇదిగో యిది...ఆయన పోతూ పోతూ నాకు ఉరిపోసి పోయినాడు.

శేషూబాయి:—ఆయన అప్పు తీసుకున్న విషయం నాకు తెలీదు. నాతో ఎప్పుడూ చెప్పలేదు. దానికేం, యివ్వాలిసివుంటే తప్పకుండా యిస్తాను. కాని కాలంపడ్తుంది. మాకు రావలసిన వసూళ్లు రాలేదు. రేపు వస్తే, మా గుమాస్తా దస్తావేజు సరియైనదో కాదో చూసి, నిజమే అయితే, ఓ నెలలోపల డబ్బు అందజేస్తాను.

జగన్నాథం:—(ఆదుర్దాతో)ఓనెల కాదుగదా ఓరోజుకూడా ఆగడానికి వురవతులేదు. ఇక్కడికి 9 నెలలు నిండింది, ఒక్క పైసా

గూడ వస్తూలు లేదు. అయినా మీరు పెట్టిన నెల గడువుదాకా ఆగే వాళ్ళే. కాని నాకు చిక్కులన్నీ ఓమారుగా చుట్టుకున్నాయి. నేను బాకీ వున్న వాళ్ళంతా పీకుతున్నారు. రేపు ఆఖరురోజు. చెల్లించక పోతే నా దుకాణాల్లో సరుకులన్నీ బయటికి వేస్తారు. ఇంటికి మీదకు కూడా దండెత్తుతారు. అంచేతే మీదగ్గిరికి పరిగెత్తి వచ్చాను

శేషూబాయి:—(అతని తొందర్ధా ధోరణికి కొంచెం నవ్వు కుంటూ) అంతా నిజమే కావచ్చు. కాని రేపటిలోగా యివ్వలేను. కావచ్చు మీ కష్టాలన్నీ...నిజమే.

జగన్నాథం:—నా తోడు, క్షమించాలి మోటుమాటకి, పీకల మీదకి వచ్చింది. మీరు యిచ్చితీరాలి పైకం, తప్పదు.

శేషూబాయి:—తప్పదూ ఏమి టా ధిమాకి? నెలదాకా యివ్వడానికి వీలుపడదు. ఏమి టా మోటతనం, చెప్తూంటే?

జగన్నాథం:—మోటుతన మేమిటమ్మా. నాకు యివ్వాలి సింది అడుగుతున్నా నా, ధర్మం చెయ్యమంటున్నా నా అవసర మేమిటో గ్రహించారా? రేపు ఆవెధవలంతా నన్ను ముట్టడిస్తే ఏం చెయ్యను? (ఆవేశంతో) ఏంచెయ్యనంట?

శేషూబాయి:—ఏమి టా కేకలు? త్రోవా పోయేవాళ్ళంతా వింటారు.

జగన్నాథం:—వింటే విన్నీ. నాకే మంచిది. భయమా నాకు? ఆమాత్రం తెలీదు మీకూ.

శేషూబాయి:—అంతా తెలుసు. నెలలోపలగా దమ్మిడీ గూడా యివ్వడానికి వీల్లేదు. ఈ అవసరానికి ఎక్కడేనా సర్దుకో.

జగన్నాథం.—దమ్మిడీగూడ వీల్లేదూ? ఏం శాణాతనమమ్మా. ఆ బిక్కనీరుసేట్లమోస్తరు నేనేం వేలూ, లక్షలూ గదెలో నేల్లో పాతేసి దాచాననుకున్నావా?...(ఆవేశంతో) నాకు యివ్వాలిసిన తొత్తుకొడుకులు, క్షమించాలి మోటుమాటకి, ఒక్కడూ యివ్వడు. రమణమూర్తియింటి కెడితే ఊళ్ళో లేడన్నారు. నరసింహారావు దగ్గర కెడితే జబ్బుతో మంచంలో వున్నాడు. శేషాచలపతి, తల్లి చావుతో ఖర్చులోవున్నాను. నేనేం ఉరిపోసుకునేదా రేపు. ఇవ్వ లేకపోయినా నా. నామాట ఎట్లావున్నా, నావ్యాపారంఖ్యాతి కాస్తా మట్లుతుంది. బుద్ధి గడ్డితిని యీఅడ్డమైనవాళ్ళకీ అప్పిచ్చాను. వడ్డీమాట దేవు డెరుగున్నాడు. అసలుగూడా అంతర్ధానమయ్యేటట్టుంది. మీ రేమో యిట్లా ఏడ్పిస్తున్నారు నన్ను. వొళ్ళుమండిపోతోంది. బాయ- క్షమించాలి- శేషూబాయమ్మగారూ.

శేషూబాయి: — ఎందుకు వృథాగా గొంతుచించుకోడం? నా మనస్సు మనస్సులో లేదు.

జగన్నాథం:—"మనస్సు మనస్సులో లేదు!" నామనస్సు మనస్సులోవుందీ? యమదూతల్లాగ వచ్చిపడ్తారు, రేపు ఆ బాకీదార్లు. ఏడుకొట్టేసరికి తయారవుతారు, ప్రొద్దున. అరికాలిక్రింద నిప్పులుపోసి నట్టుంది. శరీరం, మనస్సు, మెదడూ, కళ్లు, సర్వం దహించుకుపోతున్నాయి. అబ్బా అబ్బా ఎల్లాంటి చిత్రకూటంలో యిరుక్కున్నాను. బోనులో యిరుక్కున్న ఎలుకపని నయం. బాయమ్మ, క్షమించాలి, శేషూ బాయమ్మగారూ, మీరు తప్పదు. ఇచ్చితీరాలి. ఏమైనా సరే.

శేషూబాయి:—అబ్బా! నీవెర్రితనం, మోటతనంతో నా మనస్సు యింకా చెదిరిపోతోంది. ఆఖరుమాట చెప్తున్నాను. నెల లోపుగా ఏమీఅందదు. కచ్చితంగా అంతే. గలభాచేసి లాభం లేదు.

జగన్నాథం:—(కోపంతో వొణుకుతూ) ఆఖరుమాటేనా అది?

శేషూబాయి:—ఆహా. ముమ్మాటికి.

జగన్నాథం:—అందాకా నన్నేంచెయ్యమంటారు? రేపు వాళ్ళ కేం బదులుచెప్పను? నాఅవస్థ కాస్తయినా ఆలోచించారా. మీమాటే మీకా? మెల్లిగాచెప్తూంటే తెలీటంలేదు కాబోలు. ఆఖరుమాట నేను చెప్తున్నాను. పైకిచ్చిందాకా యిక్కణ్ణుంచి కదలను-ఏంచేస్తారో చూస్తా.

శేషూబాయి:—మరిపిచ్చా దున్నపోతువా చెప్తూంటేను-అసలు దాన్ని ఒక్కటెనుచేసి ఏమిటి దౌర్జన్యం? మర్యాద తెలీదు బుద్ధిలేదు.

జగన్నాథం:—(ఆగ్రహంతో లేచి, క్రోధ చూపులతో) నేను ఓపికపట్టి వింటున్నాను. ఏమిటమ్మా మాటలు మిగలడం. పైబ్బా యిచ్చి, మాటలూపడ్తానా? చూస్తాను ఎవరడ్డంవస్తారో. చస్తేకదలను యిక్కడనుంచి. (కొట్టవచ్చేటట్టుగా చెయ్యిఆడిస్తాడు.)

[శేషూబాయి కెవ్వనకేకవేసి, ప్రక్కనవున్న మెట్లమీదించి, గబగబ మేడిమీదికిపోతుంది...లోపలినుంచి రత్నాబాయి ప్రవేశించి, చీకటిగావుండటం చూచి, స్విచ్ నొక్కుతుంది. హాలుమధ్యనున్న అగ్రా చలవజాతిడోములో లైటు వెలుగుతుంది. జగన్నాథం రొప్పుతూ కుర్చీలోవుంటాడు. ఆవిడే సుమ్మానికి అనుకొని మెల్లగా...]

రత్నాబాయి:—ఏమిటయ్యా, యిందాకటినుంచీ వింటు న్నాను, మహారభస చేస్తున్నావు. పరాయిస్త్రీతో మాట్లాడుతున్నా ననే భీతేనా లేకుండా యిష్టమొచ్చినట్టు వాగుతున్నావు. అమ్మాయి చెప్పింది తెలీడంలేదు. ఒంటరిది ఏంచేస్తుంది. గుమాస్తా వచ్చిం తర్వాత,........

జగన్నాథం:—(విసుగుతో) చాలు, చాల్లేవమ్మా—నీతులు చెప్పవచ్చావు. అసలు ఆవిడెఅయిండి, యిహనీవు. ప్రాణం మీది కొచ్చినేనువస్తే, ఏమిటే మర్యాద?

రత్నాబాయి:—ఏమిటయ్యోయ్, మాటలు సరిగా రానియ్యి. ఎవ్వరనుకున్నావో, ఏమిటో, పోలీసును కబురంపించి, అమాంతం గెంటిస్తాను బయటికి. అసలు ఎవరి అనుకూలంమీద వచ్చావులోపలికి ?

జగన్నాథం:—(లేచి, చేతుల్తో కసరతుచేస్తూ) పో, పోవమ్మా. ఇల్లాంటివాళ్లను చాలాచూశాను. కోమట్నిగదా బెదిరిస్తే చాలనుకున్నావేమో. రానీ, పోలీసులు రానీ, ఏంచేస్తారో చూస్తాను. (చేతులతో బెదరిస్తాడు... రత్నాబాయి గూడ కవ్వున కేకవేసి లోపలికి నిష్క్రమిస్తుంది.)...అబ్బ...ఈదినం ఎక్కడికిపోయి బాకీవసూలు అడిగినా యిట్లాగే చుక్కెదురౌస్తోంది. తెల్లవారి లేచి ఎవరిమొహం చూశానో. ఇష్...రామ, రామ. అరిచి అరిచి గొంతుగూడ ఆరిపోతోంది. మనస్సు బేజారయింది...వెలఆగాలిట. వెలగాదు ఒక్కక్షణం ఎల్లా? తెల్లవారితే వచ్చిపడ్తారు. రెక్కలుకట్టుకుని రాత్రే ఎక్కడికేనా ఎగిరిపోనా? ఏమంత్రగాడిదగ్గరకైనా వెళ్లి బుట్టలో దాగి మాయమైపోనా? దిక్కుమాలినలోకం, పోనీగదా కష్టాల్లో వున్నారని అప్పిస్తే, యిదీ పితలాటం. ఇదిగదా అవస్థని ఎవ్వరికీ యివ్వకపోతే వడ్డీనష్టం. అబ్బ! వొళ్లంతా మండిపోతోంది. ఏంచెయ్యను ఏంచెయ్యను? మనస్సు బాగుళ్లేదుట ఈవిడెగారికి. నామనస్సు బాగుండి చచ్చింది. ఆశది అయిపోయిందిగాని, మీదపడి రక్కేద్దును, కొరికేద్దును. అట్లా అనిపిస్తోంది నాకోపం (పైనగదిలో సంభాషణ జరుగుతోంది. మాటలు స్పుటంగాలేవు) అదిగో ఆడాళ్లు యిద్దరూ ఏవో గుసగుసలు ప్రారంభించారు. కొంపతీసి చావగొట్టరుగద యిద్దరూ కలిసి. లేకుంటే పోలీసుల్ని పిలవనంపలేదుగద. వున్నదంతా చాలక మరోకష్టంగూడా వస్తుంది. అయ్యో బాబోయ్! చల్లగాజారి యింటికి పోనేమిటి? పోతే, అదేగోడవతిరిగి, ప్రొద్దున్నే సిద్ధమవుతారు ఆనుంకలంతా. ఇహ ఆగరు.

(ఇంతలో మెట్లమీద కాళ్లచప్పుడు. తర్వాత మాటలు. "అమ్మాయి! నామాటవిను. వొద్దు. ఆపనివొద్దు. వాడు మోటమనిషి." "ఫర్వాలేదు, పిన్నీ, నాకుతెల్సు ఏంచెయ్యాలో.")

బాబోయ్, ఏదో కొంపమునిగేందుకే వచ్చింది. కానీ. యిందాకా వచ్చి బెదిరిపోతే ప్రయోజన మేమిటి?

(శేషూబాయి మెట్లుదిగివచ్చి అక్కడున్న ఆర్చినంటి, తిలోత్తమ పోజులో నిల్చుంటుంది. తల్లో గంపెడు మల్లెపూలు. బంగారు నక్కి రోజాసిల్కుచీరెలు ఎలెక్ట్రిక్కు కాంతిలో ధగధగా మెరుస్తోంది. నాటకంలో నటకురాలు మోస్తరు, సినీమాలో నాయకురాలు మోస్తరు చమకుతో, భావవివశతకల్గించే వయ్యారంతో, చక్కిలిగిలిపెట్టే చూపులతో నిల్చుంది...జగన్నాథం ఒక్కమారుగా నిర్ఘాంతిపోయి. గుడ్లు మిటకరించి, నిదానించి రెప్పవాల్చకుండా చూస్తూంటాడు, కనపడేవ్యక్తి నిజమా కల్లా అని.)

బాయి:—ఊఁ.

జగన్నాథం:—ఆఁ

శేషూబాయి:—

జగన్నాథం:—క్షమించాలి,

శేషూబాయి:—తర్వాత.

జగన్నాథం:—(తడబడుతూ) క్ష-మిం-చా-లి.

శేషూబాయి:—(వెక్కిరింపు నవ్వుతో) ధైర్యమంతా-

జగన్నాథం:—మాయమైంది.

శేషూబాయి:—ఎంచేతో?

జగన్నాథం:—(తనలో) చచ్చినంత వొట్టు, యింతవరకెన్నడేనా యీలాంటి పిల్లనిచూస్తే! ఇందాక చీకట్లో ఆ నల్లచీరలో వుంటే ఏమీ గుర్తించలేకపోయినాను ఈవిడె అందాన్ని! మనుష్యులు అందంగా వుంటారని తెలుసుగాని యింతా? ఇదేమిటి, వొళ్లంతా కంపరమెత్తుతోంది. ఏం వాగుతానో కొంపతీసి. డబ్బురాకపోతే పోయింది గాని, తస్సాదియ్యా కళ్లతనివి తీరుతోంది.

శేషూబాయి:—(కొంచెం ముందుకువచ్చి పైట ముందుకూ, వెనక్కూ విసురుతూ) ఏమిటి ఆలోచన?

జగన్నాథం:—(గాబరాతో ఏ-ముం-దీ

శేషూబాయి:—అయినా?

జగన్నాథం:—మీరేనా అని చూస్తు-న్నా-ను.

శేషూబాయి:—నేనుగాక మరి?

జగన్నాథం:—నిజంగా చె-ప్తా-ను.

శేషూబాయి:—తెలుసు-చెప్పబోయే దేమిటో.

జగన్నాథం:—క్ష-మిం-చా-లి.

శేషూబాయి:—తర్వాత?

జగన్నాథం:—మాట రావ-డం-లే-దు.

శేషూబాయి:—రానీవద్దు.

జగన్నాథం:—(వణుకుతో) ఇంత-అం-దం-నే-నెక్క-డా

శేషూబాయి:—నా అందంతో నీకేం పని?

జగన్నాథం:—క్ష-మిం-చా-లి. ఆగక-చెప్తు-న్నా-ను.

శేషూబాయి:—ఆడవాళ్లని ఎప్పుడూ చూడలా?

జగన్నాథం:—చూ-చా-ను. మా-బట్టల-సాపుకు వస్తూంటారు చాలా-మంది.

శేషూబాయి:—మరి?

జగన్నాథం:—కాని-ఇ-ల్లాం-టి-అం-దం-ఎప్పుడూ,

శేషూబాయి:—చాలు అంతటితో ఆగమ్మ.

జగన్నాథం:—క్ష-మిం-చా-లి. ఆ-గ-క

శేషూబాయి:—వచ్చిన పని?

జగన్నాథం:—పూ-ర్తిగా మరిచిపోయి-నా-ను. అది-త-ర్వా-త చూడవచ్చు

[illegible]యి:—అందాకా?

[illegible]ం:—మీ-దయ-[illegible]-అ-[illegible]

శేషూబాయి:—(రెండుచేతులతోనూ- జడలోపూలు సవరించుకుంటూ- రెండు [illegible]లు ముందుకువేసి-) ఎంత-మొత్తం?

[illegible]థం:—(ఆవిడ[illegible] [illegible], అప్రయత్నంగా)

[illegible]బాయి:— (పెదవులమీద చిరునవ్వు [illegible]) ఏమిటి

జగన్నాథం:—అబ్బా!-ఏం-చెప్ప-ను.

శేషూబాయి:—మొత్తం?

జగన్నాథం:—దానికేం గానీండి, శేషూబాయమ్మగారూ, నాకళ్లు ఎంతో పుణ్యంచేసుకున్నాయి, యివ్వాళ! నాతోడు-క్షమించాలి, నిజం చెప్తున్నాను- మిమ్మల్ని- యీ విధంగా- యింత అందంతో- మొదలే చూచివున్నట్టయితే- నిజం చెప్తున్నాను. ఆవిధంగా, కటువుగా- మోటుగా- మాట్లాడకపొయ్యేవాణ్ణి.

శేషూబాయి:—అంటే- అందమైన ఆడవాళ్లతో ఎట్లా మాట్లాడాలో తెలుసన్నమాట.

జగన్నాథం:—యథార్థం చెప్తున్నాను- బాయమ్మ- క్షమించాలి- శేషూబాయమ్మగారూ- ఇప్పుడంటే- ఏళ్లువచ్చి మీద పడ్డాయిగాని- ఒకప్పుడు నేనూ- వయస్సుతోనూ, వయస్సుయొక్క ఆవేశంతోనూ మిలమిల లాడుతూండేవాణ్ణి. కనీసం ఎనిమిదిమంది పిల్లలతో నేనా ప్రేమసాగరంలో యీదివుంటాను. మామూలు రకంవాళ్లుగాదు సుమండీ- కవులు వర్ణిస్తారే- అలాంటి అందం- పోకడలు గలవాళ్లు. కాని ఒక్కమాట చెప్తాను. అనుభవంవల్ల. ఆడదానంత-చంచలత్వంగలదాన్ని మరోటి ఎరగను- క్షమించాలి. ఏంచేతా?

శేషూబాయి:—పాపం! విచారకర మైన విషయమే! ఎవరుండుసురు మోసం చేశారుగా?

జగన్నాథం:—ఆశాభంగమే కాకుండా, మనోవ్యథే కాకుండా పై సాహుకారా మోసం. కనీసం ఎనిమిదివేలేనా తగలేసివుంటాను, ఆ ఎనిమిది పాదరసంబుడ్లమీదా. నమ్ముతారో లేదో.

శేషూబాయి:—పాపం, అంచేతే కా బోలు! ఆడవాళ్లంటే భిన్నాభిప్రాయం. స్త్రీలంటే మా ఆయనకు అమితాభిమానం.

జగన్నాథం:—మీరు లభించడం కేవలం ఆయన పూర్వ జన్మ సుకృతం. కాని విధివశంచేత ఆట్టేకాలం మీకు సౌఖ్యం యివ్వడానికి......పాపం! నోంటరిదాన్ని జేసి యీచిన్నవయస్సులోనే, విడిచివెళ్లాడు...పాపం!...ఎంత యీడు? క్షమించాలి- ఆగక అడుగుతున్నాను.

శేషూబాయి:—నా వయస్సుతో నీకేం పని? పాతికేళ్లనుకో,



"ఏమిట్రా చేస్తున్నావు" అని గర్జిస్తూ

## కా. నాగేశ్వరరావు పంతులుగారి యభిప్రాయము

MADRAS, 7TH APRIL 36.



I saw "Chinnamamba Andhra Mudralekhini" while in working operation. It is a difficult task to invent a Typewriter in Telugu Language with 600 letters with varied sizes and sounds. A long felt want in Telugu language is fulfilled by the Ch. A. Typewriter. The typewriter deserves all the encouragement from the officials, scholars and businessmen.

(Sd.) K. NAGESWAR ROW.

## యస్. రాధాకృష్ణన్‌గారి యభిప్రాయము

WALTAIR, 6-3-1936.



I tested this typewriter and found it quite ingenious. The Telugu Alphabet is somewhat complicated and its difficulties are overcome in a striking manner. This pioneer attempt deserves every encouragement.

(*Sd.*) S. RADHAKRISHNAN,
*Vice Chancellor*, ANDHRA UNIVERSITY.

## చిన్నమాంబాంధ్ర ముద్రాలేఖిని

ఆంధ్రభాషావధూటికి ధాత వత్సరపుకానుక.

# తెలుగు టైపురైటరు




ప్రస్తుతము 100 మిషనులు మాత్రమే వచ్చినవి. కావలసినవారు వెంటనే త్వరపడుడు. ఆలసించిన ఆశాభంగము.

**చిన్నమాంబా నిలయము,**
త్యాగరాయనగరము, మద్రాసు.

## కట్టమంచి రామలింగారెడ్డిగారి యభిప్రాయము

CHITTOOR, 11-2-'36



I examined and tested by dictating very difficult words the Telugu Typewriter of Chinnamamba N i l a y a m. I was quite surprised at the faultlessness a n d excellent reproduction. I think this typewriter is a marvellous achievement.

C. R. REDDY.

## వి. కృష్ణరావుగారి యభిప్రాయము

MADRAS, 29—2—'36.



I have pleasure in certifying that I have seen the Chinnamamba Andhra Mudra Lekhini machine designed by Raja Kumar of Pithapuram, at work, and found it quite original and as efficient as any English Typewriter. As precious acquisition to the Telugu Language I am sure it will prove very useful for purpose of office or private correspondence in Telugu.

(Sd.) V. KRISHNA ROW,
Telugu Translator to Govt. Madras.



అ. భా. జాతీయమహాసభా కార్యనిర్వాహకసంఘసమావేశము, చెన్నపురి.



౧౫వ ఆంధ్రరాష్ట్ర మహాసభ, విషయనిర్ణయసంఘము, కాకినాడ.



15-వ ఆంధ్రరాష్ట్ర మహాసభ, కాకినాడ; పతాకాప్రతిష్ఠానంతరము,



౧౫-వ ఆంధ్రరాష్ట్ర మహాసభ, కాకినాడ; పతాకాప్రతిష్ఠకు పూర్వము.

# శ్రీ అరవింద జీవితము

వీరిజీవిత మింతవఱకు నేభాషయందు నింతవివరముగా ప్రకటింపబడలేదు.

ఇందు వీరిజీవితవిశేషములు, వీరియోగము, ఆశ్రమవిషయములే గాక

వీరి జాతకము, ధర్మపత్రికి ౧౯౦౯లో వీరువ్రాసిన అద్భుతలేఖలు

'స్వాతంత్ర్య నిర్వచనము', 'జాతీయత', 'ప్రాచ్యులు - పాశ్చాత్యులు'

అను శీర్షికలక్రింద వీరా కాలమున రచించిన వ్యాసముల

కనువాదములు, వీరి ఉత్తరపరోపన్యాసము,

౧౯౦౯ లో వీరుప్రకటించిన నాదేశీయుల కొకబహిరంగలేఖా సంగ్రహము

మున్నగువిషయము లెన్ని యోగలవు.

శ్రీ అరవిందుల, ఆశ్రమకట్టడముల ఫోటోలు గలవు.

ఫెదరువైటుపేపరు — పెద్దక్షరములు — చక్కనికూర్పు — వెల ౧-౦-౦.

# శ్రీ అరవింద దర్శనము

శ్రీ అరవిందుల అపూర్వ తత్త్వసారమంతయు నిం దున్నది.

లైఫ్‌డివైన్ - (Life Devine) అను తమగ్రంథమున శ్రీఅరవిందులే

సంగ్రహముగా రచించినభాగము ననుసరించి

బ్రహ్మశ్రీ వేలూరు చంద్రశేఖరంగారు వ్రాసినారు

శ్రీ

అరవిందులు స్థాపింపనెంచు దివ్యజీవనము, భాగవతజీవనము, స్వర్గరాజ్యము ఏదో

ఆదివ్యపరిణామ మెట్లురాగలదో ఈగ్రంథమును పఠించినవారికి తెలియగలదు.

తత్త్వజిజ్ఞాసగలవారందఱు చదువవలసినగ్రంథము.

ఫెదరువైటుపేపరు — పెద్దక్షరములు — చక్కనికూర్పు - వెల ౧-౦-౦.

ఈ గ్రంథముల విక్రయధనము శ్రీ అరవిందులకు సమర్పింపబడును.



మతి ఆర్. సుబ్బమ్మగారు, బి. ఏ.
ప్రథమ వైశ్యపట్టభద్ర, మదనపల్లి తియసాఫికల్ కాలేజి విద్యార్థిని.



అత్యం సత్యవతీదేవిగారు.
డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పడమటి గోదావరిజిల్లా.



డా. సుమిత్రాబాయి శ్రీఖండే.



శ్రీమతి అంగులీయబాయి, ౧౯ సం. వయస్సు
కస్టమ్సుశాఖ అప్రైసరు వి. యస్. చినసామిగారి కూతురు.
విమానముల నడపుటకు నేర్చుకొన్న భారతీయ యువతి.



శ్రీమతి కుముదమ్మాళు, ౧౯ సం. వయస్సు
చెన్నపురి అడ్వకేటు వి. యల్. నరసింహాచారియారుగారి కూతురు.
విమానములను నడపుటకు నేర్చుకొన్న భారతీయయువతి.



శ్రీమాడపాటి హనుమంతరావుగారు,
నిజామురాష్ట్రాంధ్ర మహాసభాధ్యక్షులు.



శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మగారు,
నిజాంరాష్ట్రాంధ్ర చతుర్థ మహిళాసభాధ్యక్షురాలు.



డా. అచ్చమాంబగారు,
ఆంధ్రరాష్ట్ర మహిళాసభాధ్యక్షురాలు, గుంటూరు.



శ్రీ బి. కామేశ్వరమ్మగారు,
ఆంధ్రరాష్ట్ర మహిళాసభాధ్యక్షురాలు, కాకినాడ.

# లక్ష్మి

## ముందుకు నడచుచున్నది

దాని పదకొండవ యేడు పూర్తియగుచున్నది.

ఈలోపుగా

**ఒకకోటి యిర్వైలక్షల రూపాయల వ్యాపారము జరిగెను.**

భద్రత, సుస్థిరత్వము యీ రెండును

**కంపెనీయొక్క నిరంతర అభివృద్ధికి మూలకందములై యున్నవి.**

# లక్ష్మీ యిన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్,

**లాహోరు.**

## Aletris Vibro Asoka
## (హేమపుష్ప)

ఇది గర్భాశయము గర్భకోశములకు సంబంధమైన సకల రోగములను పోగొట్టును. స్త్రీల వ్యాధులకు శ్రేష్ఠమైన ఔషధము. ఋతుకాలములో స్త్రీలకు కలుగు శూలలును, గర్భాశయము తనస్థానమునుండి తప్పినపుడు కలిగే బాధలును, ప్రసవము, గర్భస్రావము, గర్భపాతము, వీనికి సంబంధించిన సకల ఉపద్రవములను తగ్గించును. సూతికానొప్పిని పోగొట్టును. అండకోశ సంబంధమైన సకలవ్యాధులను గుణపరచును. ఋతువు అధికముగ వెడలుట, కొంచెముగా వెడలుట, తెలుపు, ఎరుపు, మిశ్రమకుసుమలు, రజోదోషములు, గర్భాశయము జారుట, గర్భస్రావముచే కలుగు దోషములు, జననేంద్రియ సంబంధమైన కొన్నిపుండ్లు, సోమరోగము, బలహీనము, నడుమునొప్పి, దేహముకృశించుట తగ్గించి, స్త్రీకి వకవిధమగు అందమును, రక్తవృద్ధి పటుత్వమును కలుగచేసి, గర్భాశయ దోషములను పోగొట్టి సంతానము కలుగుటకు మార్గములు ఏర్పడ గలదు. ఔన్సుల సీసా రు. 1-8-0.

మావద్ద శాస్త్రీయమైనట్టియు, నమ్మకమైనట్టియు, ఆయుర్వేదౌషధములు చౌకయైన ధరలకు దొరకును.

కేటలాగు ఉచితము.

**ఈశ్వరఫార్మసీ, పాలకొల్లు.**

*Take a trial of Shelat Ink!*

Patronised by Imperial Banks of India, Madras Circle, Colleges, Indian & European Firms For quality & Price.




FOR DURABILITY & EASY FLOWING

Appreciated by University Vice-chancellors.

*Manufactured by*

**SHELAT BROS.,**

**China Bazar, MADRAS & ANAND.**

Agencies open everywhere

ఈస్టు ఇండియా ఫిల్ముకంపెనీవారు వ్యయప్రయాసలకోర్చి
తయారుచేసిన రెండు గొప్ప పౌరాణిక ఫిలుములు

# డైరెక్టరు: సి పుల్లయ్యగారు.

## సతీ - అనసూయ మరియు ధృవ - విజయము

పసిపిల్లలు పాల్గొన్న ఫిల్మురాజము.

ఆంధ్రదేశమందలి నటీనటులు పాల్గొన్న ఫిల్ము.

డబుల్ ప్రోగ్రాముగా ఒకేసారి ఈ దిగువస్థలములందు
ప్రదర్శింపబడును.

మదరాసు, బెజవాడ, రాజమండ్రి,
విశాఖపట్టణం, విజయనగరం, సికింద్రాబాదు.

తయారుగాయున్న
నూతన హిందీ, ఉరుదు ఫిల్ములు.

బిద్రోహి
మర్డరర్
కైబర్-పాస్

తయారగుచున్న
గొప్ప ఫిల్ములు.

సూర్ వాడట్
గోల్డన్ వరల్డు
భాగిసిపాయి

ఇప్పుడే వచ్చిన టాకీపరికరములు - క్రొత్త మాడల్సు.

**ఆర్. సి. ఏ. సౌండ్ హెడ్సుతో సింప్లెక్సు ప్రొజక్టరులు.**

1000, మరియు 2000 అడుగుల మాగజీన్సు - వాటికి సరుసగా
11, 15 వాట్సు యాంప్లిఫయర్సు అమర్చబడియున్నవి.

Apply Sharp:—

**CHAMRIA TALKIES DISTRIBUTORS,**

Telegrams: "Chamria." Telephone: 2675.

20, Vepery High Road, P. T. Madras.

జగన్నాథం:—నిజంగా కనిమిదని నేను నిశ్చయించు కున్నాను. ఎందరో హిందూస్త్రీలనో చూచాను. పాతికేళ్లకే అర డజనుపిల్లల్నికని, క్షమించాలి...యాభైఏళ్ల ముసళ్లు అవుతారు. అయితే సంతాన మేమీ కల్గలేదు గాదూ!

శేషూబాయి:—లేదనుకో...అ పైన ?

జగన్నాథం:— చొరవకు క్షమించాలి... మగవరో ప్రగారికీ నాకూ రెండే స్నేహగీత్యా...పాపం- మీరిట్లా వొంటరి అయినారే అని...

శేషూబాయి:—ఒంటరినైన మాట నిజమే...కాని తుంటరిని మాత్రం కాలేదు. (రెండడుగులు ముందుకు నడుస్తుంది.)

జగన్నాథం:— రామ, రామ...నే నా అభిప్రాయంతో ఏమన్నా అంటే నాలుక తెగ్గోసుకొంటాను.

శేషూబాయి:— అవునవును, నాకు తెలుసు...(నీలపు బల్బు వున్న స్విచ్ నొక్కుతుంది. నాటకంహాల్లో మోస్తరు, హాలంతా వింత రంగుతో నిండిపోతుంది. ఆకాంతిలో శేషూబాయి కళ్లను మెరపిస్తూ అతనికి అడుగుదూరంలోకి పోయి)...ఎంత మొత్తం అన్నారు. ఇచ్చే ఏర్పాటుచేస్తాను త్వరగానే.

జగన్నాథం:—(అందుబాటుదూరంలో తళుక్కుమంటున్న ఆ అపూర్వదృశ్యానికి గాబరాపడి తత్తరపాటుతో) ఆఁ- దానికేం లెండి ... తర్వాత చూడొచ్చు. అబ్బా. (మిటకరిస్తాడు.)

శేషూబాయి:—(అతని ఆవేశాన్ని గమనించనట్టుగా, అతను యిదివరదాకా కూర్చున్నకుర్చీవిరిగున్న కాగితాలకట్టలో పైదాన్ని తీసి చూస్తూ) ఓహో ఇది మాఆయన పుస్తకమే. నాకు తెలుసు... (చదువుతూ) రెండువేలు...నాతో ఎప్పుడూ చెప్పనైనా లేరు. (కాగితాన్ని ఇంకా తిలకిస్తూ, ఎక్కువ వెల్తురుకోసం ఓరగా తిరుగుతుంది. ఆ తిరుగుడులో ఆమెవాలుజడ జగన్నాథం బుజానికి కొట్టుకుంటుంది. కదలికలో కల్గినగాలికి పైట చెరుగుఎగిరి అతనిశరీరాన్ని స్పృశిస్తుంది..... ఆ అపూర్వ స్పర్శసౌఖ్యంలో వొళ్లుమరచి, శేషూబాయిమీదకు వెనకనుంచి వొరిగి—చుంబనక్రీడకు దిగుతా మా లేదాయని ఊహిస్తుంటాడు......

శేషూబాయి ప్రోనోటును చూస్తున్నట్టుగానే వుండి, చప్పున దాన్ని ముక్కలు ముక్కలుగా చింపి గభాలున వెనక్కు తిరిగేసరికి జగన్నాథం డీకొంటాడు...లేనిపోనికోపం తెచ్చిపెట్టుకొంటూ)......ఏఘట చేయబోతున్నావ్ బద్మాష్ ...(అని ఉరిమేసరికి అతను నిలువెల్లా వొణికి—క్షమాపణసూచకంగా కొంగుపట్టుకొని "ఒక్కమారు, దాంతో లాలోచీ-రాజీ" అంటూంటగా—తటాలున ప్రక్క తలుపు తెరుచుకొని "ఏమిట్రా చేస్తున్నావు" అని గర్జిస్తూ నరహరి దుడ్డుకర్రతో ప్రవేశిస్తాడు. జగన్నాథం కుక్కిన పేనులాగా ప్రాణాలు బిగబట్టుకొని సింహద్వారంవేపు మెల్లగా దారితీస్తుంటగా, చింపిన కాగితంముక్కల్ని అతనినెత్తిమీద విసిరి, శేషూబాయి మందువానైపు వెళ్తుంది......జగన్నాథాన్ని వాకిట్లోకి తరుముతూ—)

నరహరి:—ఓరిశెట్టీ...యింతధైర్యంవచ్చిందిగా, మూడేళ్లనుంచీ ఆశతో కనిపెట్టుకుండి, యీ ఆరునెల్ల



నరహరిదుడ్డుకర్రతో ప్రవేశిస్తాడు."

నుంచీ అడ్డమైనచాకిరీ చేస్తూ, ప్రేమభిక్షను ఆశిస్తూన్న నే నిట్లాగే వున్నానూ...మధ్య పానకంలో పుడకలాగు నువ్వొచ్చావూ?... రాజీ బాగానే అయిందిలే...పో...ఎక్కడన్నా యీప్రస్తావన బిగ్గరగా అన్నావా అంటేచూడు (లాటీఆడిస్తూ) దీంతో నడ్డివిరిగిపోతుంది. ప్రాణాలతో పోతున్నావు...గుళ్లో కొబ్బరికాయలు కొట్టు...పో

రత్నాబాయి:—(ఉద్వేగంతో లోపలికివస్తూన్న శేషూబాయిని కలుసుకొని) ...ఎంత ఘోరకార్యం శేషూ...వెనుకా ముందూ ఆలోచించకుండా ఆకోమటాడితో అంతసేపు...అః- ఏం మాట్లాడావు...ఏంచాశావు......బయటికిపోయి వాడు చాటిస్తే... పరువూ మర్యాదా- ఏమన్నా -అః- కల్పించుకు మధ్యవస్తామా అంటే, వాడు మోటమనిషి, ఏంచేస్తాడో అని భయంతో వూర్కొన్నాను- ఏంపని శేషూ యీవేషం నువ్వూ.

శేషూబాయి:—పిన్నీ, నేనేం మతిమాలినదాన్ని అనుకున్నావా? ఆత్మగౌరవం, నీతినియమం తెలియనిదాన్నా? ఆకోమటి పిరికి, అల్పసంతోషీ అని నాకుతెలుసు. చూపుల్తోనే కరిగిపోయి, శీతలించే రకం. అదిగోచూడు చింపిన దస్తావేజు కాగితలు... ఒక్కటక్కరు ఎత్తుతో రెండువేలు రాజీ, పొదువు... ఇక వాడు తలక్రిందుగా తపస్సుచేసినా, ప్రయోజనంలేదు... ఈలాభానికి నేనేమన్నా తిరిగి వాడికి యిచ్చాననుకున్నావేమో?... ఇదిగో సొంప చూడు, తడన్నా తాకలేదు. సమయానికి కంగారుపడేసి, కార్యం సాధించాను. కాదూ?

రత్నాబాయి:—మా అమ్మే...ఎంతపన్నాగంజేసి నెగ్గావూ? ...కొంసమాత్రమే తాకించి కొనసాగించావు కార్యం.

నరహరి:—అంతకు పైగాపోతే గూడా తప్పులేదుగా మీలో ...తపస్సుచేస్తూ కొన్స్టిట్యూషనులు ప్రొసీజరుకోసం కనిపెట్టుకున్న నే నిట్లాగే వున్నాను. అరగంటక్రితం వచ్చి బెదిరించిన ఆవెధవాయకు మిలమిలచూపులు, పైటకొంగుతాకుడు, ముసిముసి నవ్వులూ, కిలకిల మాటలు, ఉపోద్ఘాత చర్యలన్నీని! న్యాయమార్గాలకి రోజులా యివి? కాలమహిమకాదూ? రాజీటు, లాలోచీ అనరాదూ!.

## అలవాటు ౧.



జేబుదొంగ పరధ్యానముతో తనజేబునేతాను ——

# ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి కొన్ని సూచనలు

**—దేశిరాజు రామదాసు—**

పదియవ శతాబ్దమునుండి ౧౯౩౫సం.వరకు గలకాలములో నుద్భవమందిన గ్రంథములను సింహావలోకనము గావించుచో, నింకను తెలుగుభాషయందలి గ్రంథరచన ప్రారంభదశయందే యున్నట్లు విస్పష్టము కాగలదు. పందొమ్మిదవ శతాబ్దమున వీరేశలింగముగారు జన్మించినవఱకును గల వాఙ్మయములో నొక్కశాఖయైన పద్యవాఙ్మయమే యభివృద్ధి నందుచువచ్చినది. ఆ వాఙ్మయమైనను వివిధ వాహికలతో ప్రవహించినదనుటకు వీలులేదు. పురాణములు, ప్రబంధములు, శతకములు. వానియందైనను ఒక్కొక్క తెగకు చెందిన యుత్కృష్ట గ్రంథములు ఇరువది యిరువదియైదునకు మించియుండవు. ౧౯౨౧ సం. నందు ఇంగ్లీషుభాషలో ఒక్క నవలలే పదునొకండువేలు వెలువడినవి. అట్టియెడ ౧౯౨౦ సం.వరకు గల తెలుగువాఙ్మయము పరిశీలించినచో పట్టుమని పదివేల గ్రంథములు లేవు. అందులోను ముక్కాలు మువ్వీసమునకుపైని 'నూకాలమ్మ దండకము', 'పోలేరమ్మదండకము', 'అచ్చన్న శతకము', 'బుచ్చన్న శతకము' మొదలైనవి. ఇట్టివానివలన వాఙ్మయాభివృద్ధియైనదని యెవ్వ రనగలరు? "అంతా కవులముగామా! అంతింతగ కందపద్య మల్లగలేమా?" అన్నలోకోక్తిని సార్థకపరచుటకు పుట్టినవేగాని వేఱుకాదు.

పందొమ్మిదవ శతాబ్దమువఱకు కవిత్వమొకటే కాల్వలో ప్రవహించుటకు కొన్ని కారణములు కలవు. అప్పటివఱకు కవీశ్వరులకు కొద్దియో, గొప్పయో రాజపోషణ ముండినను లేఖనసౌకర్యమును, ప్రచురణ సౌలభ్యములు నుండెడివికావు. అదిగాక కవీశ్వరులను పోషించువారి యభిరుచినిబట్టియు కవిత్వమునకు శృంఖలము లేర్పడెను. కావున నంతవరకు గల లోటు క్షంతవ్యము.

పందొమ్మిదవ శతాబ్దమున వీరేశలింగముగారు కవితాప్రవాహమున కానకట్టుకట్టి అనవసర సాగరసంగమునుండి తప్పించి వివిధమైన కాల్వలగుండ ప్రవహింపజేసి ప్రజోపయోగమునకు బనికివచ్చునట్టుగా వాఙ్మ[illegible] బునాదిరాయి [illegible]చిరి. కాని నిజమైన ప్రారంభదశ ఇరువదియవ శతాబ్దముతోడనే ప్రారంభమైనదని చెప్పవలెను. ఈ ముప్పదియైదు సంవత్సరములనుండియు వాఙ్మయసౌధమునకు బునాదు లేర్పడుచున్నవేగాని నిజమైన యభివృద్ధి లేదు. విజ్ఞానచంద్రికాగ్రంథమండలి, ఆంధ్రభాషాభివర్ధనీసమాజము, సరస్వతీ గ్రంథమాల, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, వేగుచుక్క గ్రంథమాల మొదలైనవన్నియు భాషయం దొకవిధమైన సంచలనమును గలిగించినమాట నిశ్చయము. అయినను విజ్ఞానచంద్రికాగ్రంథమండలివారి గ్రంథములు తప్ప భాషకు నిజవికాసమును, శాశ్వతత్వమునుగూర్చు గ్రంథములు పొడమలేదనియే చెప్పవచ్చును. కాని యీ దరిమిలా నెలకొల్పబడిన యాంధ్రగ్రంథమాలయు కొంతవఱకు స్థిరత్వమువహించు గ్రంథములను ప్రకటించుచున్నది. ఈ సందర్భమున సంవత్సరాది సంచికలును ఏటేట ప్రకటింపఁబడు ఆంధ్రపత్రికానుబంధ గ్రంథములుగా నూహించునది.

ఏదెట్లయినను ప్రస్తుతము ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ మొదలగు పాశ్చాత్యభాషలతో సరిపోల్చుకొనుట మన తలకు తగని పనియైనను మన హిందూదేశమునందలి బంగాళి, మరాటి, గుజరాతి మొదలగు భాషలతో సరిపోల్చుకొన్నను మన భాషయందలి గ్రంథరచన షాభా సౌధముయొక్క ప్రథమసోపానమునం దున్నదని చెప్పుటకు మిక్కిలి విషాదము గొల్పుచున్నది.

దీనికి కారణ మేమి? గ్రంథకర్తలా? దేశముయొక్క ఆర్థిక దుస్థితియా? ప్రజలయందు విద్యాసక్తి లేకనా? తగినప్రచారము గావించు సాహసికులైన విద్యాప్రచారకులు లేకనా?

దేశమందలి యార్థికదుస్థితి దీనికి కారణమనుటకు వీలులేదు. ఏలనందురా, యుద్ధఋణము, బీహారు భూకంపనిధి, క్వెట్టా భూకంపనిధి, తిలకుస్వరాజ్యనిధి మొదలగు నెన్నియోనిధుల కాంధ్రులు తమ న్యాయమైన సహాయము జేసి పేరొందిరి. నిత్యమును క్రిమినల్ సివిల్ వ్యాజ్యములవంక నవసరమైనదానికంటె నధికమైన ధనప్రవాహమును పారించుచున్నారు. తమ కవసరమైన యేకర్చులను త్యజించలేదు. తమ దర్జాలను, షోకులను యథారీతిగనే సాగించుచున్నారు. అట్టియెడ నార్థికదుస్థితి కారణము కాజాలదు.

ప్రజలయందు విద్యాసక్తి లేమియా యనుచో నదియును గాదు. గయోపాఖ్యానమును లక్షప్రతులను గొని, భక్తచింతామణి, ప్రసన్నయాదవము మొదలైనవి యేబదివేలకుపైగా చలామణి సాగించి, పనికిమాలిన యే రైల్వేపుస్తకమునైనను ఇచ్చవచ్చినట్టుగా గొని యాదరించు ప్రజలకు విద్యాసక్తి లేదని చెప్పుటకు వీలులేదు. అయిన దీని కారణము లేమిటి? గ్రంథకర్తలులేమి, అంతకంటెను ముఖ్యాతిముఖ్యమైనది సాహసికులైన విద్యాప్రచారకులు లేమి.

గ్రంథకర్తలు భాషాసేవ చేయుచున్నను, నిజమైన దీపకళిక లాంధ్రభాషయం దుద్భవింపలేదు. మినుకు మినుకు మనుచున్న వారైన

ప్రజాబాహుళ్యమున కప్పగించుట. దీపకళిక యెట్టివాడవు మీరు ప్రశ్న విపులగ్రంథకర్తయో, ఎవని గ్రంథములు ప్రజారంజకములై మన్ననలు గెలుపుచు, నూతన సమస్యలను సూచించుచు నూతన సందేశ మొసంగునో, ఎవని గ్రంథములు భాషాం తరీకరణమున కనువై, [illegible] హృదయంగమములై యొప్పారునో యట్టివాడవు [illegible] జనుల [illegible]. విపులగ్రంథకర్త లున్నారు. కాని వారి గ్రంథములు [illegible] "మాలపల్లి", "యెంకిపాటలు", "సుభద్రావిజయము" వంటి వనే కొద్దిపాటి హృదయంగమ మైన గ్రంథము లున్నను, "మాలపల్లి", "యెంకిపాటల" గ్రంథకర్తలు ఇంచు మించు నా గ్రంథములతోనే యుణగారియున్నారు. అదిగాక కొం దఱు గ్రంథకర్తలకు, తమ రచనల కాదర్శ మేమియు లేక తమ పరిసర ముల నున్న యేకొద్దిపాటిమంది మక్షికస్థానివలె కాన్పించుచున్నది. ఆకారణముచే వారి గ్రంథములకు స్థిరత్వము లేదు. నేడు పొగడ బడెడు గ్రంథము రేపు దూషింపబడుచున్నది. ఈ జెడుగు ఆదర్శము నుండి తప్పకోగలవారే నిజమైన భాషాసేవకులు. అట్టివారికొఱకే మన మెదురుచూడవలసియున్నది.

అట్లు చెప్పుటచే నేనాటివైనను చెప్పకోతగ్గ కవీశ్వరులు లేరా యన్నచో వావిలికొలను సుబ్బారావుగారు, విశ్వనాథ సత్యనారా యణగారు, తిల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు మొదలగు కొద్దిమంది యుండుటచేతనే వాఙ్మ యము ప్రారంభదశలో నున్నదని చెప్పుటకు వీలైనది.

కవీశ్వరులలో నింకొకలోటు కనుపించుచున్నది. నాట్యకళ కును, నవలావాఙ్మయమునకును నేమాత్రమును భేదముపాటించుట లేదు. ప్రదర్శనయోగ్యములగు నాటకములు సాధారణముగా నెంత చిన్న విగా నుండిన నంత మంచిది. చదువుకొని యానందింపదగ్గ నవల యెంత విపులముగా నుండిన నంత మంచిది. విపులమైన నవల వివిధ ములైన, స్వభావసిద్ధములైన పాత్రలనిర్మాణమునకును, కల్పనలకును ననుకూలపడును. ఆకారణముచేతనే పాశ్చాత్యదేశమున నవలారచయిత లును, నాటకకారులును వేరు. షేక్స్పియరు, ఇబ్సను, మీటర్లింకు మొదలగు సత్తమోత్తమనాటకకారులు నవలారచనకు గడంగరైరి. అట్లే హాల్కేయిన్, విక్టరుహ్యూగో, అలెగ్జాండరు డ్యూమాసు, స్కాటు మొదలగువారు నాటకరచనకు గడంగరైరి. అట్లే బంగాళీ భాషయందు పేరెన్నికగన్న పాంచకౌడీదేవు, బంకించంద్రఛటర్జీ మొదలగువారు నవలలనేగాని నాటకములను వ్రాయ దొరకొనలేదు. ద్విజేంద్రుడు నాటకములనేగాని నవలలను వ్రాయ బూనలేదు. కాని యిది యొక కేవలన్యాత్ర మని తలపరాదు. రవీంద్రుడు, టాల్స్టాయి మొదలగు కొందరు దీని కపవాదము. ఇది మిక్కుటముగా కవియొక్క అభిరుచిశక్తిసామర్థ్యములలో నున్నది

ఈసందర్భమున విపులగ్రంథకర్తలగు బళ్ళారి కృష్ణమాచార్యులు గారు, కోలాచల శ్రీనివాసరావుగారును నాటకరచనకు గావించిన సేవ ప్రశంసాపాత్రము గాకపోదు. ఇరువురును కేవలము నాటకము లనే రచించిరి. ఇరువురును విపులగ్రంథకారులు. నాట్యకళ ననుసరించి కొద్దిపాటి సవరణ లవసరమైనను, ఇరువురి కథాసంవిధానములును మనోజ్ఞమై ప్రజల కుత్సాహమును, దృశ్యకావ్యములయం దాసక్తియు జనింపజేసినవి. వీరియనంతరము తిరుపతి వేంకటేశ్వరకవులు, బలిజే పల్లి లక్ష్మీకాంతముగారు, కాళ్లకూరి నారాయణరావుగారు, చిలక మర్తి లక్ష్మీనరసింహంగారు మొదలగువారు పలువురు నాటక రచనకు సమర్థతతో గడంగినను, ఆంధ్రభాషకు సొంతసొమ్మై, భాషకు ఘనత తెచ్చి గర్వింపదగిన నాటకములు [illegible] ముట లేదనుట నిర్వివాదాంశమైన సంగతి. నవలావాఙ్మయము నాటకవాఙ్మయముకన్న మరి యున్నదశలో లేదు. సరస్వతీ గ్రంథమాల, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల మొదలగువారు నవ లలు, నాటకములు ప్రచురించుచున్నను, అవియన్నియు ననువాద ములే. మచ్చున కొకటి రెండు స్వతంత్రము లున్నను అవి చెప్పదగి నంత బాగుగా లేవు. నవలారచనలో కొంతవఱకు పేరొందినవారు వేంకట పార్వతీశకవులు, భోగరాజు నారాయణమూర్తిగారు, కేతవరపు వేంకటశాస్త్రిగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు మొదలైనవారు.

వీరందఱిలోను ఆంధ్రదేశమందు దీపశిఖవలె ప్రకాశించినవాడు చిలకమర్తి లక్ష్మీనరసింహాకవి. ఇతడు వీరేశలింగముగారివలెనె సంస్కర్త యైనను సామర్థ్యముతో భాషను వివిధవాహికలలో ప్రవహింపజేసె ను. నాటకములు స్వతంత్రములు, అనువాదములు, నవలలు స్వతంత్ర ములు, అనువాదములు, జీవచరిత్రలు, వాచకపుస్తకములు మొదలగు నవి పెక్కు రచించి భాషాసేవ గావించెను వీరి శైలియు భాషకు పెట్టని సొమ్ము. ఇతని గ్రంథములయందే నిజమైన యాంధ్రత్వము భాషయందును, భావశబలతయందును ఉట్టిపడుచుండును. విపులగ్రంథ కర్త యగుటయేకాదు. ఇతని గ్రంథములకున్న విపుల ప్రచారము ఆంధ్ర భాషయందింకెవ్వరి గ్రంథములకును లేదు. గయోపాఖ్యానము లక్షప్రతు లకు పైగా అమ్ముడుపోయినది. ప్రసన్నయాదవము మొదలగు కొన్ని గ్రంథములు ఏబదివేలకు పైగా నమ్ముడుపోయినవి. హేమలత యితర భాషలకుగూడ పరివర్తింపబడినది. కావుననే కొంతవఱకు [illegible]క ముగా నున్నను, రెండు విషమపరిస్థితులలో బడి భాష నలిగిపోవు చున్నది. సాహంకారులై యారక ఒసంగినను పుస్తకముల [illegible] నొల్లని కవులు, గ్రాంథిక గ్రామ్యభాషా[illegible]జనిత మాత్సర్యముచే నొకరిగ్రంథముల కొకరు లఘుత్వ మాపాదించు కుత్సితభాషాసేవకులు.

విద్యాసక్తికంటెను, ఆర్థికదుస్థితికంటెను, గ్రంథకర్తల యాల సతకంటెను గూడ ముఖ్యాతిముఖ్యమై భాషకు నడుగు బొడుగు లేక యరికట్టుచున్నది సాహసికులైన విద్యాప్రచారకులు లేమియే. ఆంధ్ర భాషకు మొదటిదియు, పేరెన్నికగన్నదియు నగు వావిళ్ల రామస్వామి

# ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి కొన్ని సూచనలు

శాస్త్రులు అండు సన్సువారి కంపెనీ తప్ప మఱియొకటి సర్వతోముఖ ప్రచారము గావించుకంపెనీ లేదు. అదియును చెన్నపట్నములో నున్నది. దాని నామమాత్రమైన "బ్రాంచీలు" బెజవాడ, రాజమండ్రి, విశాఖపట్నంలలో నున్నను, అందులో నేమియు సకాలమునకు హాజరగా నుండవు. ఇకను గ్రంథమాలలో నొకమారు ప్రకటింపబడిన గ్రంథములు పునర్ముద్రణ నొందవు. అదియునుగాక గ్రంథమాలాధికారులు తమపద్ధతులకు విరుద్ధములైన గ్రంథములను ప్రకటింపజాలరు. ప్రకటించిన నైనను కాలనియమాదులచే నే కొద్ది గ్రంథములకంటెనో హెచ్చు ప్రకటింపజాలరు. అందుచే నుత్తమాదర్శములతో వ్రాసిన గ్రంథములనైనను కర్తలు తమ పెట్టెయడుగున నైచుకొనవలసినదే. ఈ నిరుత్సాహమే యుత్తమగ్రంథము లుద్భవించుట కాటంకకారి యగుచున్నది.

బెజవాడ, ఏలూరు, రాజమండ్రి మొదలగు పట్టణములలో నిప్పుడిప్పుడు కొద్దిగా విద్యాప్రచారకసంఘములు లేచుచున్నవి. అవి పాఠ్యపుస్తకముల ప్రచారమునకేగాని తదితర గ్రంథప్రచారమునకంతగా పూనుకొనలేదు. నిజమైన విద్యాభివృద్ధియు, భాషాభివృద్ధియు జేకూరవలె నన్నచో నాంధ్రదేశమునందు ప్రతి పెద్దపట్టణమునందును విద్యాప్రచారకసంఘముల నేర్పఱచుటయే గాక వారు కొందఱుసంచారకుల నేర్పాటుచేసి పల్లెలయందును గ్రంథవిక్రయప్రచారములు గావించవలెను. ఇట్లు గావించినచో నుత్తమగ్రంథములు రచించుటకు ప్రోత్సాహము గల్గుటయేగాక, ఆంధ్రదేశమున మూలకందములని చెప్పదగు పల్లెలలో విద్యాప్రచారము సాగును. తమ కెటులకపడని యనేక గ్రంథములు వారు సులువుగా కొనుక్కొని పఠించుట కవకాశము లేర్పడును. అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బరావు, విశ్వనాథ సత్యనారాయణ, గుండిమెడ వెంకటసుబ్బరావు మొదలగు ననేకుల గ్రంథములు చదువుకొన నుద్దేశించువారి కైన లభించునవకాశము లేకున్నది. ఈ విద్యాప్రచారకులందఱును వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సువారివలెనే తమ సొంత ప్రచురములనేగాక కవులు సొంతముగా ప్రచురించుకొను గ్రంథములను కొంత కమిషన్ పద్ధతులపై నమ్మిపెట్టుటయైనను జేసినచో చాల వఱకు బాగుండును. అప్పు డాంధ్రరాష్ట్రమునం దంతటను ప్రతిగ్రంథకర్తపుస్తకమును లభించుటకు వీలగును. పుస్తకము బాగుండినచో మంచి చలామణి కలిగియుండును. ఏలనందురా యనేకులకు పుస్తకములు చదువవలెనని యాసక్తి గలిగినను పోస్టుచార్జి వగైరాలకు జడిసి తెప్పించుకొనునాసక్తి యుండదు. పై చెప్పిన రీతినైనచో పోస్టు ఖర్చులు భరింప నవసరము లేకయే తమకు వలసిన పుస్తకములు తెప్పించుకో వచ్చును. లేదా తమకు వలసిన మఱికొన్ని గ్రంథములతో కొంచెము స్వల్పమైన యంచెకూలితో సులువుగా తెప్పించుకో వచ్చును. కాని ఒక్కొక్క గ్రంథ మొక్కొక్క గ్రామమునుండి శ్రమకోర్చి తెప్పించుకొనుట అత్యధిక విద్యాభిమానుః గాని సామాన్యులపని గాదు.

ఈ రీతిగా గావించిన నిస్సహాయులగు గ్రంథకర్తలకు కొంతవఱకు బాధ్యత తగ్గించి సహాయముచేసినవా రగుదురు. ఒకవిషాదకరమైన యంశమును మీరెఱిగియున్నారుకదా. విశ్వవిద్యాలయముచే బహుమతి పొందిన గ్రంథములును ఇంతవఱకు ముద్రింపబడలేదు. న్యాయముగా బహుమతినొందిన గ్రంథములు వెన్వెంటనే ప్రచురింపబడినచో నా యుత్సాహమున నా గ్రంథముల కెంతయో చలామణి యుండును. కాలము దాటించి ప్రకటించినచో వాటికంత విలువ యుండదు. ఈ విషయమున విశ్వవిద్యాలయముకంటెను విజ్ఞానచంద్రికాపరిషత్తువారె నూరుమడుంగులు సముచితమైనపని గావించిరి. బహుమతి పొందిన గ్రంథములను ప్రకటించుట, బహుమతినొసంగుటయు నొక్కసారియే గావించుచుండిరి. కావున విశ్వవిద్యాలయము బహుమతినొందిన గ్రంథములను ప్రచురింప సాహసింపలేనిచో నింక భాషయొక్క దుఃస్థితి వేరేవచింపవలెనా? గ్రంథకర్తలు జన్మించియు దేశమున కేమి సేవ చేయగలరు? ఇంకను ఒకచిత్రాతి విచిత్రమైన విషయము. అనేక ముద్రితగ్రంథముల నామములేగాని గ్రంథము లిప్పుడు లభించుటలేదు. అవియు ననామకగ్రంథములు కావు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిచే నింటర్మీడియటుతరగతికి పఠనీయగ్రంథముగా నేర్పఱుపబడిన నారాయణదాసుగారి బాటసారివంటి యుత్తమగ్రంథములు విద్యార్థులకు లభింపలేదు. ఎంతటి దుస్థితి! విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారిచే బహుమతుల నొందిన విమల, రాణీసంయుక్త మొదలగు నమూల్యగ్రంథములు కొనుటకు బజారులలో నిలువలేవు. అవి తిరిగీ ముద్రింపబడునో, లేదో ఎవ్వరికిని తెలియదు. ఇంతకంటెను ఆంధ్రభాషకు దుస్థితి వేరొండు కలదా?

ఆంధ్రభాషయందు చెప్పదగిన నిఘంటువులు లేవు. చెన్నపురి విశ్వవిద్యాలయమువారి(?)ధర్మమా యని శబ్దరత్నాకరమును, నాగేశ్వరరావుగారి ధర్మమున ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమున రెండు భాగములును వెలువడినవి. సూర్యరాయాంధ్రనిఘంటువు, వావిళ్లనిఘంటువు, తక్కిన వన్నియు నెప్పటికిని తయారులోనే యుండును. ఇది ఆరంభదశయొక్క సూచనయే గదా!

ఈ యారంభదశలోనున్న వాఙ్మయమును వివిధశాఖోపశాఖలుగా నభివృద్ధిచేయ మార్గములు లేవా యన్నచో నవశ్యముగాగలవు. ఆంధ్రభాషయం దుద్భవించిన ప్రతి గ్రంథమునకును పదివేలుగాని, అధమపక్షము ఐదువేలుగాని చలామణికి తగిన మార్గ మేర్పాటు చేయవలెను. ప్రారంభదశలో దీనికై కొందఱు ప్రచారకుల నేర్పఱచిన నేర్పఱుపవచ్చును. పై నుదాహరింపబడిన ప్రచారకులు యావన్మంది వారివారి ప్రాంతములలో పుస్తకపఠనముయొక్క ఉత్కృష్టతనుగూర్చియు, ప్రకటింపబడు గొప్పగ్రంథములగూర్చియు తగిన ప్రచారముచేసి ప్రజ

లలో విద్యాభిలాష హెచ్చింపవలెను. రెండవది బ్రాంచీ పోస్టాఫీసు గలిగిన ప్రతి గ్రామమునందైనను రిజిష్టర్డు గ్రంథాలయముల నేర్పరచి ఆంధ్రభాషయందు ప్రకటింపబడు సమస్త గ్రంథములను విధిగా తెప్పించుకొను నేర్పాటు చేయవలెను. దీనివలన పల్లెలలో విద్యాభివృద్ధి, భాషకు గ్రంథాభివృద్ధియుగూడ కలుగును. ఇవి విద్యాభిలాషులును, ద్రవ్యవిహీనులును నగు పేదలకు పెన్నిధులు కావా?

మూడవది స్థానికప్రభుత్వముల యాదరణ. జిల్లాలో నేవిధముగా జూచినను, హయ్యరు ఎలిమెంటరీపాఠశాలలు, మాధ్యమిక పాఠశాలలు, ఉన్నతపాఠశాలలును కలిపి యిరువది డెబ్బదివఱకుండును. అందుచే స్థానికప్రభుత్వములు (మ్యునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు వగైరాలు) రాష్ట్రమందంతటను సుమా రొక వెయ్యిప్రతులకు హామీ చెయ్యవచ్చును. దీనికి ధనాభావ మడ్డురాకుండుగాక. ఏలనందురా, సదరు గ్రంథాలయములు విద్యార్థులయొక్కయు, ఉపాధ్యాయుల యొక్కయు విద్యాభివృద్ధికి సర్వవిధముల దోడ్పడును. ఈవిషయములో నొక హెచ్చరిక. జిల్లాబోర్డువారు హయ్యరు ఎలిమెంటరీపాఠశాలల నెంత యధికముగా నెలకొల్పిన నంత మంచిది. ఇట్లు కొలది సంవత్సరములు గడచినచో ప్రాథమికవిద్యాసమస్య చాలవఱకు చులకబడగలదు.

నాలుగు-ధనికులయభిమానముకూడ నీవిషయమున నత్యావశ్యకము. ధనికు లనగా లక్షాధికారులును, కోటీశ్వరులును నని మాత్రమే కాదు నాయాశయము. ఎవని యాయము ఖర్చులకంటె నధికముగా నుండి కొద్దిపాటి మిగుల్చుకో వీలగునో, వారెల్లరు ధనికులనియే చెప్పవచ్చును. అట్టివారు తమ నిలువలో నంతయు గాకున్నను ఒకటి నాల్గవవంతో, ఒకటి అయిదవవంతో పుస్తకపఠనమునకు వినియోగించుట శ్రేయోదాయకము. ధనాఢ్యులు తమ సంతతివారికి భూవసతి, నగదుమూలమైన యాస్తియేగాక సొంతగ్రంథాలయ మనెడు యాస్తి కూడ నిలువజేయుట యుత్తమోత్తమము. పెద్దనాదిమహాకవీశ్వరులెల్లరును తమతాతతండ్రులు నిలువజేసిన గ్రంథములమూలముననే అంతటి గొప్పవారైరి. ఆంగ్లభాషయందు పేరెన్నికగన్న రాబర్టు బ్రౌనింగు తమ తాతతండ్రులు నిలువజేసిన యపార గ్రంథరాసులమూలముననే మహాకవి యయ్యెను. నగదుఆస్తికంటె గ్రంథరూపమైన యాస్తి హెచ్చు స్థిరమై శ్రేయోదాయకమైనది. ఇట్టి స్వంత గ్రంథాలయముల నిలువ చేసుకోతగ్గవారు ఆంధ్రరాష్ట్రమున రెండుమూడువేలకు తక్కువగా నుండరుకదా! కాబట్టి ధనికులు, విద్యాప్రచారకులు, గ్రంథాలయాధిపతులు యావన్మందియు తగిన శ్రద్ధవహించి పుట్టిన ప్రతిగ్రంథమునకును ఐదువేలకు తక్కువలేని చలామణి హామీచేసినయెడల గ్రంథకర్తల కుత్సాహమును, దేశమున భాషాభివృద్ధియు గలిగి యచిరకాలములో నుత్తమోత్తమగ్రంథము లుద్భవించుటకు వీ లేర్పడును. ఇగా ఎడతెగని ప్రచార మైదారుసంవత్సరములపాటైనను సాగించినచో ననంతరము పుస్తకములను కొని చదువవలె ననెడు నాసక్తి ప్రజలలో మొలకలెత్తి, వేలేకాక యుత్తమగ్రంథములకు లక్షలకొలది చలామణి యేర్పడగలదు.

గ్రంథప్రచారమున కనువైనమార్గములను సూచించి గ్రంథముల తెగలనుగూర్చి చెప్పకుండుట భావ్యముకాదు. అనుకరణము, అనువాదము, స్వతంత్రము అని గ్రంథములలో మూడు తెగలు. అనుకరణ మన్నివిధముల నధమశ్రేణిలో జేరును. శక్తిహీనమైన స్వతంత్రరచన కంటెను శక్తివంతమైన యనువాదము శ్రేష్ఠము. కాని తావి గుబులుకొని తేజోవంతమైన స్వతంత్రరచన సర్వోత్కృష్టమైనది. అట్టి యుత్తమరచనలకొఱ కాంధ్రదేశ మెదురుచూచుచున్నది. స్వతంత్రరచన గ్రంథకారుని పటిమను వెల్లడిచేయును. శక్తియుతమైన యనువాదము మూలగ్రంథకారుని యొక్క ప్రతిభను వెల్లడిచేయును. కాని యనుకరణ ముభయభ్రష్టత చేకూర్చును. అనువాదము రెండవ శ్రేణిలో చేరినను భాషాసందర్భమున నది విడనాడతగ్గది కాదు. భాషాంతరీకరణములవలననే ఆంగ్లభాష యంత గొప్పదియైనది. ప్రపంచమునందలి మేటికవీశ్వరుల నందరిని మనము ఇంగ్లీషు ముఖమున చేరగలము. వాని యనువాదములు మూలమును బురిడించుచు నాకవీశ్వరు డాంగ్లభాషయందు రచించెనా యన్నట్లు భ్రమింపజేయును. అట్టి మహాసుదిన మాంధ్రభాష కెప్పుడు చేకూరునో!

ఆంధ్రభాషయందు మూలము ననుసరించి పరివర్తింపబడిన గ్రంథములు లేవని కాదుగాని, అవి కేవలము బంగాళీభాషనుండియే. మరి యే కొద్దిపాటియో మరాటి, గుజరాతీభాషలనుండి యుండవచ్చును గాని, ఆంగ్ల, ఫరాశ, జార్మణ్యాది భాషలనుండి చక్కని పరివర్తనలు లేవు. విద్యుద్వేగముతో పరుగులిడుచున్న పాశ్చాత్య భాషా మహాకవులను విడిచినచో మన సారస్వతము సంపూర్ణత్వము వహింపజాలదు.

తదుపరి నవలలు, నాటకముల మాట యటుండనిచ్చినను విజ్ఞానాది శాస్త్రములు, చరిత్ర, భూగోళాదులయందును ప్రతీచీభాషల నుండి యెరవడి గ్రహింపకున్నచో మనకు గతిలేదు. ఎప్పుడు ఎం. ఏ. మొదలగు పరీక్షల నందినవారుసహితము వైజ్ఞానికాది విషయములలో నాంగ్ల భాషాసాహాయ్యమవసరము లేక యాంధ్రముననే గరచుటకు వీలగునో, అప్పుడే తెలుగుభాష యభ్యున్నతి నొందినదని తలపవలెను. అంతవఱకు భాషాభిమాను లెన్నటికిని హాయిగా నిద్రింపజాలరు. అట్టి సుదిన మెప్పటికి చేకూరునో!



# రంపపితూరీలు

వేంఢ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

దక్షిణ హిందూస్థానమునందుగల పడమటి కనుమలు ఇంచుమించుగ 'తపతీ'నదిమొదలు కన్యాకుమారివరకు నవిచ్ఛిన్నముగా వ్యాపించియున్నవి. తూర్పుకనుమలు 'మహానది' మొదలు అట్లే దక్షిణముగా వ్యాపించియుండినను, వీనికి నవిచ్ఛిన్నతకలుగక, గోదావరి, కృష్ణ, పెన్న, కావేరి మొదలగు మహానదులు భేదించుటచే విచ్ఛిన్నత నొందినవి. మఱియు, పడమటి కనుమలు మహారాష్ట్ర కర్ణాటకాది ద్రావిడార్య జాతులకు నివాసములైయున్నవి. అందువల్ల పడమటికనుమలు ప్రయోజనకరములగు శివాజీమొదలగువారి దండయాత్రలకు నిలయము లైయుండె. కోయ, శబరా ద్యనార్యజాతుల కునికిపట్లగు తూర్పుకనుమలు అప్రయోజనకరములగు కోయశబరాదుల దండయాత్రలకు స్థానములైనవి. మఱియు నవిచ్ఛిన్నములగుటచే పడమటికనుమలలోనుండి బయలుదేరిన దండయాత్రలు శత్రుజనదుర్భేద్యము లగుటకును, విచ్ఛిన్నములగు తూర్పుకనుమలనుండి బయలుదేరిన దండయాత్రలు పరాజయముల నొందుటకును గూడ హేతువులైనవి. మనకుఁ దెలిసినంతవరకు, తూర్పు కనుమలలోనుండి బయలుదేరిన దండయాత్ర(పితూరీ)లలో రంపపితూరీ లనబడునవి ప్రసిద్ధికెక్కియున్నవి.

'రంప' యనునది తూర్పుగోదావరిజిల్లాలో రాజమహేంద్రవరమునకు రమారమి నలువదిమైళ్లుత్తరముగా నేటి 'చోడవరము' డివిజనునం దున్నది. ఈ 'రంప' కేంద్రస్థానమై 'ద్వారబంధము చంద్రయ్య' నాయకుడుగాగల పితూరి క్రీ. శ. ౧౮౭౯, ౮౦ సం. రములనాటిది. ౧౯౨౨ సం. రపుప్రాంతమునందలి 'అల్లూరి రామరాజు' పితూరీకిఁగూడ రంపపితూరి యను పేరు కలిగెనుగాని ఆ పితూరీదారులలో నొక్కఁడును రంప నెఱుఁగ డని చెప్పవచ్చును. ఇంచుమించుగ నా పితూరీదారు లందఱును విశాఖపట్టణముజిల్లాలోని నరసీపట్టణపు తాలూకావారే. పితూరీ ప్రదేశములుగూడ గొలుగొండ, ఎల్లవరము (అడ్డతిగెల), తుని, పెద్దాపురము తాలూకాలలోనివే కాని రంప ప్రాంతమున పితూరీ జరిగినట్లే లేదు. కాని అల్లూరి రామరాజుగారి పితూరీకి రంపపితూరీయని పేరు పెట్టుట విచిత్రాంశము. ౧౯వ శతాబ్దాదిని అల్లూరి రామరాజుగారు పితూరీచేసిన ప్రదేశములందే 'శాంతభూపతి' గారి పితూరీ గూడ జరిగెను. నికి రంపపితూరీ యను పేరు కలుగలేదు.

ఆలోచింపగా ౧౮౭౯ సం. రపు 'ద్వారబంధము చంద్రయ్య, కారం తమ్మయ్య'గార్ల నాయకత్వమున జరిగిన పితూరీనే రంప పితూరీ యని చెప్పవలసియున్నది. ౧౮౭౯—౧౯౨౧ సం.రములలో జరిగిన పితూరీలవంటి పితూరీ లించుమించుగ నాప్రదేశములయందే స్వదేశరాజుల పరిపాలనకాలమునందును జరిగినట్లు గ్రంథస్థ నిదర్శనములు కలవు. నకుఁ దెలిసినంతవఱకుఁ గొన్ని పితూరీలం గూర్చి వ్రాయుచున్నాఁడను.

(I) కాటయ వేమారెడ్డి (క్రీ. శ. ౧౩౯౫) కాలమున జరిగిన పితూరీ.

కొమరగిరిరెడ్డి (క్రీ. ౧౩౮౬—౧౪౦౨)పరిపాలించుకాలమున రంపపితూరీలు జరిగిన ప్రదేశమునందే పితూరీలు జరుగగా నామహారాజు తన బావమఱది యగు 'కాటయ వేమారెడ్డిని' ఆ పితూరీల నణఁచుటకుఁ బంపఁగా, నాతఁడు ససైన్యుఁడై వచ్చి పితూరీదార్ల నణఁచి వారి ప్రఖ్యాతదుర్గములను బట్టుకొనియున్నాఁడు. పిమ్మట నెప్పుడును ఆప్రదేశములలో పితూరీలు లేకుండుటకుఁ గాబోలు నాప్రదేశములతో గూడిన ప్రాగ్గోదావరీమండలరాజ్యమునకుఁ గాటయవేముఁడు కొమరగిరిరెడ్డి మహారాజుచే నధిపతిగాఁ జేయఁబడినాఁడు. ఆ యంశములు కాటయవేమకృతమును, కొమరగిరిరెడ్డి కంకితము చేయఁబడినదియు నగు 'వసంతరాజీయము' అను పేరుగల శాకుంతల నాటకవ్యాఖ్యానపీఠికంబట్టియు, నితరశాసనములంబట్టియుఁ దెలియఁగలదు శాకుంతలనాటకవ్యాఖ్యానమున నిట్లు గలదు:

శ్లో॥ ధాటీఘోటీఖురాగ్రత్రుటితగిరితటే యత్ర 'మాలేతిదుర్గం'
దుర్గం 'కిమ్మూరు' సంజ్ఞం దళితరిపుబలే దుర్గమం 'బెండపూడి'ం

[illegible] విద్యార్థులు [illegible] [illegible]

ఆంధ్రభాషయందు ప్రకటింపబడు [illegible] గ్రంథములను [illegible] తెప్పించుకొనునేర్పాటు చేయవలెను. దీనివలన పల్లెలలో విద్యాభి వృద్ధి, [illegible] కూడ కలుగును. ఇవి విద్యాభిలాషు లును, ప్రత్యేకించి [illegible] కలకు [illegible]

[illegible] ప్రభుత్వము [illegible] సాదరణ. [illegible] సేవిక [illegible], [illegible] ఎలిమెంటరీపాఠశాలలు, మాధ్యమిక [illegible] ఉన్నతపాఠశాలలును కలిపి [illegible] మును. అందుచే స్థానికప్రభుత్వములు (మ్యునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు వగైరాలు) రాష్ట్రమంతటను సుమా [illegible] ప్రతులకు హామీ చెయ్యవచ్చును. దీనికి [illegible] మడ్డురాకుండుగాక. ఏలనందురా, సదరు గ్రంథాలయములు విద్యార్థులయొక్కయు, ఉపాధ్యాయుల యొక్కయు విద్యాభివృద్ధికి సర్వవిధముల తోడ్పడును. ఈవిషయ ములో నొక హెచ్చరిక. జిల్లాబోర్డువారు హయ్యరు ఎలిమెంటరీపాఠ శాలల [illegible] యధికముగా నెలకొల్పిన నంత మంచిది. ఇట్లు కొలది సంవత్సరములు గడచినచో ప్రాథమికవిద్యాసమస్య చాలవఱకు సులకువగలదు.

నాలుగు-ధనికులయభిమానముకూడ నీవిషయమున నత్యావశ్య కము. ధనికు లనగా లక్షాధికారులును, కోటీశ్వరులును నని మాత్రమే కాదు. నాయాశయము. ఎవని యాయము ఖర్చులకంటె నధికముగా నుండి కొద్దిపాటి మిగుల్చుకో గలుగునో, వారెల్లరు ధనికులనియే చెప్ప వచ్చును. అట్టివారు తమ నిలువలో నంతయు గాకున్నను ఒకటి నాల్గవవంతో, ఒకటి అయిదవవంతో పుస్తకపఠనమునకు వినియోగిం చుట శ్రేయోదాయకము. ధనాఢ్యులు తమ సంతతివారికి భూవసతి, నగదుమూలమైన యాస్తియేగాక సొంతగ్రంథాలయ మనెడు యాస్తి కూడ నిలువచేయుట యుత్తమోత్తమము. పెద్దనాడిమహాకవీశ్వరు లెల్లరును తమతాతతండ్రులు నిలువజేసిన గ్రంథములమూలముననే అం తటి గొప్పవారైరి. ఆంగ్లభాషయందు పేరెన్నికగన్న రాబర్టు బ్రౌనింగు తమ తాతతండ్రులు నిలువజేసిన యపార గ్రంథరాసులమూలముననే మహాకవి యయ్యెను. నగదుఆస్తికంటె గ్రంథరూపమైన యాస్తిహెచ్చు స్థిరమై శ్రేయోదాయకమైనది. ఇట్టి స్వంత గ్రంథాలయముల నిలవ చేసుకోతగ్గవారు ఆంధ్రరాష్ట్రమున రెండుమూడువేలకు తక్కువగా నుండరుకదా! కాబట్టి ధనికులు, విద్యాప్రచారకులు, గ్రంథాలయాధి పతులు యావన్మందియు తగిన శ్రద్ధవహించి పుట్టిన ప్రతిగ్రంథమున కును ఐదువేలకు తక్కువలేని చలామణి హామీచేసినయెడల గ్రంథకర్తల కుత్సాహమును, దేశమున భాషాభివృద్ధియు గలిగి యచిరకాలములో నుత్తమోత్తమగ్రంథము లుద్భవించుటకు వీ లేర్పడును. పైరీతిగా నెవతెగని ప్రచార మైదారుసంవత్సరములపాటైనను సాగించినచో ననంతరము పుస్తకములను కొని చదువవలె ననెడు నాసక్తి ప్రజలలో మొలకలెత్తి, వేలేకాక యుత్తమగ్రంథములకు లక్షలకొలది చలామణి యేర్పడగలదు.

గ్రంథప్రచారమున కనువైనమార్గములను సూచించి గ్రంథముల తెగలనుగూర్చి చెప్పకుండుట భావ్యముకాదు. అనుకరణము, అను వాదము, స్వతంత్రము అని గ్రంథములలో మూడుతెగలు. అనుకరణ మన్నివిధముల నధమశ్రేణిలో జేరును. శక్తిహీనమైన స్వతంత్రరచన కంటెను శక్తివంతమైన యనువాదము శ్రేష్ఠము. కాని తావి గుబాళించు [illegible] తేజోవంతమైన స్వతంత్రరచన సర్వోత్కృష్టమైనది. అట్టి యుత్తమరచనలకొఱ కాంధ్రదేశ మెదురుచూచుచున్నది. స్వతంత్రరచన గ్రంథకారుని పటిమను వెల్లడిచేయును. శక్తియుతమైన యనువాదము మూలగ్రంథకారుని యొక్క ప్రతిభను వెల్లడిచేయును. కాని యనుకరణ ముభయభ్రష్టత చేకూర్చును. అనువాదము రెండవ శ్రేణిలో చేరినను భాషాసందర్భమున నది విడనాడతగ్గది కాదు. భాషాంతరీకరణములవలననే ఆంగ్ల భాష యంత గొప్పదియైనది. ప్రపంచమునందలి మేటికవీశ్వరుల నందరిని మనము ఇంగ్లీషు ముఖమున చేరగలము. వాని యనువాదములు మూలమును బురిడించుచు నాక వీశ్వరు డాంగ్లభాషయందు రచించెనా యన్నట్లు భ్రమింపజేయును. అట్టి మహాసుదిన మాంధ్రభాష కెప్పుడు చేకూరునో!

ఆంధ్రభాషయందు మూలము ననుసరించి పరివర్తింపబడిన గ్రంథములు లేవని కాదుగాని, అవి కేవలము బంగాళీభాషనుండియే. మరి యే కొద్దిపాటియో మరాటి, గుజరాతీభాషలనుండి యుండ వచ్చును గాని, ఆంగ్ల, పరాశ, జార్మణ్యాది భాషలనుండి చక్కని పరివర్తనలు లేవు. విద్యుద్వేగముతో పరుగులిడుచున్న పాశ్చాత్య భాషా మహాకవులను విడిచినచో మన సారస్వతము సంపూర్ణత్వము వహింపజాలదు.

తదుపరి నవలలు, నాటకముల మాట యటుండనిచ్చినను విజ్ఞా నాది శాస్త్రములు, చరిత్ర, భూగోళాదులయందును ప్రతీచీభాషల నుండి యెరవడి గ్రహింపకున్నచో మనకు గతిలేదు. ఎప్పుడు ఎం. ఏ. మొదలగు పరీక్షల నందినవారుసహితము వైజ్ఞానికాది విషయము లలో నాంగ్ల భాషాసాహాయ్యమవసరము లేక యాంధ్రముననే గర చుటకు వీలగునో, అప్పుడే తెలుగుభాష యభ్యున్నతి నొందినదని తలపవలెను. అంతవఱకు భాషాభిమాను లెన్నటికిని హాయిగా నిద్రింప జాలరు. అట్టి సుదిన మెప్పటికి చేకూరునో!



# రంపపితూరీలు

వెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

దక్షిణ హిందూస్థానమునందుగల పడమటి కనుమలు ఇంచుమించుగ 'తపతీ'నదిమొదలు కన్యాకుమారివరకు నవిచ్ఛిన్నముగా వ్యాపించియున్నవి. తూర్పుకనుమలు 'మహానది' మొదలు అట్లే దక్షిణముగా వ్యాపించియుండినను, వీనికి నవిచ్ఛిన్నతకలుగక, గోదావరి, కృష్ణ, పెన్న, కావేరి మొదలగు మహానదులు ఛేదించుటచే విచ్ఛిన్నత నొందినవి. మఱియు, పడమటి కనుమలు మహారాష్ట్ర కర్ణాటకాది ద్రావిడార్య జాతులకు నివాసములైయున్నవి. అందువల్ల పడమటికనుమలు ప్రయోజనకరములగు శివాజీమొదలగువారి దండయాత్రలకు నిలయములైయుండె కోయ, శబరాద్యనార్యజాతుల కునికిపట్లగు తూర్పుకనుమలు అప్రయోజనకరములగు కోయశబరాదుల దండయాత్రలకు స్థానములైనవి. మఱియు నవిచ్ఛిన్నములగుటచే పడమటికనుమలలోనుండి బయలుదేరిన దండయాత్రలు శత్రుజనదుర్భేద్యములగుటయు, విచ్ఛిన్నములగు తూర్పుకనుమలనుండి బయలుదేరిన దండయాత్రలు పరాజయముల నొందుటకును గూడ హేతువులైనవి. మనకుఁ దెలిసినంతవరకు, తూర్పు కనుమలలోనుండి బయలుదేరిన దండయాత్ర(పితూరీ)లలో రంపపితూరీ లనబడునవి ప్రసిద్ధికెక్కియున్నవి.

'రంప' యనునది తూర్పుగోదావరిజిల్లాలో రాజమహేంద్రవరమునకు రమారమి నలువదిమైళ్లుత్తరముగా నేఁటి 'చోడవరము' డివిజనునందున్నది. ఈ 'రంప' కేంద్రస్థానమై 'ద్వారబంధము చంద్రయ్య' నాయకుఁడుగాగల పితూరీ క్రీ. శ. ౧౮౭౯, ౮౦ సంవత్సరములనాటిది. ౧౯౨౨ సం. రపు ప్రాంతమునందలి 'అల్లూరి రామరాజు' పితూరీకిఁగూడ రంపపితూరీ యను పేరు కలిగెనుగాని ఆ పితూరీదారులలో నొక్కఁడును రంప నెఱుఁగఁడని చెప్పవచ్చును. ఇంచుమించుగ నా పితూరీదారు లందఱును విశాఖపట్టణముజిల్లాలోని నరసీపట్టణపు తాలూకావారే. పితూరీ ప్రదేశములుగూడ గొలుగొండ, ఎల్లవరము (అడ్డతీగెల), తుని, పెద్దాపురము తాలూకాలలోనివే కాని రంపప్రాంతమున పితూరీ జరిగినట్లే లేదు. కాని అల్లూరి రామరాజుగారి పితూరీకి రంపపితూరీయని పేరు పెట్టుట విచిత్రాంశము. ౧౯ వ శతాబ్దాదిని అల్లూరి రామరాజుగారు పితూరీచేసిన ప్రదేశములందే 'శాంతభూపతి' గారి పితూరీ గూడ జరిగెను. దానికి రంపపితూరీ యను పేరు కలుగలేదు.

ఆలోచింపగా ౧౮౭౯ సం. రపు 'ద్వారబంధము చంద్రయ్య, కారం తమ్మయ్య' గార్ల నాయకత్వమున జరిగిన పితూరీనే రంపపితూరీ యని చెప్పవలసియున్నది. ౧౮౭౯—౧౮౮౧ సం. రములలో జరిగిన పితూరీలవంటి పితూరీ లించుమించుగ నాప్రదేశములయందే స్వదేశరాజుల పరిపాలనకాలమునందును జరిగినట్లు గ్రంథస్థ నిదర్శనములు కలవు. నాకుఁ దెలిసినంత [illegible] పితూరీలం గూర్చి వ్రాయుచున్నాఁడను.

(1) కాటయ వేమారెడ్డి (క్రీ. శ. ౧౩౮౬) కాలమున జరిగిన పితూరీ.

కొమరగిరిరెడ్డి (క్రీ. ౧౩౮౩—౧౪౦౨)పరిపాలించుకాలమున రంపపితూరీలు జరిగిన ప్రదేశమునందే పితూరీలు జరుగగా నామహారాజు తన బావమఱది యగు 'కాటయ వేమారెడ్డిని' ఆ పితూరీల నణఁచుటకుఁ బంపఁగా, నాతఁడు ససైన్యుఁడై వచ్చి పితూరీదార్ల నణఁచి వారి ప్రఖ్యాతదుర్గములను బట్టుకొనియున్నాఁడు. పిమ్మట నెప్పుడును ఆప్రదేశములలో పితూరీలు లేవకుండుటకుఁ గాబోలు నాప్రదేశములతో గూడిన ప్రాగ్గోదావరీమండలరాజ్యమునకుఁ గాటయవేముఁడు కొమరగిరిరెడ్డి మహారాజుచే నధిపతిగాఁ జేయఁబడినాఁడు. ఆ యంశములు కాటయవేమకృతమును, కొమరగిరిరెడ్డి కంకితము చేయఁబడినదియు నగు 'వసంతరాజీయము' అను పేరుగల శాకుంతల నాటకవ్యాఖ్యానపీఠికం బట్టియు, నితరశాసనములం బట్టియుఁ దెలియఁగలదు. శాకుంతలనాటకవ్యాఖ్యానమున నిట్లు గలదు:

శ్లో॥ ధాటీఘోటీఖురాగ్రత్రుటితగిరితటే యత్ర 'మాలేతిదుర్గం'
దుర్గం 'కిమ్మూరు' సంజ్ఞం దళితరిపుబలే దుర్గమం 'బెండపూడి'ం

దుశ్ఛేద్యం 'వజ్రకూటం' జితవతి రభసా 'రామగిర్యాఖ్య' దుర్గం
విఖ్యాతాం 'వీరఘట్టోటాం' గళిత మసుహృదాం వీరసన్నాహదార్ఢ్యం.

. పర్వ్వలపంక్తిక మకరో
ద్ప్రధనే నిర్జిత్య వైరిణో రామః,
వైరికులపరశురామః
కాటయవేమస్తు రిర్ధిశతిమ్.

తాత్పర్యము. కాటయవేముని యుద్ధయాత్రయందలి గుఱ్ఱపు డెక్కలచేతను, పర్వతప్రదేశములు బ్రద్దలుకొట్టఁబడి 'మాలేతి' దుర్గము, 'కిమ్మూరు' దుర్గము ఖండింపఁబడిన శత్రుబలములు కలవై దుర్గమమగు బెండపూడి, అభేద్యమగు వజ్రకూటము, రామగిరిదుర్గము, ప్రసిద్ధమగు వీరఘట్టోటము, వేగముగా జయింపఁబడఁగా శత్రువుల వీర సన్నాహదార్ఢ్యము జాఱిపోయెను.

పరశురాముఁడు యుద్ధమున శత్రువులను జయించి యైదు చిన్న సరస్సులను జేసెను. వైరికులపరశురాముఁడగు కాటయవేముఁడో నూఱుసముద్రములం జేసెను. పైశ్లోకములలోఁ జెప్పఁబడిన 'మాలేతి' దుర్గము పదునేడవశతాబ్దాదినుండి నేఁటివఱకు 'మొల్లేరు'ను పేరితో నొప్పుచున్నది. (మొల్లేరు రంపకు సమీపమునఁ గలదు) 'బెండపూడి, వజ్రకూటము' లనునవి నాఁడును నేఁడును నొక్కపేరు కలవిగానే యున్నవి. (ఇవి పిఠాపురమునకు ౧౦ మైళ్లదూరమున గలవు) కిమ్మూరు దుర్గము పదునాఱవశతాబ్దమధ్యమునుండి నేఁటివఱకు పెద్దాపురపు కోట యను పేరుకలదిగా నున్నది. వీరఘట్టోటము కోటామైనది. తునిసంస్థానమునకు 'కోటాము' సంస్థానమని పేరు. 'రామగిరి' తునికి సమీపమునం దున్నది. పదునేనిమిదవ శతాబ్దమునం దుండిన రేకపల్లి సోమప్పకవి ఈ రామగిరిని పుణ్యక్షేత్రమని తన 'రుక్మవతీపరిణయమున' విశేషముగా వర్ణించియున్నాఁడు.

పైప్రదేశము లించుమించుగ ౧౫౬౯-౧౫౭౧ సం.రపు పితూరీలుజరిగిన ప్రదేశములుగా నేయున్నవి. పైప్రదేశములనే కాటయవేముడు జయించిన ట్లుండుటచే నాదుర్గము లానాఁడు మన్యపుదొరలచే నాక్రమింపఁబడఁగా వారిని గాటయవేముఁ డోడించియుండు నని తలంపవలసి యున్నది. కాటయవేముని నాఁటి పితూరీ క్రీ.శ. ౧౩౭౬సం.రం ప్రాంతమునం దైనట్లు కాన్పించును. మనకుఁ దెలిసినపితూరీలలో నిది మొదటి పితూరీ. ఉత్తరాంధ్రము రెడ్ల పరిపాలనానంతరము 'ఓఢ్రరాజుల' వశమైనది. ఓఢ్రుల కాలమున పితూరీలు జరిగెనో లేదో తెలియదు. ఓఢ్రులనుండి బహమనీసుల్తాను లీ యుత్తరాంధ్రమును కైవసము చేసికొను మధ్యకాలమునందు 'ఆంధ్రదేశపు శివాజీ' యనఁదగు శ్రీ వత్సవాయి చతుర్భుజ తిమ్మ జగపతి మహారాజుగారు పితూరీలు జరిగిన ప్రదేశములతోఁ గూడిన పెద్దాపురం సంస్థానమును స్థాపించిరి. 'తాళికోట' యుద్ధమువంటి మహాయుద్ధములోను, పెక్కు తురుష్క యుద్ధములలోను ముక్కోకలందేరిన చతుర్భుజ తిమ్మ జగపతి మహారాజుగారి నిరంకుశపరిపాలనమువలన పితూరీల పేరె కాన్పింపదు. కాని, వారి కుమారులగు రాయ జగపతి మహారాజుగారు పరిపాలించు క్రీ. శ. ౧౬౦౬-౧౬౪౯ కాలమున రాఘవరాజసీమ పితూరీ బయలుదేరినది. ఆపితూరీనిగురించియు, దానిలోని నాయకులం గూర్చియు, దానిని రాయ జగపతిరాజుగా రణఁచుటను గూర్చియు, తత్కాలమునందుండిన * ఏనుగు పెదలక్ష్మణకవి తన తుల్యామహాత్మ్యమునను, రెండవ లక్ష్మణకవి 'రామవిలాసము' నందును వర్ణించియున్నారు. మఱియు 'రాఘవరాజుసీమకైఫియతు' కూడ పై యంశమును స్పష్టపఱచియున్నది.

తుల్యామాహాత్మ్యమునం దిట్లు కలదు :

సీ. అరిమురి తురకసైన్యము నుగ్గుచేయించె
గట్టిగా నమ్మయ్య గట్టుదరిని
వంతుకు వచ్చు భూవరుల పేరడఁగించె
తీవిచే లంపక లోవయొద్ద
రాఘవరాజగర్వము మాపి పాట్రాయ
రాజుని జేసెఁ దద్రాజ్యమునకు
గూడెమంతయును గగ్గోలుగా శరభభూ
పతిఁ గొట్టి వీరన్నఁ బ్రభుని జేసె

గీ. రాజమాత్రుండె పరమాన్య రాయనిభఁగ
చంద మన్నియరాజులసుండె గనులు
వెక్కసపు మన్నెరాజుల వెన్నుతరటి
తిమ్మభూపాలరాయధాత్రీవిభుండు.

ఇందు నుడువఁబడిన (i) 'అమ్మయ్యగట్టు' అనునది 'రంప'కు నాలుగైదుమైళ్లదూరమునం గలదు. అచట తురకసైన్యము లానాఁ డెట్లు చేరెనో దురూహ్యముగా నున్నది. కాని యే తురుష్కుఁడైన కోయదొరలను పెద్దాపురసంస్థానాధీశులపైఁ బురికొల్పియుండెనేమో!

(ii) 'లంపకలోవ' ఇది ఇప్పటి పెద్దాపురము తాలూకాలో 'ప్రత్తిపాడు'నకు నైదుమైళ్లదూరమున నున్నది.

'వంతుకు వచ్చు భూవరుల పేరడఁగించె' అనుటను గూర్చి 'రాఘవరాజు, శరభభూపతులు' తగుసహాయముతోనే రాయజగపతి

* భర్తృహరిసుభాషితము నాంధ్రీకరించినట్టియు, రామవిలాస, జాహ్నవీమాహాత్మ్యాది బహు గ్రంథములను రచించిన ఏనుగు లక్ష్మణకవియొక్క పితామహుఁడును లక్ష్మణకవియే. ఆతఁడు తుల్యామాహాత్మ్యము, ధ్రువచరిత్రము, ద్రౌపదీపరిణయము, భీమసేనవిజయము మొదలగు బహు గ్రంథములను రచించెను.



కాంగ్రెసుభవనము, మదరాసు.



ఆంధ్రకాంగ్రెసుభవనము, రాజమహేంద్రవరము. భవనదాత: అరవ తిరుపతిరాయలు



తెనాలిలో కాంగ్రెసు సువర్ణోత్సవము





నల్లూరు రేపల్లెసత్యాగ్రహాశిబిరమున కాంగ్రెసు సువర్ణోత్సవము



చెన్నపురమున కాంగ్రెసు సువర్ణోత్సవము

రాజుగారి సెక్రటరీ రను సంశముక్రింద వ్రాయించబడు 'రాఘవరాజు సీమ' కైఫీయతువలనఁ దెలియఁగలదు చూడుఁడు.

(రాఘవరాజు కైఫీయ్యతులలోని యంశములు)

"పెద్దాపురమునకు వుత్తరభాగమున పన్నెండుక్రోసులదూరమున జంగిలి పట్టినికొండలమధ్య కొన్నికొన్ని చిల్లరపల్లెలు వుంటూ వుంతగా అక్కడికి రాఘవరాజు అనే ఆయన పదిమంద్ని స్తోమతు చేస్కొని ప్రవేశించిప్రబలుడై కొండపల్లెలుఅరణ్యప్రదేశము స్వాధీనం చేసుకొని అక్కడ వాళ్లవల్ల చిన్న పల్లెకు వరహా చొ॥ పెద్దపల్లెకు రెండేసి వరహాలు చొ॥ పుచ్చుకుంటూ హౌకముల (హౌకము = అధికారి) తర్పున వచ్చినవారివద్దికి వచ్చి మంచిమాటలు ఆడుకుంటూ వుండేవారు.........రాఘవరాజు అనే ఆయన 'రాజు వొమ్మంగి' అనే గ్రామంలో నివాసం చేసుకుని వుండడంచేత ఆతను ఆక్రమించుకున్న పల్లెలకు రాఘవరాజుసీమ అనే వక ప్రశిద్ధనామం యేర్పడ్డది. వీరు మన్నెంలో వుండడం చేత మన్యపురాజులు అనిపించుకున్నారు.

(ఈ రాజ వమ్మంగిని ఇపుడును రాజవమ్మంగియనే అందురు. ఇది జడ్డంగి కేడుమైళ్లుత్తరమున ఎల్లవరము (డివిజనులో) గలదు

ఆయ్నకు బల్ రాఘవరాజు అనేవకు కొమార్డు వుండేవాడు. ఆయ్న తండ్రిగారయ్ని రాఘవరాజుగారు పోయ్నితరువాత క్రమక్రమంగా బల్వీషయి, సబాబులకు యేమి వారితరఫున వచ్చిన ఫౌజుదారలకు యేమి స్వాధీనంకాక రాఘవరాజు సీమ అనేస్తలమును ప్రత్యేకం అనుభవిస్తూవుండేవాడు. అప్పటిలో 'షేక్ మహ్మద్ ఖాన్' వారు తిమతాలూకు కొంత ఫౌజును రాఘవరాజు సీమమీదికి పంపించినంతలో వారికి స్వాధీనం కానందున్న శ్రీ పెదరాయపరాజుగారిని పిలిచి రాఘవరాజుసీమ మాకు స్వాధీనంఅయ్నిదికాదు. గన్కమీరు కొట్టి సాధించి అనుభవించవలసినదని శల్వీయిచ్చి ఫర్మానా వ్రాయించినందున్న శ్రీ పెదరాయపరాజుగారు స్న ౧౧౮౫ ఫసలీ * ౧౬౯౭ శాలివాహనశకం 'రాక్షస' సంవత్సరంలో విస్తరించి ఫౌజును తీస్కొని రాఘవరాజుసీమమీదికి వెళ్ళి అనేక్కవిధాల ప్రయత్నంచేసి బల్ రాఘవరాజు తాలుక్క కొంతిఫౌజును కొట్టి షికస్తుచేస్నిమీదట బల్ రాఘవరాజు స్వాధీనం అయి జేరుదస్తులోకివచ్చి సాలు ౧ కి వొ. ౧౦౦౦ లు చొ. జమాబందీపయికం చెల్లించుకో వడమున్ను ౫౦౦ మంది సిబ్బందితో నౌఖరీ చెయ్యగలందులకున్ను వప్పుకుని ఖరారునామావ్రాశి దాఖలుచేసి ఆ ప్రకారం కొన్ని సంవత్సరములు పైకం చెల్లించి నవుఖరీచేస్తూవుండి చనిపోయినాడు. ఆబల్ రాఘవరాజు కొమార్డు 'మల్ రాఘవరాజు' అనే ఆయ్న తండ్రివలెనే కొంత్తకాలం పెద్దాపురపు జమీదారుగారి ఆజ్ఞలో తిర్గుతూ పయికం చెల్లించ్ని నవుకరీ చేస్తూవుండేవాడు. మొదట స్తలం సంపాదనకర్త రాఘవరాజు అవుట చాత దరిమిలాను వారి వంశీకుల్కు చివర రాఘవరాజు అనేకితాబు వాడకలో తెచ్చుకుంటూ ఆ ప్రకారమే వ్రాసుకుంట్టూ వుండ్డేవారు. ఈలాను కొంత్తకాలం జర్గుతూవుండగా ౧౧౯౨ ఫసలీ ౧౭౦౪ శ, శాలివాహనశకం దుంద్దుభి సంవత్సరంలో.........రాఘవరాజ సీమ మన్యపుస్తలంగన్క పెద్దాపురపు జమీందారుగారికి స్వాధీనంగాక తిరగబాటు చేసినంద్ను శ్రీ పెదరాయపరాజుగారు విస్తరించి జనమును స్తోమతుచేసి పంప్పించి మల్ రాఘవరాజును కొట్టివేసి స్తలం స్వాధీనచేశకున్నమీదట వారి సన్నిహితజ్ఞాతి అయ్ని పొట్రాఘవరాజు అనే ఆయన వచ్చి అనేక విధాల ప్రాథేయపడి కొంతకాలము నజరుదాఖలు చేసినంద్ను ఆయనను యధాప్రకారం రాఘవరాజు శీమకు అధికారిని చేసి సాలు ౧ కి వొ ౧౦౦౦ పుచ్చుకుంటూ ౫౦౦ సిబందీచేతను నవుఖరీ చేయించ్చుకుంట్టూ వుండేవారు........."

పొట్రాఘవరాజుగారి కుమారుడు 'శరభరాజుగారు' కూడ రాఘవరాజు సీమను బాలింపుచు వత్సవాయివారికి లోఁబడి కొంతకాల ముండి పిమ్మట పితూరీని జేయగా, రాయ జగపతిరాజుగారు పితూరీ నణఁచి రాఘవరాజసీమను మూఁడు భాగములుగాఁ జేసి శరభరాజుగారి మంత్రియగు నెనుముల బాపన్నదొరకు రెండు భాగములును, సేనాని యగు 'బొగ్గుల గన్నంరెడ్డి దొర' కొక భాగము నిచ్చినట్లు గోదావరి డిష్ట్రిక్టు మాన్యూలువలనఁ దెలియుచున్నది. దీనినే తుల్యామాహాత్మ్యమున

"గూడెమంతయును గగ్గోలుగా శరభభూ
పతిఁ గొట్టి వీరన్న ప్రభునిజేసె"

అని కలదు. బాపన్నకు వీరన్న యను పేరుకూడఁ గలదేమో? మొత్తమునకు శ్రీ వత్సవాయి రాయ జగపతిరాజుగారు పాలించు కాలమున మూఁడు పితూరీలు జరిగియున్నవి. అందు బల్ రాఘవరాజు పితూరీ క్రీ.శ. ౧౭౫౪ సం. రమునను, మల్ రాఘవరాజు పితూరీ ౧౭౭౦ సం. రమునను, శరభరాజు పితూరీ ౧౭౮౦ సం.ర ప్రాంతమునను జరిగియున్నవి. పిమ్మట పెద్దాపురసంస్థానమును నాలవ తిమ్మజగపతిరాజుగారు పాలించుకాలమున ౧౮౭౦-౧౮౯౮ సం. రముల నడిమికాలమున తోటపల్లిముఠా నేలుచున్న 'జగ్గన్నదొర' పితూరీని లేపెను. ఇది క్రీ. శ. ౧౮౮౦ సం.రమున జరిగియున్నది.

ఆపితూరీని తిమ్మ జగపతిమహారాజుగారి సేనానియగు వత్సవాయి జగ్గరాజుగా రణఁచిరి. ఆయుద్ధమున జగ్గరాజుగారు గండ్రగొడ్డళ్ల నుపయోగించుటచే నాయనను 'గొడ్డళ్ల జగ్గరాజు'గా రనుచుండిరి.

పితూరీదారగు జగ్గన్నదొరను పాలఁద్రోలి యాతని జ్ఞాతియగు 'రాజన్నదొరకు' తోటపల్లిముఠాను, తిమ్మజగపతిమహారాజుగారు

* తేదీలు సరిగాలేవు. కాని ఆ తేదీల ననుసరించియే పితూరీ సంవత్సరాలు వ్రాసి

సం.రమునకు ౭౦౦ కళుకువరహాలు పన్ను నిచ్చునట్లును ౫౦౦ మంది సిబ్బందిని కావలసినపుడు సిద్ధపఱచుటకును నిర్ణయించియిచ్చిరి.

ఈపితూరీ నణఁచుటలో నాకాలముననే చామర్లకోటలో నింగ్లీషువారు నెలకొలిపిన పటాలపు సిపాయీలనుగూడ శ్రీరాజావారు కోరుటచే నాంగ్లప్రభుత్వమువారు తోడుగ నంపిరి. పిమ్మట రాజన్నదొరయు ౧౭౮౦సం.రమున నొకపితూరీని లేపెను. దానిని గొడ్డళ్ల జగ్గరాజుగారే యణఁచి మొఠాను స్వాధీనపఱచుకొనిరి.

అటుపిమ్మట ౧౭౮౧ సం. రమున 'మల్లు' దొరయనునాతఁడు పితూరీని లేపి, పెద్దాపురసంస్థానపు గ్రామములను గవర్నమెంటువారిగ్రామములను దోఁచుకొనఁగా నింగ్లీషుపటాలమునకు పెద్దాపురపువారి సైన్యము తోడై యాతనిని రణనిహతుఁ జేసినట్లును తోటపల్లి మొఠాను ౧౭౮౩ సం.రమున ఎనుముల బాపన్నదొరకు సం. రమునకు ౧౦౦౦ కళుకువరహాలు పన్నునిచ్చులాగున పెద్దాపురాధీశులిచ్చినట్లును 'తోటపల్లి కైఫియతు' వలనఁ దెలియనగుచున్నది.

మొత్తమునకు నాల్గవ తిమ్మరాజుగారి కాలమున జగ్గన్నదొర పితూరీ౧౭౭౦సం.రమునను, రాజన్నదొరపితూరీ౧౭౮౦సం.రమునను, మల్లుదొర పితూరీ ౧౭౮౧ సం. రమునను మూఁడుపితూరీలు జరిగియున్నవి.

పిమ్మట ౧౭౯౭-౧౮౦౫సం.రముల నడిమికాలమున కోయదొరలు 'గోకవరము' సమీపమున (ఇది రంపకు సమీపము) నొక పితూరీని లేపగా రెండవ వత్సవాయి రాయజగపతిమహారాజుగారు ససైన్యులై స్వయముగ యుద్ధముచేసి యా పితూరీ నణఁచినట్లును ఆయుద్ధమున 'ఈటెల' నుపయోగపఱచినట్లును పద్యములు కలవు. ఆ పితూరీనాయకుల పేరు తెలియరాదు. గ్రంథవిస్తరభీతిచే పద్యములను వ్రాయలేదు.

పిమ్మట ప్రసిద్ధికెక్కిన ౧౮౭౯-౮౦ సం. రపు 'రంప పితూరి' ఇందు కోయదొరల నాయకుఁడు ద్వారబంధము చంద్రయ్య. దీనిని గుఱించి గోదావరిజిల్లా గెజటీయర్సున విస్తారముగ కలదు.

అది 'రంప'లోనె బయలుదేరుటచే రంప పితూరి యన నొప్పుచున్నది.

ఆ పితూరీ కాలమున రంపను స్వయముగాఁ జూచినట్టియు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి కాంధ్రమున స్వల్పకాలము గురువైనట్టియు * పన్నాల రామబ్రహ్మశాస్త్రిగారిట్లు రంపను వర్ణించియున్నారు:

ఉ. రంప గణింపరాని జనరాజిని జంపెడు దుంప కాన్‌స్టేబిల్
గుంపులపెంపు సొంపణపఁ గూర్చిన యాజెము కొంప దోర్గమా
యింప జనించురొంప ధరణీశుల టొంప పితూరిదార్లకున్
సంపద లిచ్చి ప్రోచుటకు చాలిన మేరువుచెంప యిమ్మహిన్.

(ఇందలి 'టొంప' శబ్దమున కర్థము నిఘంటువులలోఁ గాన్పింపదు కాని గంజాముమండలమున 'టొంప' యన లోఁగని పసువునకు పరుగిడకుండ మెడకుఁగట్టు గుదెగా వాడెదరు. ఆయర్థ మీపద్యమున సమర్థమయియె యున్నది.)

౧౮౭౯-౮౦ సం||రపు పితూరీని బ్రిటీషు గవర్నమెంటువారె యణఁచిరి.

పిమ్మట భరతఖండమంతయు వినకరినొందిన 'అల్లూరి రామరాజుగారి ౧౯౨౨-౨౩ సం|| ప్రాంతమునందలి పితూరి.' దీనికిని రంపకును సంబంధ మెంతమాత్రము లేదని యిదివఱకె వ్రాసితిని.

మొత్తమునకు పది పితూరీ లీక్రింద వివరించినవారి నాయమున నైయున్నవి.

| | పితూరీ కాలము | పితూరీ నాయకులు | పితూరీ నణఁచినవారు |
|---|---|---|---|
| 1. | క్రీ. 1386 | పేరు తెలియదు | కాటయ వేమారెడ్డి |
| 2. | 1657 | బల్ రాఘవరాజు | వత్సవాయి రాయజగపతి మహారాజుగారు |
| 3. | 1660 | మల్ రాఘవరాజు | |
| | | | " |
| 4. | 1670 | శరభరాజు | " |
| 5. | 1770 | జగ్గన్నదొర | వత్సవాయి తిమ్మ జగపతిరాజుగారు |
| 6. | 1780 | రాజన్నదొర | |
| | | | " |
| 7. | 1781 | మల్లుదొర | " |
| 8. | 1800 | పేరు తెలియదు | వత్సవాయిరాయ జగపతిరాజుగారు |
| 9. | 1879-80 | ద్వారబంధము చంద్రయ్య | బ్రిటీషువారు. |
| 10. | 1922, 23 | అల్లూరి రామరాజు | " |

* పన్నాల రామబ్రహ్మశాస్త్రిగారు తణుకు తాలూకా 'విప్పఱ్ఱు' నివాసులు. అత్తవారి యాస్తి కలియుటచే రాజోలుతాలూకా 'ఏనుగులమహాలు' అను గ్రామమున నివసించి ౧౯౦౮సం.ర ప్రాంతమున 'ఎనుబది' యేండ్ల వయస్సున స్వర్గస్థులైరి. వీరు బహు గ్రంథములను రచించిరి. అందు (1) శంతను చరిత్ర, (2) ఖలకర్ణ విషాణము(3) పూచికపుల్ల శతకము అనునవి ప్రసిద్ధములు. రెండవ గ్రంథము ద్వ్యర్థికావ్యము. అది యొక రాజోద్యోగిని దిట్టుచు రామాయణకథ వచ్చునట్లు చెప్పినది; పింగళి ప్రోలు లక్ష్మణకవి 'రావణదమ్మీయము' వంటిది; మూఁడవది వీరేశలింగము పంతులుగారు కోరగా నాశుధారను జెప్పిన యన్యాపదేశ శతకము. వీరు పంతులుగారి 'వివేకవర్ధనిపత్రికకు' చాల వ్యాసములు వ్రాసియున్నారు.

మొదటి యెనిమిది పితూరీలలోను ధనవ్యయము దేశీయప్రభుత్వముల కెంతయయ్యెనో తెలియదు గాని ౧౮౭౯-౮౦ సం.రముల పితూరీకి రూ. ౨౫ లక్షలును, ౧౯౨౨ సం.రపు పితూరీకికూడ రూ. ౨౫ లక్షలును గవర్నమెంటువారికి వ్యయమయ్యె నను నైతిహ్యము కలదు. మొదటి యెనిమిది పితూరీల వ్యయము కలిపినను నిరువదిలక్షలుండునా? కారణ మేమన కొండయవేముని విడచిన తక్కిన పెద్దాపురసంస్థానాధీశుల కంతద్రవ్య మెక్కడిది? ప్రాచీనులు బాహుబలముచేతనే శత్రులం జయించువారుగాని యంత్రపు టాయుధములు వారికి లేవు. గండ్ర గొడ్డళ్లు, ఈటెలు, ధనుర్బాణములు మొదలగునవియే వారి యుద్ధపరికరములు. అల్లూరి రామరాజుగారి పితూరీయందు బ్రిటిషుభటులు మర ఫిరంగులంగూడ నుపయోగించిరి. ఒకసారి ఫిరంగిని గాల్చుటకు కొన్నివందలరూప్యము లగునని వినుదుము.

మొత్తమునకు పదిపితూరీలను జరిపించిన గోదావరీమండల మన్యప్రదేశము మహావీరక్షేత్ర మన నొప్పుగదా! ఆ వీరక్షేత్రమున నేకదేశమగు 'తోటపల్లె' యందు 'శాంత్యాశ్రమము'ను ఓంకార స్వాములవారు స్థాపించుట విచిత్రాంశమై యున్నది.

# చమత్కారచాటువులు

దీపాల పిచ్చయ్యశాస్త్రి

(సంపాదకుఁడు)

నడవకయు నడచివచ్చితి
నడచిన నే నడచిరాను నడచెడునటులన్
నడపింప నడవ నేరను
నడవడికలు చూచి నన్ను నడిపింపరయా!

పరువపుఁ జంద్రునికై వడిఁ
బరిమళజలరాశిలోనఁ బరితృప్తుండై
ధర మూఁడడుగుల నిలుచును
నరుఁడెవ్వఁడుఁగాఁడు, పద్మనాభుఁడు గాఁడున్.

కరచరణంబులు గలిగియుఁ
గరచరణవిహీను చేతఁ గడు దుర్బలుఁడై
పరిభవ మందఁగఁ గనుఁగొని
శిరహీనుఁడు నవ్వె నిట్టి చిత్రము కలదే?

నేలం బడి పొరలాడును
గాలికి నో రావులించి గక్కున మ్రింగున్
వాలమున మంట యుండును
పోలంగా దీనిఁ దెలుపు పురుషులు గలరే?

ఇనుఁ జూచిన వికసించును
మునుకొని శీతాంశుఁ జూడ ముకుళించునయా
కనుఁగొనఁ గమలము కా దది
పనిగొని ముఖ్యముగ నుండు పాంథులయొద్దన్.

పంచభాషాపద్యము

బావ యెక్కడికి గని యా
యావుల నొకదానిఁ దెమ్ము యనఁగా నవు డే
యావని యడిగిన నుడు గది
కావలయున్ భావ తెలుఁగు బుధు లెన్నన్.



# దక్షిణ ధ్రువాన్వేషణ, పరిశోధన

(Discovery and Exploration of the South Pole)

**పుల్లేపు సూర్యనారాయణ**

౧

ధ్రువాన్వేషకుల కథలు తలచుకొన్నచో గుండె లదరును. ఈ యన్వేషణలో అనేకమంది నావికులు ప్రాణములు పోగొట్టుకొనిరి. కొందరు బ్రతికియున్నప్పటికి జీవితసౌఖ్యములను గోల్పోయిరి; వికలాంగులైరి. ఒక్కసారి ఈయన్వేషణోన్మాదము ప్రవేశించినచో నావ్యక్తి నది వదలదు, ప్రాణములనైనను పోగొట్టును గాని. దీనియందలి యాకర్షణకు కారణము దైవమునకెరుక; మనుష్య మాత్రునికి గోచరముగాదు.

నౌకాయానమున పేరెక్కిన అన్నిజాతులవారు వారి నావికా ప్రముఖులను ధ్రువాన్వేషణకై పంపియుండిరి; వేనకువేలు సొమ్ము వెచ్చించిరి. అమెరికా, జర్మనీ, ఇటలీ, ఫ్రాంసు, బ్రిటను, జపాను, ఆస్ట్రేలియా రాజ్యములన్నియు నీ ప్రయత్నములలో పాల్గొనియున్నవి. తుట్టతుదకు దక్షిణధ్రువాన్వేషణగౌరవము నార్వేవారికి దక్కినది. ఉత్తర ధ్రువాన్వేషణగౌరవము అమెరికా సంయుక్తరాష్ట్రముల వారికి దక్కినది.

౨

౧౭౬౮-వ సంవత్సరములో రాయలుసొసైటీవారు జేమ్సుకుక్కు అనేనావికుని శుక్రగ్రహపరివర్తనం పరీక్షించుటకు దక్షిణార్ధగోళమున ప్రయాణముచేయ నియమించిరి. ఇది వీనియాత్రకు ప్రధానకారణము, దీనితోపాటు నెరవేర్చవలసిన మరికొన్నివిధులు వీనికి నియమించిరి. ప్రధానధర్మము నెఱవేర్చి ఇంకను దక్షిణమునకు ప్రయాణము చేయవలయును. ౪౦° ద. వరకు ప్రయాణముచేసిన మార్గమధ్యమున నొకఖండపు భూభాగము కనబడవచ్చును. అట్లు కనబడకపోయినను, దానివిషయమై సూచనలు లేకపోయినను, ౩౫° ౪౦° ద. అక్షాం లమధ్య పశ్చిమముఖముగా ప్రయాణంచేయవలసియున్నది. అప్పటి కి ఏ భూభాగము కనబడకపోయినచో టాస్మనుకనిపెట్టిన న్యూజీలండు తూర్పుతీరముననే ప్రయాణముచేసి, ఆ భాగపు అక్షాంశ, దీర్ఘాంశలు సరిగా నిర్ణయించి, అంతర్భాగము నెంతవరకు పరిశోధింపగలవో అంతవరకు పరిశోధించవలసియున్నది. వీనికి పూర్వవిభాగమునకు ప్రయాణముచేసియున్న ఫ్రెంచినావికుల వృత్తాంతము కుక్కునకు సాహాయ్యముచేసియున్నది.

౧౭౬౮ సంవత్సరము ఆగస్టు ౨౬ వ తేదీని బయలుదేరెను దక్షిణయాత్రకు. జూన్ నెల మూడవతేదీకి 'సొసైటీ' ద్వీపములను చేరెను. చేరి తన డైరీలో నీవిధముగా వ్రాసియున్నాడు. "పరిస్థితులన్నియు ప్రధానవిధికి అనుకూలముగా నున్నవి. ఆకాశం స్వచ్ఛముగా నున్నది. శుక్రగ్రహపరివర్తనం కనిపెట్టుటకు సర్వము వీలుగానున్నది."

సకాలంలో న్యూజిలాండు చేరగలిగెను. అచ్చటినుండి దక్షిణంగా ప్రయాణంచేసెను. తర్వాత ఉత్తరముఖముగా దరిగి ఉత్తర ద్వీపమువరకు పోయెను. తదుపరి దక్షిణద్వీపము చుట్టి తిరిగెను. తుదకు న్యూజిలాండు ద్వీపముగాని దక్షిణఖండముయొక్క భాగముగాదని నిర్ణయించెను.

కుక్కు చేసిన రెండవయాత్రలో అంటార్కిటికా విషయమైన కొన్ని విషయములు స్పష్టపడినవి. మొదట గుడ్‌హోపు మార్గమున ప్రయాణముచేసెను. అచ్చటినుండి తూర్పుగా దక్షిణసముద్రంలో ప్రయాణంచేసెను. ఖండముగాని, ద్వీపమేదైన గాని కనబడలేదు.

ఆరువారములు దక్షిణసముద్రములో నిటు నటు ప్రయాణం చేసినాడు; న్యూజీలాండు దక్షిణభాగముచేరెను. తుదకు అచ్చటినుండి దక్షిణమునకు పోవుట అపరిస్థితులలో ప్రమాదమని తెలిసికొనెను. అచ్చట ఆవరించియున్న హిమము ధ్రువమువరకు వ్యాపించియుండవలెనని యూహించెను. డైరీలో నీవిధముగా వ్రాసియున్నాడు: "ఈ ప్రాంతమున భూభాగ మొకటి యున్నదనుటకు ఏవిధమైనపక్షులు కనబడుటలేదు. కాని యీ హిమమువెనుక కొంత భూభాగ ముండవచ్చును. అట్లున్నను, అది ప్రాణికోటి కేవిధముగను నివాసయోగ్యము గాదు." ఇంటికి తిరిగిపోయెను. ప్రయాణాంతమున తన డైరీలో

నిశ్చయముగా మరల వ్రాసినాడు: "ధ్రువసమీపమున భూభాగమున్న దనుట నిర్వివాదాంశము. వానిలోని కొన్ని భాగములు మేము చూచియే యుండవచ్చును. అధికశీతలము, ద్వీపసమూహము, తేలియున్న హిమశిలలు ఈ విషయమును చెప్పక చెప్పుచున్నవి."

ఇతడు దక్షిణఖండమునుగాని, అంటార్కిటికానుగాని చూడలేకపోయినను కొన్ని ముఖ్యవిషయములు స్థిరపరచినాడు. అతిశీతల సముద్రమున దేహస్వస్థత చెడకుండ ప్రయాణముచేయుట అసంభవము గాదు. అతని ప్రయాణములలో చనిపోయినవారిసంఖ్య మిక్కిలి తక్కువ. అపాయము లేవియు సంభవించలేదు.

## 3

కుక్కు తరువాత సుమారు నలబదిసంవత్సరములవరకు దక్షిణధ్రువమును గురించి ఆలోచించినవారు లేరు. ఈ లోపున బెల్లింగ్సుహాజెను కొంతపాటుపడెను. ఇతడు రష్యాదేశస్థుడు. బయలుదేరి ౧౮౧౯ సంవత్సరములో దక్షిణజార్జియాను చేరినాడు. అచ్చటినుండి సాండ్విచ్ ద్వీపసమూహముచేరి, తరువాత ౬౦° ద. రేఖ వెంబడినే తూర్పుగా ప్రయాణముచేసి అంటార్కిటిక్ మహాసముద్రమును చుట్టి, బయలుదేరినచోటు చేరుకొనెను. కుక్కుకంటె ఒకడిగ్రీ యెక్కువ మేర దక్షిణంగా ప్రయాణంచేసెను. అంతకంటె దక్షిణధ్రువమున కెక్కువ సమీపముగా పోలేదు.

ప్రయాణాంతమున నీతనికి పామరు అనే వర్తకునితో పరిచయము కలిగినది. అతనితో ప్రస్తావింపగా నతడు షెట్లెండు ద్వీపప్రాంతము స్వంతముగా తెలిసినవానివలె కనబడెను. బెల్లింగ్సుహాజను ఆశ్చర్యపడెను. దక్షిణఅమెరికా శాస్త్రవార్లు ఆ భాగములకు పోవుట నాటుక. పామరుమొదలైనవారందరుచే కుక్క బెల్లింగ్సుహాజెనులు చూచినదానికంటె ఎక్కువ జూచియున్నారు. కాని వారెరిగిన విషయములు రహస్యముగా నుంచియున్నారు.

బెల్లింగ్సుహాజెనుతర్వాత మరికొందరు ప్రయాణీకులు అంటార్కిటిక్ వలయమునకు దక్షిణమున, ఎండరుబీలాండు (౧౮౩౧) కెంపులాండు (౧౮౩౪), అడిలైడులాండు (౧౮౩౨) బాల్లెనీద్వీపములు మొదలైన భూభాగము లున్నవని కనిపెట్టిరి.

## ౪

ఇంతటితో ఐరోపా, అమెరికాలలోని ప్రజలయందు పరిశోధనాభిలాష పట్టరానిదాయెను. అందుచేత ననేకములు అంటార్కిటిక్కు ప్రయాణములు సమకూర్చబడినవి.

ఈ ప్రయాణములలో "విల్కిసు" ప్రయాణము ముఖ్యమైనది. (౧౮౪౦) హిమావృతప్రదేశపువ్యాపన సరిగా నిర్ణయించగలిగినాడు. దానియంచులు, సరిహద్దులు మిక్కిలి నిర్దుష్టముగా స్థిరించగలిగెను. ఆ భాగములలో రక్తముసహితము శరీరములో పేరుకొని పోవునంతటి హిమ ముండును. అట్టి ప్రదేశములలో ౨౦౦౦ ల మైళ్లు ప్రయాణము చేసినవాని ఖ్యాతికి అంతములేదు.

అన్నిటికంటెను ముఖ్యమైన ప్రయాణము 'రాసు' ప్రముఖునిది (౧౮౪౦--౪౩). అతని ఓడపేరు టెరరు (Terror). ఇది దాని సార్థనామము. సముద్రం దీనిని చూచి భయపడినదనవచ్చును. ఇతనిప్రయాణమునకు ముఖ్యోద్దేశ్యము కాంతత్వము (Magnetism) విషయమై కొన్ని పరిశోధనలు వేర్వేరు అక్షాంశములపై గావించి, కాంతధ్రువము (Magnetic Pole) ను కనుగొని స్థిరించుట. ఇందుల కితను కూడ ప్రయాణములు కావించెను. ఇట్టి శాస్త్రీయ పరిశోధనలకు (Scientific Observations) తోడు ఇదివరకే కనిపెట్టబడిన ధ్రువప్రాంతములకు విక్టోరియాలాండును చేర్చెను. పూర్వపు యాత్రికుల కంటె ఎక్కువ సమీపముగా ధ్రువము చెంతకు పోగలిగెను.

## ౫

ఇంతటితో ౧౯ వ శతాబ్ది అంతమొందెను. ౨౦ వ శతాబ్దిలోనే సరియైన పరిశోధనలు జరిగినవి. 'స్కాటు' అనే పరిశోధకనాయకుడు ౧౯౦౧ సంవత్సరము ఆగస్టునెలలో ఇంగ్లాండునందు బయలుదేరెను. ఆరునెలలలో 'అడేరు' అగ్రమును సమీపించెను. 'రాసు' సముద్రమును పరిశోధించెను. కింగ్ యెడ్వర్డుసెవెంతులాండు కనిపెట్టెను. ఆసముద్రపు తూర్పుతీరమును చేరి ఎరిబిరస్, టెరర్ అనే పర్వతములు ప్రత్యేకద్వీపములేగాని, యితనిపూర్వులనుకొనినయట్లు అంటార్కిటిక్ భాగములు కావని స్పష్టపరచెను. అనుచరులతో కలిసి విక్టోరియాలాండు పీఠభూమిపై కొంతదూరము ప్రయాణము చేసెను. స్లెడ్జి బండ్లమీద మరికొంతదూరము ప్రయాణంచేసిరి. ఇట్లు అంటార్కిటికా భూభాగపునైఋతి కొంతవరకు చూడగల్గిరి.

ఇతనితర్వాత నల్గురొకరితర్వాత నింకొకరు నాల్గు అయిదు సంవత్సరములలో ప్రయాణంచేసిరి. ౧౯ వ శతాబ్దంలో అంటార్కిటికా విషయమై తెలియని కొన్ని సంగతులు బైటపడెను. కాని పరిశోధకులు చేయవలసినపనులన్నియు నట్లేయున్నవి. 'రాసు' నావికుడు కనుగొనబోయిన కాంతధ్రువము ఎవ్వరును చేరలేదు. దక్షిణధ్రువము నెవ్వరును కనుగొనలేదు. అంటార్కిటికా అజ్ఞాతముగనే యున్నది. అది యేకఖండమా, లేక మరికొందరూహించినట్లు రెండుదీవులా అను విషయము లింకను తేలలేదు.

౧౯౦౯ సంవత్సరములో నొక విషయము తేలియున్నది. "షాకిలుటను" అనే నావికుడు వాని యనుచరులతో కలిసి కాంతధ్రువము చేరగల్గెను. (౭౨°౨౫' ద; ౧౫౫°౧౬' తూ) దక్షిణధ్రువం చేరుటకు తీవ్రప్రయత్నం చేసెను. వలనుపడలేదు. ౮౮°౨౩' ద. వరకు పోగల్గెను. కాని భోజనసంభారము లయిపోయెను. శీతగాలు లతితీవ్రముగా వీవప్రారంభించెను. కాని తగిన యేర్పాట్లతో ప్రయ

క్షించినచో దక్షిణధ్రువమును చేరుట అసంభవముకాదని ప్రపంచకమునకు స్పష్టపరిచెను. షాకిలుటను తన చివర ప్రయాణమున జార్జియాలో చనిపోయెను. వాని జ్ఞాపకార్థమై నేటికిని అచ్చట రాతికట్టడమొకటి యున్నది.

దక్షిణధ్రువమును చేరు గౌరవము అముండ్సెనుకు దక్కె అదృష్టమున్నది. ఇతడు ఉత్తరధ్రువం విషయంలో కూడ పేరు పొందినవాడే! ఇతడు తన జీవితమును ధ్రువముల పరిశోధనకే ఆహుతిచేసెను. శీతకాలమును వేల్సు అఖాతములో గడిపి, దక్షిణంగా ప్రయాణము చేసెను. ౧౯౧౧ సంవత్సరము డిశంబరు నెల ౧౪ వ తేదీని దక్షిణ ధ్రువము చేరకలిగెను. ఇంతకుపూర్వ మెవరును చూడని భాగములు కొన్ని చూచెను. ఖండపులోపలి భాగమును కొంతవరకు పరిశోధించకలిగెను. అన్నిటికంటెను ముఖ్యమైన విషయము - దక్షిణధ్రువము భూభాగమునకు మధ్యనున్నదిగాని ఉత్తరధ్రువమువలె మహాసముద్ర మధ్యమున లేదని స్పష్టపరచినాడు.

ఐరోపాలో ఆర్. యఫ్. స్కాటు పేరును విననివా రుండరు. దక్షిణధ్రువమును మొదట చూచు పేరు ఇతనికి రావలసినదే! కాని దురదృష్టవశమున అముండ్సెనుకంటె ౩౨ రోజులు దక్షిణధ్రువమును చేరుటలో ఆలస్యమయ్యెను. దారిలో ఓట్సులాండును కనిపెట్టెను. వాని యనుచరులందరును దారిలో చనిపోయిరి. చివరకు తానుగూడ దారిలో చనిపోయెను. ౧౯౧౨ సంవత్సరము మార్చి నెల ౨౯వ తారీఖున తన డైరీలో నీవిధముగా వ్రాసియున్నాడు. ఇవి వాని తుది పలుకులు. " ఈ ప్రయాణ ఫలితం విషయమై నాకు విచార మావంతయు లేదు. ఇంగ్లీషువారొకరికి నొకరు సాహాయ్యం చేతురనియు, అష్టకష్టములు పడుచున్నను ధైర్యమువీడకుండ ప్రాణములు సమర్పింపగలరనియు విదితమైనది. ఈ ప్రయాణమున నిట్టికష్టము లున్నవని మాకు తెలియకపోలేదు. ప్రాణభయ మున్నదనియు తెలియకపోలేదు. ఇవన్నియు తెలిసియున్నను కీర్తికాంతకై యీ ప్రయాణమును చేసియున్నాము. దైవికమునకు వగవబనిలేదు. కంఠమున ప్రాణము లున్నంతవనుక చేయసాధ్యమగునది చేయ నిశ్చయించుకొంటిమి"

ఈవాక్కులు పరిశోధకులకు ఇంకను ఉత్సాహమును గలుగజేసినవి.

ఇంతవరకు అంటార్కిటికా యొక్క ఆద్యంతములు చూచుట పడలేదు. ౧౯౨౧ సంవత్సరము షాకిలుటను తిరిగి 'క్వెస్టు' అనే ఓడలో బయలుదేరెను. ఎండరుబీలాండు తీరమును పరిశీలించి దక్షిణ షెట్లెండు ప్రాంతపుసముద్రమును సంపూర్ణముగా పరిశోధింప తలచుకొనెను. కాని ప్రయాణమధ్యమున సౌతు జార్జియాలో చనిపోయెను (౧౯౨౨).

ఇతని తరువాత 'వైల్డు' అనే యితని యనుచరుడు మిగిలిన యత్నమును సాగించెను. ఇతడు హిమవ్యాపన ఆద్యంతములు, వైశాల్యము, లక్షణములు కనుగొనెను. ౧౮° తూర్పు మొదలు ౫౨° పశ్చిమమువరకును, ౬౩° దక్షిణము మొదలు ౭౦° ద. వరకు హిమము వ్యాపించియున్నదని నిర్ణయించెను.

అంటార్కిటికా పరిశోధనకు అంతములేదు; జరుగుచునే యున్నది. ౧౯౨౮, ౧౯౨౯ సంవత్సరములలో ధ్రువప్రాంతపరిశోధనకు నాల్గు ప్రయాణములు జరిగినవి. ఈప్రయాణములు పొగయోడలపై జరుగలేదు. అప్పటికి వాయువిమానము లిందుల కుపయుక్తములోనికి వచ్చినవి. ౧౯౨౯ లో బైర్డువైమానికుడు చేసిన వాయుప్రయాణము మిక్కిలి ముఖ్యమైనది. ఇతడు వేల్సుబేలో బయలుదేరి, మేరీబేర్డులాండు శోధించి, దక్షిణధ్రువమునుచేరి తిరిగివచ్చెను.

'విల్కిసు' వైమానికుడు ప్రయాణముచేసి, శోధించి గ్రాహాంలాండు అనబడునది అంటార్కిటికా యొక్క అగ్రభాగముగాదు, రెండుద్వీపములు అని నిర్ణయించెను. గ్రాహాంలాండుకు దక్షిణముగ 'హెరస్టులాండు' అను ఒకభూభాగ మున్నదని కనిపెట్టెను.

తరువాతి వైమానికులు కెంపులాండుకు తూర్పుగా మాక్ రాబర్టుసన్‌లాండ్, యెండరుబిలాండుకు పశ్చిమంగా క్వీనుమాడ్ లాండు, ప్రిన్సుమార్తాలాండు లున్నవని కనిపెట్టి, సముద్రగర్భ పరిశీలనాశాస్త్ర (Oceanography) విషయములను కొన్నింటిని నిర్ణయించిరి.

౧౯౩౧ సంవత్సరమున "నార్వీజియా" విమానము అంటార్కిటికా ఖండమును ఒకమారు చుట్టినది. ఈ ప్రయాణవిషయములు సవిస్తరముగా "స్కాటుపోలారు రిసెర్చి ఇన్‌స్టిట్యూటు" అనువారు "పోలారు రికార్డు అనేపేరుతో ౧౯౩౨ సంవత్సరమునుండి ప్రకటించుచున్నారు. వీనినుండి అనేకమగు విషయములు తెలిసికొనవలసి యున్నవి.

ఈ విధముగా అంటార్కిటికాతీరరేఖ యేర్పడుచున్నది. ఒక్కొక్క నావికుడు వేసిన యంచనాలలోని లోపములు క్రమక్రమముగా తేలుచున్నవి. అందుచే మొదటినావికులు మేధావంతులు కారనుట యొక తెలివితక్కువతనము. అప్పుడున్న పరికరములతో నామాత్రము నిర్వహించుటయే అధిక్యము. వా రంతవరకుచేయుటచేతనే పరిశోధన ఇంతవరకు రాగల్గినది. పరిశోధనాప్రపంచకములోని తప్పొప్పులు తప్పవు.



# భీమరాజు - గోకర్ణుఁడు

## శేషాద్రి రమణకవులు

హనుమకొండలోని రుద్రదేవుని శాసనమువలన భీమరాజు, గోకర్ణుఁడు అను నిరువురు వ్యక్తులు మనకుఁ బరిచయులగుచున్నారు. వీరలెవరు? వీరి రాజధానియేది? వీరినిగూర్చిన ప్రత్యేకచరిత్ర మేది యను సంశయమునఁ దగిన పరికరములు నిజాము రాష్ట్రమునఁగల అజ్ఞాత శాసనసముదాయమున మరుఁగుపడియున్నవి. వాని నాధారముగఁ జేసికొని ఈ వీరపురుషుల జీవితచరిత్రము సంగ్రహముగాఁ దెలుపుటయే ఈ వ్యాసరచనోద్దేశము.

భీమరాజు పెద్దవాఁడు. అతని సహోదరుఁడు గోకర్ణుఁడు. వీరు ఆంధ్రచోడవంశమునకుఁ జెందినవారు. తమ కులగోత్రాదికములను వీరలిరువురును గలిసి మహబూబునగరు జిల్లాలోని అమరాబాదు తాలూకా మామిళ్ళపల్లి లోని నృసింహాలయమున నొకశాసనమున స్థాపించిరి. అందు దీ క్రింది చరిత్రాంశములు గలవు:

"తీవ్రాంశువంశతిలకః కలికాలకర్ణో
గోకర్ణ ఇత్యభవ దృవనైకవీరః,
యోమిత్రమండల అపత్రప ఏకయుద్ధే
ముక్తింగతోన ఘనరావ మృధే కదాచిత్.

అథాభూ దుదయాదిత్య స్సత్యసంధ స్సత స్తతః
చోడఖ్యాతిమయీ యస్య మయూఖవితతిక్షితౌ.

తస్యధర్మసుతం దేవం ధార్మికత్వం కిముచ్యతే,
ప్రాప్తాయుద్ధే మృతే ర్యస్య మిత్రైః పుణ్యాంకురై రివ.

అథ తత్కృతి నక్షత్రగణ ప్రగుణ తేజసః,
భీమగోకర్ణ భూపాలౌ సూర్యచంద్రా వివోదితౌ.
నిస్సీమ ప్రేమబంధేన సమానసుఖయో ర్యయోః,
ఐకాత్మ్యంమన్యతే లోకా ద్యథాపురమురద్విషోః."

ఈ శాసనమునందుఁగల చరిత్రాంశము లింతవఱకె. శకాబ్దము లేదు. "విళంబికార్తికేమాసే విశుద్ధేద్వాదశీతిథౌ" అని సంవత్సరాదికము మాత్రము సూచింపఁబడినది. పైశ్లోకములవలన ఈ క్రింది వంశవృక్షము ఏర్పడుచున్నది.

సూర్యుని వంశమునందు గోకర్ణుఁడు

ఉదయాదిత్యుఁడు

భీమరాజు గోకర్ణుఁడు

భీమరాజు తుమ్మటి గ్రామమునందలి కాలువను, గోకర్ణుఁడు మండిగంటి గ్రామభాగమును నృహరికి సమర్పించిరి. ఇందు మూలపురుషుఁ డగు మొదటి గోకర్ణుఁడు కలికాలకర్ణుఁడు చోడవంశమునకుఁ గీర్తి కలిగించినాఁడు. గోకర్ణచ్ఛందస్సు, నాగేంద్రుని శిష్యత్వము లోనగునవి ఈ మొదటి గోకర్ణునకు సంబంధించినవి కావచ్చును. ఉదయాదిత్యుఁడు చరిత్రప్రసిద్ధుఁడు. రుద్రదేవుని శాసనమందు ప్రోలరాజును బ్రశంసించు భాగమున ఈ యుదయరాజు ప్రశంస యీ క్రిందివిధముగాఁగలదు:

"యోకుంఠోరిప తేరకుంఠ కుంతపరశుశ్లిష్టాగ్రధారోల్లసత్
ధారాపాతనిపాతనైకచతురం గోవిందరాజాహ్వయం,
బద్ధ్వాన్ముచ్యతదోదయక్షితిభృతేః రాజ్యం దదౌ లీలయా"

ప్రోలరాజు వీరుఁడగు * గోవిందరాజును బంధించి విడిచివేసి యాతని రాజ్యమును ఉదయరాజునకు నొసంగెను. ఈ యుదయరాజే మామిళ్లపల్లి శాసనములోని ఉదయాదిత్యుఁడు. గణపేశ్వరము శాసనములోని ప్రోలరాజు ప్రశంసయందుఁగల "కేచిత్ స్వస్యపదేషుయే నిహితా శ్చోడోదయ స్త్వేశవత్" అను భాగముగూడ నీ యుదయాదిత్యున కన్వయించునదే. ఆంధ్రచోడవంశజుఁడును, వీరుఁడును నగు ఉదయాదిత్యుఁడు పశ్చిమచాళుక్య సామ్రాజ్యము క్షీణించిన పిమ్మటఁ గాకతీయచక్రవర్తియగు ప్రోలరాజునకులోఁబడి రాజ్యము పాలించుచు రాజద్రోహియగు గోవిందరాజు శిక్షితుఁడైన పిమ్మట నతని రాజ్యమునకుఁ గూడ ప్రభువైనాఁడు. ప్రోలునియనంతరము రుద్రదేవుఁడు రాజ్యమునకు వచ్చినపుడు ఉదయాదిత్యుని కుమారులగు భీమరాజు, గోకర్ణుఁడు పితృరాజ్యమునకుఁ బరిపాలకులైరి. కొంతకాల మీ సోదరు లిరువురు ఏకభావముతో శివకేశవులవలెఁ గలసి యుండిరి. పిమ్మట నెవరికి

* ఈ గోవిందరాజు కందూరునకు ౨౦ మైళ్ళ దూరమునగల అమ్మాపురము పాలించినరాజనియు, ఇతఁడు బలవంతుఁడై ఉదయరాజు రాజ్యమును హరింపఁగాఁ గాకతి ప్రోలరాజు వానిజయించి ఉదయావనీపతికిఁ దిరుగ రాజ్యము నొసంగెననియు, కోమర్రాజు భరతయ్యగారను పరిశోధకులు దెలుపుచున్నారు.

వారుగఁ జేలి ధర్మములు గావించిరి. అందు భీమరాజుశాసనములు లభింపలేదుగాని గోకర్ణుని శాసనములు మాత్రము అందందు గోచరించుచున్నవి. గోకర్ణుఁడు దయా సత్యశౌచసంపన్నుఁడగుటచే దుర్మార్గుఁడగు భీమరాజును వ్యతిరేకించెను. తత్ఫలితముగా రుద్రదేవుని శాసనమునందలి ఈక్రింది శ్లోకానుసారముగ దుర్మరణము నొందెను

"భీమేన భీమనకులేన కులేనహీనో
గ్రస్తో మమార గృహమూషకవత్ క్షణేన,
మార్జారడింభకవరేణ మహాంధకారే
గోకర్ణనామభుజగో భువి శూరమానీ."

భీమరాజునకుఁ గల విశేషణములలో "హన్తా భ్రాతృవరస్య భోజనవిధౌ" అనునది యొకటి. కాన భీమరాజు గోకర్ణుని భోజనకాలమున నమ్మించి చంపినది వాస్తవము. ఇంతటితో గోకర్ణుని చరిత్రము సమాప్తమైనది.

భీమరాజు సోదరుని రాజ్యము నాక్రమించుకొనినాఁడు. అంతఁ బోక పితృమరణానంతరము అతనిభార్యలలో నొకతెను (చవితితల్లిని) ఉంపుడుకత్తెను జేసికొనినాఁడు. దురాశాపరవశుఁడై పరరాజ్యము లకుఁ జైకొన్నాఁడు. చిన్నచిన్న సామంతరాజులఁ దిరుగఁదీసి కాకతీయ సామ్రాజ్యము నేలు రుద్రదేవచక్రవర్తికిఁ దిరుగఁబడినాఁడు. (చూ. అనుమకొండశాసనము ౨౦-౨౧ శ్లో) అంతియగాక రుద్రదేవుని పరాక్రమమునకు వెఱచి మరణించిన చోడోదయుఁడగు తైలపుని రాజ్యమును దనరాజ్యములోఁ గలుపుకొన్నాఁడు. అందులకై రుద్రదేవుఁడు భీమరాజును వధించి తద్రాజ్యము గైకొనవలసిన యవసరము తటస్థించినది. భీమరాజు రుద్రదేవుని ధాటికి వెఱచి మరణించిన తైలపదేవుని రాజ్యమును హరించెనని ఈక్రింది శ్లోకమువలన స్పష్టపఱుపఁబడినది:

'యాతేఽపి తైలపనృపే దివమస్య భీత్యా
సర్వాతిసారకబలీకృతిగాత్రయష్టౌ,
శ్రీరుద్రదేవనృపతేః పృథువిక్రమస్య
భీమోపి రాజ్యపదవీం క్షణికాం స లేభే.'

ఇట రుద్రదేవుని ప్రత్యర్థియై యాతనిధాటికి మరణించిన తైలపదేవుని వృత్తాంతము గ్రహించినగాని భీమరాజు చరిత్రము సంపూర్ణము గాదు. హనుమకొండశాసనములో నొక తైలపదేవుని ప్రశంస ప్రోలుని చరిత్రమునఁగలదు. ప్రోలరాజు చాళుక్యచూడామణియగు తైలపదేవుని బంధించి భక్త్యనురాగములచే విడిచెను. ఈ చాళుక్య తైలపదేవుఁడును, రుద్రదేవుని ధాటికి వెఱచి మరణించిన తైలపదేవుఁడును భిన్నవ్యక్తులు.

ప్రోలరాజునాఁటి చాళుక్యచూడామణియగు తైలపుఁడు ఆఱవవిక్రమాదిత్యునకు మనుమఁడు. మూఁడవసోమేశ్వరుని తనయుఁడు. ఈతనిని మూఁడవతైలపదేవుఁడని యందురు. ఈ తైలపదేవుఁడు క్రీ. శ. ౧౧౫౧ నుండి ౧౧౬౨ వఱకు రాజ్యమును బాలించినాఁడు. క్రీ. శ. ౧౧౫౭లో కాలచుర్యవంశజుఁడును, సామంతుఁడును నగు బిజ్జలుఁడు నీతైలపుని రాజ్యము నూడలాగుకొని దూరముగఁబోఁదోలెను. అందుచే తైలపుఁడు తొలుత ధార్వాడమండలములోని అన్నిగిరిలో నూతన రాజ్యము నెలకొల్పెను. బిజ్జలుఁ డచటకును వచ్చి ముట్టడించుటచే నారాజ్యము వదలివేసి ఇంకను దూరముగనున్న వనవాసిలో రాజ్యము నెలకొల్పి క్రీ. శ. ౧౧౬౨ లో మరణించినాఁడు. హనుమకొండ శాసనము క్రీ. శ. ౧౧౬౩ న నెలకొల్పఁబడినది. అందంతకు తో ముందు గతించినటులఁ జెప్పఁబడిన తైలపుఁ డింకొక వ్యక్తియై తీరవలయును. ఆ వ్యక్తిరాజ్యము భీమరాజు ఆక్రమించుకొనుటకుఁ దగినదిగా నుండవలయును. ఉపలబ్ధములగు నాధారములచే నీమరణించిన తైలపుఁడెవరో తెలిసికొనుటకవకాశములు గలవు.

రుద్రదేవుఁడు అనుమకొండరాజ్యమును బాలించుకాలమున చోడవంశజుఁడు, భీమరాజునకు జ్ఞాతికుటుంబములోనివాఁడును నగు తైలపదేవుఁడనురాజు కోడూరు రాజధానిగఁ జేసికొని పరిసర భూభాగములను బాలించుచుండెను. భీమరాజ రాజధానియగు వర్ధమానపురమునకు ఈకోడూరునకు నాలుగామడలదూరము. ఇరువురిరాజ్యముల కును సరిహద్దు ఒకటియె. త్రిభువనమల్లదేవుని సామంతుఁడైన చోడవంశజుఁడగు తైలపదేవుఁడు చందలదేవికి భర్త. ఇతని పట్టపు రాణి లక్ష్మీదేవి. కుమారుఁడు పెమ్మనడిదేవుఁడు. కోడలు గిరిదేవి. బూదపూరులోనను, నెక్కొండయందును విక్రమశకవర్షములు ౮౬ ప్లవసంవత్సరము శ్రావణ అమావాస్య ఆదివారమునందు శాసనములను నెలకొల్పుచు తైలపదేవుఁడు తాను చోడవంశజుఁడననియు, కోడూరు తన రాజధానియనియుఁ జెప్పుకొనినాఁడు. ఈతైలపదేవుఁడు వేంగీశ వంశదవదహన, ప్రోరమశేయసవనాది బిరుదములను బూదపూరు, నెక్కొండశాసనములలో సమముగఁ జెప్పుకొనెను. ఈరెండు శాసనములందును కోడూరు తన రాజధానియనియు, కందూరులోని భూమి రామేశ్వరునకు దానముగ నిచ్చితిననియు వ్రాయుటచే నీతఁడు కందూరుమండలములోని కొంతభాగమునకును, వర్ధమానపురము సరిహద్దులలో నున్న కందూరువఱకును రాజని తెలియును. ప్రోరమశేయసవన యను విశేషణముచేఁ గాకతిప్రోలరాజున కీతఁడు ప్రత్యర్థిగ నుండి యాతని నెదిరించినకతన యనంతరము రుద్రదేవునకుఁగూడ విరోధిగఁ బరిణమించెనని విశ్వసింపవచ్చును. కావుననే రుద్రభూవల్లభుఁడు తైలపుని జయింపవచ్చి విజయము నొందెను. రుద్రదేవునకు వెఱచి ఈ చోడతైలపుఁడు మరణింపఁగనే సమీపముననున్న భీమరాజు తైలపదేవుని రాజ్యమునంతయు నాక్రమించుకొనెను.

తైలపదేవుని నిర్యాణానంతరము భీమరాజు అతని రాజ్యమును హరించెను. ఇది క్షణికము. ఈయంశము చారులవలన విని భీమరాజు దుశ్చేష్టల నాలకించి యాతనిపైకి దండయాత్రకు రుద్రదేవచక్రవర్తి బయలుదేరెను. తొలుత రుద్రదేవుఁడు గొప్ప ప్రాకారముతో బల

# EAST & WEST

## INSURANCE CO., LTD.

# ఈస్టు అండ్ వెస్టు

## యిన్సూరెన్సు కంపెనీ., లిమిటెడ్.

హెడ్ ఆఫీసు:—ఈస్టు అండ్ వెస్టు బిల్డింగు, అపోలో వీధి, ఫోర్టు, బొంబాయి.

ప్రాతినిధ్యము వహించి
పని చేయుటకును,
భీమా చేయుటకును
ఉత్తమమైన కంపెనీ.

ఈస్టు అండ్ వెస్టు
మీ ఆదాయమును
వృద్ధిపరచుకొనుటకు
సాటిలేని సౌకర్యముల
నొసంగును.



బొంబాయిలోని
ఈస్టు అండ్ వెస్టు బిల్డింగు.

ప్రతికార్యమునకును
ప్రతివారికి అందుబాటు
లో నుండులాగున
ఆధునిక పద్ధతులపై
యేర్పరిచిన పాలిసీలు.

---

హెడ్డాఫీసువారివలన ఆదరణపూర్వకమగు సహకారము నొసంగబడును. పాలిసీహోల్డర్లకు సమస్తమైన సదుపాయములు గావింపబడును.

**ఈస్టు అండ్ వెస్టువారి యీ మూడువిధములైన ప్రత్యేక లక్షణములవలన, ధనార్జనము పుష్కలముగా చేసికొనువారికి మంచి యవకాశము లభించును.**

వివరములకు:— దలాల్ అండ్ కో, శెక్రటరీస్, బొంబాయి.

జే. యస్. రెడ్డి, బ్రాంచి శెక్రటరి, 121 ఆర్మీనియన్‌వీధి, మద్రాసు.

1. యస్. జే. రెడ్డి అండ్ సన్సు, చీఫ్ యేజంట్లు, గౌరీశంకర్, కడప. 2. గంగస్వామిబ్రదర్సు, బళ్లారి, అనంతపురం జిల్లాలకు చీఫ్ యేజంట్లు



# డోంగ్రేస్ బాలామృతము

## బిడ్డలకు యిది ఆదర్శనీయ మయిన ఆహారము

బక్క—చిక్కి బలహీనముగా నున్న పసిపిల్లలకు బలమును కలిగించి దృఢముగా నుండునట్లు చేయును. ఎముకలను గట్టిపరచును. చిరకాల వ్యాధులను నివారించును. దగ్గు అంతర్గత జ్వరము మున్నగు వాటిని పోగొట్టును.

## ఎదిగెడు బిడ్డలకు యిదియే సరియైన ఆహారము

Madras Agents:—A. B. PAREKH, 268, China Bazar.

**Prop. K. T. DONGRE & Co., Girgaum, Bombay.**

మద్రాసు యేజంట్లు:—ఏ. బి. పరేఖ్, 268, చైనాబజారు.

ప్రొప్రయిటర్లు: కే. టి. డోంగ్రే అండ్ కంపెనీ., గిర్గాం, బొంబయి.

## ఇటలీ అబిసీని ద్ధ చిత్రము



స్సి సానుచరుడగు బిసీని సేనాని



యుద్ధ సన్నద్ధయగు అబిసీనియాయువతి



అబిసీనియా చక్రవర్తి అంగరక్షకులు



రణోత్సాహముతో పరువిడుచున్న అబిసీనియా యోధులు



'కడవా నెత్తినబెట్టి' —యస్. వి. యస్. రామారావు.

విస్తీర్ణ దుర్గముగానున్న వర్ధమానపురమును ముట్టడించి దానిని దనకోప వహ్నిచే వేల్చివైచెను. ఈయంశమె ఈక్రింది శ్లోకములలో హనుమకొండ శాసనమునందుఁ జెప్పఁబడెను:

"గత్వా జవా త్త్రిచతురాణి పదాని రాజా
సస్యస్య ఖండన మివ ప్రథమాహుతింవా,
భ్రూభంగవీక్షణ వివర్తితకోపవహ్నౌ
యద్వర్ధమాననగరీం ప్రసభం జుహావ"

రుద్రదేవుఁడు వర్ధమానపురమును ముట్టడించి ప్రతిపక్షసైన్యమును జెండాడుటజూచి పరాజయశంకచే భీమరాజు రాజ్యమును, భోగభాగ్యములను విడిచి అవరోధకాంతలను వెంటఁగొని లజ్జావిహీనుఁడై ప్రాణరక్షణముకొఱకు అరణ్యములకుఁ బోయెను. వర్ధమానపురమునందు భీమరాజు నేలలోని సొరంగమునుండి పోయినటుల నేటికిని గ్రామవాసులు కొన్ని దృష్టాంతములను జూపుచున్నారు. రుద్రదేవుఁడు కొంతదూరము భీమరాజును వెన్నంటి యాతఁడు గనఁబడక పోవుటచే వెనుకకు మఱలి చోడోదయుఁడనఁబడు భీమరాజు నగరము దహన మొనరించి నగరమధ్యమునఁగల యుద్యానవనము నూడబెరికించి దుర్గమును భేదించి నగర ప్రాకారమును గట్టుఁజేసి నగర మధ్యమునం దొక గొప్పతటాకము నేర్పఱచి విరోధికి ఆనగరము మరల ఆశ్రయము గాకుండఁజేసెను శిథిలమగు వర్ధమానపురమున నేటికిని రుద్రదేవునిపరాక్రమచిహ్నములు గోచరించుచున్నవి.

కందూరు తొలుత తైలపదేవుని రాజ్యములోని దగు కోడూరునకు శాఖానగరము, తైలపదేవుని మరణానంతరము భీమరాజు నగర రాజమును ఆక్రమించుకొని పూర్వరాజకుటుంబమును నిర్బంధమునందుంచి కాకతీయరాజ్యమునకు ఎదురుతిరిగెను. రుద్రదేవుఁడు వర్ధమాననగరము నాశనముగావించినపిదప చోడోదయుల కాశ్రయముగానున్న కందూరుజయించి యచటి సర్వభాగ్యములను జూరగొని తైలపదేవుని పుత్రికయగు పద్మావతిని బరిగ్రహించెను. రుద్రదేవుని ధాటికి వెఱచి తైలపదేవుఁడు మరణించుటచే నాతని భార్యలు సహగమనము గావించిరి. కోడూరులో ఈ సహగమనస్థలమున నొక స్తూపముగట్టి యీతని వంశజులు గతించిన వీరుల జ్ఞాపకార్థముగ వీర విగ్రహములను స్తూపముచుట్టును బ్రతిష్ఠజేసిరి. నేటికిని కోడూరులో నీ వీరవిగ్రహములుగలభాగము పూజనీయప్రదేశముగఁ "బిందమనుపేర" బవిత్రస్థలముగ భావింపఁబడుచున్నది. తైలపదేవునితో కోడూరు కందూరు రాజ్యములును, భీమరాజుతో వర్ధమానపురరాజ్యము అంతరించి కాకతీయసామ్రాజ్యములోఁ గలసిపోయెను. ఇంతతో నీ యాంధ్రచోడుల రాజ్య మంతరించుటచేఁ దద్వంశజులు కాకతీయరాజ్యమున కంకితులై రాజకీయోద్యోగులుగ మారిపోయిరి. మహబూబు నగరమండలమునుండి పనపర్తిసంస్థానమున కేగు త్రోవలో ౩౦ మైళ్లపైన కందూరు. జటచర్లనుండి నాగర కర్నూలుపోవు త్రోవలో ౨౦ మైళ్లపైన వర్ధమానపురము మహబూబునగరు రైలుస్టేషనునకుఁ బ్రక్కదిగ కోడూరు నేటికిని నాఁటిచరిత్రములకు జ్ఞాపకచిహ్నములుగ నున్నవి.

భీమరాజు చాళుక్యుఁడగు మూఁడవతైలపుని జయింపనేగిన టులఁ జరిత్రాధారములు లేవు. బిజ్జలుఁడు స్వతంత్రుఁడై కల్యాణ నగరమున రాజ్యము నెలకొల్పియుండ నాతనిఁ దిరస్కరించి యావల నెందో నూతనరాజ్యము నెలకొల్పిన తైలపదేవుని జయింప భీమరాజు పోవుటగాని, క్రీ. శ. ౧౧౬౫ వఱకు జీవించిన మూఁడవ చాళుక్యతైలపునకు క్రీ. శ. ౧౧౬౨ లోని రుద్రదేవుని శాసనము నాఁటికి మరణించుటయుఁగాని బొసఁగదుగాన సరిహద్దులలో జ్ఞాతులగు చోడతైలపదేవుఁడు, భీమరాజులతో రుద్రదేవుని శాసనాంశములకు సమన్వయము కుదురుచున్నదిగానదియె విశ్వసింపఁదగు మార్గము. భీమరాజు అడవులపాలగుటతోఁ జోడరాజ్యమంతయుఁ గాకతీయుల హస్తగతమయ్యెను. మల్యాలవంశజులగు దన్న సేనానాయకుఁడును, అతనికుమారుఁడగు జావసేనానియుఁ జోడరాజ్యమునకుఁ, గాకతీయ సామ్రాజ్యమునకుఁ బ్రతినిధులుగ రుద్రదేవునిచే నియోగింపఁబడిరని బూదపూరులోని గుండయసేనానిశాసనమువలన గ్రహింప వీలగుచున్నది.

నల్లగొండయొద్దగల పానుగంటిలో నొకశాసనఖండము లభించినది. అడ్డముగా వ్రాయఁబడిన ఆశాసన శిలయందుఁజివరభాగము విరిగిపోయినది. అందుచే నందలి శ్లోకము లసంపూర్ణములుగ నున్నను అందుండి యీక్రింది చరిత్రాంశము నిర్ణయింప వీలగుచున్నది.

సోమరాజు భార్య బిడగాదేవి
|
పుత్రి మేలాంబిక

౧. ఉదయాదిత్యుఁడు ౨. భీమరా ౩. గోకర్ణుఁడు

ఇందుఁగల మేలాంబిక యెవనిభార్యయో తెలియదు. ఉదయాదిత్యుఁడనువాఁడు పానుగంటిరాజ్యమునకుఁ బాలకుఁడుగానుండి పండితారాధ్యులనఁబడు మల్లికార్జున పండితారాధ్యులను ద్వేషించి శాపగ్రస్తుఁడై మరణించినటుల పాలకురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రములోనఁగల యీక్రిందిభాగములవలన మనము గ్రహింపవచ్చును.

కాదింకనీ పానుగంట నుండఁగ మ
హాదేవుభక్తుల కసుచుఁగట్టలుక
మసలక పండితమల్లికార్జునుఁడు
వెసఁదలిర్పఁగఁ బురివెడలంగ వెనుక
నక్కజంబుగఁ బూచె నంతకల్పొన్న
కొక్కొక్కరో పుట్టిని కూసె కలొక్కడి

పురిమహోత్పాతముల్ పుట్టె నెండియును
పురము పాడగునని బుధులుగలంగ
విదితశాపోద్ధతవిలయోగ్రవహ్ని
కుదయావనీశుఁ డాహుతియయ్యెఁ బుత్ర
పౌత్రులన్యోన్య కళత్రాభినిరతి
శత్రులై చీఁకటి చప్పరంబులను
దడయ కాసురియచేఁ దన పురిజనము
లడరంగ నిర్మూలమై రట్టుగూడె
సంతానమెల్ల నిస్సంతాన మయ్యె.

మహిమా ప్రకరణము, పుట ౩౦౧.

పండితారాధ్యుల శాపముచేఁ బానుగంటి ఉదయరాజుకుటుంబము నిశ్శేషముగ నశించినది. ఉదయరాజుశాసనము తర్కాబ్ధిదిక్మితే కాలేయనుటచే శా. శ. ౧౦౮౬ క్రీ. శ. ౧౧౬౪ అగుచున్నది. నిస్సంతతిగా నశించిన యీ కుటుంబము కాకతిరుద్రదేవుని ప్రతిపక్షివర్గమునకుఁ జెందినదికాదు. కాన నీ వంశమునకును వర్ధమానపురము బాలించిన భీమరాజ గోకర్ణుల వంశమునకును ఎట్టి సంబంధము లేదు. రెంటికిని గూటస్థులలోఁగూడ వ్యత్యాసము గలదు. కె. వి. లక్ష్మణరావుపంతులువారు మల్లికార్జునపండితారాధ్యుల నాఁటి ఉదయరాజాదులు వనపర్తి సంస్థానముచెంత గల పానుగంటి పాలకు లనిరి గాని యీపానుగంటిచోడోదయుల శాసనములు, రాజ్యచిహ్నములు లేవు. ఉదయచోడుని శాసనములు ఉదయసముద్రము, ఉదయచోడ సోమేశ్వరాలయము గల్గి చోడులకు రాజధాని యని శాసనాదులచే నెఱుంగఁబడు నల్లగొండ చెంతఁగల పానుగల్లే పండితుని ప్రత్యర్థియగు ఉదయచోడుని రాజధాని.

భీమరాజుశాసనములు ప్రత్యేకించి లభింపకున్నను నాతఁడు పరాక్రమశాలియగు గొప్పరాజు. తనతండ్రియగు ఉదయరాజు కాకతి ప్రోలరాజునకు లోఁబడి యాతఁడొసంగిన రాజ్యమునకుఁ బ్రభువగుట తన వీరత్వమునకుఁదగనిదిగఁదోఁచెను. కాననే రుద్రదేవునికాలమున స్వతంత్రపతాకము నిలువఁబెట్టి వర్ధమాననగరము రాజధానిగఁజేసికొని బలసంపత్తి మిగుల నభివృద్ధిపఱచెను. ఓరుగంటి మంటికోటకు సమానముగఁ దననగరికి మంటికోటగట్టి యగాధమగు పరిఖ త్రవ్వించెను. రాజధానిలో మనోహరశిల్పములు గల ఆలయములను బెక్కింటిని గట్టించెను. కాకతీయుల నెదుర్కొననియ్యకొనని తన సోదరుఁడగు గోకర్ణుని వధించి నిరంకుశపరిపాలనము స్థాపించెను. ఇది జూచి తైలపదేవుఁడను కోడూరుపాలకుఁడు సైతము కాకతీయ రుద్రదేవుని నెదిరించెను. సామ్రాజ్యము విస్తరింపఁజేయు కాంక్షగల ప్రతాపశాలియగు రుద్రదేవుఁ డింగులకు సహింపక తైలపదేవుని మృతు శరణ్యుని గావించెను. ఈయదను గ్రహించి సమీపరాజులను గలుపుకొని భీమరాజు సరిహద్దులలోనున్న తైలపుని రాజ్యమును లోఁగొని సమీపమునందలి కందూరిలో బలము నుంచి కాకతీయ సామ్రాజ్యమునే కబళింపఁదలఁపడెను. దైవబలము, స్థానికబలము చాలకుంటచే భీమరాజు ప్రాణభీతితో నడవులలో డాఁగి యందె మరణింపవలసివచ్చెను. బూదపూరు, నెకొండలలోని తైలప చోడుని శాసనములు విక్రమశకము ౮౬ లోనిదికాన క్రీ. శ. ౧౧౬౧ నాఁటివి. గోకర్ణునిశాసన మొకటి ఏలేశ్వరమున లభించినది. అది విక్రమ శకము 33 క్రీ. శ. ౧౧౦౯ లోనిది. ఇవి వీరల రాజ్యారంభమున నెలకొల్పఁబడిన శాసనములుగ నున్నచో రుద్రదేవుఁడు రాజ్యమునకు వచ్చిన క్రీ. శ. ౧౧౬౨ నాఁటికి ప్రత్యర్థులు నడివయస్సు దాఁటినవారుగ నుందురు. అందుచే భీమగోకర్ణులు, తైలపదేవులు రుద్రదేవుని రాజ్యారంభమున నుండి ప్రత్యర్థికోటిలోఁ జేరినవారను సమన్వయము కుదురును. భీమరాజు, గోకర్ణుఁడు మామిళ్లపల్లి శాసనమునకు సంబంధించినవారనియు, వీరిరాజ్యము మహబూబునగరమండల మంతయు నావరించి దాదాపుగ శ్రీశైలమువఱకు వ్యాపించి దుర్భేద్యముగ నుండె ననుట సత్యము. మహబూబునగర మండలములోని వర్ధమానపురము, కందూరు, కోడూరు పరిసరములలో నీచోడవంశజుల శాసనములు పెక్కులు మరుగుపడియున్నవి. అవి పరిశీలించినమీఁదట భీమరాజు చరిత్రము, రుద్రదేవుని విజృంభణము, గోకర్ణుని నిధనముగూర్చిన వివరము లింకను దెలియఁగలవు.

శ్రీయుతులసుజయంతిరామయ్యపంతులు వారుగోనగన్నారెడ్డిసంబంధులరాయమూరుకోటపయిగలశాసనము ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురించుచు వర్ధమానపురమునుగూర్చి స్థలనిర్ణయము చేయుటలో వర్ధమానపురము వర్ధమానకోటగ మారెననియు, అదియె యిపుడు మానుకోట యను గ్రామమనియు వ్రాసియున్నారు. వర్ధమానపురము ఇపుడు వడ్డమాని యని అపభ్రంశనామముతో మహబూబునగరమండలమున నున్నది. వారు పేర్కొనిన వర్ధమానకోట మహత్తరస్థలదుర్గముగా సూర్యాపేటతాలూకాలో భువనగిరినుండి సూర్యాపేటకుఁ బోవుమార్గమున నున్నది. మానుకోట బెజవాడనుండి హైదరాబాదు పోవు రైలుమార్గములో మహబూబాబాదు అను నూతననామముతో నొప్పుచున్నది. కాకతీయ రుద్రదేవుని కాలమునఁగల భీమరాజు రాజధాని మహబూబునగరుమండలములోని సుప్రసిద్ధ చరిత్రస్థలమై వర్ధమానిరుచఁబడు వర్ధమాననగరమని చరిత్రాధారములచేతను, స్థలవిశేషములచేతను ఋజువగుచున్నది.




# సదాచారము

## జనమంచి శేషాద్రిశర్మ

మానవజన్మమునకు ఫలము సదాచారము. అనఁగా మంచియలవాటులు గలిగియుండుట. అవి రెండు తెఱంగుల నుండును. అం దొక్కదాని నంగీకరించి రెండవదానిని వదలిన లాభము పూర్ణముగఁగలుగదు. బాహ్యమని, ఆంతరమని యా రెండువిధము లుండును. జనులందఱకుఁ దెలియునట్లు నటించుచు నవి మంచివని యితరులు గ్రహించి మెచ్చునట్లుండుట బాహ్యాచార మనఁబడును. పరిశుద్ధమనస్సు గలిగి భగవద్విషయకచింతయందే యాసక్తి గలిగియుండుట యాంతర మగు సదాచార మని పెద్ద లందురు. ఇందుఁ బ్రధానము రెండవది. మొదటిది రెండవదిగాఁ బరిగణింపఁదగినది. మనఃపావనత్వము ప్రాక్పుణ్యపరిణతిచేఁ గలుగఁదగినది. బాహ్యములగు సదాచారముల నలవడఁ జేసికొనుటయు సామాన్యకార్యము కాదు. కాని దీనికిఁదోడు మానసికశుద్ధియు నుండిన ననంతఫలము లభించునని మహాత్ముల యాశయము. కేవలస్నాన ప్రముఖములు నిరుపయోగము లనరాదు. వీనిమూలమున నెప్పటికేని మనఃపారిశుద్ధ్యము లభింపవచ్చును. కాని యనేక జన్మములకుఁగాని యట్లు లభింపదు. కావున నద్దానికొఱకు మానవుఁడు నిరంతరము ప్రయత్నించుచుండ వలయును. పూర్వపుణ్యమున నది తనంతన లభించునని యూరకయుండరాదు.

తీర్థయాత్రాదు లద్దానికిఁ దోడుపడుననియే పెద్దలవ్వాని నియ
1. అద్దానియందును సద్భావన కలిగినఁగాని యాయాత్రాదులు ఫలము నీఁజాలవు. యత్కించిత్ఫలము లొసంగినను సంపూర్ణఫలము లద్దానం గలుగవు.

> న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
> తే పునం త్యురుకాలేన దర్శనాదేవ సాధవః.

అని భాగవతమున భగవద్వాక్యము కలదు. జలమయములగు తీర్థములు, మృచ్ఛిలామయములగు దేవతలు చిరకాలమునకుఁగాని భక్తుని బావనునిగఁజేయఁజాలరు. సాధువులు దర్శనమాత్రముననే పావనుని జేయుదురు. అనఁగా సారమేమి? భక్తులు తీర్థములు, విగ్రహములు లోనగు వానిని భగవత్స్వరూపములుగా భావించి సేవించిన నాభగవంతుఁ డారూపమున వారికిం దోఁచి పరిశుద్ధులను జేయఁగలఁడు. ఆకార్యమునకుఁ జాలకాలము పట్టును. సాధువులో, ఈ శ్రమముపడియాతి తేలినవారగాన నందలి రహస్యములను దెల్పుదురు. కావున భక్తుఁ డంతగా శ్రమములపాలు గానక్కఱలేదు. సులభముగా నందలి సారముం గానఁగలఁడు. సాధుసమాగమము తీర్థయాత్రాదులకన్న మిన్న యనుట కిదియే కారణ మన వచ్చును. స్వానుభవమున నిట్టివిషయములు తెలిసికొనుటకుఁ జాలకాలము పట్టును. అట్టి శ్రమము పడినవారే తెల్పిన నది సులభముగా గ్రహింపఁదగును. దీనిభావము: భావనయే ప్రధానము, నయ్యది లేనిచో నాయాత్రాదులు సంపూర్ణఫలదములుగాఁజాలవు.

భావనచేతనే మనస్సు పరిశుద్ధమగు. దానిమూలమున సదాచారములు (భగవద్ధ్యానాదులు) అలవడును. అట్టిస్థితియం దుండువానికి బాహ్యాచారము లక్కఱలేదు. కాని తనమూలమునఁ బామరులు వాని నేర్చుకొనవలయునను నూహచే నతఁడు వాని నాచరించుచుండ వలయునని

> యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
> స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.
>
> యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః,
> మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.
>
> ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాం కర్మ చేదహమ్,
> సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః.
>
> సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
> కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్.
> న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
> జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్.

అను నీ గీతావాక్యములు శాసించుచున్నవి. కావున మహాత్ములకు బాహ్యాచారములతోఁ బనిలేకున్నను పమ్మరజాతి నేర్చుకొనవలసిన పామరులకొఱకు వాని నాచరించుచుండవలయునని యేర్పడుచున్నది. బాహ్యాచారములు కూడ మంచివియే యని దీని సార మని గ్రహింపవచ్చు. కాని మానసికశుద్ధి గలిగియుండినఁ గాని

యవి ఫలదాయకములు కాఁజాల వనుమాటనుమాత్రము మనము మఱువరాదు.

ఈ సదాచారములన్నియు మతముపై నాధారపడియున్నవి. మతబోధకుల యుపదేశమూలముననే యాసదాచారములు వృద్ధి యగుటయో, క్షీణించుటయో, మార్పునొందుటయో జరగుచుండును. మతము లన్నియు మానవునభివృద్ధికొఱకే నియమింపఁబడినవి. ఇన్ని మతము లేలయని ప్రశ్నించువారికిమతతత్త్వ మించుకంతయుఁ దెలియదనవచ్చును. కర్మములు పెక్కువిధములు. వాని ననుష్ఠించువా రనేకులు. ఒకరికి రుచించునది వేఱొకరికి రుచింపదు. వారి వారి కర్మముల ననుసరించి భగవత్సేవ చేయు ధర్మములు రుచించును. ఒక్కరీతిగ నుండునారాధనము సర్వజనసమ్మతము కాదు. కావుననే మతము లిన్ని యేర్పడినవి. మహాత్ము లాలోచించి యెట్టికర్మము చేసినవాని కెట్టిమతధర్మములు రుచించునో వాఁడు వాని ననుసరింపవచ్చుననియుఁ, ఒనర్మాలమున నుత్తమమార్గమునకుఁ బోవచ్చుననియు మతస్థాపకుల యాశయము. ఈ కారణముననే యేమతము గాని పనికిరాని దనరాదనియు, హెచ్చుతగ్గులు పాటింపరాదనియు మన మూహింపవచ్చును. భగవంతుని సేవించుట కెల్లరకు నధికారము గలదు. కాని యొకరీతిగా సేవించుట కెల్లరు సమర్థులుగారు. అనేక మార్గములలో నే మార్గ మెవరికి మంచిదిగాఁ దోఁచిన దాని ననుసరించి వారు గమ్యస్థానముఁ జేరఁ బ్రయత్నింపవచ్చును. ఇతరుల కదియంత మంచిదిగాఁ దోఁపకయున్నను వాని కది యుత్తమమే యని తోఁచుటం జేసి వాఁడు దానిని శ్రద్ధాభక్తులతో నాశ్రయించిన నా మార్గమే కొంతకాలమున కాతని చిత్తవృత్తిని మార్చి యంతకంటె నింకొక్క యుత్తమమార్గమునకుఁ జేర్చును. ఈ ఫలము కలుగఁగలయుననియే యిన్ని మతములు కల్పింపఁబడినవి. ఇవి కల్పించుటకు భగవదిచ్ఛయే కారణము. భిన్నభిన్న కాలముల నివి కలుగనేల యను ప్రశ్నము రావచ్చును. ఏకాలమున నంతకుముందున్న మతధర్మముల నన్నింటి ననుష్ఠింపఁదగినవారు లేకుందురో యట్టివారి కనుకూలముగా నుండు ధర్మముల నిర్ణయించుచు నొకమతమును స్థాపించువా రొక్కరు భగవదిచ్ఛచేఁ బుట్టుదురు. వారాకాలమునఁగల మానవుల కాచరింప సమర్థమగువాని నియమించి దురాచారములను వారినుండి తొలఁగింపఁ బూనుదురు. అట్టిమతధర్మముల నాచరింపఁదగినవా రెల్ల నామతము నంగీకరింతురు. దాని కర్హులు కానివార లద్దాని నంగీకరింపరు. కావున నిన్ని మతములు మానవజీవితమును బవిత్రముచేయుటకొఱకే యేర్పడినవని మనము నిశ్చయించుకొనవలయు.

మతస్థాపకులు భగవదిచ్ఛచేఁ బురికొల్పఁబడి తత్కాలమునకు జనుల కనుష్ఠేయములగు ధర్మముల నియమింతురు. ముందున్న మతమున కవి విరుద్ధములుగాఁ దోఁచునుగాని విరుద్ధములుకావు. ఆమతధర్మముల నన్నింటి ననుష్ఠింప సమర్థులగువారికి నందుఁ గొన్ని మాత్రమే యనుష్ఠేయములని నియమింపఁ బడును. ఆతత్త్వ మెఱుఁగక యిది వానికి విరుద్ధమని పామరు లూహింతురు. సత్యదయాదులు సర్వమతసాధారణములుగా నుండుటకుంగల కారణ మిదియేకదా. పంచాగ్నిమధ్యమున నుండి తపస్సుచేయుట యొక పద్ధతి. జీర్ణపర్ణాంబుభక్షణమునఁ దపమాచరించుట యింకొక పద్ధతి. చాంద్రాయణాది వ్రతపరాయణత్వమునఁ దపమొనరించుట యింకనొకపద్ధతి. కేవలభక్తిని భగవంతు నాత్మహృత్కమలమున నిలిపి తద్దర్శనము చేయుచుండుట యింకొక పద్ధతి. ఇట్లే యనేకపద్ధతు లుండఁ గారణమేమి? వారివారి యోగ్యతల ననుసరించి భగవంతు నారాధింప వచ్చుననియేకదా. భావన నక్కుఁ ననుసరించి... భావనాగానున్న నిన్నియు సమానఫలదములే కాని వేఱుగావు. భావనాబలమే లేకున్న నిన్నియు నిరర్థకములే.

మతాభిమానులు పరమత ధర్మములఁ దూలనాడుట న్యాయసమ్మతము కానేరదు. పరమత నిరాసన పూర్వక స్వమత స్థాపనము విధి యని కొందఱందురు. కాని స్వమత ధర్మైక ప్రకటనము ముఖ్యము కావచ్చుంగాని యన్యమత ధర్మదూషణము ముఖ్యము కానేరదు. ప్రాయికముగా మతస్థాపకులకంటె నూత్నమత ప్రవిష్టులే యాకార్యమును మిన్నగఁ జేయుదురు గాన నట్టివారికి మతస్వరూపము తెలియదని మన మూహింపవచ్చును. ఒక్కొక్క మతమునం దొక్కొక్క ధర్మ మత్యుత్కృష్టముగా నున్నది. బౌద్ధమతమునం దహింస ప్రధానముగా నున్నది. అనఁగా హింసా ప్రధాన కర్మములనే యాచరించువారు పెక్కండున్నతఱిఁ దన్నివారణ ప్రయత్న మావశ్యకమే. కాన బౌద్ధమత మావిర్భవించినదని మన మూహించినచో దానితత్త్వము నరయఁబ్రయత్నించినవార మగుదుము. జ్ఞానమున కహింసావ్రత మత్యంత ముఖ్యముగదా. హింసాకర్మములు తగ్గించుకొనుట కెల్లరును ప్రయత్నింప వలసినదే కాని వానిని పెంపొందింపఁ బ్రయత్నింపరాదు. "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః" అని యుపనిషత్తులు ఘోషించుచుండలేదా. వానికర్థమేమి? మానవుఁ డుత్తమగతికి రావలయునన్న హింసాకర్మముల సడలించుకొనుచు నహింసాకర్మములగు జపయజ్ఞాదులఁ బెంపొందించుకొనుచు సర్వభూతసమత్వ మరయువాఁడై వృద్ధిపొందవలయును.

> అహింసా సత్య మక్రోధ స్త్యాగశ్శాంతిరపైశునమ్,
> దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్.
>
> తేజః క్షమాధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా,
> భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత.
>
> దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
> అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్.
>
> దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా,
> మాశుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ.

అని గీతాశాస్త్రము(అధ్యా. ౧౬) తెలుపుచున్నది. జ్ఞానిలక్షణ మహింసా వ్రత పరాయణత్వమని స్పష్టమగుచున్నది. కావుననే

శ్రీకృష్ణుఁడు "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అనియె. అనఁగా హింసాప్రధాన యజ్ఞములు నాకుఁ బ్రీతినీఁజాలవని తెల్పినట్లే కదా. "మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః" అని మనుస్మృతి తెల్పెను. "మహాయజ్ఞైః బ్రహ్మయజ్ఞాదిభిః పంచయజ్ఞైః, యజ్ఞైః జ్యోతిష్టోమాదిభిః" అని కుల్లూకభట్టు వ్రాసెను. స్వలాభమునుగోరి పరహింసచేయు కర్మము లుత్కృష్టములు కాఁజాలవని కదా దీని భావము. ఫలమునుగోరిచేయు సత్కర్మములకంటె ఫలాభిసంధిరహితకర్మము లుత్కృష్టములు, భగవత్ప్రీతికరములు నగును.

> నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
> యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే.

అను గీతావాక్యము (౧౧ అ ౧౨) పైయర్థమునే బోధించుచున్నది కదా. ఏయేయలవాటులు హింసాకార్య విరహితములో యవియే సదాచారము లనఁబడుచున్నవి.

బాహ్యాచారములు నిష్ఫలము లగుట వాని నెల్లభంగుల వదలి మనఃపరిశుద్ధిని ప్రధానముగా భావించి భగవంతుని ధ్యానించుట మంచిదని కొందఱందురు. అట్టివార లసురులనఁబడుదురు. ఏలయనఁగా నది సామాన్యులకు శక్యమైనదిగాదు. ఆచారములయందుఁ బ్రీతిలేనివారే యీయుక్తిఁ బన్నుదు రనవచ్చును. మహాత్ములే పామరుల నుద్ధరించుటకొఱకె బాహ్యాచారముల మానక యొనరింతురు. సమదర్శనులగు వారుకూడ యాత్రాకర్మమున నాసక్తులగుదురు. ఏల? పామరులు వానింగూడ మాని చెడుదురను నాశయముననేకాని వేఱుగాదు. అట్టివారే యట్టులుండ సాధారణుల కట్టిధ్యానము శక్యమా? కాదు. లక్ష్యము మాత్రము దానియందుండు టుత్తమమే. కాని నిత్యనైమిత్తిక కర్మములమానుట మంచిది కాదు. వాని నాచరించుచు వానిమూలమున నేఫలముం గోరక భగవదర్పణము చేయుచుండిన మనస్సు తనయంత నే పరిశుద్ధము నగును. అదియే భగవదనుగ్రహము.

> అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
> తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్,

అన్న భగవత్ప్రతిజ్ఞ కర్థమేమి? సత్కర్మానుష్ఠానము ఫలాభిసంధిరహితముకాఁగా నట్టిభక్తులను రక్షించుభారము నాది యనికదా ప్రతిజ్ఞాఫలము. భక్తులమని పరమతముల దూషించువారిని భగవంతుఁడు ప్రేమింపఁడని మన మెఱుంగవలయుఁగదా. "ప్రణమే ద్దండవ ద్భూమా వాశ్వ చండాల గోఖరమ్" అను భాగవతవచనమునకుఁ దాత్పర్యమేమి? "యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచమయి పశ్యతి" అన్న గీతార్థమేకదా. అట్లు భగవదభిప్రాయ మెప్పుఁగా నన్యమతములనుద్ధి వానిని స్థాపించిన మహాత్ములను సర్వజ్ఞుల మనుకొనువారు దూషించుచు భగవత్తత్త్వము మాకే తెలియుననుకొనువారికంటె మూర్ఖులెవ రుందురు? సదాచారముల నభ్యసించువారు పరమత దూషణమునకుఁ బాల్పడరు. కావున బాహ్యాభ్యంతర సదాచారముల నలవఱుచుకొనినఁగాని సర్వేశ్వరానుగ్రహమునకుఁ బాత్రు లెట్టివారును గాఁజాలరు. పరమత సహిష్ణుత సుగుణములలో నుత్తమోత్తమము. దానినెల్లరు నభ్యసింపవలయు. అహింసావ్రత పరాయణులగుటకు ముందుగాఁ బ్రయత్నింపవలయును. దేవాలయములలోనే భగవంతుఁడున్నవాఁడను భావము వదలి సర్వవ్యాపకుని ధ్యానింపవలయును. ఇంద్రియ నిగ్రహ మందులకుఁ బ్రధానము. యోగాభ్యాసమునఁగాని యది యలవడదు. అది యలవడినఁగాని మనోమాలిన్యములు తొలంగవు. అవి తొలంగినఁగాని సదాచారములు పట్టుపడవు. అవి పట్టువడినఁగాని భగవంతుని నిర్మలతత్త్వము బోధపడదు. దానఁగాని భగవంతుని మహత్త్వము తేటపడి ముక్తిమార్గము దొరకదు. కావున మంచిమార్గమున నేశ్రమముల పాలుగాక యీశ్వరు నేరూపమున, నేనామముననైనఁ దలంచుచుమనః పదమున నధివసింపఁజేసి తత్పాదారవింద ద్వంద్వమున దృష్టినిలుపఁజను. ఉత్తమోత్తమమార్గ మిదియే. నిరపాయమగు నుపాసన యిదియే. మహర్షి సమ్మత మిదియే. ఇట్టియుత్తమోత్తమ మార్గమున నడువ నెల్లర నాసర్వేశ్వరుఁ డాశీర్వదించుఁ గాక. భారతభూమి యట్టిప్రజలు వెలయ సత్కీర్తి వఱలుఁ గాక.

---



# నానాజాతి సమితి
## (League of Nations)
### భావరాజు సత్యనారాయణ

సృష్టిలోని ప్రతిపరిణామమునకును, క్షేమమునకును కొన్ని నిబంధనలు గలవు. ఆర్థికరాజకీయాభివృద్ధియు కొంతవరకు ప్రకృతి నియమముల ననుసరించియుండును. నాగరకత చెందినదని పేరుగాంచిన ప్రతిజాతియును, జాతీయజీవనమునకు ముఖ్యమైన అంశములను, తత్సంబంధమైన పరికరములను నిర్మించుట కర్తవ్యము. ఆర్థికాభివృద్ధి, రాజకీయాభివృద్ధి, విద్యాభివృద్ధి - ఇవి ప్రపంచమునందు శాంతి యున్నపుడే రాణించును. కాబట్టి మానవనిర్మితమైన యంత్రజాలమును శాంతిని స్థాపనచేయుటకు వినియోగింపవలెను.

గతయూరపు మహాసంగ్రామానంతరము 'శాంతములేక సౌఖ్యము లేదు' అని అందరికి తట్టినది. పాశ్చాత్యభావప్రపంచము శాంతి కొరకు పాటుపడినది. పాశ్చాత్యులకు యంత్రములన్న కడుప్రీతి. వారు యంత్రనిర్మాణమునందు బహు కుశలబుద్ధికలవారు; వర్తక వ్యాపారమునందు అసామాన్యులు; రాజకీయపు పన్నాగములలో అగ్రగణ్యులు. అందుచే వారికి ఒక నూతనయంత్రము స్ఫురణకు వచ్చినదనిన ఆశ్చర్యములేదు. ప్రెసిడెంటువిల్సన్ అధ్యక్షతక్రింప ప్యారిసులో మిత్రమండలివారు సంభాషించారు. ఏ యంత్రమైనాసరే, రెండుపనులకు తగియుండాలి అన్నారు - జర్మనీని నొక్కిపట్టుకోవాలి - ప్రజాప్రభుత్వమును రక్షించాలి. ఆయంత్రమును పరిశోధించి చూసుందన్నారు. జినీవాలో దానినిస్థాపనచేయుటకు అంగీకరించినారు. 'నానాజాతిసమితి' అని నామకరణము చేసినారు. వెర్సైయిల్సు సంధి (Treaty of Versailles 1919) లో యీ జాతిసమితిని చేర్చి, దాని నిర్మాణవిధానమును సృష్టించినారు.

జాతిసమితి నిర్మాణ విధానము (Covenant of the League of Nations) :—ఈ చట్టమునందు ౨౬ క్లాజులు గలవు. ఈ విధానము ననుసరించి నానాజాతిసభ (Assembly of the Leagus , నానాజాతి కార్యనిర్వాహకసభ (Council of the Leagus , నానాజాతి కార్యదర్శక శాఖ, (League Secretariat), అంతర్జాతీయన్యాయసభ (Permanent Court of International Justice)— ఇవి స్థాపింపబడినవి. అంతకుపూర్వమే పనిచేయుచున్న అంతర్జాతీయ కార్మిక వర్గమును (International Labour Office) సమితికార్యవర్గములలో చేర్చబడెను.

నానాజాతిసభ :—ఇందు ప్రస్తుతము ౫౮ రాష్ట్రములుకలవు. సభ్యత్వము పొందిన ప్రతిదేశమును ముగ్గురు ప్రతినిధులవరకు పంపవచ్చును. కాని వారు ముగ్గురు కలసి ఒక వోటును మాత్రమే ఉపయోగించవలెను. ఈసభయందు అన్ని దేశములు సమానముగా పరిగణింపబడును. ఈ సభవారు న్యాయసభయందలి న్యాయాధిపతులను ఎన్నుకొందురు ; అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించుటకును, ప్రతిసంవత్సరము నానాజాతిసమితిఆదాయవ్యయముల అంచనాలను (Budget) పరిశీలించుటకును, సమితినిర్మాణ విధానమును మార్చుటకును (Amendment) ఈ సభకు అధికారము కలదు. కాని యిందు గొప్పలోటు ఎక్కడంటే, యీ సభయందు సామాన్యమైన కొన్ని చిన్న విషయములందు తప్ప అన్నివిషయములందును అఖిలసమ్మతముగా ( unanimity ) నిర్వర్తింపవలసియున్నది. ఈ నిబంధనవలన యీసభకున్న అధికారములన్నియు వ్యర్థములగుచున్నవి. ఒకవిషయమందు ౫౫ రాష్ట్రములు ఒప్పుకొనినను ఏ కార్యమును చేయుటకు వీలులేదు. అన్ని రాష్ట్రములును ఏకగ్రీవముగా ప్రతివిషయమందును అంగీకరింపవలెను.

కార్యనిర్వాహక సభ :—జాతిసమితికి యీ సభ గుండెకాయ వంటిది ఇంగ్లండుకు మంత్రివర్గము (cabinet) ఎట్టిదో సమితికి యీసభ అట్టిది. ప్రతి రాష్ట్రమునందుగల కార్యనిర్వాహక సభకు శాసనములుచేయు అధికార ముండదు. కాని సమితియొక్క కార్యనిర్వాహక సభకు చట్టములుచేయు అధికారము కూడ కలదు. ఈ సభలో కొన్ని ముఖ్యమైన దేశములకు శాశ్వతస్థానము ఒసగబడినది. దీనికి శాశ్వత భాగము (Permanent part) అంటారు. ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా మొదలయిన ముఖ్యమైన రాజ్యములకు మాత్రమే యీ స్థాన మొసగబడెను. మిగతా దేశములకు తాత్కాలిక స్థానము

(temporary part) యివ్వబడును. ఇందుకూడ నానాజాతిసభలో వచ్చే అన్ని విషయములందును 'అభేదసమ్మతము' ప్రకారము అనుసరించవలెను. ప్రతి సంవత్సరమును యీ సభవారు అయిదారు సార్లు కలిసికొని సమితి వ్యవహారములను విచారింతురు. ఈసభకు ప్రత్యేకముగా కొన్ని వ్యవహారములను విచారించుటకు అధికారము కలదు. ఏ రెండు రాష్ట్రములకైనా తగవు వచ్చినయెడల, ఆతగవును పరిష్కరించుటకు యీ సభవారు ఒక వివాద పరిష్కార సంఘము (Arbitration board) ను నియమింతురు. లేదా, ఆరాష్ట్రములు న్యాయసభకు విన్నవించుకొనవలెను. వీటివలన ఏమియూ తేలనపుడు కార్యనిర్వాహకసభ ఆ తగవును విచారించి ఒక రిపోర్టును ప్రకటించును. ఈరిపోర్టును ప్రచురించుటకు ఏకగ్రీవముగా ఆమోదింపబడవలెను. అది వెలువడిన మూడు నెలల వరకు ఏరాష్ట్రము యుద్ధమునకు పోకూడదు. రాష్ట్రాంతరంగికసంబంధమైన తగవులను పరిష్కరించుటకు జాతిసమితికి అధికారములేదు. అందుచే ప్రతి రాష్ట్రము ఏతగవువచ్చినా ఆంతరంగిక సంబంధమైన తగవని ప్రకటించి యుద్ధమునకు కాలుద్రవ్వుచున్నది. అభేదభావ సూత్రము వలన యీ సభయందు కూడ కార్యములు కానేరకున్నవి.

న్యాయసభ:—౧౪ వ ఆర్టికిలు ప్రకారము ఈ అంతర్జాతీయ న్యాయసభను హేగుపట్టణమందు స్థాపించిరి. ఇందలి న్యాయాధిపతులను నానాజాతిసభవారు ఎన్నుకొందురు. ప్రస్తుతము పదునైదుగురు న్యాయాధిపతులుకలరు. ఏ రాష్ట్రమునుండియు ఒక న్యాయాధిపతి కంటె ఎక్కువమందిని ఎన్నుకొనుటకు వీలులేదు. ఇందు అంతర్జాతీయసమస్యలు, వివాదములు, తగవులు పరిష్కరింపబడును. దీనికి ప్రాతిపదిక అధికారమే (Original jurisdiction) కలదు; అప్పీలు అధికారము లేదు. అంతర్జాతీయ సంధిషరతులు ఇందలి న్యాయాధిపతులచే అన్వయింపబడును కార్యనిర్వాహక సభవారు కోరినవిషయములందు యీ సభన్యాయాధిపతులు సలహాయిచ్చెదరు. ప్రతి న్యాయాధిపతి ౯ సం. లు పనిచేయును.

ఈ విధముగా నానాజాతిసమితికి ప్రాతినిధ్యహోదా (Representation), కార్యనిర్వాహకహోదా (Executive), న్యాయపరిపాలనహోదా (Judiciary) యును కలవు. మరియు కార్యదర్శకశాఖవలన నిరంతరహోదాను (Continuous) పొందుచున్నది. అంతర్జాతీయ కార్మికవర్గశాఖ మూలముగా పెట్టుబడిదార్లయొక్క, కర్షకులయొక్క తగవులు పరిష్కరింపబడుచున్నవి. అనగా వారి ఐక ... ై పాటుపడుచున్నది.

అంతర్జాతీయ కార్మికవర్గశాఖ:—౧౩ వ ఆర్టికిలు ప్రకారము దీనివిధానము నిర్మింపబడినది. ప్రతిరాష్ట్రము నుండియు కార్మిక పక్షము(Labour) నుండి ౨ మందిన్ని, పెట్టుబడిదార్ల పక్షమునుండి (Capital) ౨ మందిన్ని ప్రతినిధులు ప్రతిసంవత్సరము కలిసికొందురు. వీరు ప్రపంచపుఆర్థిక సమస్యలను పరిష్కరించుట యందు శ్రద్ధతో పనిచేయుచున్నారు. జాతిసమితి సభ్యత్వము లేకపోయినను యీ సభయందు ప్రతిరాష్ట్రము చేరవచ్చును. అమెరికా దేశము జాతిసమితిలో ఎన్నడును చేరలేదు. కాని యీ కార్మికవర్గమునందు ప్రారంభమునుండియు ప్రారంభము ైకొన్నది. వేతనములు నియమించుట(Regulation of wages) యందును, పనిచేయుగంటలను శాసించుటయందును (Regulation of hours of labour), శ్రమకరుల జీవనమును అభివృద్ధిచేయు ఏర్పాటులందును కడు శ్రద్ధతో ఈ సభవారు పాటుపడుచున్నారు.

కార్యదర్శకశాఖ:—ప్రతిరాష్ట్రమునందు సివిలు సర్వీసు (Civil Service) వలెనే యీశాఖ నానాజాతిసభకు, కార్యనిర్వాహక సభకు, కార్మికవర్గశాఖకు సంబంధించిన ఏర్పాటులు, వ్యవస్థలు చక్కబెట్టుచుండును. జాతిసమితికి కావలసిన విషయములను పరిశోధించుట (Investigation) యందును రాయబారమునకు సంబంధించిన ఏర్పాటులయందును (Negotiations), సమితి సమాచారములను ప్రకటించుటయందును (Publicity) యీ శాఖవారు పనిచేయుచున్నారు. మరియు యీశాఖకు అనేక విషయములతో సంబంధమున్నది. అందు ముఖ్యమైనవి:

అల్పసంఖ్యాక పక్షము (Minorities)

సాంఘికసంస్కరణపక్షము (Social questions: Opium traffic etc.)

దక్షితరాజ్యపక్షము (Mandates)

ఆయుధ విసర్జన పక్షము (Disarmament)

అంతర్జాతీయ తపాలాశాఖ (Communications Postal Service)

ఆరోగ్య శాఖ (Health)

బౌద్ధిక సహకార శాఖ * (Intellectual Co-operation)

జాతిసమితియొక్క ఘనత అంతయు డిపార్టుమెంటుల మూలముననే చాటింపబడుచున్నది. జాతిసమితి ప్రతిదినము చేయుచున్న పనులు ఇందుకనబడును.

* ఈసభకు ఇండియా ప్రతినిధి సర్ యస్. రాధాకృష్ణన్ గారు, కె. టి.

1. "No one will study the League's work, its work on dangerous drugs, its work on slavery now developing the beginnings of financial and economic contribution what it has done through the mandates system & what the International Labour Organization has done already in regard to labour legislation, without realising that this is indeed the greatest creative enterprise in the history of political thought." (Viscount Cecil)



మకాలేవద్ద నెలకొల్పబడిన ఇటాలియనుల మరఫిరంగి.



ఇటాలియనుల మరఫిరంగులబండ్లు (టాంకులు).



సైనికశిక్షణమును పొందుచున్న ఇటలీలోని ఫాసిస్టు యువకులు; వారిని ముసోలినీ పరికించుచున్నాడు.



ఇటలీలో సైనికశిక్షణము పొందుచున్న ఫాసిస్టుయువకులు
ప్రాణవాయు ముఖావగుంఠనధారణము నభ్యసించుచున్నారు.



వాల్ వల్ వద్ద అబిసీనియనులు నెలకొలిపిన మరఫిరంగి.



అబిసీనియనులచే పట్టువడిన ఘరఫిరంగులబండ్లు (టాంకులు).



మకాలే ఆక్రమణము: ఇటలీసైనికులను మకాలేలోనికి తీసికొనిపోవుచున్న రాస్‌గగ్సా సేనాని.



కంచరగాడిదలపై నున్నతప్రదేశములకు పోవుచున్న ఇటలీసైనికులు.

అట్టినిర్మాణవిధానముకల్గియు, అట్టి అధికారవర్గముకల్గియు నానాజాతిసమితి అంతర్జాతీయ సమస్యలను ఏలపరిష్కరింప లేకున్నది? నిర్మాణవిధానమందలి లోపముల మూలముననా, లేక కార్యనిర్వాహకుల లోపమా అని ఆలోచింపవలసియున్నది.

నిర్మాణచట్టములో ౧౧ వ క్లాజు ప్రకారము ఏ దేశమైనా యుద్ధమునకు దిగినపుడును, యుద్ధమునకు సంసిద్ధమై యున్నను తక్షణము కార్యనిర్వాహకసభవారు కలిసికొని శాంతిని సమకూర్చుటకు తగుచర్యను తీసికొనవలయును. ౧౬ క్లాజు చాలాముఖ్యమైనది దీని ప్రకారము సమితికి చెందిన ఏ దేశమైనా నిర్మాణ చట్టపు ౧౨, ౧౩, ౧౫ క్లాజులను తిరస్కరించి యుద్ధమునకు దిగినయెడల, తక్షణము ఆ దేశము సమితికి శత్రువుగా పరిగణింపబడును. జాతిసమితి సభ్యులందరును కలిసి ఆ దేశముతో వారికిగల ఆర్థిక, వర్తక వ్యాపార సంబంధములను రద్దుచేసికొనవలెను. కార్యనిర్వాహకసభవారు ప్రతిదేశమునకు ఈ విధమగు చర్యతీసికొనవలసినదని వేడుకొందురు. జాతిసమితిపక్షమునకు చెందిన దేశములన్నియు ఒకరొకరె సహాయము చేసికొనవలయును. సమితిచట్టమును తిరస్కరించిన దేశము తన సభ్యత్వమును గోల్పోవును. సాధారణముగా ఈక్లాజు సరిగా అమలులో పెట్టినయెడల ప్రతిదేశమును యుద్ధమనిన భీతికలిగి ధర్మబద్ధముగా ప్రవర్తించుటకు ప్రయత్నించును. జపాను చైనాతో యుద్ధముచేసి, సమితిచట్టమును తిరస్కరించి, మంచూకియోను తనరాజ్యములో కలుపుకున్నది. జాతిసమితి దిష్టిబొమ్మలా చూస్తూ ఊరుకుంది. లిట్టన్ కమిషనువారు జపాను నేరస్తురాలని తీర్మానించినపుడైనా జాతిసమితి ఏమైనా శ్రద్ధవహించిందా? లేదు. హిట్లరు వర్సైయిల్సుసంధిపత్రమును బహిరంగంగా చింపిపారేశాడు. జర్మనీకి ఏల్నాటిశని వదిలింది. జర్మనీలో సైన్యము హెచ్చింది. యుద్ధసామగ్రి తయారవుతోవున్నది. అందరు జర్మన్ దేశీయులును సైనికులయియుండాలని హిట్లరు ఆజ్ఞాపించాడు. ఈ సంగతిచూసి ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ స్ట్రెసాలో కలిసికొన్నపుడు జర్మనీ చేసినపనిని విమర్శించాయి. "అయ్యా, మీకాళ్లకు మ్రొక్కుతాను, నాపనికి మీరు అడ్డువస్తే పనిజరగదు. క్షమించాలి." అని హిట్లరు ప్రకటన చేశాడు. ఇట్టి పరిస్థితులలో గతించిన చరిత్ర ప్రకారము చూస్తే కొంపమునగవలసిందే న్యాయతః.

హిట్లరుఅడావిడి చూచి, అప్పుడే ఫ్రాన్సు రష్యాతో స్నేహసంబంధమైన సంధిని చేసికొన్నది. ఈ స్నేహాలే కొంప తీస్తాయి. ఏ మాత్రము ఒక డిగ్రీ హెచ్చినా యుద్ధము తప్పకపోను. రష్యాకు ఫ్రాంసుకు యుద్ధసంబంధమైన సంధిమూలముగా అధికస్నేహంకలిగితే, అప్పుడు యూరపురాజకీయములు నాలుగువిధాలుగా మారుతాయి:

1. అప్పుడేజర్మనీ, పోలండు స్నేహసంబంధమునుచేసికొన్నాయి. ఈ స్నేహము దిన దినాభివృద్ధి చెందుతుంది. పోలండుజర్మనీ స్నేహము ఎప్పుడయితే ఎక్కువడిగ్రీలలో వుంటుందో అప్పుడు స్వరక్షణార్థము జకోస్లొవేకియా (Czechoslovakia), రుమేనియా (Rumania) కలసి రష్యాతో స్నేహం చేసుకొంటాయి.

2 జర్మనీకి ఫ్రాంసుకు కక్షలు పెరుగుతాయి. ఏ మాత్రము ఎక్కడ పేచీవచ్చినా 'లోకార్నో సంధి' (Locarno pact) ప్రకారము ఇంగ్లండు యుద్ధములో ప్రవేశిస్తుంది. తక్షణం ఇంగ్లండుకు ఫ్రాంసుకు గల ఒడంబడికలు బుట్టదాఖలా అవుతాయి.

3. ఫ్రాన్సు, రష్యా, ఇటలీ ఏకమైతే జర్మనీ ఏంచేస్తుంది? రష్యాకు శత్రువైన జపానుసహాయము కోరుతుంది.

4. అట్టి సమయానికి అప్పుడే ప్రతిదేశములోను సైన్యములను ఎక్కువ చేస్తారు. తత్సంబంధమైన సామగ్రిని తయారు చేస్తారు. ఎక్కడ చూచినా సైనిక ప్రమాణికలు (Military time-tables) ప్రత్యక్షముగా ప్రకటింపబడతాయి. దానితో మరల ప్రపంచమునకు ఘోరనరకప్రాప్తి సంప్రాప్తమవుతుంది. *

అదృష్టవశాత్తు ఆచిహ్నములు కనపడుటలేదు. అక్కడక్కడ సూచనలు వున్నప్పటికి అలజడిలేదు. వర్సైయిల్సు సంధి అక్రమమని ఇంగ్లండుకూడ ఒప్పుకుంది; హిట్లరుతో నౌకాదళపు సంబంధమైన సంధిని చేసికొన్నది. దానితో ఎవరి దారిని వారు వెడుతున్నారు. ఈ మధ్య పరిస్థితులు యింకోవిధముగా పరిణమిస్తున్నాయి. జపాను సత్తువను, జాతిసమితి బలహీనతను ఇటలీ బాగా గమనించింది. ఇటలీలో జనసంఖ్య హెచ్చింది. ఆజనానికి స్థలం చూపించాలి. ఆఫ్రికా చవుకగా కనపడింది. ఏదో వంక దొరికింది. వాల్ వాల్ అనేచోట కొందరు ఇటాలియనులు అబిసీనియనుల చేతులలో వీరస్వర్గము పొందినారు. అదిగాక ౧౮౯౬లో ఎబిసీనియాచక్రవర్తి ఇటాలియనులను ఎడోవా దగ్గర ఓడించాడు. ఇటలీ ఏమిటి? ఎబిసీనియా చేతుల్లో ఓడిపోవడమేమిటి! చరిత్రలోనుంచి యీవిషయాన్ని చెరిపెయ్యాలని ముస్సోలిని కంకణం కట్టుకున్నాడు. 'జాతిసమితి కాదు దానబ్బరానీ. ఇటలీని ఏమీచేయజాలదు' అని ముస్సోలిని గంభీర నినాదము చేశాడు. ఎబిసీనియా చక్రవర్తి జాతిసమితికి మనవిచేసుకున్నాడు. ఇంగ్లండుకు, ఫ్రాంసుకు ఆఫ్రికాలో, ఎబిసీనియాకు తూర్పున సామంతరాజ్యములు కలవు. అందుచేత గబగబా జాగ్రత్తపడ్డారు. ప్యారిసులో సంభాషణలు జరిగినవి. ఎలాగైనా సంధికొరకు ప్రయత్నాలు జరిగి

*"Death stands at attention, obedient, expectant, ready to serve, ready to shear away the peoples in masse; ready if called on, to pulverise, without hope of repair what is left of civilisation" Winston Churchill in his "World Crisis: the Aftermath"

నాయి. 'ససేమిరా' అని ముస్సోలోని అక్టోబరు 3-వ తేదీని యుద్ధంలోకి దిగినాడు. ఈ యుద్ధమును ముస్సోలోని తెల్లవాని బాధ్యత (White man's burden) అని పేలుతున్నాడు. నానా జాతిసభవారు ఇటలీ నేరస్థురాలని తీర్మానించారు జాతిసమితిలో ఏకాభిప్రాయము కలుగుట కిదియే మొదటిసారి. ౧౬ వ క్లాజు ప్రకారము ఆర్థికసంబంధమగు అనుజ్ఞలను ప్రయోగించుటకు ఒప్పుకున్నారు. కాని యిక్కడకూడ కొన్ని విషయములు గమనించాలి. ఆస్ట్రియా, హంగేరి, ఆల్బేనియా, బ్రెజిలు రాష్ట్రములు అనుజ్ఞలను (Sanctions) ప్రయోగించుటకు యిష్టపడలేదు. ఈవ్యాపారంతో మాకేమీ సంబంధంలేదు అని అమెరికా తటస్థంగా వూరుకుంది. ఇటలీ తనకు కావలసిన సామగ్రిని యిదివరకే జాగ్రత్తచేసికొన్నది. కాబట్టి యీ 'అనుజ్ఞల' వలన ఏమియు లాభములేదని కొందరి యభిప్రాయము. ఎథియోపియాలో ఒకమూల యుద్ధంజరుగుతూవుంది; చిత్రవధ జరుగుచున్నది.

ఇట్టిపరిస్థితులలో హిట్లరు యేంచేస్తాడో అని కొందరికి భయముగావున్నది. ఆస్ట్రియాతో స్నేహసంబంధం చేసికొన్నాడంటే ఏదో ఉపద్రవం జరిగితీరుతుంది. ఎప్పటికయినా మంచూకుయో, ఆస్ట్రియా, మెమెల్, ఎబిస్సీనియా అందరికొంపలు తీస్తాయి. దీనికేమిటి సాధనం? నానాజాతిసమితినిర్మాణ విధానమునందు కొన్ని మార్పులు రావాలి.

నానాజాతిసమితి ప్రతిష్ఠను కాపాడాలంటే కొన్ని ముఖ్యమైన అంశములు గమనించాలి

౧. అన్ని దేశములూ హెచ్చు తగ్గులు లేకుండా ప్రవర్తించాలి. బలవంతమైన దేశముల కెన్నడును భయములేదు. ఎప్పుడు ప్రమాదము వచ్చినా బలహీనమైన దేశములకు, చిన్న దేశములకు వస్తుంది. అందుచేత ఏమిచేయాలని అంటే కొన్ని చిన్నదేశములు అనుకూలమైన తావులందు, సఖ్యముచేసికొని ఒక 'యూనిట్' క్రింద పనిచేయవలసియున్నది. తమ అభ్యర్థులను సమితిసభకు పంపినయెడల వారు ఆ 'యూనిట్' అభివృద్ధికొరకు పాటుపడి ఆ దేశములకు ప్రమాదము రాకుండా కాపాడగలరు. యూరపులో జకోస్లోవేకియా, జుగోస్లావియా, రుమేనియా కలిసి ఒక గ్రూపుక్రింద (Regional group) పనిచేస్తున్నాయి. దానిని లిటిల్ అంతాంతు (Little Entente) అంటారు. ఈ విధముగా చిన్నదేశాలు కలిసి పనిచేస్తే పెద్ద దేశముల వలన జరిగెడు ప్రమాదములు జరుగుటకు వీలుండదు. ఏదేశమున్ను బలహీనముగా నుండదు. అదిగాక యీ గ్రూపులను నిర్మించుటవలన అందుచేరిన ప్రతిదేశమునకు ఆర్థికసగుపాయము కూడ చేకూరును.

౨. ప్రస్తుతము నానాజాతిసభలోను, కార్యనిర్వాహక సభలోను ప్రతివిషయమునందును 'అభేదసమ్మతము' సూత్రము ప్రకారము జరుగవలసియున్నది. ఇటలీ విషయములో సమితి సభ్యులందరూ ఏకీభావముతో పనిచేస్తున్నారంటే దానికి కొన్ని కారణములున్నాయి. ఈ సమస్య-ఇంగ్లండు ఫ్రాంసులకు సంబంధములున్నవి. నిత్యము యీమోస్తరుగా జరుగవు. దీనివలన నానాజాతిసమితి తన ధర్మముల నిర్వర్తించుకొనలేకపోవుచున్నది. కాబట్టి అధికసంఖ్యాకుల సమ్మతిమీద (Majority decision) సమితికార్యములను ఆచరణయందు పెట్టునట్లు మార్పుచేయవలయును.

3. ప్రతిదేశము సమష్టి బాధ్యతను (Collective Security) శిరసావహింపవలెను. జాతిసమితికి దండనాధికారమును (Police powers) యివ్వవలెను. సమితికి ప్రత్యేకము సైన్యమును, యుద్ధ విమానములను, నౌకాదళమును నిర్మించవలెను. ఈ అధికారము జాతిసమితికి లేనన్నాళ్లు సమితిని ఏదేశమూ లెక్కచేయదు. శాంతిని నెలకొల్పుటకు దండనాధికారము ముఖ్యము. అందువలన తటస్థత సూత్రము (Neutrality) సమష్టిబాధ్యతకు వ్యతిరేకమవును. ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో ఏయుద్ధము ఎక్కడ జరిగినను, అది అన్ని దేశములను కలవరపెడుతుంది. ఇతరదేశ సంబంధముల విడనాడి ప్రవర్తించుట ఏదేశమునకైనా దుస్సాధ్యము అట్లు ప్రయత్నించుట మూఢత్వము. కాబట్టి అన్నిదేశములు కలిసి వాటి ప్రత్యేక సైన్యములను, ఆయుధములను తగ్గించి, సమితికి దండనాధికార మొసంగి ప్రపంచశాంతికి బాధ్యత వహింపవలెను. *

౪. రహస్య మంత్రాంగమును (Secret diplomacy) సమితి సభలయందు రద్దుచేయవలయును. రహస్యాలోచనలవలన రాజ్యతంత్రనిపుణులు ప్రజలను వంచించెదరు. నిజము సరిగా తెలియక ప్రతివిషయమును పలువురు పలువిధములుగా అన్వయించెదరు. ప్రజలను 'అదిగో పులి' అని భయపెడతారు; యుద్ధమునకు పురికొల్పుతారు. అది రవులుకొని మండుతుంది. కాబట్టి అన్ని మీటింగులు, చర్చలు బహిర్గతముగా జరుపవలెను. దానివలన ప్రజలు సందేహపడి భయపడరు. భయపడి మోసము చెందరు. †

౫. వీటన్నిటికన్న ముఖ్యమైన విషయము—ప్రతిజాతియును శాసనవిధానమునకు బద్ధమై, ఆనిబంధనలను ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించవలెను. ౧౯౨౮ వ సంవత్సరములో ౫౪ రాష్ట్రములు కెల్లాగ్ బ్రియాండు ‡ పేక్టు నంగీకరించినవి. దీనినే ప్యారిస్ పేక్టు

---

*. "In a war which international law condemns and the world's conscience brands as a crime, neutrality becomes nonsense" (M Politis)

† Publicity ought to be antiseptic both of economic and political abuses & no man can have confidence in his neighbour unless both work in the light" (Tawney)

‡ Kellogg Briand pact 1928.

(Paris Pact) అనికూడా అంటారు. కాని క్రియాపరిపక్వమువచ్చు సరికి ఆసంధి నెవరు లెక్క చేయలేదు. జపాను, ఇటలీ ఆఒడంబడికను ఆమోదించినవే కదా! ఆసంధియొక్క ముఖ్యోద్దేశము లేవనగా,

౧. జాతీయ విధానములందు యుద్ధము ప్రతిదేశమును పరిత్యజింపవలెను.

౨. అంతర్జాతీయ సమస్యలన్నిటిని ఇకముందు యుద్ధము ద్వారా కాకుండా మధ్యవర్తులద్వారానో, న్యాయసభ తీర్మానముల ద్వారానో శాంతి మార్గములద్వారా పరిష్కరించుకొనవలెను.

ఈసంధిని ఏరాష్ట్రము ఆచరణయందు పెట్టుటలేదు. జపాను చైనాతో యుద్ధము చేసింది. ఇటలీ యిప్పుడు ఎబిస్సీనియాతో యుద్ధంచేస్తోంది కాబట్టి ప్రతిరాష్ట్రమూ అన్నమాటమీద నిలబడి వుండుటకు ప్రయత్నించవలెను.

కాబట్టి జాతిసమితిగౌరవము* కాపాడాలంటే యుద్ధము వీర లక్షణము కాదని ప్రతిదేశము ప్రమాణికము చేయాలి. ప్రతిదేశమునకు సమితియందు నమ్మకం కలుగజేయాలి. అమెరికాదేశమును సమితి లోనికి రప్పించాలి. తమ సభ్యత్వమును రద్దుచేసుకొన్న జర్మనీ, జపాను మున్నగువాటిని తిరిగీ రప్పించుటకు తగు ప్రయత్నములు చేయాలి. ప్రసుతము జాతి సమితి సస్థుగను కనిపెట్టాలి. ఇటలీ అబిసీనియా సమస్య మనసందేహమునకు సమాధాన మివ్వగలదు.

నానాజాతిసమితి - హిందూదేశము :— నానాజాతి సమితిలో మొదటచేరిన దేశములలో మన హిందూదేశ మొకటి. సమితిచట్టములో 'స్వతంత్రత కలిగినదేశములే సమితి సభ్యత్వమునకు అర్హములు' అని వ్రాసియున్నది. అందువలన "మన హిందూదేశమునకు స్వతంత్రత లేదు. కాని సమితియందు సభ్యత్వము పొందినది. ఇది విరుద్ధముగా నున్న"దని కొందరి అభిప్రాయము. ఇది నిజముగా విరుద్ధమే. † ప్రతియేటా ఇండియా ప్రభుత్వమువారు ప్రతినిధులను నియమించి పంపుతారు. ఈప్రతినిధులు బ్రిటిషుమంత్రులు చెప్పినట్లు వోటు చేయవలసియుంటుంది. అటువంటప్పుడు సమితిసభ్యత్వము హిందూ దేశమునకు లాభకరమని ఏమైవుందవుదను ప్రస్తుతము రూఢిగా చెప్పుటకు సాహసింపను. సుభాషుచంద్రబోసుగారు హిందూదేశము తక్షణం సమితిసభ్యత్వము రద్దుచేసి కొనవలసినదని కోరుచున్నారు.‡ వారి కారణములు ముఖ్యముగా ఆర్థికసబంధమైనవి. సమితిఖర్చుల నిమిత్తము హిందూదేశము చాల పైకము చెల్లించుచున్నది. ఇతరదేశములు ఎక్కువడబ్బు చెల్లించినా, వారి దేశీయులు సమితికార్యనిర్వాహకశాఖలో పనిచేయుచు జీతములు పుచ్చుకొనుటవలన తిరిగీ వారి డబ్బు వారిదేశమునకు చేకూరుచున్నదన్నమాటే. మనకు అందు ఉద్యోగములు చేకూరకున్నవి. ఒకరిద్దరు మన దేశీయులు పనిచేయుచున్నను అది లెక్కకురాదు. అదిగాక సరిహద్దురాష్ట్రములో (Frontier province) బ్రిటిషుపరిపాలకులు విమానములనుండి బాంబులు వదలుచున్నారు. దీనికి సమితి ఏవిధమైన శ్రద్ధ తీసికొనుటలేదు. అందుచేత సమితిసభ్యత్వము నిష్ప్రయోజనమన్నారు. కాని సాంఘిక విషయములందు మనదేశమునకు సమితి సహాయము చేయుచున్నదని కొందరి అభిప్రాయము. కార్మికవర్గశాఖ తీర్మానములవలననే ౧౯౨౩ లో ఇండియా ఫ్యాక్టరీచట్టము, ౧౯౨౬ లో ట్రేడుయూనియను చట్టములను ఇండియా ప్రభుత్వమువారు ఆమోదించినారని కొందరు వాదిస్తున్నారు. సమితిలోనుంచి వెళ్లిపోయినందువలన కలిగెడులాభములులేవు సరిగదా, కొన్ని నష్టములున్నవి కొందరనుచున్నారు. సమితిలో వుండి మన

౧ "That the high contracting parties solemnly declare the names of their respective peoples that they condemns recourse to war for the solution of international controversies & renounce war as an instrument of national policy in their relations with one another"

౨ "That the settlement or solution of all disputes or conflicts of whatsoever nature they may be, which arise among them shall never be sought except by pacific means"

All nations in the League signed this pact including United States also all except Argentina & Brazil.

* The glamour of war is as unreal as the bought affection of the prostitute. It is false to believe them that prevention of conflict by internationalgovernment deprives life of its glamour or its romance' (Laski "Grammar of Politics")

† As one remarked "India's place in the League is an anomaly of the anomalies"

‡ Subhas Bose writes: "Every year India has to pay a sum of 16,66, 205 gold francs (roughly equal to 16 lakhs rupees). Let us compare the units of contribution of various countries

| | | | |
|---|---|---|---|
| China has to contribute | 46 units | U. S. S. R. ... ... | 79 ,, |
| France ... | 79 | India | 55 |
| Italy ... | 40 | one unit is equivalent to | 30, 294 gold francs.) |

హిందూదేశముతరఫున దేశ భక్తులు ప్రచారము చేయవచ్చును అనుచున్నారు: ఇంకాకొందరు మన ఏషియా ఖండమంతను ఒక సమితిని వేరే స్థాపించాలి అంటున్నారు. ఈ విషయముల నన్నిటిని ప్రతి హైందవుడును కడు శ్రద్ధతో గమనించి తన అభిమతమును తెలుపవలెను.

ఏది యెట్లున్నను ప్రపంచశాంతిని వీక్షించుటకు ప్రత్యేకము జాతిసమితిమీద నాధారపడిన లాభము లేదు. మీటింగులవల్లను, వివాద పరిష్కారసంఘములవలనను, సఖ్యత సంఘములవలనను కార్యసిద్ధి కానేరదు. ప్రతి దేశమునందుగల ఆర్థిక తారతమ్యములను నిర్మూలనము చేయవలయును. దేశమందుగల ఆర్థికసంపదను జనసామాన్య క్షేమ లాభముల ననుసరించి విభజనము చేయవలయును. ధనవంతులు, ధనహీనులు అనుతరగతుల భేదములను, సంఘవిచక్షణలను సంస్కరించి, ప్రతిపౌరుని క్షేమలాభములకొరకు ప్రభుత్వములు పాటుపడవలెను. తెల్లవారు, నల్లవారు అనెడి విచక్షణవలన కలిగెడి దురాచారముల రూపుమాపవలెను. అంతర్జాతీయ సమాజములను, సంఘములను స్థాపించి, అంతర్జాతీయ విద్యలను పోషింపవలెను. పాశ్చాత్యులు వారి అడావిడిలో ఒకసంగతి మరచిపోయారు. ఆసమస్యను పరిష్కరిస్తేగాని శాంతి చేకూరదు. తక్షణము హిందూదేశమును స్వతంత్ర దేశముగా పరిగణింపవలెను. ఒకదేశమును మరియొక దేశమువారు పరిపాలించుటకు అనర్హులు. కాబట్టి బ్రిటిషువారు హిందూదేశపు స్వతంత్రతను గ్రహింపలేనన్నాళ్లు, ముప్పదిఐదుకోట్ల భారతీయుల జాతీయతను లెక్కచేయనన్నాళ్లు శాంతిసౌధముల నిర్మించుట ఇసుక పునాదులమీద కట్టుటయే. హిందూదేశమునకు స్వరాజ్యము రావాలి. మాగాంధి, టాగూరు, రాధాకృష్ణన్ శాంతిపుష్పములను వెదజల్లాలి. అప్పుడు "సమితి" ని రక్షించాలి.

అలవాటు ౨






# ప్రకృతిలోని ఆహారపరివర్తనము

దువ్వూరి బాలకృష్ణమూర్తి

సమస్త జీవకోటికి ఆధారభూతమగు నాహార మెటుల లభించుచున్నది తెలియజేయు నుపనిషదర్థమునే పాండవు లరణ్యమునకు వెళ్లిన తరుణములో వారియొక్కయు, వారి అనుచరులయొక్కయు పోషణవిషయమై చింతించుచుండిన ధర్మరాజునకు సూర్యారాధన చేయుమని ధౌమ్యులవా రిట్లుపదేశించిరి:

"గతోఽవ్యుత్తరాయణం తేజో రసా నుద్ధృత్యరశ్మిభిః,
దక్షిణాయన మావృత్తో మహీం నివిశతే రవిః.
క్షేత్రభూతే తత స్తస్మి న్నోషధీ రోషధీపతిః,
దివ స్తేజస్సముద్ధృత్య జనయామాస వారిణా.
నిషి క్తశ్చంద్రతేజోభి స్స్వయోనా నిర్గతే రవిః,
ఓషధ్యష్షడ్రసా మేధ్యా స్తదన్నంప్రాణినాం భువి
ఏవంభానుమయంహ్యన్నంభూతానాంప్రాణధారణమ్"

సూర్యభగవాను డుత్తరాయణమును ప్రవేశించి భూమిలోనుండు రసమును, అనగా ఉదకమును తీక్ష్ణమైన తన కిరణములచేత నాకర్షించి దక్షిణాయనమును పొంది, ఉదకరూపేణ భూమిలో ప్రవేశించుచున్నాడు. ఈరీతిగా క్షేత్రభూతుడైన సూర్యుని ఓషధీపతియగు చంద్రుడు అమృతమయములగు తన చల్లనికిరణములతో ఆకాశమునుండి సూర్యసంబంధమగు తేజస్సును గ్రహించి తడుపుచున్నాడు. ఇట్లు చంద్రతేజస్సుచే తడుపబడిన సూర్యరూపమగు బీజములు అంకురాదిరూపమున నిష్పన్నమై పవిత్రములగు షడ్రసములతో కూడిన ఓషధులుగా నుత్పన్న మగుచున్నవి. అవే ప్రాణికోటికి ప్రాణధారణమగు అన్నమగుచున్నవి. దీనినిబట్టి ప్రాణులకు జీవనాధారమగునన్నము సూర్యమయమని స్పష్టమగుచున్నది.

కనుకనే ప్రకృతిశాస్త్రజ్ఞులు ప్రపంచకములో నంతటనుండు అన్నిరూపములగు శక్తులు (all forms of energy) సూర్యసంబంధమైన శక్తి (Solar energy) ని రూపములే అని రూపించి యున్నారు. ఇందుకుదాహరణము:

నీటి ఆవిరివలన యంత్రములు తిరిగి అన్ని విధములగు పరిశ్రమలకు శక్తి నిచ్చుచున్నవి. నీటిని ఆవిరిరూపముగా మార్చుటకు వలయు ఉష్ణత కట్టెలను, బొగ్గును, చమురును కాల్చుటచే కలుగుచున్నది. ఈ కట్టెలు మొదలుగాగలవాటిలో నుండుశ వృక్షాదులు పెరుగుట కాధారభూతమయిన సూర్యరశ్మివలననే కలిగియుండినది. కనుక సూర్యతేజస్సే అనేక విధములుగా మార్పుచెందుచున్నదని యెరుంగనగు. దీని ఆధారమువలననే ప్రకృతిలో ఆహారపదార్థము లెటుల పరిణామమును పొందుచున్నవో పరిశీలింతము.

పశుపక్ష్యాదులు ఉచ్ఛ్వాసముతో గాలిలోనికి విడిచిపెట్టు బొగ్గుపులుసువాయువును సూర్యతేజస్సుఆధారమున ఉద్భిజ్జములన్నియు వాటి అంగనిర్మాణమునకు వలయు కర్బనమును (Carbon) తీసికొని ప్రాణవాయువును గాలిలోనికి తిరిగి విడిచిపెట్టుచున్నవి. ఈ ప్రాణవాయువునే మనుష్యాదులు ఊపిరి పీల్చునప్పుడు లోనికి తీసుకొని జీవించుచున్నారు.

ఓషధులు, ఇతరవృక్షాదులు నిచ్చు ధాన్య, కంద, మూల, ఫలాదులు, కసువులు ప్రాణాణువులతో (Vitamins)నిండియుండి మనుష్యులకు, పశుపక్ష్యాదులకు ఆరోగ్యమైన ఆహారమగుచున్నవి. తిరిగి మనుష్యాదులు విసర్జించుమలమూత్రములు భూమిలోకలసి, సకలోద్భిజ్జ

ములకు సంపూర్ణాహారముగా మారుచున్నవి. ఆకాశము నుండి వర్షరూపమున నేలమీద పడు నీరే బావులు, చెరువులు, తటాకములు, నదులలోను చేరి జీవకోటికి వలయు నుదకముగా నేర్పడుచున్నది.

నేలమీద పెరుగు సమస్త వృక్షాదులకు ముఖ్యాహారమగు నత్రజనిని, పప్పు దినుసులను ఇచ్చు అపరజాతి సస్యగణము మాత్రమే, వాటివేళ్లనాధారము చేసికొని యుండు కొన్ని సూక్ష్మజీవులు గ్రహించి పైర్లకు ఆహారముగా నుండునట్లు సమకూర్చగలుగుచున్నవి. మిగిలిన వాటన్నిటికి సకలాహారపదార్థములు నేలలోనుండి మాత్రమే చేకూరుచున్నవి.

ఓషధులు, వృక్షాదులు నిచ్చు ధాన్యము, కంద, మూల, ఫలాదులు, పచ్చికసుపులు, ఎండుగడ్డి, చొప్ప, ఆకులలములు, పశ్వాదు లిచ్చుపాలు, మానవకోటికి పశుపక్ష్యాదులకు జీవనాధారమగు ఆహారముగా నేర్పడుచున్నది. సమస్తవృక్షజాలము, సస్యాదులు నిచ్చు ఫలితములు సకల జంతుకోటికి ఆహారమగుచు అవి విసర్జించు హేయములగు మలమూత్రాదులు భూమిలో పక్వమై వాటికి ప్రతిఫలముగా నాహారముగా మారుచున్నవి. ఇందులో గమనించవలసిన ముఖ్యవిషయ మేమన, ఒక జాతిజీవకోటి విసర్జించు వస్తువులే మరియొకజాతికి ఆహారముగా నేర్పడుచున్నవి. అందుకనే వృక్షాదుల కృతజ్ఞత నీరీతిగా వర్ణించియున్నారు:

"ప్రథమవయసి పీతం తోయ మల్పం స్మరన్తః
శిరసి నిహితభారా నారికేళా నరాణామ్,
సలిల మమృతకల్పం దద్యు రాజీవితాన్తం
నహి కృత ముపకారం సాధవో విస్మరంతి."

చిన్న వయసున తమకుపోయబడిన కొంచెము నీటిని తలచుకొనుచు, పెద్దవైనతరువాత నెత్తిని కాయలను మోయుచు వాటి జీవితకాలమంతయు అమృతతుల్యమగు జలమును నరులకిచ్చుచు నీరీతిగా సజ్జనులెన్నడు తమకు చేసిన మేలును మరవరని కొబ్బరిచెట్లు లోకమున కొక గొప్పనీతిని బోధచేయుచున్నవి.

ఇంతేకాక, పట్టణములలోని సకలకశ్మల వస్తువులను బళ్లమీద తోలుకొనిపోయి పరిసరములలో నివసించు గ్రామవాసులు తమపొలముల కెరువుగా నుపయోగించుకొని వాటిమీద పెరుగు పాడిపంటలను, కూరగాయలను పట్టణవాసులకు ప్రతిఫలముగా నిచ్చి పట్టణములలోని ఆరోగ్యమున కెల్లప్పుడు సహాకారులగుచున్నారు.



# కర్ణాటక రాగపద్ధతి: జన్యరాగములు

(వింజమూరు వరాహనరసింహాచార్యులు)

శ్రీముఖ ఉగాదిసంచికయందు భారతీయ రాగపద్ధతిని చర్చించుచు రాగముల త్రయోదశలక్షణము శార్ఙ్గదేవ రామామాత్య సోమనార్య వేంకటమఖి ప్రభృతుల మతము ననుసరించి పేర్కొనబడెను. ఆయాకాలములందు వారువారెట్లు రాగవిభాగము గావించినదియు జెప్పుచు మేళపద్ధతికాలము (క్రీ. శ. ౧౬౬౦) రామామాత్యుడు సోమనార్యుడు వేంకటమఖి * తమతమ మేళరాగములందు ఏయే జన్యరాగములను పేర్కొనినదియు జూపియుంటిమి. భావసంవత్సరాదిసంచికలో ననంతరకాలమున ప్రస్తారమేళము లెట్లు పేర్కొనబడినదియు, నందులకు గారణములు నెంచబడెను. యువనామ వత్సరసంచికయందు రెండువిధములను ప్రస్తారమేళముల పేర్లగూర్చి చర్చించుచు దేశమునందు వీనివ్యాపకమును, ఆపైరమును గూర్చియు జెప్పియుంటిమి. ప్రకృతము ప్రస్తారమేళములందలి జన్యరాగముల గూర్చి నేర్వవలసియున్నది.

మేళరాగములు మరి ప్రస్తారమేళరాగములు జనకరాగములనియు, వీనినుండి కలిగినవి అనగా ఆయారాగముల స్వరావళినే కలిగిన రాగములు జన్యములనియు చాల కాలమునుండియు నీదేశమున గ్రహింపబడుచుండెను. శార్ఙ్గదేవుని కాలమునను (౧౩ వ శతాబ్దివరకు) మరియంతకు పూర్వము గ్రామరాగకాలమునను ఈజన్యరాగములు కలవనుట తథ్యము. ఆకాలమున శుద్ధ, భిన్న, గౌడ, వేసర, సాధారణములను అయిదు గ్రామరాగములందు ముప్పది జన్యరాగములు చెప్పబడెను. అనంతరము పదిహేను భాషారాగములందు జన్యములు కొన్ని పేర్కొనబడుట విదితము. కొంతకాలమున కీపద్ధతి మారి రాగాంగ భాషాంగోపాంగ క్రియాంగపద్ధతి క్రమముగ నమలునకు వచ్చినప్పుడును రాగాంగములందు తక్కిన భాషాంగాదులు జన్యములుగ నెంచబడెను. ఇట్లు ప్రతికాలమునను రాగాంగములు లేక జనకరాగములు కొన్నిటినుండి పెక్కులు జన్యరాగములు షాడవౌడవ స్వరప్రస్తార మూర్ఛనలచే గలిగింపబడుట విదితము.

పెక్కురాగములు ఆయా జనకరాగములయొక్క స్వరావళి చొప్పున నెలయింపబడుటచే నివి జన్యము లనబడును. ఉత్తరదేశమున నివి పుత్రికాపుత్రరాగము లనబడును. జన్యరాగములు వర్జరాగములుగ నుంట చూతుము. కొన్ని వక్రరాగములు జన్యములయ్యు ఆరోహణావరోహణములందు సంపూర్ణస్వరములు కలవిగనే యున్నవి. ఒక్కొక్క మేళకర్తయందు పెక్కు జన్యరాగములు గ్రహింతుము. ప్రకృతిపై చిత్ర్యము ఘడియఘడియకు మనస్సున నూతనరుచుల నెట్లు ఘటించుచునే యున్నదో జన్యరాగములును పెక్కు భావయుతములై, రసానుభవోచితములై, భావతైక్ష్ణ్య ప్రచురములై విలసిల్లుచుంట తథ్యము. ఆయారాగముల ప్రభావమును మహనీయులు కనుగొనుచునే యున్నారు. "శోభిల్లు సప్తస్వర సుందరుల భజింపవే మనసా" అని పాడుకొనుచునే యున్నారు. ఇట్లు అక్బరుకాలమునాటి మహాగాయకుని "టాన్ సన్" దీపకరాగమును పాడి ఆరాగ ప్రభావముచే నసువుల బాయవలసినవాడాయెను. కొలదికాలముక్రితము సంగీత వాఙ్మయ నిర్మాతలు శ్రీ త్యాగరాజు అమృత వాహిని రాగమున "శ్రీరామపాదమా" కీర్తన పాడి ఒకానొక భక్తుని మృత్యువుముఖము నుండి తప్పించ గలిగెను. ముద్దుస్వామి దీక్షితులు "అమృత వర్షిణి" రాగ మాలపించి వర్షము సంభవింపజేసెను. † ఇట్లు ఆయారాగముల ప్రభావమును మహనీయులు ప్రదర్శించుచుంట యీ దేశమున విదితము. కొందఱు ఆయారాగానుభవముస్సులై చిరంతన కీర్తిని సంపాదించినవారి నీ దేశమున చూతుము. ప్రత్యేకరాగములను ప్రత్యేక ప్రత్యేకముగ వారువారు స్వాధీనమందు కలిగియుంటయు విదితము. తోడి సీతారామయ్యరు తాను తోడిరాగమును ఘనముగ నలవరచుకొని యద్దాని నొక రసికాగ్రగణ్యుడగు ధనాఢ్యునకు దాకట్టుపెట్టి తనకు వలయు ధనమును పొందెనని తెలియుచున్నది. ఈ సంగతి ఈయన యసమాన రాగజ్ఞానమును చాటుచున్నది. నారాయణగౌళరాగమం దమిత ప్రజ్ఞ సంపాదించియుంటచేగాబోలు త్యాగరాజుశిష్యుడు కుప్పయ్యగారు నారాయణగౌళ కుప్పయ్య అని పిలువబడుచుండెను. ఇట్లు ఆయారాగములం దసమానకౌశల్యమును చూపజాలినందున శంకరాభరణము నరసయ్యగారు, దర్బారు సీతారామయ్యగారు, అఠాణ అప్పయ్యగారు, బేగడ సుబ్రహ్మణ్యయరు, ‡ భైరవి శంకరయ్యరు, సావేరి దొరస్వామి అయ్యరు ఇట్లు ఆయా రాగముల పేర్ల చొప్పున వారు పేర్కొనబడుట చూతుము.

---

* వేంకటమఖి తనకాలమున వాడుకయందుండిన ౧౯ మేళములను పేర్కొనెను. ఇప్పుడు వాడబడు ౭౨ ప్రస్తారమేళములు తాను నిర్మించినట్లు చెప్పుకొనినాడు.

† చూడుడు నావిరచిత "శ్రీ దీక్షితుల చరిత్రము."

‡ ఈయనను పట్నం సుబ్రహ్మణ్యయ్యరు అందురు. శ్రీ త్యాగరాజుగారి కీర్తనలను బోలు పెక్కు కీర్తనలు ఈయన రచించెను.

## రాగవిభాగము

శ్రీముఖ సంవత్సరాదిసంచికయందు గ్రామరాగకాలము నాటి భాషా విభాషాంతర భాష రాగముల గూర్చి చెప్పుచు నివి శార్ఙ్గదేవుని కాలమున గ్రహింపమి రాగాంగోపాంగభాషాంగ క్రియాంగములు జనాదరణ నొందుట గూర్చి తెల్పితిమి. శార్ఙ్గ దేవుని మతము ననుసరించి వీనియందలి రాగములు కూడ పేర్కొనబడెను. ఈ రాగ విభాగము అనంతరము కర్ణాటకదేశమందలి వాగ్గేయులు రామామాత్యుడు, సోమనార్యుడు, వేంకట మఖి మున్నగువారు ఆదరించియుండిరి. వేంకటమఖి తన ప్రస్తారమేళములందు గల జన్యరాగముల నిట్లే విభాగించియుంటయు విదితము.

ఉపాంగ భాషాంగరాగములు నేటికిని జనసమ్మతము నొంది యుంటచే నీ విభాగము తక్కినవానికన్న నవ్యమగునదిగ నెంచవలసియున్నది. ఘననయ రక్తిరాగములను పద్ధతి ఔడవషాడవ వక్రరాగములను విభాగము, పంచమాంత దైవతాంత నిషాదాంత రాగములని ఎంచుట ఈ విధమున రాగవిభాగమును తెలియుట ప్రతిసంగీతజ్ఞుని, సంగీతప్రియుని ముఖ్యకర్తవ్యమని వేరుగ చెప్పనక్కరలేదు.

### ౧. ఉపాంగాదిజన్యరాగములు

పైన తెలిపినట్లు జన్యరాగములు ఉపాంగములు, భాషాంగములు క్రియాంగములు అని మూడువిధములు.

౧. ఉపాంగములన జనకరాగము, లేక మేళకర్తరాగముయొక్క స్వరములనే కలిగియుండునవి. అనగా జనకరాగములందు ఏ యే స్వరములు కలవో వానినే కలిగియుండి, ఔడవషాడవాది భేదముల నొందినవని చెప్పబడును. ఉ. ధన్యాసి, హంసధ్వని మున్నగునవి ఆయా జన్యరాగములందలి ప్రకృతి వికృతస్వరములనే కలిగియుండును.

౨. భాషాంగరాగములు ఉపాంగములవలె జనకరాగముల యొక్క స్వరావళిచొప్పున తమ స్వరములను కలిగియుండియు నన్య స్వరములనుకూడ స్వీకరించును. ఈ అన్యస్వరములే ఆయా రాగ భావములను ఆయా స్వరమూర్ఛనలందుండి కరము పోషించునవి. రాగములు రక్తివంతములగుటకు వీనిని కొంత నియమముతోనే చేర్చబడుట విదితము. భైరవి రాగమున చతుశ్శ్రుతి ధైవతము ఆరోహణమున మాత్రము చేర్చనగుననియు, అవరోహణమున శుద్ధధైవతమే కలుగుననియు నిట్లు నియమముతోనే చతుశ్శ్రుతి దైవతము చేర్చబడుచున్నది. బిలహరి, నీలాంబరి, దేవగాంధారి - ఇట్టి రాగములలో కైశికి నిషాదము కలుగుచున్నది. ఇట్లు కొన్నిరాగములందు అన్యస్వరములు నియమబద్ధముగ నాయా ప్రయోగములందుమాత్రము వచ్చును. ఈ స్వరము లెట్లు చేర్చునది తెలియుటకు మనశ్శాస్త్ర (psychology) సమ్మతమగు "అల్పనిరోధధర్మము" (Law of least resistance) నెరుగవలసియున్నది. ఈ సంగతిని గూర్చి మరియొకతావున చెప్పవలసియున్నది.

ఇక క్రియాంగములగూర్చి చెప్పునప్పుడు ఈవిధమగు జన్యరాగము లిప్పుడు కానమని కొందరెంచుదురు కాని ఇది సత్యదూరము. వేంకటమఖి క్రియాంగరాగముల ...ంచినాడు. క్రియాంగరాగములు అన్యరాగఛాయలను కలిగినవందురు. ఉ. జుజావంతి, ఆహిరి మున్నగు రాగములు ఈవిధముగ నన్యరాగకళలనుకూడ పొంది యుండును.

### ౨. ఘననయ దేశీయములు

రాగములను ఘననయదేశీయములను మూడువిధములుగ గొందరు పేర్కొనిరి. (౧) గమకాదులచే నాభితానముగా ననంతముగా గానము సేయదగినవి ఘనరాగములని యెంచిరి. ఇట్లు ఆరభి, నాట, వరాళి, గౌళ, శ్రీరాగములు ఘనరాగపంచకముగ జెప్పబడును. ఇందుకు మరియొక కారణము కలదు. ఈరాగములందు పరిస్ఫుటమగునదియు, రాగపోషక మగునదియు నగు ఆయా శ్రుతి వ్యక్తీకరింపబడును. అందుచే ప్రాచీనులు వానిని పాటకుడు పాడిన నాతని పాండిత్యమును కనుగొనుట యగునని యభిప్రాయపడిరి. ఇట్లు గౌళయందు ఏకశ్రుతి ఋషభము, ఆరభియందు ప్రత్యేకదైవతము శ్రీరాగమున ప్రత్యేకశ్రుతిగలనిషాదము, మరి తక్కినవానియం దిట్టి ప్రత్యేకశ్రుతిపూర్వక స్వరము కలుగుట, యట్లుపాడుట విదితము. ఇయ్యవి పండితాళి గ్రాహ్యములై యున్నవి.

౨. నయరాగములనే రక్తిరాగములనిరి. ఇయ్యవి రంజనకరములై యుంటచే గట్టుబాట్ల నంతగ బాటింపవు. ఈవిధమగునవి భాషాంగములుగ నిప్పుడెంచబడుట కలదు. కాని రక్తిరాగములుగ పేర్కొనబడినవి కొన్ని ఉపాంగములుగను చూతుము. నాదరామక్రియ, మధ్యమావతి, మోహన మున్నగునవి రక్తిరాగములుగ జెప్పబడును.

3. దేశీయరాగములు ఔత్తరీయరాగములని చెప్పనొప్పు నని సుబ్బరామదీక్షితులు తలంచెను. వీనియందు అన్యరాగఛాయలను చూతుము కావున నివి క్రియాంగములుగ మరియొకవిధమున గొంద రెంచిరి. కాని దేశీయములుగ నెంచబడిన నాయకి, దర్బారు, కాఫీ, జంఝూటి, సారంగ మున్నగునవి అన్యరాగఛాయలను పొందక అన్యస్వరములనుమాత్రము గ్రహించి భాషాంగములుగ నుంటయు విదితము. వీనిని సుబ్బరామదీక్షితులు మున్నగువా రెంచినట్లు ఔత్తరీయరాగములుగ జెప్పుటకు కారణము అఠాణ, కానడ, యమునాకళ్యాణి, కాఫీ మున్నగు నీవిభాగమున పేర్కొనబడినవి ఉత్తరదేశపు ఫక్కిగ నావిధమగు గమకములతో బాడుటచే నని యనవచ్చును.

### 3. శుద్ధచ్ఛాయాలగసంకీర్ణములు

సోమనార్యుడు మున్నగువారు కొందరు రాగములను శుద్ధచ్ఛాయాలగసంకీర్ణములను మూడువిధములుగ మరియొకపద్ధతిని వర్ణించిరి. (౧) శుద్ధరాగములు స్వకీయముగ శ్రోతల మనములను రంజింపజేయజాలినవనియు, (౨) ఛాయాలగములు అన్యస్వరాశ్రయములన



మకాలే దాడికోసము ఇటాలియను లాయత్తపరుచుచున్న యుద్ధఫిరంగులు.



 మ[illegible]ాలే దాడికోసము ఇటాలియనులు ఆయత్తపరుచుచున్న మరికొన్ని యుద్ధఫిరంగులు; కొండఫిరంగులు.

నటు మనస్సును పల్లవింప జేయుననియు, (౭) సంకీర్ణములు ఈరెండు విధములను ప్రజ్ఞ కలిగి పోయి నొదవించుచో తమపనిగ గొనినవైనందున అన్యరాగాశ్రయము లగునవనియు నిట్లు తెలియుదుము. ఈ విధమగురాగములు ఉమాపతి గ్రహించెనని సోమనార్యుడు తెలిపినాడు. కాని వీనిని మతంగముని చెప్పెనని "సంగీతదర్పణ" కర్త దామోదరుడు వాక్రొనినాడు. సోమనార్యుని వాక్య మిట చూడుడు.

"దేశజనుషోఽప్రసిద్ధాస్తేఽభితరంగా ఇవ త్వసంఖ్యాతాః,
శుద్ధచ్ఛాయాలగ సంకీర్ణ తథాస్త్రివిధతాఽత్యేస్త్రేషామ్
శుద్ధో రంజనకారీ స్వేనచ్ఛాయాలగః పరాశ్రయతః,
సంకీర్ణ స్తూభయథా మతి ముదిత ముమాపతే రేవమ్."

—రాగవిబోధ.

## ౮. ఉత్తమ మధ్యమ అధమరాగములు

సోమనార్యుడు మరియొక ఉత్తమ మధ్యమ అధమములను రాగవిభాగమును కూడ చెప్పెను.

(౧) ఉత్తమరాగములు :— గీతప్రబంధాలాపాల ప్తియోగ్యములగు రాగములు ఉత్తమము లనబడెను.

(౨) మధ్యమరాగములు :— గీతప్రబంధాలాపాల ప్తియోగ్యములయ్యు నల్పప్రచారము నొందినవి మధ్యమము లనబడెను.

(౩) అధమరాగములు:— దేశమున బహుళప్రచారమున గలవయ్యు నైవిధమగు గీతప్రబంధాల ప్తియోగ్యత లేని రాగములు అధమములనబడెను.

"యేఽస్త్రాలాపాల ప్తి ప్రబన్ధయోగ్యా స్త ఉత్తమాః కథితాః,
అపి తాదృశా యేఽల్పప్రచారిణో మధ్యమాస్తేస్యుః.
అపిబహుతర ప్రచారా స్తద యోగ్యాస్తే ఽధమా ఇతిత్వన్యే."

అనంతరము సోమనార్యుడు దేశమందు ప్రసిద్ధమగు రాగవిభాగము సంపూర్ణషాడవౌడవముల గూర్చి చెప్పినాడు,

"యద్యపి దేశీరాగా దేశేదేశేఽ న్యథేలాఖ్యాః,
పూర్ణౌడవషాడవతా స్వంశన్యాసగ్రహేషుచానియతాః."

## ౯. సంపూర్ణ షాడవౌడవములు

రాగములు ఆరోహణావరోహణములందలి స్వరసంఖ్య ననుసరించి సంపూర్ణములనియు, * షాడవములనియు, ఔడవములనియు నిట్లు పేర్కొనబడుట ప్రాచీనకాలమునుండియు జాతము. భరతముని తన 'నాట్యశాస్త్రము'న జాతిరాగములందు షాడవౌడవముల గూర్చి కొంతమేర చెప్పియుండెను. అనంతరము వాగ్గేయులు నీవిధమగు రాగములను గ్రహించి యాదరించిరి. పాశ్చాత్యదేశములందు సహితము షా- ఔడవరాగములను చూతుము. మోహన మున్నగు మన ఔడవరాగములను పాశ్చాత్యులు గ్రహించి వానిని **Pentatones** అని మనము చెప్పునట్లు వచింతురు. కాని వారు ఏవో కొన్ని ఔడవ షాడవరాగములను మాత్రము గ్రహించి రనునది మరువకూడదు. మనవా రట్లుకాక ప్రతిమేళకర్తయందు స్వరములను క్రమముగ భ్రష్ఠించి పెక్కురాగములను గ్రహించి పాడుచుండిరి. కొలదిరాగములు మాత్రము గ్రహించు పాశ్చాత్యులకు భారతీయుల వేనవేలు రాగములు వింతగ దోచుటయే కాక సులభగ్రాహ్యములుగకూడ గావనవలయును. పాశ్చాత్యులు కొలది రాగములందే తమ ప్రజ్ఞానైపుణ్యము చొప్పున స్వరమూర్ఛనల నేర్పరచి అట్లు శ్రావ్యగాన పద్ధతి (Hormonic type of Music) నాదరించి యుండిరి. ఈ పద్ధతియు భారతీయుల గ్రాహ్యమునకు దూరముగ లేదు. కొన్నికొన్ని తావుల గొందరు కొందరు మన వాగ్గేయులు ఈవిధమగు పోకడలను తమ కృతులందు చూపియుంట గందుము.

కొంతకాలమునుండి పెక్కురు † ప్రస్తారమేళములు, లేక మేళకర్తలు సంపూర్ణ సంపూర్ణములుగ నెంచుచుండిరి. అనగా మేళకర్తలందలి ఆరోహణావరోహణములు సప్తస్వరయుతములై సంపూర్ణములుగ నుండునట్లు ఎంచుచుండిరి. కాని వేంకటమఖిచే జెప్పబడిన మేళకర్తలు పెక్కులు సంపూర్ణ సంపూర్ణములుగ లేవనునది మరువకూడదు. మేళకర్త లీనియమానుసరణీయములని రెంచుటకు వలయు సంగతులు వీరు పేర్కొనలేకయున్నారు. ఇప్పుడు వాడుకలోగల జన్యరాగములు హుసేని, మాంజి మున్నగునవి స్వరవర్జయుతములుగ లేక సంపూర్ణ సంపూర్ణములుగ నుంట తెలియుదుము. వీని జనకరాగములు కూడ నిట్లు సంపూర్ణ సంపూర్ణములయ్యు నివి వ్యక్తములుగనే యున్నవి. జనకరాగములనుండి వీనిని వ్యక్తపరచునది రాగరంజికస్వరమూర్ఛని లనవచ్చును. ఈ స్వరమూర్ఛనలనే దక్షిణమున 'పిడుప్పు' అని చెప్పుదురు.

రాగము వ్యక్తీకరింపబడుటకు అధమము అయిదు స్వరములు‡ లావశ్యకము లగుచున్నవి. ఒకస్థలము నావరించుటకు త్రికోణమందు వలె మూడురేఖలు (నిడుపుగీతలు) ఆవశ్యకము లగునట్లు రాగములు వ్యక్తీకరింపబడుటకును, స్వరూప మేర్పడుటకును అయిదు స్వరములై పను కావలయు ననునది పెద్దకాలమునుండియు నిట నేమి,పాశ్చాత్యదేశములందేమి గ్రహింపబడుచున్నది. కాని భారతావనియందు కొన్ని రాగము లిప్పుడు నవరసకన్నడ (సగమపస-సనిదమగరిస) వివర్జని

* సప్తస్వరములుగల రాగములు సంపూర్ణములు. ఆరుస్వరములు గలవి షాడవములు. అయిదుస్వరములుగలవి ఔడవములు.

† ఆంధ్రపత్రిక యువ సంవత్సరాదిసంచికయందు తెలిపినట్లు కనకాంగి, రత్నాంగిమేళములు గ్రహించువారు.

‡ తారస్థాయి షడ్జము లెక్కలో చేర్చబడదు.

(స రి మ ప స - స ని ద ప మ గ రి స) మున్నగునవి నాలుగుస్వరములచొప్పున చూతుము. కాని అవరోహణమం దియ్యవి ఆరు, లేక ఏడుస్వరములను కలిగినవగుటచే రాగవిన్యాసయోగ్యము లుగ నున్న వందుము. ఈ సందర్భమున పూర్వపువాగ్గేయులు ఒక్క స్వరము, రెండుస్వరములు, మూడు స్వరములు గల రాగములనుకూడ గ్రహించి చెప్పవచ్చు నననది మరువకూడదు. ఒక్కస్వరముతో గల రాగము 'ఆర్చిక' మనియు, రెండుస్వరములు కలది 'గాధిక' మనియు, మూడు స్వరములు కలది 'సామిక' మనియు నిట్లు వాక్కొనిరి. నాలుగు స్వరములు కల రాగము స్వరాంతర మనిరి.

## ౬. వక్రసక్రమ రాగములు

జన్యరాగములు సక్రమములు, వక్రములు అని రెండువిధములుగ జూతుము. వక్రరాగములందు స్వరావళి ఆరోహణమునగాని, అవరోహణమునగాని, లేక యీ రెంటియందు గాని వక్రసంచారము చొప్పన నుండును. ఉదాహరణముగ నానందభైరవి సగరిగమ పదపనిస-సనిదప మగరిస చొప్పన ఆసావేరి సరిమపదస- సనిస పదమపరిగరిస, శహన సరిగమపమదనిస - సనిదపగమరీగరిస ఇట్లు సంచరింపబడును. స్వరములు సక్రమముగ సంచరింపబడునప్పటి జన్యరాగములకన్న వక్రరాగములు ప్రతిమేళమందు పెక్కులు గ్రహింతుము. అట్టు లయ్యు మిగుల కొలది వక్రరాగములు మాత్రము వాడుకలో నున్నవి. అందుచే మేధావంతులు, సంగీత జితప్రజ్ఞులు అప్పుడప్పుడు నూతన వక్రరాగములు నిర్మించి పాడుటకు వీలుకలదు. కొలదికాలము వెనుక నుండి యభినవ త్యాగరాజై పెక్కుకీర్తనలు రసవంతముగ రచించి పాడి ఘనతగాంచిన పట్నం సుబ్రహ్మణ్యయ్యరు "కదన కుతూహలము" రాగమును సరిమదనిగపస- సనిదపమగరిస అను స్వరవక్రసంచారముచొప్పన నిర్మించి తన "రఘువంశసుధాంబుధిచంద్ర" రన పాడెను. ఇట్లు కొందరు క్రొత్తరాగములను పాడగలుగుచున్నారు.

## సక్రమజన్యరాగములు

స్వరములు ఆరోహణావరోహణములందు సక్రమముగా కొన్నిటి వర్జించియు నొప్పింపబడిన జన్యరాగములు ప్రతిమేళకర్తరాగమును ఎనిమిది విధములుగ నిట్లు గ్రహింతుము:

(౧) షాడవ- సంపూర్ణములు
(౨) సంపూర్ణ- షాడవములు
(౩) ఔడవ- సంపూర్ణములు
(౪) సంపూర్ణ-ఔడవములు
(౫) షాడవ-షాడవములు
(౬) షాడవ- ఔడవములు
(౭) ఔడవ-షాడవములు
(౮) ఔడవ- ఔడవములు

ఈ ఎనిమిది విధములగు రాగములందు బాగుగ వ్యాసకమునగల రాగము లిట వివరములతో జూడవగును:

| | స్వరసంచారము | రాగము పేరు | మేళకర్తసంఖ్య | విభాగవివరము |
|---|---|---|---|---|
| 1 | స రి గ మ ప ద స - స ని ద ప మ గ రి స | కాంభోజి | 28 | షాడవ - సంపూర్ణము |
| 2 | స రి గ మ ప ద ని స - స ద ప మ గ రి స | భైరవము | 17 | సంపూర్ణ - షాడవము |
| 3 | స రి గ ప ద స - స ని ద ప మ గ రి స | బిలహరి | 29 | ఔడవ - సంపూర్ణము |
| 4 | స రి గ మ ప ద ని స - స ని ద మ గ స | సారమతి | 20 | సంపూర్ణ - ఔడవము |
| 5 | స రి గ మ ప ద స - స ద ప మ గ రి స | శుద్ధసీమంతిని | 8 | షాడవ - షాడవము |
| 6 | స రి గ మ ధ ని స - స ని ప మ గ స | నాటకురంజి | 28 | షాడవ - ఔడవము |
| 7 | స రి మ ప ద స - స ద ప మ గ రి స | సామ | 28 | ఔడవ - షాడవము |
| 8 | స రి గ ప ద స - స ద ప గ రి స | మోహన | 28 | ఔడవ - ఔడవము |

ఒక్కొక మేళకర్తయందు ఈవిధములగు జన్యరాగములు ౪౮౩ కలవని ఇట్లు ప్రస్తరించి కనుగొనవచ్చును.

(౧) సప్తస్వరములలో ఒక్కొకస్వరమును వర్జించి ఆరేసి స్వరములను ఆరోహణమున జేర్చగ గలుగు రాగములు ఆరు కలవు. ౬

(౨) ఇట్లు అవరోహణమున ఒక్కొక్కస్వరమును వర్జించినచో గలుగు షాడవరాగములు. ౬

(౩) ఔడవ సంపూర్ణములు: సప్తస్వరములలో ఆరోహణమున మాత్రము అయిదేసి తీసికొనినప్పుడు ౧౫ రాగములు గలుగును. ౧౫

(౪) ఇట్లు సంపూర్ణఔడవములు అవరోహణమున అయిదేసి స్వరములు మాత్రము గ్రహించునప్పటి రాగములు. ౧౫

(౫) షాడవషాడవములు: ఆరోహణమున ఆరేసిస్వరముల చొప్పున తీసికొనునవి యారును అవరోహణమున ఆరేసిస్వరములు తీసికొనునవి యారును కలుగును కావున ఆరోహణావరోహణములందు ఆరేసిస్వరములు గల రాగములు ముప్పదియారు గ్రహింతుము. ౩౬

(౬) ఔడవషాడవములు: ఆరోహణమున అయిదేసి స్వరములు మాత్రము గ్రహించునప్పటివి ౧౫ కలవు. కావున అవరోహణ

మున ఆరేసిస్వరములుగల యారురాగములతో వానిని చేర్చిన తొంబదిరాగములు వ్యక్తములగును. ౯౦

(౭) షాడవౌడవములు : ఈవిధమున ఆరోహణమున ఆరేసిస్వరములుగల యారురాగములతో అవరోహణమున అయిదేసిస్వరములుగల ౧౫ రాగములు జేర్చగ గలుగునవి మరితొంబది కలవు. ౯౦

(౮) ఔడవౌడవములు : ఆరోహణమున అయిదేసిస్వరములు తీసికొనునప్పటి పదిహేనురాగములతో అవరోహణమున నైదేసి స్వరములు గల పదిహేనురాగములుచేర్చిన ౧౫ × ౧౫= ౨౨౫ రెండువందల యిరువదియైదురాగములు కలుగును. ౨౨౫

ఇట్లు ౮ విధములగు విభాగములందు మొత్తము ౪౮౩ రాగములు ప్రతిమేళకర్తరాగమందును గ్రహింతుము.

## ఇందలి కొన్నిదోషములు

పైవిధమున కనుగొనిన జన్యరాగములందు కొన్నిదోషములు చూడగలము. హరికాంభోజి శంకరాభరణమేళములకు నిషాదమే వ్యత్యాసముకద! ఈ జనకరాగములందు నిషాదములేని రాగములు

i స రి గ ప ద స - స ద ప గ రి స
ii స రి మ ప ద స - స ద ప మ రి స
iii స గ మ ప ద స - స ద ప మ గ స
iv స రి మ ప ద స - స ద ప మ గ రి స.

ఇట్లు కొన్ని కలవు. ఇయ్యవి పై జనకరాగములు రెంటియందు లేని జన్యమైనను పునరుక్తిగ దెలియుదుము. మరియు ౧ వ రాగమువలె మధ్యమము కైగొనని జన్యములు ప్రతిమధ్యమయుతములగు మేళకర్తలందును పునరుక్తిగ గలుగును. పై మేళకర్తలందలి జన్యములు ప్రతిమధ్యమయుతములగు ౬౪, ౬౫ మేళములు, అనగా వాచస్పతి మేచకళ్యాణి జన్యములుగ గూడ నెంచవచ్చును. ౨ వ జన్యరాగము ౨౨ వ ఖరహరప్రియ జన్యమగను, ౨౩వ గౌరిమనోహరి జన్యముగను కూడ ప్పవచ్చును. కాని పునరుక్తిగ నిట్లు దోచు రాగములు ఒక్క జన్యరాగమందుమాత్రము ఎంచబడుట విదితము.

## పునరుక్తిలక్షణము

(౧) రాగములందు ఆరోహణము కాని, అవరోహణము కాని సంపూర్ణముగ సప్తస్వరములు కలిగియున్న నారాగములు పునరుక్తిగ గలుగవు. షాడవ సంపూర్ణములు, సంపూర్ణ షాడవములు, ఔడవ సంపూర్ణములు, సంపూర్ణ ఔడవములు ఇట్లు పునరుక్తిలేని రాగములే. ఇయ్యవి ప్రతిమధ్యమ మేళకర్తలందును పునరుక్తిగ రావు.

(౨) ఏయే మేళకర్తయందు వర్జస్వరము, లేక స్వరములు ఒక్కటే యగుచున్నదో వానియందెల్ల పునరుక్తిరాగములు చూతుము. ఋషభవర్జమగునవి స గ మ ప ద స - స ని ద ప మ గ స అను సంచారముగల ఖరహరప్రియయందలి జన్యరాగము (జయంతిసేన) నాటకప్రియయందును జన్యముగ నెంచవచ్చును. ఈ రెంటికి వ్యత్యాసము ఋషభమందుమాత్రముకద!

(౩) షాడవషాడవములు, షాడవౌడవములు, ఔడవ షాడవములు, ఔడవౌడవములు పునరుక్తిరాగములు కలవయ్యు వీనిలో

i స రి మ ప ద స - స ని ప మ గ స
ii స రి గ మ ప ద స - స ని ద ప మ గ స.

ఇట్లు ఆరోహణావరోహణములు కలసి సప్తస్వరములు కలిగినచో నట్టి రాగములు పునరుక్తిగ సంభవింపవు.

(౪) అ. శుద్ధమధ్యమ మేళకర్తలందలి పునరుక్తిరాగములు ప్రతిమధ్యమ మేళకర్తలందును అట్లు అగుచున్నవి.

స రి మ ప ని స - స ని ప మ రి స అను సంచారముగలిగి చతుశ్రుతిఋషభ శుద్ధమధ్యమ చతుశ్రుతిదైవత కైశికి నిషాదముతో గల రాగము ౨౦, ౨౨, ౨౬, ౨౮ మేళకర్తలందును మరి వీనికి ప్రతిమధ్యమము చేర్చబడిన ౫౬, ౫౮, ౬౨, ౬౪ మేళకర్తలందును పునరుక్తిగ సంభవించును.

ఆ. ఇట్లు గాంధారము వర్జమగు ఔడవరాగము శుద్ధమధ్యమ మేళకర్తలందు నాలుగుచోట్ల పునరుక్తిగ దోచుటచే నాడవరాగములు నాలుగు మేళకర్తలందు పునరుక్తిగ గలుగునని ఎంచవచ్చును. ఉదాహరణము—స గ మ ప ద స - స ద ప మ గ స అను సంచారముగల రాగము ధీరశంకరాభరణము, చక్రవాకము, సూర్యకాంతము, హరికాంభోజి మేళములందును స రి మ ప ద స - స ద ప మ రి స అను స్వరావళి గల రాగము ధీరశంకరాభరణము, ఖరహరప్రియ, గౌరీమనోహరి, హరికాంభోజి మేళములందును పునరుక్తిగ ఇట్లు గ్రహింపనగును.

ఇ. దైవత స్వరవర్జముగల రాగము ఈస్వరముమాత్రము వ్యత్యాసముగల మేళకర్తలందు పునరుక్తిగ గలుగును. ఉ. స రి గ మ ని స - స ని ప మ గ రి స అనుసంచారముగల (రుద్రప్రియ) ౨౨వ మేళమందును, ౨౦.వ మేళమందును జన్యముగ నెంచవచ్చును.

ఈ. నిషాదవర్జ జన్యరాగములు ఈ స్వరమందు వ్యత్యాసము గల మేళకర్తలందు పునరుక్తిగ గలుగును. ఉ. స రి గ మ ద స - స ద ప మ గ రి స- ౨౨వ మేళకర్తయందలి రాగము ౨౩వ మేళమందును పునరుక్తిగ దోచు.

౪. అ. పంచమము వికృతిమొందనిదగుటచే నీస్వరము వర్జమగు ఔడవషాడవము లేక షాడవౌడవము లేక షాడవషాడవము జన్యరాగములు ఏ మేళమునను పునరుక్తిగ రావు.

౫. కాని పంచమస్వరవర్జ్య షౌడవరాగము మరియొక్క మేళకర్తయందు మాత్రము పునరుక్తిగ దోచును.

౬. పూర్వాంగస్వరము లన్నియు గల (సరిగమ) జన్యరాగము ఆచక్రమందలి మేళకర్తలందు పునరుక్తిగ గలుగును.

౭. ఉత్తరాంగస్వరము లన్నియు గల జన్యరాగము ఆయా మేళకర్త వరుససంఖ్య చొప్పున ఇతర చక్రములందలి మేళకర్తలందు పునరుక్తిగ బొడచూపును.

ఇట్లు పునరుక్తిరాగములు క్రమముగ నెంచిన పైజన్యరాగముల సంఖ్యలో పెక్కులు కలవనుట తథ్యము. కాని మనవారు సదరు జన్యరాగమును ఆయా మేళకర్తయందు మాత్రము చేర్కొనుటకు కుతూహలము చూపుచుండిరి. ఇట్టులయ్యు గొన్ని భిన్నాభిప్రాయము లీయంశమందును చూతుము. ఉదహరణముగ:-సరి గ ప ద స - స ద ప గ రి స అను స్వరావళిగల మోహనరాగము ధీరశంకరాభరణరాగ జన్యముగ గొందరు, కాంభోజిమేళ జన్యముగ గొందరు, మేచకళ్యాణి జన్యముగ గొందరు ఇట్లు చెప్పినారు. స రి మ ప ని స - స ని ప మ రి స అను సంచారముగల మధ్యమావతిరాగమును ఖరహరప్రియ, నటభైరవి, చారుకేశి, హరికాంభోజి ఈమేళకర్తల జన్యముగ వేరువేరు రీతుల నెంచుదురు. ఆయా జన్యరాగమునందలి రాగకళాపోషకములగు స్వరములకును జనకరాగముయొక్క ఈస్వరములకును గల సంబంధము ననుసరించి చేర్కొనుటలో నుత్సాహము జూపుచు గొందరు, వరుస వెంబడి ప్రథమమేళ జన్యముగ నెంచుటే యాచారమని ఎంచికొందరు అంశస్వరము మున్నగునవి జన్యజనకరాగము లందు ముఖ్యము కావున నాస్వరముల ననుసరించి చెప్పటచే గొందరు ఇట్లు పునరుక్తిరాగములను మేళకర్తలందు చేర్చుటలో భిన్నాభిప్రాయములకు లోనైరి. ఇందుచే నీరాగములగూర్చి చర్చించునప్పుడు అయ్యది ఏమేళకర్త జన్యమైనదియు దెల్పుట యావశ్యకమగుచున్నది. రాగముల లక్షణము గూర్చి చర్చించుచుండిన మద్రాసు సంగీతపరిషత్సభ మున్నగుచోట్ల ఈవిషయముగూర్చియు జర్చించుట కర్తవ్యమగుచున్నది.

## వక్రరాగములు

వక్రరాగములను మూడు విభాగములుగ నెంచవచ్చును. (౧) ఆరోహణావరోహణములు రెంటియందు స్వరములు వక్రసంచారమున నుండునవి (౨)ఆరోహణమున మాత్రము స్వరములు వక్రసంచారముకలిగి అవరోహణమున సక్రమ సంచారముతో నుండునవి (౩) ఆరోహణమున స్వరములు సక్రమ సంచారముతోనుండి అవరోహణమున స్వరములు వక్రసంచారముతో నుండునవి. ఒక్కొక్క విభాగమందు తొమ్మిది విధములగు వక్రరాగములు తెలియుదుము. ఇందుచే నిరువదియేడు విధములగు వక్రరాగములు ఈ మూడు విభాగములందు గ్రహింపనగును. ప్రతిమేళకర్తయం దీవిధములగు వక్రరాగములు కలవనుటచే నీ రాగములు పెక్కులు డెబ్బదిరెండు మేళకర్తలందు చెప్పవచ్చును. భారతీయులు ఈ విధముగ నసంఖ్యాకములగు రాగములు పాడగలుగుట పాశ్చాత్యులకు ఆశ్చర్యకరమగుటయేకాక యాదర్శప్రాయముగ నున్నది.

౧వ విభాగమందలి నవవిధ వక్రరాగము లిట్లు చూడవచ్చును.

౧ సంపూర్ణ సంపూర్ణములు
౨ సంపూర్ణ షాడవములు
౩ షాడవ సంపూర్ణములు
౪ సంపూర్ణ ఔడవములు
౫ ఔడవ సంపూర్ణములు
౬ షాడవ షాడవములు
౭ షాడ వౌడవములు
౮ ఔడవ షాడవములు
౯ ఔడవౌడవములు

ఈ తొమ్మిది వక్రరాగములు తక్కిన రెండు విభాగములందును గ్రహింతుము. అందుచే నిరువదియేడువిధములగు వక్రరాగములు ప్రతిమేళ కర్తయందు కలుగుచున్నవి.

## పంచమాంతాదిరాగములు

జన్యరాగములు కొన్ని మరియొక్క విధమునను చూతుము. తారస్థాయి షడ్జము వరకు స్వరసంచారము లేనిరాగములు కొన్ని గలవు. ఆయాస్వరముతో నంతమొందు రాగములాయాస్వరము పేరుతో జేర్గా నగుచును. ఇట్లు పంచమాంతరాగములు, మరి దైవతాంతములు, నిషాదాంతములు అని పిలువబడుట విదితము. ఈ విధముగ ప్రాచీన వాగ్గేయులు రాగముల నెంచకపోయినను కొన్ని కర్ణాటకరాగము లీవిధముగనుంటచే కర్ణాటక వాగ్గేయులచే గొంతకాలమునుండియు నిట్లు గ్రహింపబడుట చూతుము.

౧ పంచమాంతరాగములు : మధ్యస్థాయి పంచమమువరకు స్వరసంచారము కలవి - ఉదాహరణము - నవరోజు (ప ధ ని సరిగప-మగరిసనిదప)

౨ దైవతాంతములు : మధ్యస్థాయి దైవతమువరకుమాత్రము స్వరసంచారముకల రాగములు- ఉదాహరణము. కురంజి (స ని స రి గ మ ప ద- ద ప మ గ రి స ని స)

౩ నిషాదాంతములు : మధ్యస్థాయి నిషాదమువరకు స్వరసంచారము కలరాగములు. ఉదాహరణము- నాదనామక్రియ (స రి గ మ ప ద ని - ని ద ప మ గ రి స ని)

# కర్ణాటకరాగపద్ధతి : జన్యరాగములు

## వాడుకయందలి కొన్ని జన్యరాగములు

| | రాగము పేరు | మేళకర్త నెంబరు | | ఆరోహణము — అవరోహణము |
|---|---|---|---|---|
| 1 | అభేరి | 20 | ఉ. | స గ మ ప ని స - స ని ద ప మ గ రి స |
| 2 | అభోగి | 22 | — | స రి గ మ ద స - స ద మ గ రి స |
| 3 | ఆహిరి | 8 | భా. ర. | స రి స గ మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 4 | అమృతవాహిణి | 20 | — | స రి మ ప ద ని స - స ని ద మ గ రి స |
| 5 | ఆనందభైరవి | 20 | ఉ. ర. | స గ రి గ మ ప ద ప ని స - స ని ద ప మ గ రి స |
| 6 | ఆరభి | 29 | భా. ఘ. | స రి మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 7 | అసావేరి | 8 | భా. ర. | స రి మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 8 | అఠాణా | 29 | భా. దే. | స రి మ ప ని స - స ని ధ ప మ ప గ రి స |
| 9 | ఈశామనోహరి | 28 | భా. | స రి గ మ ప ద ని స - స ని ద ప మ రి మ గ రి స |
| 10 | ఉదయరవిచంద్రిక | 20 | ఉ. | స గ మ ప ని స - స ని ప మ గ స |
| 11 | ఉమాభరణము | 28 | — | స రి గ మ ప ద ని స - స ని ప మ రి గ మ రి స |
| 12 | కళ్యాణి | 65 | ఉ. ర. | స రి గ మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 13 | కమలామనోహరి | 27 | — | స గ మ ప ని స - స ని ద ప మ గ స |
| 14 | కాంభోజి | 28 | భా. ర. | స రి గ మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 15 | కన్నడ | 22 | భా. | స రి గ మ ప మ ద ని స - స ని ప ద ని ద ప మ గా మ రి స |
| 16 | కన్నడగౌళ | 22 | ఉ. | స రి గ మ ప ని స - స ని ద ప మ గ స |
| 17 | కాఫీ | 22 | భా. ర. | స రి గ మ రి ప మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 18 | కాపీనారాయణి | 28 | — | స రి మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 19 | కదనకుతూహలము | 29 | — | స రి మ ద ని గ ప స - స ని ద ప మ గ రి స |
| 20 | కేదారగౌళ | 28 | — | స రి మ ప ని స - స ని ద ప మ గ రి స |
| 21 | కేదారము | 29 | భా. | స మ గ మ ప ని స - స ని ప ద ప మ గ రి స |
| 22 | కమాసు | 28 | భా. దే. | స గ మ ప ద ని స - స ని ద ప మ గ స |
| 23 | కోకిలధ్వని | 28 | — | స రి గ మ ద ని ద స - స ని ద ని ప మ గ రి స |
| 24 | కుంతళవరాళి | 28 | — | స మ ప ద ని ద స - స ని ద ప మ స |
| 25 | కురంజి | 29 | ఉ. | స ని స రి గ మ ప ద - ద ప మ గ రి స ని స |
| 26 | గమకక్రియ | 53 | ఉ. దే. | స రి గ మ ప ద స - స ని ద ప మ గ మ రి స |
| 27 | గరుడధ్వని | 29 | — | స రి గ మ ప ద ని స - స ద ప గ రి స |
| 28 | గౌళ | 15 | ఉ. ఘ. | స రి మ ప ని స - స ని ప మ రి గ మ రి స |
| 29 | గౌళిపంతు | 15 | భా. | స రి మ ప ని స - స ని ద ప మ గ రి స |
| 30 | గౌరి | 75 | — | స రి మ ప ని స - స ని ద ప మ గ రి స |
| 31 | గోపికావసంత | 20 | — | స మ ప ని ద ని ద స - స ని ద ప మ గ స |
| 32 | గుండక్రియ | 15 | ఉ. | స రి మ ప ని స - స ని ప ద ప మ గ రి స |
| 33 | చంద్రజ్యోతి | 41 | — | స రి గ మ ప ద స - స ద ప మ గ రి స |
| 34 | ఛాయతరంగిణి | 28 | — | స రి మ గ మ ప ని స - స ని ద ప మ గ రి స |
| 35 | చిత్తరంజని | 19 | — | స రి గ రి గ మ ప ద - ని ద ప మ రి గ రి స |
| 36 | జగన్మోహిని | 15 | — | స గ మ ప ని స - స ని ప మ గ రి స |
| 37 | జనరంజని | 29 | — | స రి గ మ ప ద ప ని స - స ద ప మ రి స |
| 38 | జంఝూటి | 28 | — | ద స రి గ మ ప ద ని - ద ప మ గ రి స ని ద ప ద స |
| 39 | జయమనోహరి | 22 | — | స రి గ మ ద స - స ని ద మ గ రి స |
| 40 | జయంతిసేన | 22 | — | స గ మ ప ద స - స ని ద ప మ గ స |
| 41 | జయంతిశ్రీ | 20 | — | స గ మ ద ని స - స ని ద మ ప మ గ స |
| 42 | జింగ్ల | 20 | — | స రి గ మ ప ద ని ద ప స - స ని ద ప మ గ రి స |

| | రాగముపేరు | మేళకర్త నెంబరు | | ఆరోహణము — అవరోహణము |
|---|---|---|---|---|
| 43 | | 8 | | స రి గ మ ద ని స - స ని ద మ గ రి స |
| 44 | దర్బారు | 22 | భా. దే. | స రి మ ప ద ని స - స ని ద ప మ రి గ రి స |
| 45 | దేశాక్షి | 29 | | స రి గ ప ద స - స ని ద ప మ గ రి స |
| 46 | దేవగాంధారి | 29 | భా. దే. | స రి మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 47 | దేవక్రియ * | 20 | ఉ. | స రి మ ప ద స - స ని ద ని ప మ గ రి స |
| 48 | దేవమనోహరి | 22 | | స రి మ ప ద ని స - స ని ద ని ప మ రి స |
| 49 | దేవామృతవర్షిణి | 22 | | స రి గ మ ని ద ని స - స ని ద ప మ గ రి స |
| 50 | ధన్యాసి | 8 | భా. ర. | స గ మ ప ని స - స ని ద ప మ గ రి స |
| 51 | ద్విజావంతి | 28 | | స రి మ గ మ ప ద ని స - స ని ద ప మ గ రి గ స |
| 52 | నభోమణి | 40 | | స రి గ రి మ ప స - స ని ద ప మ గ రి స |
| 53 | నాదచింతామణి | 22 | | స గ మ ప ని ద ని స - స ని ద ప మ గ రి గ స |
| 54 | నాదనామక్రియ | 15 | ఉ. ర. | స రి గ మ ప ద ని - ని ద ప మ గ రి స ని |
| 55 | నళినికాంతి | 27 | | స గ రి మ ప ని స - స ని ప మ గ రి స |
| 56 | నారాయణగౌళ | 28 | | స రి మ ప ని ద ని స - స ని ద ప మ గ రి గ రి స |
| 57 | నాట | 36 | ఉ. ఘ. | స రి గ మ ప ద ని స - స ని ప మ రి స |
| 58 | నాటకురంజి | 28 | భా. ర. | స రి గ మ ద ని స - స ని ద మ గ స |
| 59 | నవరోజు | 29 | భా. ర. | ప ద ని స రి గ మ ప - మ గ రి స ని ద ప |
| 60 | నవరసకన్నడ | 28 | — | స గ మ ప స - స ని ద మ గ రి స |
| 61 | నాయకి | 22 | భా. దే. | స రి మ ప ద నీ ద ప స - స నీ ద ప మ రి గ రి స |
| 62 | నీలాంబరి | 29 | భా. ర. | స రి గ మ ప ని స - స ని ప ద ని ప మ గ రి గ స |
| 63 | ఫలమంజరి | 22 | | స గ మ ద స - స ని ద ప మ గ మ రి స |
| 64 | పంతువరాళి | 51 | | స రి గ మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 65 | పూర్ణచంద్రిక | 29 | భా. | స రి గ మ ప ద ప స - స ని ప మ రి గ మ రి స |
| 66 | | 53 | — | స రి గ మ ప ద ని ద స - స ని ద ప మ గ రి స |
| 67 | ప్రతాపవరాళి | 28 | — | స రి మ ప స - స ద ప మ గ రి స |
| 68 | బహుదారి | 28 | — | స గ మ ద ప ద ని స - స ని ప మ గ స |
| 69 | బలహంస | 28 | ఉ. | స రి మ ప ద స - స ని ద ప మ రి మ గ స |
| 70 | బంగాళ | 29 | — | స రి గ మ ప మ రి ప స - స ని ప మ రి గ రి స |
| 71 | బేగడ | 29 | భా. | స గ రి గ మ ప ద ప స - స ని ద ప మ గ రి స |
| 72 | బేహాగ్ | 29 | — | స గ మ ప ని ద ని స - స ని ద ప మ గ రి స |
| 73 | భైరవం | 17 | భా. దే. | స రి గ మ ప ద ని స - స ద ప మ గ రి స |
| 74 | భైరవి | 20 | భా. ర. | స రి గ మ ప ద ని స - స ని ద మ గ రి స |
| 75 | భూపాలం | 8 | ఉ. ర. | స రి గ ప ద స - స ద ప గ రి స |
| 76 | శిలహరి | 29 | భా. దే. | స రి గ ప ద స - స ని ద ప మ గ రి స |
| 77 | బౌళి | 15 | ఉ. ఘ. | స రి గ ప ద స - స ని ద ప గ రి స |
| 78 | మధ్యమావతి | 22 | ఉ. ర. | స రి మ ప ని స - స ని ప మ రి స |
| 79 | మలహరి | 15 | ఉ. ర. | స రి మ ప ద స - స ద ప మ గ రి స |
| 80 | మలయమారుతం | 16 | | స రి గ ప ద ని స - స ని ద ప గ రి స |
| 81 | మందారి | 50 | | స రి గ మ ప ని స - స ని ప మ గ రి స |
| | మణిరంగు | 22 | ఉ. | స రి మ ప ని స - స ని ప మ గ రి స |
| | మాంజి | 20 | భా. దే. | స రి గ మ ప ద ని స - స ని ద ప మ ప గా రి స |

* దీక్షితులు శుద్ధసావేరిసంచారము నెంచిరి.

# కర్ణాటకరాగపద్ధతి : జన్యరాగములు

| | రాగముపేరు | మేళకర్త నెంబరు | | ఆరోహణము అవరోహణము |
|---|---|---|---|---|
| 84 | మార్గహిందోళ | 22 | ఉ. | స రి గ మ ప ద ని స - స ని ద ప మ గ స |
| 85 | మోహన | 28 | భా. ర. | స రి గ ప ద స - స ద ప గ రి స |
| 86 | ముఖారి | 22 | భా. ర. | స రి మ ప ద ని ద స - స ని ద ప మ గ రి స |
| 87 | యదుకులకాంభోజి | 28 | భా. | స రి మ గ మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 88 | యమునాకళ్యాణి | 65 | భా. దే. | స రి గ ప ద స - స ని ద ప మ గ మ రి స |
| 89 | రవిచంద్రిక | 28 | | స రి గ మ ద ని ద స - స ని ద మ గ రి స |
| 90 | రేవగుప్తి | 15 | | స రి గ ప ద స - స ద ప గ రి స |
| 91 | రీతిగౌళ | 20 | | స గ రి గ మ ని ద మ ని ద ని స-స ని ద మ గ మ ప ద ప మ గ రి స |
| 92 | లలిత | 17 | ఉ. | స రి గ మ ద ని స - స ని ద మ గ రి స |
| 93 | వరాళి | 39 | ఉ. ఘ. | స గ రి గ మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 94 | వసంత | 17 | | స గ మ ద ని స - స ని ద మ గ రి స |
| 95 | వివర్ధని | 28 | | స రి మ ప స - స ని ద ప మ గ రి స |
| 96 | శహాన | 28 | భా దే. | స రి గ మ ప మ ద ని స - స ని ద ప మ గ మ రి గ రి స |
| 97 | సాలగభైరవి | 22 | ఉ. | స రి మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 98 | సామ | 28 | ఉ. | స రి మ ప ద స - స ద ప మ గ రి స |
| 99 | శంకరాభరణం | 29 | | స రి గ మ ప ద ని స - స ద ప మ గ రి స |
| 100 | సారమతి | 20 | | స రి గ మ ప ద ని స - స ని ద మ రి గ స |
| 101 | సారంగ | 65 | భా. ర. | స రి గ మ ప ద ని స - స ని ద ప మ రి గ మ రి స |
| 102 | సావేరి | 15 | భా. ర. | స రి మ ప ద స - స ని ద ప మ గ రి స |
| 103 | సౌరాష్ట్రి | 17 | | స రి గ మ ప ద ని స - స ని ద ప మ గ మ రి స |
| 104 | శ్రీరాగం | 22 | | స రి మ ప ని స - స ని ప ద ని ప మ రి గ రి స |
| 105 | శ్రీరంజని | 22 | | స రి గ మ ద ని స - స ని ద మ గ రి స |
| 106 | శుద్ధబంగాళ | 22 | | స రి మ ప ద స - స ద ప మ రి గ రి స |
| 107 | శుద్ధదేశి | 20 | ఉ. | స రి మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 108 | శుద్ధధన్యాసి | 22 | ఉ. | స గ మ ప ని ప స - స ని ప మ గ స |
| 109 | శుద్ధసావేరి | 29 | ఉ. | స రి మ ప ద స - స ద ప మ రి స |
| 110 | శుద్ధసీమంతిని | 8 | | స రి గ మ ప ద స - స ద ప మ గ రి స |
| 111 | సుపోషణి | 28 | | స రి స మ ప ని ద స - స ద ని ప మ రి మ స |
| 112 | సుప్రదీపం | 17 | | స రి మ ప ద ని స - స ని ద ప మ గ మ రి స |
| 113 | సురటి | 28 | భా. దే. | స రి మ ప ని స - స ని ద ప మ గ ప మ రి స |
| 114 | హమీరుకళ్యాణి | 65 | భా. దే. | స రి గ మ ప ద ని స - స ని ద ప మ గ రి స |
| 115 | హంసధ్వని | 29 | ఉ. | స రి గ ప ని స - స ని ప గ రి స |
| 116 | హంసనాదం | 60 | — | స రి మ ప ద ని స - స ని ద ని ప మ రి స |
| 117 | హిందోళము | 22 | ఉ. | స గ మ ద ని స - స ని ద మ గ స |
| 118 | హిందోళవసంత | 22 | ఉ. | స గ మ ప ద ని ద స - స ని ద మ గ రి గ స |
| 119 | హుసేని | 22 | భా. ర. | స రి గ మ ప మ ప ని ద ని స - స ని ద ప మ గ మ ప మ గ రి స |




## కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

భువనాంతర
సుపథికుడా
దారినిపో !
దారినిపో !

మలుపున మరి
మరచితివో ?
తెలిసియె యిటు
తరలితివో ?
వెనుకకుపో—
వెనుకకుపో—

కెరలుచు పడు
తరగలలో—
నురుగుమిసెడు
తరగలలో—
కలియకుమీ !
కలియకుమీ!

పడిపడి పరు
గిడు నావలు—
జనముతో బరు
వగు నావలు—
ఆటుపోవును
ఆటుపోవును

అదె! కదలకు
ఇదె! హద్దును
గతికనుగో—
నిమిసములో—
తొందరగా—
తొందరగా—

గిర గిర గిర
సుడిగుండము—
గిర గిర గిర
సుడిగుండము—
ఇక మళ్లదు
ఇక మళ్లదు

ఈ రాతికి—
ఈ కొనపయి—
వేలకివే
లెన్నెన్నో—
పళ పళ పళ
విరిగినవో ?
బుడ బుడ బుడ
మునిగినవో?
ఎరుగవుమీ!
ఎరుగవుమీ !

ఎటు దాటితో—
ఎటు చేరితో—
ఈ శిలపయి ?
ఈ కొనపయి ?
ఎరుగుదువా—
ఎరుగుదువా—

భువనాంతర
సుపథికుడా !
దారినిపో !
దారినిపో !



ఒంటెలపయిఁ రణరంగమునకు బయలుదేరనున్న అబిసీనియను సైనికులు.



ఆధునికమారణ పరికరముల బారినిఁబడకుండుటకై నివారణ సాధనోపయోగముల యభ్యాసము.



రణరంగమునందలి బ్రిటిషు రెడ్ క్రాసువారి తాత్కాలిక చికిత్సాలయము;
క్షతగాత్రులగు అబిసీనియను సైనికులు చికిత్స పొందుచున్నారు.



ఇటలీవారికి పట్టువడిన అబిసీనియను సైనికులు; ఇటలీదళములకు సీదు కొనిపోవుచున్నారు.

# అన్యమతస్వీకరణము

వల్లూరి సూర్యనారాయణరావు

హరిజనుడగు డాక్టరు అంబేద్కరుగారు తన శాఖ వారి నందరిని సవర్ణహిందువులు అతినీచముగా చూచుచుండుటచేత, ఇతరమతములలో చేర్చినయెడల సాంఘికసమానత్వము దొరకునని భ్రమపడుచున్నారు. విద్యయో, ధనమో కలిగియున్నపుడు హరిజనునకు కూడ తనకువలెనే యెక్కువ సాంఘికఅంతస్తు దొరకుచునేయున్నది. ఈయన కనపరుచు బాధ ఒక్క హరిజన సంఘమునకే వర్తించుటలేదు. ఈవర్ణ-కట్టుబాట్లు అన్ని వర్ణములను బాధించుచున్నవి. ఈయనయభిప్రాయమునుబట్టి బ్రాహ్మణవర్ణము తప్ప తక్కిన క్రిందివర్ణముల వారు ఆర్యమతమును వీడి, అన్యమతములలో చేర వలసియుందురు. ఇప్పుడు ప్రచారములోనున్న హైందవ మతమును సాంఘికజీవనములో క్రిందివర్ణములవారు స్వగౌరవము చెడగొట్టుకొని పైవర్ణములవారిచే తృణీకరించబడుచున్న మాట వాస్తవము. నాయింటికి విద్యాధికుడును, సన్మార్గప్రవర్తనుడును నగు నాశూద్రస్నేహితుడు అతిథిగా వచ్చినయెడల నేను లోపలివంటయింటిలో నా భార్యచేత వడ్డించుకొని భోజనము చేయుచు, నాశూద్ర స్నేహితునికి ప్రత్యేకముగా బయట ఒక వసారాలో విస్తరివేయించి, యితరులచేత వడ్డింపించునపుడు, ఆయన యేమాత్రము స్వగౌరవముకలవాడైనను నా యాతిథ్యమును తాను తప్పక నిరాకరించవలసియుండును. ఇట్టి భేదము వేదకాలములో లేదని సాకులుచెప్పిన లాభమేమి ? దానివలన ఆయనకు మనశ్శాంతి కలుగునా ? ఇట్టి వర్ణాచారములు నశించినగాని బుల్లభభాయి దేశాయిగారు మొదలగు సవర్ణహిందువుల యుద్బోధనలెంతమాత్రము ప్రయోజనకారులు కావు. అమెరికా, స్విట్జర్లెండు, అయిర్లెండులను ఆయన దృష్టాంతములుగ తీసికొని, జాతి, భాష, మతము, రంగులలో ప్రజలలో ఎన్నిభేదము లున్నను, స్వగౌరవము, స్వార్థత్యాగము, ఐకమత్యమువలననే స్వరాజ్యము రాగలదనియు, స్వమతమును వదలనక్కరలేదనియు ఆయన సెలవిచ్చిరి. కాని యీయన సూక్ష్మదృష్టితో చూచినయెడల, పై దేశములలో మనలోని వర్ణములవంటివి లేవు. భోజనప్రతిభోజనములకుగాని, అన్యోన్య వివాహములకుగాని అడ్డంకులు లేవు. దుస్తులు మార్చుకొన్నట్లే అక్కడ మతములను మార్చుకొనుచున్నను వారికి సాంఘికబాధలు లేవు. వారు అన్యోన్యస్నేహముతో, సమస్తవిషయములలోను కలసి పనిచేయుట కెట్టియాటంకములు నుండవు. హెచ్చుతగ్గులు విద్యాధనములనుబట్టి యుండునుగాని జన్మనుబట్టి యుండవు. ఈభారతదేశములో అట్లుకాదు. మన హిందువులు ఇతర మతములవారితో బొత్తిగా కలియకపోగా, తమలోని ప్రతివర్ణమునకును, దానిలోని ప్రతి అంతఃశాఖకును చుట్టు రాతిగోడలు కట్టుకొని జీవించుచున్నారు. ఆగోడలను దాటిపోలేక చిన్నచిన్న సంఘములుగా ప్రత్యేకజీవనము సాగించుచు, హైందవ మతమను పేరున మనసంఘము నడచుచున్నది. ఇట్టి యసంతృప్తికరమగు సాంఘికాచారమును నశింపజేయుటకు ఈ హిందూమతమునుండియే బౌద్ధమతము, జైనమతము, ఆర్యసమాజమతము, బ్రహ్మసమాజమతము మొదలగునవి యుద్భవించినవి. కాని యివి యేవియు జనబాహుళ్యముచేత స్వీకరింపబడుటలేదు. దీనికి ముఖ్యకారణము ఏమతమునందును విశ్వాసములేక, కొన్ని

సాంఘికాచారములను పట్టుకొని వ్రేలాడుట మనలో నాచార మగుటయే.

ఇట్టి వర్ణభేదములు ప్రపంచములో మరియెచ్చటను కనుపడవు. ఈ శిలారూపము దాల్చిన వర్ణభేదములను బ్రద్దలుగొట్టజాలక అంబేద్కరుగారు తనవాండ్రను ఇట్టి హైందవమతమును వీడవలసినదని సలహా యిచ్చుచున్నారు. దీనివలన నెట్టి ప్రయోజనములేదు సరికదా, ప్రతిమాలపల్లిలోనున తనవారు అట్టే నీచదశలో నుండుటయేగాక సవర్ణహిందువుల సానుభూతిని బడయజాలక దుర్భరజీవనమునకు గురియగుట నిశ్చయము. వీరు తమ గ్రామములను విడిచిపోజాలరు. అట్లు పోయినను వీరు మహమ్మదీయులు, క్రిస్టియనులైనను, వీరి అంతస్తు పెరుగక, నీచముగ వారిచేతను, మనచేతనుకూడ చూడబడుదురు. ప్రస్తుతమున్న కొద్ది ఐకమత్యము కూడా చెడిపోయి, భారతీయులు ఇంకను స్వరాజ్యసంపాదనకు దూరమగుదురు.

నిజ మేమనగా, ఈ వివిధమతములకు మనరాజయ సాంఘికార్థిక వ్యవహారములలో పోటీయరాదు. ఆధ్యాత్మికవిషయములు ఊహలమీద ఆధారపడి యుండును గనుక వానిని వ్యక్తులకు వదలివేసి, సాంఘికాచారములలో ఇప్పటి అన్ని మతములవారును ఏకమగునట్లు చేయవలెను. మన భారతీయులందరు ఆర్యులుగనే యెంచబడవలెను. మహాత్మగాంధిగారు వర్ణాశ్రమధర్మము లున్నను వానిలో హెచ్చుతక్కువ లుండకూడదని వాదించుచుందురు. సాత్త్వికరాజసతామసగుణములనుబట్టి యేకకుటుంబములోని మెంబర్లే వేరు వేరు వృత్తుల నవలంబించినంతమాత్రమున, వర్ణాశ్రమభేదములు కలిగినను, వీరిలో హెచ్చుతక్కువలు లేక కలసి యుండవచ్చునని యీయననమ్మకము. అటు లగుచో ప్రస్తుతహిందూమతము నశించిన దనియే నమ్మవచ్చును. ఈప్రస్తుతవర్ణములను, వీనిలోని యంతఃశాఖలను మనము సమర్థించజాలనపుడు ఇక హిందూమతమనునది లేనే లేదు. అంబేద్కరుగారు ఈ పనికిమాలిన సాంఘికాచారములు మనదేశములోని ప్రతివర్ణమును పీల్చి పిప్పిచేయుచున్నవని తెలిసికొన్నయెడల, అవి ప్రత్యేకముగ తన సంఘమునే బాధించుచున్నవని యనుకొనుట పొరపాటు. అంత్యజాతులగు మాలమాదిగలు కలియునపుడు వీ రందరు అన్యమతస్వీకరణమునకు ఎంతమాత్రమును ఒప్పుకొనరు. దీనికి మందు సాంఘిక విప్లవమునకును, మతవినాశమునకును సదా ప్రయత్నించుటయే. ఇక్కడ మతశబ్దము సాంఘికాచారమునకే వర్తించును. మనకును, దేవునికిని గల సంబంధవిషయము కాదు. ఈ వేదాంతమంతయు వ్యక్తులకు వదలివేసి, మానవసౌభ్రాత్రమునకు ఈ ప్రత్యేకవర్ణభేదములను, మతభేదములను, ఆయామతగ్రంథముల యనుల్లంఘ్యత మొదలగువానిని రూపుమాపవలయును. ఈ ప్రత్యేక మతములే ప్రపంచములోని వివిధజాతుల రాజకీయార్థిక స్వాతంత్ర్యములకును, ఐకమత్యమునకును ఆటంకములు కలుగజేయుచున్నవి.




# కాలమానము

## సూరి రామసుబ్బరాయశాస్త్రి

> వేదాహి యజ్ఞార్థమభిప్రవృత్తాః
> కాలానుపూర్వ్యా విహితాశ్చ యజ్ఞాః,
> తస్మాదిదం కాలవిధానశాస్త్రం
> యో జ్యోతిషం వేద స వేద యజ్ఞాన్.

వేదములు యజ్ఞములకొఱకుఁ బ్రవృత్తమైనవి. యజ్ఞములు కాలము ననుసరించియున్నవి. కావునఁ గాలవిధానశాస్త్రమను జ్యోతిషమును దెలిసికొనినవాఁడు యజ్ఞములఁ దెలిసికొనుచున్నాఁడని వృద్ధ వశిష్ఠ సిద్ధాంతమునందుఁ జెప్పఁబడియున్నది. అట్టికాలమును గూర్చి కొంత తెల్పెదను.

కాలస్వరూపము, తద్విభాగము సూర్యసిద్ధాంతమునందు—

> లోకానామంతకృత్కాలః కాలోఽన్యః కలనాత్మకః,
> స ద్విధా స్థూలసూక్ష్మత్వాన్మూర్తశ్చామూర్త ఉచ్యతే.

భగవద్రూపమై యఖండ దండాయమానమగు కాలము సృష్టి స్థితి సంహారకారక మగుచున్నది. "కాల స్సృజతి భూతాని కాల స్సంహరతి ప్రజాః" అనియుఁ జెప్పఁబడుచున్నది. ఈ మహాకాలము జ్ఞాన విషయకము కాఁజాలదు. జ్ఞానవిషయ స్వరూపమైనది గణితకాలము. అది స్థూలసూక్ష్మ భేదములచే మూర్తమనియు, నమూర్తమనియు ద్వివిధము. స్థూలమై ప్రాణాది స్వరూపమున వ్యవహార యోగ్యమగు కాలము 'మూర్త'మనఁబడుచున్నది. సూక్ష్మమై ప్రాణాంతర్గత త్రుటితత్పరాది నామములచే నవ్యవహారికత్వమగు కాలము 'అమూర్త' మనఁబడు చున్నది.

కలనాత్మక కాలముయొక్క ప్రవృత్తి సిద్ధాంతశిరోమణి యందు—

> లంకానగర్యాముదయాచ్చ భానో
> స్తస్యైవ వారే ప్రథమం బభూవ,
> మధోః సితాదే ర్దినమాసవర్ష
> యుగాదికానాం యుగపత్ప్రవృత్తిః.

సృష్ట్యాదిని లంకానగరమున చైత్రశుద్ధ పాడ్యమి ఆదివారమున సూర్యోదయకాలమయ్యెను. తత్సమయమునుండి దిన, మాస, వర్ష, యుగ కల్పము లారంభమయ్యెను.

వెనుక నొక సంవత్సరాది సంచికయందు 'సంవత్సరప్రవృత్తి నిర్ణయ' మను శీర్షిక క్రింద నీ యంశమును వివరించియుంటిని.

కాలమానమునందు భేదములు సిద్ధాంతశిరోమణియందు—

> సౌరంచ సావనకమైందవమార్క్షమానం
> పైత్ర్యం సురాసురగురోర్మనురుతాం(?) మనోశ్చ,
> మానం విధేరితి నవాఖిలకర్మసిద్ధ్యై
> మానాని మానవవరేణ సునిశ్చయ స్స్యాత్.

౧. సౌరము సూర్యసంబంధము, ౨. సావనము భూమి సంబంధము, ౩. ఐందవము చంద్రసంబంధము, ౪. ఆర్క్షము నక్షత్ర సంబంధము, ౫. పైత్ర్యము పితృసంబంధము, ౬. బార్హస్పత్యము గురుసంబంధము, ౭. మానవము లేక ప్రాజాపత్యము మనుసంబంధము, ౮. దివ్యము దేవతాసంబంధము, ౯. బ్రాహ్మ్యము బ్రహ్మసంబంధము. ఇట్లు కాలమానము నవవిధము. ఇవియే సూర్యసిద్ధాంతము నందు

> బ్రాహ్మం దివ్యం తథా పైత్ర్యం ప్రాజాపత్యం గురోస్తథా,
> సౌరంచ సావనం చాంద్ర మార్క్షం మానాని వై నవ.

అని చెప్పఁబడినది.

(౧) ఇందుఁ బ్రథమమున సావనమానమును గూర్చి సిద్ధాంత శిరోమణియందు

> యోఽక్ష్ణోర్నిమేషస్య ఖరామ (౩౦) భాగ
> స్స తత్పరస్తచ్ఛతభాగ ఉక్తా,
> త్రుటిర్నిమేషై ర్ధృతిభిశ్చ (౧౮) కాష్ఠా
> తత్త్రింశతా (౩౦) సద్గణకైః కలోక్తా.
> త్రింశత్కలాభి ర్ఘటికా క్షణస్స్యా
> న్నాడీద్వయం తైః ఖగుణై (౩౦) ర్దినంచ.

కనుఱెప్పపాటుకాలము నిమేషమనఁబడును. నిమేషములోని ముప్పదవవంతు 'తత్పర' యనియు, తత్పరలోని శతాంశము 'త్రుటి' యనియు చెప్పఁబడును. పదునెనిమిది నిమిషములు 'కాష్ఠ' యనఁ బడును. ముప్పది కాష్ఠలు 'కల'. ముప్పదికలలు 'నాక్షత్రఘటిక'. రెండు ఘటికలు 'క్షణము'. ముప్పది క్షణములు నాక్షత్రదినము.

ఇదియే ప్రకారాంతరమునఁ జెప్పఁబడుచున్నది—

సర్వాక్షరైః ఖేందు (౧౦) మితైరసు స్తైః
షడ్భిః పలం తైర్ఘటికా ఖ షడ్భిః (౬౦),
స్యాద్వా ఘటీషష్టిరహఃఖరాంశుః (౩౦)
మాసోదినైస్తైర్ద్వికుభిశ్చ (౧౨) వర్షమ్.
క్షేత్రే తేసమాద్యేన సమావిభాగాః
స్యుశ్చక్రరాశ్యంశ కలావిభాగాః.

స్వస్థసుఖాసీనుని శ్వాసోచ్ఛ్వాసాంతరితకాలము ప్రాణ మనఁబడును. ఇది దశ సర్వాక్షరోచ్చారణకాలము, లేక వింశతి లఘ్వక్షరోచ్చారణకాల మగును. ఆరుప్రాణములు పానీయపలము, లేక విఘటిక యగును. అరువది విఘటికలు ఘటిక యగును. అరువది ఘటికలు నాక్షత్రదిన మగును. ఈ విషయమై సోమసిద్ధాంతమందును

దశగుర్వక్షరః ప్రాణః షడ్భిః ప్రాణై ర్వినాడికా,
తత్ షష్ట్యా నాడికా ప్రోక్తా నాడీషష్ట్యాఽర్క్షకం దినమ్.

అని చెప్పఁబడినది.

ముప్పదిదినములు మాసము. పండ్రెండుమాసములు వర్షము. దినమాసవర్షము లార్క్షమానమున నగునని జ్యోతిర్విదాభరణమున నిటు చెప్పఁబడినది—

సర్వాక్షరాణా మదితం చ షష్ట్యా
పలం పలానాం ఘటికా కిలైకా,
షష్ట్యా ఘటీనాం భదినం తదార్క్షైః
త్రింశతా వి శ్రుత మార్క్షమాసం.

సంవత్సరమున మాస దిన ఘట్యాదివిభాగమువలెనే క్షేత్రము నందు రాశ్యంశకలావిభాగము గలదు. అనఁగా చక్రమునందు ౧౨ రాసులు. రాశియందు ౩౦ భాగలు. భాగయందు ౬౦ కలలు. కల యందు ౬౦ వికలలు. ఇట్లు క్షేత్రవిభాగము చేయఁబడుచున్నది.

నాక్షత్రమానోపపత్తియును, దద్వ్యవహారమును సూర్యసిద్ధాంతమునందు

భచక్రభ్రమణం నిత్యం నాక్షత్రం దినముచ్యతే,
నక్షత్రనామ్నా మాసాస్తు జ్ఞేయాః పర్వాంతయోగతః,

నిత్యమును నక్షత్రచక్ర మొక్కసారి సంపూర్ణముగాఁ బశ్చిమమునకుఁ దిరిగివచ్చుట కగు కాలము నాక్షత్రదిన మనఁబడుచున్నది. ఇట్టి నాక్షత్రదిన మరువదిఘటికల ప్రమాణముకలది యగును. కావుననే ఘటికలు నాక్షత్రము లని చెప్పఁబడినవి. నక్షత్రములఁబట్టి చాంద్ర మాసములకుఁ బేర్లు కలిగినవి. పూర్ణిమయందు చంద్రుఁ డే నక్షత్రమున నుండునో ఆనక్షత్రనామముచే నామాసము వ్యవహరింపఁబడుచున్నది. పూర్ణిమయందుఁ జంద్రుఁడు కృత్తికానక్షత్రమున నున్న మాసము కార్తీక మనఁబడుచున్నది. ఇట్లే తదితరమాసములును పిలువఁబడు చున్నవి.

పూర్వోక్త చంద్రసంస్థితియందు భేదము సూర్యసిద్ధాంతము నందు

కార్తిక్యాదిషు సంయోగే కృత్తికాది ద్వయం ద్వయమ్,
అంత్యోపాంత్యౌ పంచమశ్చ త్రిధా మాసత్రయం స్మృతమ్.

కార్తికమాసముమొదలు పూర్ణిమయందుఁ జంద్రుఁడు కృత్తిక మొదలుగ రెండేసినక్షత్రములం దుండును. అనఁగా కార్తికపూర్ణిమ యందుఁ జంద్రుఁడు కృత్తికయందైన, రోహిణియందైన నుండును. ఇట్లే తదితరమాసములందును నగును. కాని యాకార్తికమున కంత్యోపాంత్య పంచమమాసములందు, అనఁగా ౧౨, ౧౧, ౫ మాసములను ఆశ్వయుజ, భాద్రపద, ఫాల్గునములందు చంద్రుఁడు మూఁడేసినక్షత్ర ములలో నుండును. అనఁగా నాశ్వయుజ పూర్ణిమయందు రేవత్యశ్వినీ భరణులలో నెందైనను, భాద్రపదపూర్ణిమయందు శతభిషక్ పూర్వా భాద్రోత్తరాభాద్రలలో నెందైన నుండును. ఫాల్గునపూర్ణిమయందు పూర్వఫల్గున్యుత్తరఫల్గునీ హస్తలలో నెందైన నుండును.

(౨) చాంద్రమానము, తదుపయోగము సూర్యసిద్ధాంతము నందు:—

అర్కాద్వినిస్సృతః ప్రాచీం యద్యాత్యహరహః శశీ,
తచ్చాంద్రమాన మంశైస్తు జ్ఞేయం ద్వాదశభి స్తిథిః.
తిథిః కరణ ముద్వాహః క్షౌరం సర్వక్రియాస్తథా,
వ్రతోపవాసయాత్రాణాం క్రియా చాంద్రేణ గృహ్యతే.

సూర్యుని విడిచి చంద్రుఁడు ప్రతిదినము తూర్పునకుఁ బోవు కాలము చాంద్రమాన మనఁబడును. అమావాస్యనాఁడు సూర్యచంద్రులు ఏకరాశిగతు లైయుందురు. అధికగమనము గల చంద్రుఁడు సూర్యు నతిక్రమించి తూర్పునకుఁ బోవుచు ౧౨ రాసులు, లేక ౩౬౦ భాగలు తిరిగివచ్చి మరల సూర్యుని రాశ్యాదిఁ జేరునప్పటికి నగు కాలము చాంద్రమాసము, లేక ౩౦ చాంద్రతిథులగును. ఇట్లు సూర్య చంద్రాంతరము ౩౬౦ అంశ లగునప్పటికి ౩౦ తిథులగును గావున నొక్కొక్క తిథిచే ౧౨ అంశ లంతరమగును. ఇవియే చాంద్ర దినము లనఁబడును. ఈ చాంద్ర దినములు నాక్షత్రములకంటె స్వల్పములు.

చాంద్రమానమున తిథులు, బవాదికరణములు, వివాహము, క్షౌరము, వ్రతము, ఉపవాసము, యాత్ర, పితృకర్మ మొదలగు సర్వ కార్యములును గ్రహింపఁబడుచున్నవి. ఈ విషయమై జ్యోతిర్విదా భరణమునందును

తిథ్యర్థ ముండన కరగ్రహ పితృకర్మ యాత్రా వ్రతోపవసనాన్య
ఖిలక్రియాసు, గ్రాహ్యం బుధై రనిశమైందవ మాసమేవ...

అశ్విన్యాది నక్షత్రములందుఁ జంద్రుఁడు చరించునపుడు కొంతకాలము త్యాజ్యమగుచున్నది. తత్సాధనమునకై మత్పితృపద్యములు—

త్యాజ్యా మిత్రిహరిద్వయే శరయుగా (౧౦) దింద్వింద్ర శూర్యానిలే లోకాత్ (౧౪) ప్రోష్ఠపదిప్రభో (౧౬) శ్శతభిష జ్యర్యమ్ణి చాంకద్వయాత్ (౧౮), విశ్వత్వష్ట్రభగార్య భేద్వివిదశతః (౨౦) తీక్ష్ణాంశు మృత్యుంజయే త్రిస్సప్త ప్రమితే (౨౧) ర్ద్విశా ముఖ యమాంభో భే చతుర్వింశతేః (౨౪)

వహ్న్యదిత్య మఖాంత్యభే తిథియుగా (౩౦) త్సార్పేతురా జద్వయాత్ (౩౨) రోహిణ్యాం వసుపంచకాచ్చ (౪౦) తురగే పంచాశతో (౫౦) మూలభే, దేశా (౫౬) ద్వింశతితశ్చ (౨౦) సం గుణిత భాద్యంతం హారేదబ్ధతో (౬౦) లబ్ధాలబ్ధి (౪) హతాబ్ద (౬౦) భక్తభమితే ర్నాడ్యో వినాడ్యస్సదా.

ఇష్టదిన నక్షత్రమునఁ జంద్రుఁడు ప్రవేశించినది మొదలుగఁ దరువాతి నక్షత్రమునఁ బ్రవేశించువరకుగల కాలముఁ దెలిసికొనవల యును. ఇది బుధోద్యంతమనఁబడును. ఈ బుధోద్యంతము ౬౦ ఘటిక లైనపుడు నక్షత్రముల త్యాజ్యకాలములు ముందుగాఁ జెప్పఁబ డుచున్నవి— అనూరాధా శ్రవణ ధనిష్ఠానక్షత్రములకు ౧౦ ఘటికల నుం , మృగశీర్ష, జ్యేష్ఠ, విశాఖ, స్వాతీనక్షత్రములకు ౧౪ ఘటికలనుండియు, పూర్వాభాద్రకు ౧౬ ఘటికలకును, శతభిషక్, ఉత్తరఫల్గునీ నక్షత్రములకు ౧౮ ఘటికలనుండియు, ఉత్తరాషాఢా, చిత్రా, పూర్వఫల్గునీ, పుష్యమీనక్షత్రములకు ౨౦ ఘటికలనుం డియు, హస్త, ఆర్ద్రానక్షత్రములకు ౨౧ ఘటికలనుండియు, ఉత్తరా భాద్రా భరణీ పూర్వాషాఢలకు ౨౪ ఘటికలనుండియు, కృత్తికా పునర్వసు మఖ రేవతులకు ౩౦ ఘటికలనుండియు, ఆశ్రే షకు ౩౨ ఘటికలనుండియును, రోహిణికి ౪౦ ఘటికలనుండియును, అశ్వినికి ౫౦ ఘటికలనుండియును, మూలకు ౫౬ ఘటికలనుండి యును, ౨౦ ఘటికలనుండియును, ద్వివారము త్యాజ్యకాలము ప్రారంభమగును. ఈ ఘటికాదినుండి ౪ ఘటికలు విషఘటిక లగును. బుధోద్యంతము ౬౦ ఘటిక లైనపుడే చెప్పఁబడినకాలమునుండి ౪ ఘటికలు త్యాజ్యకాలప్రమాణమగును గాని బుధోద్యంతము ౬౦ ఘటి కలకంటె న్యూనాధిక్య మైనపుడు త్యాజ్యారంభకాలమును, త్యాజ్య ప్రమాణకాలమును దదనుగుణ్యముగ న్యూనాధిక్య మగుచుండును. తత్సాధనార్థ మనుపాతమునకై "సంగుణిత భాద్యంతం హారే దబ్ధతః" అనఁగా పూర్వోక్తసంఖ్యచే హెచ్చింపఁబడిన బుధోద్యంతమును ౬౦ చే భాగింపవలయునని చెప్పఁబడినది. బుధోద్యంతము ౬౦ ఘటిక లైనపుడే చెప్పఁబడిన కాలమునకుఁ ద్యాజ్య మారంభమైన యెడల నిష్ట బుధోద్యంతముచే నెపుడు త్యాజ్యారంభమగునను నను పాతమున నీసంఖ్యచే బుధోద్యంతమును హెచ్చించి ౬౦ చేత భాగింపవలయునని చెప్పఁబడినది. ఈ త్రైరాశికముచే త్యాజ్య మెన్ని ఘటికల కారంభమగునదియుఁ దెలియఁగలదు. ఇఁక త్యాజ్యప్రమాణ మును దెలిసికొనుటకు మరియొక యనుపాతము—"లబ్ధా దబ్ధిహతాబ్ద భక్తభమితే ర్నాడ్యోవినాడ్య స్సదాత్యాజ్యాః" పూర్వోక్త త్రైరా శికమువలన లబ్ధమైన ఘటికాదినుండి బుధోద్యంతమును ౪ చే హెచ్చించి ౬౦ చే భాగింపఁగా వచ్చు నాడ్యాదిప్రమాణకాలము వర్జింపఁదగియున్నది. ౬౦ ఘటికల బుధోద్యంతముచే ౪ ఘటికలు త్యాజ్యప్రమాణమైనయెడల నిష్ట బుధోద్యంతముచే నెంత కాలమగు నను త్రైరాశికమున బుధోద్యంతమును ౪ చే హెచ్చించి ౬౦ చే భాగింపఁగా త్యాజ్యప్రమాణము వచ్చును.

ఉదాహరణము:—మాఘ శు ౭ బుధవారమున మఘ ౧౪-౨౦ ఘటికాదివరకును, శు ౮ గురువారము పూర్వ ఫల్గుని ౧౬-౪౦ ఘటి కాదివరకును నున్నవి. శు ౭ బుధవారమున నక్షత్ర త్యాజ్య మెప్పు డారంభమై యెంతకాలమువర కుండునని విచారింపవలసియున్నది. బుధవారమున మఘ ౧౪-౨౦ ఘటికలవరకు నున్నది. ఈ నక్షత్రము నందు ౩౦ ఘటికలకు మధ్యమవర్జ్యకాలమని చెప్పఁబడియుండు టచే గత దినమున నీ మఘానక్షత్ర త్యాజ్యము గడచిపోయినది. కావున నిఁక నీ దినమునఁ బూర్వ ఫల్గునీవర్జ్యమే విచారింపఁదగి యున్నది. అందులకై బుధోద్యంతము సాధింపవలసియున్నది. ఈ దినమున పూర్వఫల్గుని ౧౪-౨౦ ఘటికాదికిఁ బ్రారంభమై మరుదిన మున ౧౬-౪౦ ఘటికాదివరకు నున్నది. కావున సావనదిన ప్రమాణ మగు ౧౬-౧౦ నాక్షత్రఘటికాదినుండి ౧౪-౨౦ తీసివేయఁగా నను ౪౫-౫౦ ఘటికాదికాల మీ బుధవారమునను ౧౬-౪౦ ఘటికాది గురువారమునను పూర్వ ఫల్గుని వ్యాపించియున్నది. కావున బుధో ద్యంతము ౬౨-౩౦ ఘటికాది యైనది. బుధోద్యంతము ౬౦ ఘటిక లైనపుడు పూర్వ ఫల్గునికి మధ్యమ త్యాజ్యారంభ కాలము ౨౦ ఘటి కలు గావున బుధోద్యంతము ౬౨-౩౦ అయినపుడు త్యాజ్యారంభ మెపు డగునను ననుపాతమున ౬౨-౩౦ ని ౨౦ చే హెచ్చించి ౬౧ చే భాగింపఁగా ౨౦-౫౦ ఘటికాదికమునకు త్యాజ్య మారంభ మగునని తెలిసినది. ఇఁకఁ ద్యాజ్య ప్రమాణకాలమును సాధించుటకు బుధోద్యంతమును మధ్యమత్యాజ్య ప్రమాణమగు ౪ చే హెచ్చించి ౬౦ చే భాగింపఁగా ౪-౧౦ ఘటికాది యగుచున్నది. కావున పూర్వఫల్గునీనక్షత్ర మారంభమైన పిమ్మట ౨౦-౫౦ ఘటికాదినుండి ౪-౧౦ ఘటికాదికాలము వర్జింపఁదగియున్నది. కాని బుధవారమున సూర్యోదయమునుండి ౧౪-౨౦ ఘటికాదివరకు మఘానక్షత్రమే యుం డుటచే ననంతరము ౨౦-౫౦ ఘటికాదికి, అనఁగా సూర్యోదయాది ౩౫-౧౦ ఘటికాదికి త్యాజ్య మారంభమగును. ఇందుండి అహః ప్రమాణకాలమును ౨౮-౩౦ ఘటికాదిని తీసివేయఁగా సప్తమయాది ౬-౪౦ ఘటికాదికమునకు త్యాజ్య మారంభమయి ౪-౧౦ ఘటికాది కాల ముండునని తెలిసికొనఁదగియున్నది.

(౩) సావనమాసము, తదుపయోగము సూర్య సిద్ధాంతము నందు—

ఉదయాదుదయం భానో స్సావనం తత్ప్రకీర్తితమ్,
సావనాని స్యు రేతేన యజ్ఞకాలవిధిస్తు తైః.
సూతకాదిపరిచ్ఛేదో దినమాసాబ్దపా స్తథా,
మధ్యమా గ్రహభుక్తిస్తు సావనేనైవ గృహ్యతే.

సూర్యోదయసమయమునుండి మరుసటి సూర్యోదయమువరకు నగుకాలము సావనదిన మనఁబడుచున్నది. ఇదియే జ్యోతిర్విదాభరణ మునందు "ఖరమరీచ్యుదయద్వయజాంతరం యదిహ సావన సంజ్ఞ దినం స్మృతం" సూర్యోదయద్వయాంతరకాలము సావనదిన మనఁబడు నని చెప్పఁబడినది. ఈసావనదినములే రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శనివారము లను క్రమమున వ్యవహరింపఁబడుచున్నవి. తత్క్ర మోపపత్తిని 'వారప్రవృత్తి నిర్ణయము' అను వ్యాసమున వివరించి యుంటిని. సూర్యుఁ డొక దినమున నొకనక్షత్రముతోఁబా టుదయ యించినయెడల మరుదినమున నా నక్షత్రముదయించిన కొంతకాలము నకుఁ గాని యుదయింపనేరఁడు. ఈనక్షత్రోదయ సూర్యోదయాంతర మా దినమున సూర్యుఁడు ప్రాగ్గతిచే నడచిన కాలమగును. కావున నాక్ష త్రదిన ప్రమాణమగు ౬౦ ఘటికలందు సూర్యుని దినభుక్తియగు సుమారు ౧౦ విఘటికలకాలముఁ గలుపఁగా నగు సుమారు ౬౦-౧౦ ఘటికాది కాలము సావనదినమగును. కావునఁ జాంద్రదినముకంటె నాక్షత్ర దినమును, నాక్షత్రదినముకంటె సావనదినమును నధికమైనవి. ఈసావన దిన ప్రమాణమును ౬౦ సమభాగములఁ జేసిన నొక్కొక్కభాగము సావనఘటికయని వ్యవహరింపఁబడును.

సావనమానముచే యజ్ఞకాలవిధియు, సూతకాదివిభాగము, దినమాసవర్షాధిపత్యములు, గ్రహముల మధ్యమభుక్తి గ్రహింపఁ బడుచున్నవి. ఈ విషయమై జ్యోతిర్విదాభరణమునందు "స్యా త్కృచ్ఛ్ర సూతిక చికిత్సిత వాసరాద్యం భుక్త్యాదికం దివిషదాంఖలు సావనాచ్చ" అని చెప్పఁబడినది. ఇందు గ్రహముల భుక్తి యనఁగా గ్రహములు సావనదినమున మధ్యమప్రాగ్గతిచే నెంత నడచినదియుఁ దెలిసికొనఁబడుచున్నదని యర్థమే కాని గ్రహముల దశాభుక్త్యాది సాధనమున సావనము గ్రహింపఁదగి యున్నదని యెంచఁదగదు. దశా భుక్త్యాదినిర్ణయమునందున నీ చెప్పఁబోవు సౌరమానమే గ్రహింపఁ దగియున్నది.

(౪) సౌరమానవ్యవహారము సూర్యసిద్ధాంతమునందు
సౌరేణ ద్యునిశోర్మానం షడశీతి ముఖాని చ,
అయనం విషువచ్చైవ సంక్రాంతేః పుణ్యకాలతా.

సౌరమున నహోరాత్రమానము షడశీతిముఖములు, అయనము, విషువత్తు, సంక్రాంతిపుణ్యకాలము మొదలగునవి గ్రహింపఁబడు చున్నవి. భచక్రముతోఁబాటుగఁ బ్రత్యహంబును సూర్యుఁడు పశ్చి మాభిముఖముగఁ దిరుగుచున్నను స్వీయగతిచే ప్రాగ్దిశకుఁ బోవుచుం డును. ఈ ప్రాగ్గతియందు రాశిచక్రమునంతను (౩౬౦ అంశలను) జరించి మరల నశ్విన్యారంభమునఁ బ్రవేశించువఱ కగు కాలము సౌర వత్సర మనఁబడుచున్నది. ఒక్కొక్క రాశియందు సంచరించు కగు కాల మొక్కొక్క సౌరమాస మనఁబడుచున్నది. అందు ముప్పది యవభాగ మనఁగా నొక్క భాగయందు సంచరించుట కగు కాలము సౌరదిన మనఁబడుచున్నది. ఇదియే జ్యోతిర్విదాభరణము నందు "ప్రతిదినం స్ఫుటభుక్తిమితస్సదా ఖరగభస్తిదినం వి బుధై స్స్మృతం" ప్రతిదినము సూర్యుని స్ఫుటభుక్తియే సౌరదినమని చెప్పఁ బడినది. ఈ సౌరదినములవలన షడశీతి ముఖాదిపుణ్యకాలములు తెలియఁబడును. సాయన తులాసంక్రమప్రభృతి ఎనుబదియారుదినముల కొక్కొక షడశీతి ముఖపుణ్యకాల మగును. ఇట్లు గణింపఁగా ధనూ రాశియందు ౨౬ వ భాగయు, మీనరాశియందు ౨౨ వ భాగయు, మిథునరాశియందు ౧౮ వ భాగయు, కన్యారాశియందు ౧౪ వ భాగయు షడశీతిముఖములగును. కన్యారాశియందు శేషించిన ౧౬ దినములు పితృదినములు. సాయన మకర కటకరాశి సంక్రమణము లయనసంక్రమణము లనఁబడును. సాయన మేష తులారాశి సంక్ర మణములు విషువద్దినము లనఁబడును. తదితర రాశి సంక్రమణ దిన ములు విష్ణుపదపుణ్యకాలము లనఁబడును. ఇవియన్నియును పితృదిన ములే యగుచున్నవి.

సౌరమానవ్యవహారము జ్యోతిర్విదాభరణమునందు
వర్షాయనర్తుయుగపూర్వక మేవ సావనమానాదిమాన మఖిలం ఖలు
సౌరమానం."

సంవత్సరము, అయనము, ఋతువు, యుగము మొదలుగాఁగల దేవమానము - ఇవియన్నియు సౌరమానమునఁ బరిగణింపఁబడుచున్నవి. వ్యవహారమున సంవత్సర మనఁగా సూర్యుని ద్వాదశ రాశిగమనము పూర్తియగు సౌరవత్సరమనియే యర్థము. ఆయుర్దాయము, గ్రహముల దశాభుక్త్యాదికము సౌరమునసే గ్రహింపఁదగియున్నవి. ఈ విషయమై శ్రీ కేశవాచార్యులచే

ఆయు స్సౌరమిదం యతోఽబ్దగణనా సౌరం గ్రహస్యాగిభిః
ప్రోక్తం సర్వ మసద్యదల్పకథితం నాక్షత్రకం సావనమ్.

సంవత్సర గణనము సౌరమునసే యగుటచే నాయుర్దాయము సౌరమునసే గ్రహింపఁదగియున్నదని విద్వాంసులచేఁ జెప్పఁబడి యున్నది. ఇంతకంటె నల్పమానములగు నాక్షత్ర సావనములు గ్రహింప వలయు నను వాక్యము లసమంజసములు. ఈ సౌరవత్సరమే పాశ్చాత్య దేశములందు గ్రహింపఁ బడుచున్నది. పక్షాశ్రయ కర్మవిభా గము లేని యా దేశములందుఁ జాంద్రసావనాది మానములతో నెక్కువ వ్యవహారము లేదు.

సౌరమానమునఁ బరిగణింపఁబడు అయన ఋతుమాసాదివివరము సూర్యసిద్ధాంతమునందు

భానోర్మకరసంక్రాంతే ష్షణ్మాసా ఉత్తరాయణమ్,
కర్కాదేస్తు తథైవస్యాత్ షణ్మాసా దక్షిణాయనమ్.
ద్విరాశినాథా ఋతవ స్తతోపి శిశిరాదయః,
మేషాదయో ద్వాదశైతే మాసా స్తైరేవ వత్సరః.

సూర్యుని సాయనమకరసంక్రమణముమొదలుగ నారుమాసము లుత్తరాయణము. సూర్యుని కటకసంక్రమణము మొదలుగ నారుమాసములు దక్షిణాయనము. ఇచ్చట మాసమనఁగా సూర్యుఁ డొకరాశి యందు సంచరించుట కగు సౌరమాసకాలమని యర్థము. మేషాది ద్వాదశరాసులందు సంచరించుట కగు ద్వాదశ సౌరమాసము లొక వత్సర మగును. ఋతువులు ద్విరాశ్యధిపములు. అనఁగా సూర్యుని రాశిద్వయసంచారకాలము ఋతు వనంబడును. అందు మకరమాసము మొదలు శిశిరాదిఋతువు లారంభమగును. ఇందులకు వృద్ధవాశిష్ఠము నందు

మకరాది రాశిషట్కం ఉదగయనం కర్కటాదికం యామ్యమ్,
రాశిద్వయార్కభోగాత్ షడ్ఋతవశ్శైశిరాదయః క్రమశః.

మకరాదిరాశిషట్క ముత్తరాయణము. కటకాదిరాశిషట్కము దక్షిణాయనము. సూర్యుని రాశిద్వయ భోగకాలము ఋతువు. ఇవి ఉత్తరాయణారంభమునుండి శిశిరము మొదలుగ నాగు. ఈ విషయమై జ్యోతిర్విదాభరణమునందును

సౌమ్యాయనాత్ స్యాచ్ఛిశిరో వసన్త స్తతో నిదాఘశ్చోపగ్రహ
వానాత్ క్రమాత్, వర్షాశ్శరత్సు హిమసంఘవా నితిస్యురాత్రి
శే షస్పృతయో దివాకసామ్.

ఉత్తరాయణముమొదలుగ శిశిరము, వసంతము, గ్రీష్మమును, దక్షిణాయనము మొదలుగ వర్షము, శరత్తు, హేమంతమును ఇట్లారు ఋతువులు పరిగణింపఁబడుచున్నవి. ఈ షడృతుకాలమను సంవత్సరము దేవతల కహోరాత్ర మగుచున్నది. ఇందు మకర మర్ధరాత్రి మును,కటకము మధ్యాహ్నము నగును. ఋతుగణనమునందుఁ జాంద్ర మాసనిషేధము జ్యోతిర్విదాభరణమునందు

మానేన కశ్చిద్ధిమగోచిశో మధోః మధ్యానమానేవ ఋతూ
నభావత, మాసైస్తు సార్ధైరదసై (౩౨/౧౫) ర్యథాధికోమిత్యేస్తద
తత్క్రమతో భవేదసత్.

చాంద్రమానమున చైత్రమాసము మొదలుగ రెండేసి మాసము లకు వసంతాది ఋతువు లారంభమగునని కొందరనుచున్నారు. కాని చాంద్రమున ౩౨త్తమాసములకు, లేక ౬౫ పక్షముల కధికమాసము సంభవించినపు డీ ఋతుగణనమున క్రమమేమగుచున్నది ? కావున నది యసత్పక్షమని చెప్పఁబడినది. సంవత్సర గణనము సౌరమున గ్రాహ్యమని చెప్పఁబడుచున్నది. కాని చాంద్రవత్సరము సౌరవత్సరము కంటె నల్పమైనదగుటచే నీ చాంద్రమానమున ౬౫ పక్షముల కొక్క సారి యధికమాసము సంభవించుచు సౌరముతో సమానమగుచున్నది. ఇట్టి యధిమాసము సంప్రాప్తించినపుడును చాంద్రమానమున "మాఘాదిమాసౌ ద్వౌద్వౌచ ఋతవ శ్శిశిరాదయః" అనుక్రమముననే ఋతువులను గ్రహించుచు నా ఋతువునందు మూఁడు చాంద్రమాసములుగా నెంచుచున్నాము. కాని విచారింపఁగా నిది యుక్తియుక్తముగాఁ దోఁచుట లేదు.

అధిమాసాది విజ్ఞానము గణకానందమున
అర్కసంక్రాంతి రహిత శ్చాంద్రమాసో ఽధిక స్స్మృతః,
ద్విసంక్రాంతియుత శ్చాంద్రః క్షయమాస ఇతీరితః.
క్షయోత్పత్తిః కార్తికాది త్రయే నాన్యత్ర సంభవేత్,
తదానీం వర్షమధ్యే వ ద్వౌమాసౌ భవతోఽధికౌ.

సూర్యసంక్రమణములేని చాంద్రమాస మధికమాస మనియు, రెండు సూర్యసంక్రమణములుగల్గు చాంద్రమాసము క్షయమాసమనియుఁ జెప్పఁబడుచున్నవి. క్షయమాసము కార్తిక మార్గశిర పౌషమాసము లందు మాత్రమే రాఁగలదు. అట్లు క్షయమాసము సంభవించినపు డా సంవత్సరమున రెం డధిమాసములు వచ్చును.

సౌరవర్షమునందుఁ జాంద్రాదినసంఖ్య జ్యోతిర్విదాభరణమునందు

వర్షైకమధ్యే శశినో దినాని హిమాంశు సప్తాగ్ని (౩౭౧)మితాని తస్మాత్,
సార్ధద్విబాణాంబు(౩-౫౫) ఘటీయుతేన ఘటీత్రయేణైవ యుతా
న్యథాహుః.

ఒక్క సౌరవత్సరమున ౩౭౧ చాంద్రదినము లుండును. ఇంకను ౩ ఘటికల ౫౫ విఘటికల ౩ ప్రాణముల కాల మధికముగా నుండును.

భవాసనాక్షత్ర రసాంగరామాః (౩౬౬)సార్ధద్విద్రాం(౨౨)స్త్వర
ఖాగ్ని (౩౦)ఘటైర్ఘ్యః, ఘటీర్యుతాభిస్తిథినాడికాభి (౧౫)ర్యుతా
వినాదా (౧) రవివాసరా (౩౬౫) స్స్యుః.

ఒక్క సౌరవత్సరమునందు నాక్షత్రదినములు ౩౬౬. ఇంకను ౧౫ ఘటికల ౩౦ విఘటికల ౨౨-౧/౨ గుర్వక్షరముల కాల మధికముగా నుండును. ఈనాక్షత్ర దినసంఖ్యకంటె నొక్కటి తక్కువగా సావనదినసంఖ్య యగును. ప్రతినాక్షత్ర సావనదినమునకును నుండు భేద మాదినమున సూర్యభుక్తి తుల్యమగుచున్నది. సౌరసంవత్సరమున సూర్యుఁ డొక్కసారి సంపూర్ణముగా ద్వాదశరాసులను దిరిగి వచ్చుటచే నీ సంవత్సరమున సావననాక్షత్రాంతరము భగణప్రమితము, అనఁగా నొక్క నాక్షత్రదిన మగుచున్నది. కావున నాక్షత్రదినసంఖ్యలో నొక్కటిఁ దీసివేయఁగా ౩౬౫ సావనదినముల ౧౫ ఘటికల ౩౦ విఘటికల ౨౨-౧/౨ గుర్వక్షరముల కాల మొక్క సౌరసంవత్సర మగుచున్నది.

* పాశ్చాత్య సిద్ధాంతమునందు క్రీస్తుపూర్వము ౪౪ సంవత్సరమున 'జూలియస్ సీజరు' అను రోమను ప్రభువు పంచాంగమును ఏర్పాటు చేయించెను. సౌర సంవత్సరమునందు ౩౬౫ ౧/౪ సావన దినము లుండునని యెంచఁబడి యప్పటినుండియు నాల్గు సంవత్సరముల కొకసారి ఫిబ్రవరి నెలకు ౨౯ దినములుండు లీప్ సంవత్సరమని గ్రహింపఁబడుచువచ్చినది. అట్లు వెనుకకు లెక్కచూడఁగా కల్యారంభము క్రీస్తు పూర్వము ౩౧౦౨సంవత్సరమున ఫిబ్రవరి ౧౮-వ తేదీ యైనది. కాని యీ జూలియస్ పంచాంగమునకుఁ బూర్వము జనవరి ఫిబ్రవరి నెలలు వాడుకలోనే లేకుండెను.

౧౫౮౨ సంవత్సరములో పోప్ గ్రెగరీ అనునతఁడు పంచాంగమునందు మరల సవరణ చేయవలసివచ్చెను. ౩౨౫ వ సంవత్సరమున మార్చి ౨౧ వ తేదీన వచ్చిన మేష సంక్రమణము ౧౫౮౩ వ సంవత్సరములో మరల మార్చి ౨౧ వ తేదీన వచ్చుటకుఁగాను ఆ సంవత్సరమున పది దినములను తగ్గించి ౧౫౮౨ వ సంవత్సరము అక్టోబరు ౪ వ తేదీ ౧౫ వ తేదీగా గ్రహింపఁబడినది. ఇంగ్లండులో ఈ సవరణను ౧౭౫౨-వ సంవత్సరమున అమలులోనికిఁ దెచ్చుకొని ఆ సంవత్సరము సెప్టెంబరు ౩ వ తేదీని ౧౪ వ తేదీగా గ్రహించిరి. ఈ సవరణయందు సౌర సంవత్సరమునకు ౩౬౫ దినముల ౫ గంటల ౪ నిమిషముల ౪౬,౬ సెకనులని నిర్ణయింపఁబడినది. అందుచే ౪౦౦ సంవత్సరములకు ౯౭ దినములు మాత్రము అధికముగాఁ గావలసి యుండుటచే నాల్గు సంవత్సరముల కొక లీపుసంవత్సరము వచ్చుననియుఁ, నాల్గు శతాబ్ద సంవత్సరము (**Century years**) లందు మూఁడు శతాబ్దసంవత్సరములు లీప్ సంవత్సరములు కావనియును ౪౦౦ చేత నిశ్శేషముగా భాగింపఁబడు ౧౬౦౦, ౨౦౦౦ మొదలగు శతాబ్ద సంవత్సరములే లీపు సంవత్సరము లగుననియు, అందును ౩౬౦౦ సంవత్సరము లీపుసంవత్సరము కాదనియు నేర్పర్చఁబడినది. కాని యథార్థమున నిందును పొరపాటు కలదు.

ఆర్ష సిద్ధాంతము ననుసరించి ౩౬౫ దినముల ౬ గంటల ౧౨ నిమిషముల ౯ సెకనులకాల మొక సౌరవత్సర మగుచున్నది. అమావాస్యలు, సూర్యచంద్రగ్రహణములు నీగణనమున సరిపోవుచున్నవి. పాశ్చాత్యగణనమునందుఁ గల పొరపాటున కింకొక తార్కాణము కలదు. ౩౦౦ సంవత్సరమున మార్చి నెల ౧౬-వ తేదీని వచ్చిన మేష సంక్రమణము ౧౬౫౨-వ సంవత్సరములో మార్చి నెల ౨౯-వ తేదీనను, ౧౯౦౦-వ సంవత్సరములో ఏప్రియలు ౧౨-వ తేదీనను అయినది, ఇప్పుడు ౧౩-వ ఏప్రియలు తేదీన నగుచున్నది. ఈసవరణకై ౧౨౦ సంవత్సరముల కొకసారి సంవత్సరమునకు మరియొకదినము నధికముగా కలుపుచు అపుడు ఫిబ్రవరి ౩౦ దినములుగా గ్రహించిన సరి పోవచ్చునని తోఁచుచున్నది.

సౌరానభోంగాగ్ని (౩౬౦) మితాహివాసరా స్స్మృతా బుధైః స్సర్వసుకర్మసు ధ్రువం, యత్సౌరచాంద్రాంతరమేక హాయనేఽధికంతిదేవావ్యవహారికం భవేత్.

సౌరవర్షమున ౩౬౦ సౌరదినములు. అనఁగా సూర్యుఁడొక్క అంశయందు సంచరించుట కగుకాల మొక్క సౌరదినమని యర్థము. ఇట్లు ౩౦ సౌరదినము లొక సౌరమాసము. పండ్రెండు సౌరమాసము లొక సౌరవత్సరము. ప్రతిసౌరవత్సరమునందును సౌర చాంద్రాంతరము ౬౫పక్షములకొక్కసారి వచ్చు నధిమాసమువలన సవరణయగుచున్నది. ఇట్టి యధిమాసము మలమాస మనఁబడి సర్వశుభకర్మములందును నిషేధింపఁబడుచున్నది.

(౨) బార్హస్పత్యమానము జ్యోతిర్విదాభరణమునందు

మానో గురోరగభిదః పరివత్సరాణాం షష్టిస్స్మృతా మునివరైః ప్రభవాదికానాం, స్యాదేకవత్సరమితి గ్గురుమధ్యమైక రాశేస్తు భోగ మితిరేవ సదా తథాహి.

దేవేంద్రుని గురుఁడైన బృహస్పతియొక్క మానమునఁ బ్రభవాది షష్ట్యబ్దములు గ్రహింపఁబడుచున్నవి. అనఁగా నీయఱువది సంవత్సరములు బార్హస్పత్యమానవత్సరములని పిలువఁబడుచున్నవి. బృహస్పతియొక్క ఒక్కరాశియందలి మధ్యమభోగ్యకాలము ఒక్క సంవత్సరమగును. గురుని రాశిసంక్రమణసమయమున సంవత్సరారంభము కానున్నను గురుని రాశ్యంతరప్రవేశము కలుగని వత్సరమునకుఁ బ్రభవాదులలోని నామము కలుగదు.

గురుసంక్రమణమువలన నధిలుప్తవర్షవిభాగము :—

గురుసంక్రమయుగ్మవత్సమా గదితా సా ననులుప్తసంజ్ఞకా,
విబుధై రహితా శుభేషు యాఽధిసమా గీష్పతిసంక్రమోజ్ఝితా.

రవిసంక్రమణము ననుసరించి చాంద్రమున నధిలుప్తమాసములు కలుగునట్లు గురుసంక్రమణము ననుసరించి నధిలుప్తసంవత్సరములు కలుగుచున్నవి. రెండు గురుసంక్రమణములుకల సంవత్సరము లుప్తసంవత్సర మనియు, గురుసంక్రమణము కలుగని సంవత్సర మధిక సంవత్సరమనియుఁ జెప్పఁబడుచున్నవి ఈవిషయమై మహాభారత కల్పద్రుమమునందును

చేత్సంప్లుష్టయావా ప్యథ మధ్యగత్యా రాశ్యంతరం యాత్రి నగాంద్రవర్షే, గురుర్న యాయా దధివత్సరోఽధిమాసేన తుల్యస్సశుభేషు వర్జ్యః.

చాంద్ర సంవత్సరమునందు స్పష్టగతిచేనైనను, మధ్యగతిచేనైనను గురుఁడు రాశ్యంతరముఁ బ్రవేశిపని వత్సర మధివత్సర మనఁబడును. అధిమాసమువలె నదియును శుభకార్యములందు వర్జింపఁదగియున్నది.

* ఈయంశము విద్యారణ్యపంచానన శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులుగారు రచియించిన **"The date calculator"** అను గ్రంథమునుండి గ్రహింపఁబడినది.



వేద సంస్కృత పాఠశాల, మైనేనివారిపాలెం.



ఆంధ్రజనసంఘము, లక్నో.

# సన్ లైఫ్ అస్యూరన్సు కంపెనీ ఆఫ్ కెనడా.

## మౌంటురోడ్, ... మదరాసు.

"మూడురకముల ప్లాను" యాంటిసిపేటెడ్ యెండోమెంటు పాలిసి:- కీనివలన మంచిలాభము చేకూరును. "త్రీ - స్టేజి" పాలిసీ, మామూలు 20 యేండ్ల యెండోమెంటుకంట్రాక్టుకంటె ఒకవిషయములో యెక్కువ ప్రయోజనకారిగా నుండును. మీధనమునకు మీరు యిరవై యేండ్లవరకు కనిపెట్టుకొనియుండ నవసరములేదు.

మీపాలిసీ పదిసంవత్సరములవరకు అమలులో నున్నయెడల దాని ఫేస్‌వాల్యూలో 5-వ వంతు సొమ్ము మీకు యివ్వబడును. 15 సంవత్సరములతరువాత మరియొక అయిదవవంతు సొమ్ము యివ్వబడును. ఇరవైయేండ్లతరువాత మిగతా 3/5 వంతు సొమ్ము మీకు అందజేయబడును.

ఇంతేకాకుండ, పాలిసీ టెరముయొక్క కాలపరిమితియందు, పాలిసీయొక్క పూర్తి ఫేస్‌వ్యాల్యూకు మీరు భీమా కలిగియుందురు.

లాభములు:—"త్రీ - స్టేజి" పాలిసీదారులు, పట్టాప్రారంభమునుండి రెండవసంవత్సరమునను, దరిమిలా ప్రతిసంవత్సరములోను లాభములో పాల్గొనుటకు అర్హులై యుందురు.

ఉదాహరణము:—40 యేండ్లవయసులో రు 5000 లకు యాంటిసిపేటెడ్ యెండోమెంటుపాలిసి తీసికొన్నవారికి దిగువ తెలిపినవిధముగా సొమ్ము చెల్లించబడును.

| | | |
|---|---|---|
| 10 సంవత్సరములపిదప. | గ్యారంటీగా నగదుసొమ్ము | రు 1000 లు. |
| 15 సంవత్సరములతరువాత. | తిరిగి యింకొకసారి గ్యారంటీగా నగదుసొమ్ము | రు 1000 లు. |
| 20 యేండ్ల అనంతరము. | మిగతా గ్యారంటీ నగదుమొత్తము | రు 3000 లు. |
| | బాబాపుగా చేరియున్న డివిడెండు | రు 2000 లు. |

మరియు

**ఇన్సూరెన్సు ఒకేమొత్తముగా చెల్లించుట.**

ఈ యిరవైయేండ్లలో మరణము సంభవించినయెడల, భీమా మొత్తము యావత్తు రు 5000 లున్ను మరణకాలమువరకు చేర్చబడినలాభములతోను కలిపి గ్యారంటీగా యివ్వబడును. మరణముతరువాతగాని, యెండోమెంటు కాలపరిసమాప్తి తరువాతగాని భీమామొత్తం ఒకేసారిగా తీసికొనుటకు బదులు, సదరుపాలిసీ భీమా మొత్తమున్ను, డివిడెండుసొమ్మున్ను, నెలసరిగా తీసికొనుచుండవచ్చును.

గమనింపు:—పైన తెలిపిన డివిడెండులు కలుపుట యనగా, పాలిసీ డివిడెండుల మొత్తము వడ్డీతో నిలవచేయబడును. బోనస్ మొత్తములను కొనుటకుగూడ డివిడెండులను వినియోగించుకొనవచ్చును. ఆయా పాలిసీలనుబట్టి సదరు మొత్తములు మారుచుండును.

## మీ బిడ్డల లాభములకు నుపకరించునవి.

**ఉదాహరణము:**—ఇపుడు మీబిడ్డవయస్సు 8 సంవత్సరము లనుకొనుడు. మొదటిసారి సొమ్ము చెల్లింపబడునప్పటికి అతనికి 18-వ యేడు వచ్చును. ఆకాలమునకు అతనికి చదువుసంధ్యలకు సదరు మొత్తము వినియోగించుకొనవచ్చును.

రెండవసారి సొమ్ము చెల్లింపబడుకాలమునకు అతనికి 18-వ యేడు వచ్చుచుండవచ్చును. అప్పుడు విశ్వవిద్యాలయములోని విద్యాభ్యాసమునకు కావలసిన ఖర్చులకున్ను, 23-వ యేటిలో గ్రాడ్యుయేటుగా చదువుకొనుటకును ధనము అక్కరగకుండవచ్చును. అప్పుడు జీవితము ప్రారంభించుటకు పుష్కలముగా ధనసహాయము చేకూరినచో, ఎంతో అమూల్యముగా నుండగలదు. ఆపిల్లలవిషయములలో తుదిసారి చెల్లింపబడు యీమొత్తము పెండ్లికట్నముగా వినియోగింపబడవచ్చును. మీకు అప్పుడప్పుడు వాయిదాలవారిగా సొమ్ము చెల్లింపబడినప్పటికి, విలువలో భీమామొత్తము తగ్గిపోదు. 20 యేండ్లపూర్తికాలమునకు మీకు నిండురక్షణము చేకూరును. వివరములకు కంపెనీకి వ్రాసి తెలిసికొనుడు.

